# తెలుగు భాషా సాహిత్యాలు-
# కొమఱ్ఱాజు లక్ష్మణరావు

ఉస్మానియా విశ్వవిద్యాలయము వారి
డాక్టరేట్ పట్టము పొందిన సిద్ధాంత గ్రంథము

రచయిత
డాక్టర్. పాలకుర్తి మధుసూదనరావు
ఎం.ఏ.పిహెచ్.డి.,

ప్రథమ ముద్రణ : అక్టోబరు 1984

ప్రతులు : 1000

ముఖపత్ర రచన : గోపి



వెల : రూ. 45/-

ప్రతులకు (ప్రకాశకులు) :
శ్రీమతి పాలకుర్తి ఛాయాదేవి
89/C, సంతోష్‌నగర్ కాలనీ,
హైదరాబాదు - 500659 (ఆంధ్రప్రదేశ్)

ముద్రణ :
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్
హైదర్‌గూడ, హైదరాబాదు - 1

*ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వ*
*ఆర్థిక సహాయముతో ప్రచురితము*

# అంకితం

వరంగల్ జిల్లాలోని
ఏడు నూతుల గ్రామంలో
నాకు అక్షరాభ్యాసం చేయించి-
తన ఆలనలో పాలనలో
సన్మార్గక వ్యక్తిగా తీర్చిదిద్ది-
బ్రతికి ఉన్నంతకాలం నా అభ్యుదయం కొరకే
పరితపించిన మా అమ్మమ్మ
స్వర్గీయ నెల్లుట్ల కనకరత్నమ్మ గారికి
భక్తి ప్రపత్తులతో-
ఈ సిద్ధాంత గ్రంథాన్ని
అంకితం చేస్తున్నాను.

—రచయిత

# మనవి

ఒక ఆదర్శమూర్తి గురించి పరిశోధన చేయాలనే తలంపు బి. ఏ. చదువుతున్న రోజుల్లోనే నా హృదయంలో నాటుకుంది. వరంగల్‌లో బి. ఏ. పూర్తిచేసి, హైద్రాబాద్ నగరానికి ఎమ్. ఏ. చదువుకోవడానికి వచ్చిన నాటినుండే అన్వేషణ ప్రారంభించాను.

నాకు కావలసిన ఆదర్శమూర్తి అటు సమాజానికి, ఇటు సాహిత్యానికి అంకితమైనవాడై ఉండాలి. ఆదికవి నన్నయ నుండి నా అన్వేషణ ప్రారంభమైంది. అక్కడక్కడ నాకు కావలసిన మజిలీలు కనిపించాయి. కాని అప్పటికే వాటిని కొందరు సొంతం చేసుకున్నారు. ఆధునిక సాహితీరంగంలో అన్వేషణ సాగుతున్నప్పుడు కొమర్రాజు లక్ష్మణరావుగారి దగ్గర నా దృష్టి ఆగిపోయింది. నాకు కావలసిన ఆదర్శమూర్తి ఆయనలో భాసించాడు. కొన్ని రోజులు ఆలోచించాను. స్థిరమైన నిర్ణయం తీసుకున్నాను. ఎమ్.ఏ. డిగ్రీ చేతికొచ్చిన తరువాత పెద్దలకు నా నిర్ణయం విన్నవించుకున్నాను. ఆమోదముద్ర వేశారు, ఆశీర్వదించారు. గురుదేవులు ఆచార్య డాక్టర్ సి. నారాయణ రెడ్డిగారి పర్యవేక్షణలో సిద్ధాంతవ్యాసం వ్రాయమని ఆదేశించారు. దీన్ని నా అదృష్టంగా భావించాను.

నిర్ణీత వ్యవధిలో సిద్ధాంత వ్యాసం వ్రాసి ఉస్మానియా విశ్వవిద్యాలయానికి సమర్పించుకున్నాను. ఆ తరువాత కొన్నాళ్ళకు నాకు పిహెచ్.డి., డిగ్రీని ప్రదానం చేశారు. ఆచార్య డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావు గారు, ఆచార్య డాక్టర్ ఎమ్. సుబ్బారెడ్డి గారు నా సిద్ధాంతవ్యాసానికి పరీక్షకులు.

నాకు పిహెచ్.డి., చేసే అవకాశం కల్పించిన గురుదేవులు ఆచార్య డాక్టర్ సి. నారాయణరెడ్డి గారికి, ఆచార్య డాక్టర్ బి. రామ రాజు గారికి, ఆచార్య డాక్టర్ కె. గోపాల కృష్ణారావు గారికి- నా సిద్ధాంత వ్యాసం పిహెచ్.డి., డిగ్రీకి అర్హమైనదిగా నిర్ణయించిన పెద్దలకు, పరిశోధన చేస్తున్న రోజుల్లో నాకు కావలసిన పుస్తకాల నిచ్చి, సహకరించిన డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు గారికి కృత జ్ఞతాభివందనాలు.

ఈ సిద్ధాంత వ్యాసంలో వాక్య నిర్మాణం సజీవంగా ఉండాలన్న భావంతో కొంత స్వేచ్ఛ తీసుకున్నాను. అయితే సిద్ధాంత వ్యాసం ప్రమాణాలకు చెప్పదలచుకున్న విషయ ప్రామాణికతకు ఎక్కడా భంగం కలుగనివ్వలేదు.

ఇతర భాషా సాహిత్యాలకు సంబంధించిన ప్రస్తావన వచ్చి నప్పుడు, చారిత్రక విషయాలను వ్రాయవలసి వచ్చినప్పుడు వాటిని క్షుణ్ణంగా పరిశీలించి, విజ్ఞులను, పెద్దలను సంప్రదించి వాటికి అక్షర రూపం ఇచ్చాను.

లక్ష్మణరావు గారు దేశసేవ, సంఘసేవ, సాహితీసేవ ఈ మూడు గుణాలు మూర్తీభవించిన మహనీయులు. వీరేశలింగం పంతులు గారు ప్రారంభించిన సంఘ సంస్కరణోద్యమానికి ఆయన అండగా నిలిచారు. ఆయన సుప్రసిద్ధ భాషా పరిశోధకులు. లిపిని గురించి ఆయన వ్రాసిన పరిశోధక వ్యాసం అసామాన్యమైనది, అమూల్యమైనది. అట్లాగే ఆయన తెలుగు భాషను గురించి జరిపిన పరిశోధన చిరస్మరణీయమైనది.

ఆయన వెలిబుచ్చిన అభిప్రాయాలలో కొన్ని ఆనాటి పరిస్థితు లలో అత్యున్నతమైనవి. మరికొన్ని నేటికీ ప్రామాణికమైనవి.

తెలంగాణా ప్రాంతంలో గ్రంథాలయోద్యమానికి అంకురార్పణ చేసింది లక్ష్మణరావు గారే. ఆయన తరువాత, ఆయన అందించిన స్ఫూర్తితో మాడపాటి హన్మంతరావు, ఆదిరాజు వీరభద్రరావు, కోదాటి నారాయణరావు వంటి నిస్వార్థ దేశభక్తులు గ్రంథాలయోద్యమంలో పాల్గొని, తెలుగు వారిలో చైతన్యం కలిగించడంతో పాటు, తెలుగు వారు జాతీయ జీవన స్రవంతిలో భాగస్వాములు కావడానికి కృషి చేశారు.లక్ష్మణరావుగారి ప్రభావంతో స్వాతంత్ర్యోద్యమ కాలంలోదేశం కోసం సర్వస్వం త్యాగం చేసిన ఒక ప్రత్యేక నిస్వార్థ దేశభక్తుల తరం వెలసిందంటే అతిశయోక్తి కాదు.

ఇక, నా అభ్యుదయానికి కారకులైన పెద్దల గురించి ఇక్కడ రెండు మాటలు చెప్పాలని వుంది.

నేను పుట్టింది నల్లగొండ జిల్లాలోని తాటిపాముల గ్రామంలో. నా ప్రాథమిక విద్యాభ్యాసం వరంగల్ జిల్లాలోని మా అమ్మమ్మగారి ఊరైన ఏడునూతుల గ్రామంలో జరిగింది. మా అమ్మమ్మగారు స్వర్గీయ నెల్లుట్ల కనకరత్నమ్మగారు నా అభ్యుదయాన్ని గురించి ఎప్పుడూ ఆలోచస్తూ దేవున్ని ప్రార్థిస్తుండేది. అందుకే ఈ సిద్ధాంత గ్రంథాన్ని భక్తి ప్రపత్తులతో ఆమెకు అంకితం చేస్తున్నాను. మా మేనమామలు స్వర్గీయ నెల్లుట్ల రంగారావు, శ్రీ నెల్లుట్ల శేషగిరిరావు, శ్రీ నెల్లుట్ల జనార్దనరావు, శ్రీ నెల్లుట్ల రాధాకిషన్‌రావు- వీరందరూ నన్ను ప్రాథమిక స్థాయివరకు చదివించారు. వారు ఎంతో వాత్సల్యంతో చెప్పించిన ఆ చదువే నన్నొక వ్యక్తిగా తీర్చిదిద్దింది.

నా తల్లిదండ్రులు శ్రీమతి పాలకుర్తి ఇందిరమ్మ, శ్రీ పాలకుర్తి కేశవరావు- వీరి ఆశీర్వాదబలమే నా కెల్లప్పుడూ శ్రీరామరక్ష.

నేను వ్రాసిన ప్రతీ భాగాన్ని వెనువెంటనే చదివి, పొరపాట్లను నా దృష్టికి తెచ్చి, వాటిని సరిదిద్దడంలో నా అర్ధాంగి శ్రీమతి సౌ. ఛాయాదేవి నా కెంతగానో సహకరించింది.

ఈ గ్రంథ రచనకు, ప్రచురణకు సహకారం అందించిన మరి కొందరు పెద్దల గురించి, మిత్రుల గురించి ప్రస్తావించకుండా ఉండలేకపోతున్నాను.

ఈ గ్రంథాన్ని చదివి తమ అమూల్యమైన అభిప్రాయాన్ని ఆశీస్సుల రూపంలో అందించిన గౌరవనీయులు, విద్వన్మణులు, భారత దేశీయాంగ శాఖమాత్యులు పి.వి. నరసింహారావు గారికి ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను. గురుదేవులు ఆచార్య డాక్టర్. సి. నారాయణరెడ్డి గారు, సహృదయులు డి. మురళీకృష్ణగారు (I A. S.) వ్రాసిన అభిప్రాయాలు ఎంతో అమూల్యమైనవి. వారికి నా నమస్సులు.

అట్లాగే, ఈ గ్రంథ ప్రచురణకు ఐదువేల రూపాయల ఆర్థిక సహాయం అందించిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వానికి, ముఖ్యంగా సమాచార, సాంస్కృతిక వ్యవహారాల శాఖ కమీషనర్ పి.వి.ఆర్.కె. ప్రసాద్ (I.A.S.) గారికీ- ఎప్పుడు కనిపించినా చిరునవ్వుతో నన్ను పలకరించి, నా యోగ క్షేమాలను విచారించే పెద్దలు డాక్టర్ ఎన్. యాదగిరి రెడ్డి గారికి, ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ప్రొఫెసర్ జి. రాంరెడ్డి గారికి, సాహితీమూర్తి జె. బాపురెడ్డి (I A.S.) గారికి వినమ్రతాపూర్వక ప్రణామములు.

ఈ గ్రంథం ప్రచురించడానికి నన్ను ప్రోత్సహించిన సాహితీ ప్రియులు, సహృదయులు కరీంనగర్ జిల్లాలోని జమ్మికుంట పంచాయితీ అధ్యక్షులు ఎ. కృష్ణంరాజు గారికి, వెన్నంపల్లి వాస్తవ్యులు పి. గోపాల్‌రావు గారికి, హుజూరాబాద్ వ్యవసాయభివృద్ధి బ్యాంకు

అధ్యక్షులు తుమ్మల శ్రీ రాంరెడ్డి గారికి, సహకార కేంద్ర బ్యాంకు జనరల్ మేనేజర్ ఎస్. కొమరయ్యగారికి, వరంగల్ వాస్తవ్యులు అంచూరి రాజయ్యగారికి, ఆత్మీయుడు డాక్టర్ ముడుంబై పార్థసారథికి ఎన్నిసార్లు కృతజ్ఞతలు చెప్పినా తక్కువే.

ఆప్తులు మా ఆట్లూరి వెంకట్రావు చౌదరి (ఆకాశవాణి), మిత్రులు డాక్టర్ జి. గోవర్ధన్, నమిలికొండ బాల్‌కిషన్‌రావు, ఎమ్. భిక్షపతితో సహా వరంగల్, కరీంనగర్, నల్లగొండ జిల్లాలకు చెందిన ఇంకా ఎంతో మంది మిత్రులు, పెద్దలు పరిశోధన చేస్తున్న రోజుల్లో నన్నెంతగానో ప్రోత్సహించారు. వారందరికీ ధన్యవాదాలు.

—డా. పాలకుర్తి మధుసూదనరావు

డాక్టర్ పి.వి. నరసింహారావు
దేశీయాంగశాఖామాత్యులు
భారత ప్రభుత్వం
న్యూఢిల్లీ.

# ఆశీస్సులు

ఆంధ్రదేశంలో ఎంతోమంది మహానుభావులు ఉద్భవించి అటు సమాజానికి, ఇటు సాహిత్యానికి ఎంతో సేవ చేసినారు. అటువంటి మహానుభావులలో స్వర్గీయ కొమర్రాజు లక్ష్మణరావు గారొకరు, డాక్టర్ సి. నారాయణరెడ్డిగారి పర్యవేక్షణలో రూపొందించబడిన ఈ సిద్ధాంత వ్యాసములో లక్ష్మణరావుగారు తెలుగు సాహిత్యానికి, సమాజానికి చేసిన సేవలను గురించి చక్కగా విశదీకరించబడింది. ముఖ్యంగా లక్ష్మణరావు గారు స్వాతంత్ర్యోద్యమ కాలంలో నిర్వహించిన పాత్ర విశిష్టమైనది, విలక్షణమైనది. ప్రజలలో భావ విప్లవాన్ని తెచ్చి, తద్వారా వారిని స్వాతంత్ర్యోద్యమానికి సమాయత్తం చేయాలన్న తలంపుతో లక్ష్మణరావు గారు విజ్ఞాన చంద్రిక పక్షాన ఎన్నో గ్రంథాలను ప్రచురించారు. ప్రతీ గ్రంథం ఎటువంటి ఉద్దేశంతో ప్రచురించబడిందో రచయిత చి॥ మధుసూదనరావు ఈ గ్రంథంలో సాక్ష్యాధారాలతో వివరించాడు. కేవలం తెలుగు సాహిత్యాన్ని చదువుకోవాలనుకునేవారికే కాకుండా, ఈ పుస్తకం అందరికీ ఉపయోగపడుతుంది. దేశం కొరకు మన పూర్వీకులు ఎంత నిస్వార్థంతో కృషి చేసినారో చెప్తూ, నేటి యువతరం వారి జీవిత చరిత్ర నుండి నేర్చుకొనవలసింది ఎంతో ఉన్నదని ఈ గ్రంథం పరోక్షంగా ప్రబోధిస్తున్నది. చక్కని శైలితో ఈ సిద్ధాంత గ్రంథాన్ని వ్రాసిన చి॥ మధుసూదనరావు అభినందనీయుడు. ముందు ముందు ఇలాగే మరిన్ని మంచి పుస్తకాలు వ్రాయాలని నా ఆశీస్సులందిస్తున్నాను.

పి.వి. నరసింహారావు

12.9.86

"ప్రతీ ఒక్కరూ ముందు తమలోని లోపాలు సరిదిద్దుకోవాలి. ప్రజలలో ఈ విధమైన అవగాహనను పెంపొందించే ఉత్తమ సాహిత్యాన్ని సృష్టించాలి. సమాజంలో ఉండే లోపాలు, దోషాలు తొలగిపోవడానికి దోహదం చేయగల సాహిత్యాన్ని సృష్టించుకోవాలి, సృష్టింపజేయాలి."

—కొమర్రాజు లక్ష్మణరావు

పద్మశ్రీ, కళాప్రపూర్ణ
**డా॥ సి. నారాయణరెడ్డి,**
ఎం.ఎ., పిహెచ్ డి., డి.లిట్

**అధ్యక్షుడు**
అధికార భాషా సంఘం
ఆంధ్రప్రదేశ్.

# అభిప్రాయం

ఆధునిక ఆంధ్ర వాఙ్మయ నిర్మాతల్లో కొమఱ్ఱాజు లక్ష్మణరావు గారి స్థానం అపూర్వం; అపారం. సునిశిత భాషానుశీలకుడుగా, చరిత్ర పరిశోధకుడుగా, వైజ్ఞానిక గ్రంథకర్తగా, ప్రచురణ కర్తగా, తెలుగులో విజ్ఞాన సర్వస్వ రచనకు శ్రీకర్తగా లక్ష్మణరావు గారు చేసిన కృషి మౌలికం; ఉపజ్ఞామూలకం.

తొలిసారిగా 'ఎడిటర్', 'యూనివర్శిటీ' లాంటి అనేక ఆంగ్ల పదాలకు ఈనాడు వాడుకలో వున్న అనువాదాలను సృష్టించింది ఆయనే. దేశీయులకు అత్యంత ప్రధానమైన చారిత్రక గ్రంథాలను ఆయన రచించాడు. మల్లంపల్లి సోమశేఖర శర్మగారు వ్యాఖ్యానించినట్లుగా "రానున్న గాంధీయుగానికి తెలుగువారి హృదయక్షేత్రాలను పదును చేసిన గ్రంథరాజాలు" లక్ష్మణరావు గారివి.

లక్ష్మణరావుగారి విశ్వతోముఖ వైదుష్యాన్ని ఎంతో నిపుణంగా విశ్లేషించి చూపిన పరిశోధన గ్రంథాన్ని డా॥ మధుసూదనరావు రచించాడు. డా॥ మధుసూదనరావు పరిశోధన ప్రవణత, పరిశీలన చణత, విశ్లేషణ చతురత ఉన్న పరిశోధకుడు. తనకు ముందున్న విద్వాంసులు చెప్పిందే వేదంగా భావించక సమదృష్టితో పూర్వాపరాలు సమీక్షించి, సమన్వయించి ఈ గ్రంథాన్ని రూపొందించాడు. కొమఱ్ఱాజువారికి తెలుగుభాషా సాహిత్య చరిత్ర రంగాల్లో ఏర్పడిన భద్ర స్థానానికి సరితూకంవేసి ఈ సిద్ధాంత గ్రంథాన్ని వ్రాసినందుకు డా॥ మధుసూదనరావును హార్దికంగా అభినందిస్తున్నాను.

హైదరాబాదు
12-10-84

—డాక్టర్ సి. నారాయణరెడ్డి.

**D. Muralikrishna** I.A.S.
Former Registrar, Nagarjuna University, A.P.
Present Regional Controller (Iron & Steel)
Governament of India,
Hyderabad.

## INTRODUCTION

It is really an art to be able to write on literature in a style which even the common reader can understand and appreciate. I congratulate Dr. P. Madhusudana Rao on his writing his doctoral thesis in such a style which is characterized not by academicism but by felicity of expression. I have found it as absorbing as a novel, each chapter of which holding my attention as a scene or an episode of a novel would do.

Dr. Madhusudana Rao has vividly brought out the multi-faceted achievement of Komarraju Laxmana Rao as scholar, researcher, writer, reformer of society and historian. It is a matter of great distinction, particularly to the Telugus, that such a multi-splendoured personality was born in Andhra Pradesh. His national outlook and patriotic fervour are bound to influence the coming generations and his work needs to be made known as widely as possible, which what Dr. Madhusudana Rao's book aims at. In my opinion, this book is one of the best studies in Telugu literature which, I am confident, will be well received within the academic circles and without.

Hyderabad
10-10-84

—**D. Muralikrishna**, I.A.S.

# విషయానుక్రమణిక

# 19వ శతాబ్దంలో దేశభాషల్లో సాహితీ వికాసం

భారతదేశ చరిత్రలో 19 వ శతాబ్దానికి ఒక విశిష్టమైన స్థానమున్నది. ఈ శతాబ్దంలో రాజకీయ, సామాజిక, సాంస్కృతిక, సాహిత్యరంగాలలో వినూత్నమైన మార్పులు ఉత్పన్నమై, జాతిని చైతన్యవంతం చేశాయి.

భారత జాతి, భారతదేశం అనే భావం ఆసేతు హిమాచల పర్యంతం వ్యాపించి, ప్రజలలో దేశాభిమానం పెల్లుబికి, స్వాతంత్ర్యోద్యమం కొత్త చేవను సాధించుకొన్నది. ఆంగ్లేయుల వలన మనం పారతంత్ర్యులమైనప్పటికి, వారి కాలంలో దేశం మొత్తం ఒకే పరిపాలనలోకి రావడమనేది చెప్పుకోదగినది. ఇది అపూర్వమైనది, అతి ప్రధానమైనది.

అనాదినుండి భారతదేశంలో అనేక సామ్రాజ్యాలు స్థాపితమైనా ఏదీ దేశ వ్యాప్తం కాలేకపోయింది. అశోకుడు, చంద్రగుప్త విక్రమాదిత్యుడు, హర్షవర్ధనుడు మొదలైన హైందవ చక్రవర్తులు యావద్భారతదేశాన్ని సమీకృతం చేసి పరిపాలించడానికి ప్రయత్నించినప్పటికీ సఫలీకృతులు కాలేకపోయినారు. మహ్మద్ బిన్ తుగ్లక్ ఢిల్లీ సామ్రాజ్యం, ఔరంగజేబు మొగలాయి సామ్రాజ్యం కూడా ఈ విషయంలో విఫలమైనాయి.

దేశం మొత్తం ఒకే ఏలుబడిలో లేనందువల్ల అనేక చిన్న చిన్న రాజ్యాలు ఏర్పడి ఒకే దేశ ప్రజలు తమలోతాము వైషమ్యాలనేర్పరచుకొని అంధకారంలో మ్రగ్గిపోవలసిన విపత్కర పరిస్థితి ఏర్పడింది. దేశం రాజకీయంగా, సామాజికంగా, సాంస్కృతికంగా చైతన్యవంతం కాలేకపోయింది. దేశభాషా సాహిత్యాలు పాతబాటలోనే పయనించి, ప్రజలకు వెలుగును చూపించలేని నిస్సహాయస్థితిలో ఉండిపోవలసి వచ్చింది.

ఆంగ్లేయుల రాకతో దేశంలో కొత్త గాలి వీచింది. వారు కల్పించిన రవాణా సౌకర్యాలవలన దేశంలో అన్ని ప్రాంతాలకు రాకపోకలు ఏర్పడి, దేశ ప్రజలు ఒకరి గురించి మరొకరు తెలుసుకునే అవకాశం కలిగింది. తరతరాల

నుండి తాము ఎంతటి దుస్థితిలో ఉన్నదీ, అనైక్యం వలన పరాయి వాడికి లోకువై భారత జాతి ఎంతటి అప్రతిష్ఠపాలయినదీ వారు గ్రహించగలిగారు. నా దేశం, నా జాతి, నా భాష అనే భావాలకు అంకురార్పణ జరిగి, ప్రజావాహిని ఒకే లక్ష్యంతో ముందడుగు వేసింది.

వారన్ హేస్టింగ్స్, కారన్ వాలీస్, విలియం బెంటింక్ ప్రవేశపెట్టిన సంస్కరణలు మూఢాచారాలతో మ్రగ్గిపోతున్న ప్రజలకు కొత్త ప్రపంచాన్ని, సరికొత్త జీవితాన్ని ప్రసాదించాయి. ఆంగ్లేయులు రాకపోయినట్టయితే దేశం ఏ విధంగా ఉండేదో చెప్పలేకపోయినా, వారి రాకవలన దేశానికి కీడుతోపాటు మేలు జరిగిందనే చెప్పాలి. వారు పాలనా విధానంలో ప్రవేశపెట్టిన సంస్కరణలు పాశ్చాత్య సంస్కృతీ సాహిత్యాలతో పరిచయాన్ని కలిగించాయి. తద్వారా మన ప్రాచీన సంస్కృతినీ, నాగరికతను సుసంపన్నం చేసుకోవడానికి, సాహిత్యాన్ని ప్రజా ఉద్యమానికి ఊపిరిగా మలచి జాతిని అంధకారం నుండి విముక్తం చేయడానికి వీలుకలిగింది.

ఆంగ్లేయులు రాజకీయ విషయాలలోనే కాక దేశ మత, సాంఘిక విషయాలలో జోక్యం చేసుకోవడం భారత ప్రజలకు ఆగ్రహాన్ని కలిగించింది. వారు సంస్కరణల పేరుతో భారతీయులను క్రైస్తవులుగా మార్చడానికి యత్నిస్తున్నారన్న భావన ప్రజలలో వ్యాపించి, అనాదిగా వస్తున్న భారతీయ సంస్కృతిని పరిరక్షించుకోవాలన్న దీక్ష నెలకొన్నది. ఈ సాంస్కృతికోద్యమానికి నాయకత్వం వహించిన వారు పాశ్చాత్య విద్యా సంస్కృతులను బాగా అవగతం చేసుకున్నవారే. వీరు దేశవ్యాప్తంగా సంస్థలను స్థాపించి, హిందూమత వైశిష్ట్యాన్ని ప్రచారం చేస్తూ ప్రజలలో చైతన్యం కలిగించారు. ఈ కారణంగానే జాతీయోద్యమం కొత్త పునాదులు వేసుకోగలిగినది.

ఈ సంఘ సంస్కర్తలలో కొందరు మతానికి, సంస్కృతికి సంబంధం లేని మూఢాచారాలను అంతమొందించి పూర్తిగా, పాశ్చాత్య ప్రభావానికి లోబడి మన సంస్కృతిని తీర్చిదిద్దడానికి యత్నించినవారైతే, మరికొందరు సనాతన

ధర్మాన్నే అనుసరిస్తూ మన సంస్కృతి పునరుజ్జీవనానికి కృషి చేసినారు. మొదటి వర్గానికి చెందిన వారిలో రాజా రామ్మోహనరాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్ పేర్కొనదగినవారు. ఇక రెండవ వర్గానికి చెందిన ప్రముఖులు స్వామి దయానంద సరస్వతి, రామకృష్ణ పరమహంస, స్వామి వివేకానందుడు. రాజారామ్మోహన రాయలు బ్రహ్మ సమాజాన్ని స్థాపించి, సంఘ సంస్కరణకు నిర్విరామ కృషిచేసిన మహనీయుడు. దయానంద సరస్వతి స్థాపించిన ఆర్యసమాజం, వివేకానందుడు స్థాపించిన రామకృష్ణమఠం మన సంస్కృతి పునరుజ్జీవనానికి ఎంతో సహకరించాయి.

బ్రహ్మ సమాజం, ఆర్య సమాజం, రామకృష్ణమఠం ఇవన్నీ జాతి, మత, కుల వర్ణ విభేదాలను నిరసించి, భారతదేశంలో నివసిస్తున్న సమస్త ప్రజలు భరతమాత బిడ్డలనీ వీరందరూ జాతి శ్రేయస్సుకు కృషిచేయవలెననీ ఉద్బోధించాయి. ఆ తరువాత అనీబిసెంటు స్థాపించిన దివ్యజ్ఞాన సమాజం అంతర్జాతీయ సోదర భావాన్ని పెంపొందించి, భారతీయ విజ్ఞాన గౌరవాన్ని విశ్వమంతటా వ్యాపింపజేసింది.

ముఖ్యంగా రాజారామ్మోహనరాయలు లేవదీసిన సంఘ సంస్కరణ విప్లవం దేశమంతటా మారుమ్రోగి, మూఢాచారాలతో నిద్రాణమైయున్న సంఘాన్ని మేల్కొల్పింది. కొత్త ఆలోచనలు, కొత్త తరం ప్రారంభమై సంఘ సంస్కరణకు అంకురార్పణ జరిగింది. దేశ వ్యాప్తంగా ఎంతోమంది రచయితలు ప్రజల భాషలో గ్రంథాలను రచించి, సాహిత్యమనే వజ్రాయుధంతో సంఘ సంస్కరణోద్యమానికి బాసటగా నిలిచారు. ఈ మార్పు అటు ఉత్తర భారత సాహిత్యాలలో, ఇటు దక్షిణ భారత సాహిత్యాలలో కన్పిస్తుంది.

## దేశ భాషల్లో సాహితీ వికాసం :

రామ్మోహనరాయలు వంగ దేశంలో గద్య సాహిత్య ప్రథమ ప్రవర్తకుడు. ఈయన వేసిన గద్య పునాదులపై గద్యసాహిత్యాన్ని నిర్మించినవారు ఈశ్వర

చంద్ర విద్యాసాగరుడు, బంకిమ చంద్ర ఛటోపాధ్యాయ. లలితమైన, మధుర మైన గద్య శైలితో సంస్కరణను ప్రేరేపించే వ్యాస పరంపరలను విద్యాసాగ రుడు వెలువరిస్తే, బంకిమ చంద్రుడు తన నవలా రచనతో వంగ సాహిత్యానికి విశేషమైన ప్రాచుర్యం కల్పించాడు.

దేశంలో మొట్టమొదట వంగ సాహిత్యంపై ఆంగ్ల భాషాప్రభావం ప్రసరిం చింది. ఈ కారణంగా నవల, కథానిక, నాటిక, విమర్శ మొదలైన సాహిత్య ప్రక్రియలు ప్రవేశపెట్టబడినాయి.

బంకిమ చంద్ర ఛటర్జీ, శరశ్చంద్ర ఛటోపాధ్యాయ నవలా రచయితలలో, మైకేలు మధుసూదన దత్తు, దీనబంధుమిత్ర, గిరీశచంద్రుడు నాటక రచయితలలో ప్రసిద్ధి పొందినవారు. మధుసూదన దత్తు కవితారంగంలో కూడా ప్రవేశించి, వంగ సాహిత్య కీర్తి పతాకను ఎగురవేశాడు.

రవీంద్రుడు కవిత, నాటిక, నవల, కథానిక, విమర్శ మొదలైన బహు ముఖ ప్రక్రియలను చేపట్టి, వంగ సాహిత్యానికి విశిష్టమైన స్థానం చేకూర్చిన ప్రతిభాశాలి. వంగ సాహిత్యంలో సిసలైన కథానికకు శ్రీకారం చుట్టినవాడు రవీంద్ర కవీంద్రుడే. ఈ కాలంలో విమర్శనా సాహిత్యానికి రూపురేఖలు దిద్దిన వారు పూర్ణచంద్ర వసు, బలేంద్రనాథ ఠాగూరు.

వంగ సాహిత్యంలో ప్రారంభమైన ఈ సంస్కృతీ సాహిత్యాల పునరు జ్జీవనం దేశ వ్యాప్తమైంది. దీన్నే జాదునాథ్ సర్కార్ ఈ విధంగా వర్ణించాడు:

"If periclean Athens was the School of Hellas, the eys of Greece, mother of arts and eloquence, that was Bengal to the rest of India under British rule, but with a borrowed light which it made its own with marvellous canning. In the new Bengal originated every good and great thing of the modern world that

passed on to the other parts of India... New literary types, reform of language, Social reconstruction political aspirations, religious movements and even changes in manners that originated in Bengal, Passed like ripples from a central eddy, across provincial barriers, to the farthest corners of India.''[1]

ఉత్తర భారత సాహిత్యాలలో వంగదేశం ఈ రీతిగా నూత్న ప్రక్రియలతో వికాసం చెందుతూ, రచయితలు నిర్దేశించుకొన్న లక్ష్యసాధనకు పరుగులు తీస్తుంటే, ఉత్తర దక్షిణ సంప్రదాయాలను సంతరించుకొన్న మరాఠీ సాహిత్యం తన్నుతాను సంస్కరించుకొని సమాజోద్ధరణకు చేయూత నిచ్చింది.

1818 లో పీష్వా సామ్రాజ్యమంతరించడంతో మహారాష్ట్రాన్ని ఆంగ్లేయులు హస్తగతం చేసుకున్నారు క్రైస్తవ మిషనరీలు స్థాపించబడి, క్రైస్తవ మత గ్రంథాలను మరాఠీలోనికి అనువదించడం ఆరంభమైనది. కొత్తగా స్థాపించబడిన అచ్చు యంత్రాల వలన దేశభాషా సాహిత్య గ్రంథాల ప్రచురణకు అవకాశమేర్పడింది. ఆంగ్ల భాషా గ్రంథాలు మరాఠీలోనికి అనువర్తితాలై పాశ్చాత్య సాహితీ ప్రక్రియల పరిచయ మేర్పడి, సాహిత్యానికి పాత బాటల్లో పయనించే ప్రమాదం తప్పింది. ప్రాచీన సంస్కృతి పరిరక్షణకు దేశ వ్యాప్తంగా ప్రారంభమైన సాంస్కృతికోద్యమం క్రైస్తవ మిషనరీలపట్ల ద్వేషాన్ని పురికొల్పింది. క్రైస్తవులకు, సనాతనులకు, అధునాతనులకు ఘర్షణ ఏర్పడి, భావ ప్రకటనకు సాహిత్యం సాధనగా మలచబడింది.

జ్యోతిబా పులే అను మహాశయుడు సత్యశోధక సమాజమనే సంస్థను స్థాపించి, దాని ద్వారా స్త్రీ విద్యావ్యాప్తికి, హరిజనోద్ధరణకు విశేషమైన కృషి చేసి, సంఘ సంస్కర్తగా గణుతి కెక్కినాడు.

1. History of Bengal · By Jadunath Sarkar Vol. II Page No. 84.

వంగదేశం తరువాత అటు సంఘంలోనూ ఇటు సాహిత్యంలోను చెప్పుకో దగిన మార్పు కనిపించేది మహారాష్ట్రంలోనే. 19వ శతాబ్ది ఆరంభంలోనే మరాఠీ సాహిత్యంలో వెలుగురేఖలు ప్రసరించాయి. తొలి నవల 1850 లో వెలువడింది. తరువాత హరినారాయణ ఆప్టే సాంఘిక, రాజకీయ సమస్యలను వస్తువుగా స్వీకరించి, నవలా సాహిత్యానికి ఒరవడిని, ఉరవడిని ప్రసాదించాడు.

విష్ణుశాస్త్రి చిపురూణ్కర్ 1874లో 'నిబంధమాల' అనే పత్రికను స్థాపించి రాజకీయ, సామాజిక, చారిత్రక, మానసిక, ధార్మిక విషయాలపై పెక్కు వ్యాసాలను ప్రకటించాడు. ఈ వ్యాసాలు మరాఠీ సాహిత్యంలో పెద్ద సంచలనాన్ని కలిగించాయి.

బాలగంగాధరతిలక్ స్వాతంత్ర్య సముపార్జనకు తన జీవితాన్నే అంకితం చేసిన దేశభక్తుడు. 'స్వాతంత్ర్యం నా జన్మహక్కు. దానిని నేను సాధించక మానను' అనే నినాదంతో తెల్లవారి గుండెల్లో పెనుతుఫానులు రేగించి స్వాతంత్ర్యోద్యమానికి దీప్తిని కలిగించాడు. 'కేసరి' అనే పత్రికను స్థాపించి, దౌర్జన్యంతోనైనా స్వాతంత్ర్యాన్ని సంపాదించాలని ప్రబోధించాడు. 'గీతా రహస్యం' తిలక్ మేధాసంపత్తికి నిదర్శనం.

శ్రీధర వెంకటేశ్వర కేత్కార్ తనకు ఆంగ్ల భాషతో ఉన్న సన్నిహిత పరిచయాన్ని పురస్కరించుకొని, ఆంగ్లంలోని Encyclopaedia ఛాయల్లో 'మహారాష్ట్ర విశ్వకోసం' అనే పేరుతో విజ్ఞాన సర్వస్వ రచనకు అంకురార్పణ చేసి, మరాఠీ సాహిత్య జగత్తుకు అనన్యమైన గౌరవ ప్రపత్తులను చేకూర్చిన సాహితీవేత్త.

ద్రావిడ భాషా కుటుంబానికి చెందిన తమిళంలో ఆధునిక యుగం 19వ శతాబ్దం చివరి రోజుల్లో ఆరంభమైనా, ఇరవైవ శతాబ్దం ప్రథమ పాదంలోనే దానికి ప్రాచుర్యం లభించింది. 19వ శతాబ్దంలో సాంఘిక, సాంస్కృతికోద్యమాలవల్ల సాహిత్యం నవీనమైన రూపురేఖలు సంతరించుకున్నప్పటికీ ప్రజలను, సాహిత్యాన్ని ఉత్తేజితంచేసే రచనలు వెలువడలేదు.

సుబ్రమణ్యభారతి రచనలతో తమిళ సాహిత్య క్షేత్రానికి పుష్టి, నవీన సాహిత్య సృష్టి సిద్ధించాయి. సమకాలీన సామాజిక జీవితాన్ని, తమిళ సాహిత్య స్థితిగతులను, నాటి రాజకీయ పరిస్థితులను అవగతం చేసుకొని సామాన్యులకు అర్థమయ్యేరీతిలో భారతి రచనలు చేసినాడు. ఆధునిక తమిళ వాఙ్మయాన్ని సుసంపన్నం చేసిన కీర్తి సుబ్రమణ్యభారతికే దక్కుతుంది.

ఇక కన్నడ సాహిత్యంలో 19 వ శతాబ్దపు చివరి దశనుండి 1920 వరకు ఆధునిక సాహిత్య నిర్మాణానికి అనేక ప్రయోగాలు జరిగాయి.

1921 లో బి. ఎమ్. శ్రీకంఠయ్య ప్రచురించిన 'ఇంగ్లీషు గీతగళు' (ఇంగ్లీషు గీతాలు) అనే కవితా సంకలనం కన్నడ కవితా ప్రపంచంలో సంచలనాన్ని సృష్టించింది. కన్నడ కవితా ప్రపంచంలో నవ్యకవిత్వోద్యమానికి నాంది పలికింది ఈ కవితా సంకలనమే.

1915 లో ఎమ్. ఎస్. పుట్టణ్ణ రచించిన 'మాడిద్దుణ్ణో మహారాయ' (చేసింది తినే మహారాజు) అనే సాంఘిక నవలతో నవలా సాహిత్యం కొత్త దారులు త్రొక్కింది. మొట్టమొదటి సాంఘిక నాటకం 1887 లో వెలువడింది. ఈ నాటకం పేరు 'ఇగప్ప హెగడే వివాహ ప్రహసన.'

కన్నడ సాహిత్యంలో విమర్శ, పరిశోధన రంగాలలో చెప్పుకోదగిన మార్పు కనిపించింది 1920 తరువాతనే. బి. ఎమ్. శ్రీకంఠయ్య కన్నడ విమర్శనా సాహిత్యానికి ఎంతో సేవ చేశారు. తెలుగు దేశంలో వీరేశలింగం పంతులుగారివలె కన్నడంలో శ్రీకంఠయ్య సాహితీ సవ్యసాచిగా కనిపిస్తారు.

19 వ శతాబ్దం చివరి రోజుల్లో మలయాళ సాహిత్యంపై ఆంగ్ల భాషా ప్రభావం ప్రసరించింది.

'కుందలత' అనే నవల మలయాళంలో మొట్టమొదటి నవల. ఇది 1887లో ప్రకటించబడింది.

ఈ నవల మణిప్రవాళ పదాల ఆడంబరానికి భరత వాక్యం పలికింది. శిష్ట వ్యవహారికానికి స్వాగత తోరణాలను కట్టింది. 1889 లో వెలువడిన ప్రథమ సాంఘిక నవల 'ఇందులేఖ' తో మలయాళ సాహిత్యం ఆధునికంగా మరికొంత ముందుకు వెళ్ళింది.

ఇక మలయాళ కవితా రంగాన్ని పరిశీలిస్తే, 20 వ శతాబ్దం ప్రారంభంలో కవిత్వ స్వరూప స్వభావాల్లో కొంత మార్పు కనిపిస్తుంది. విమర్శనా సాహిత్యంలో పాశ్చాత్య పద్ధతులను అనుసరించే ధోరణి కూడా ఈ సమయంలోనే మొదలైంది.

ఆధునిక వాఙ్మయాన్ని సృష్టించుకోవడంలో, సాహిత్యాన్ని సమాజోద్ధరణకు సాధనంగా మలచుకోవడంలో తెలుగుదేశం సోదర భాషా సాహిత్యాలకంటే తక్కువేం కాదు, వాటికంటే ముందే వుందని చెప్పవచ్చును.

వీరేశలింగం పంతులుగారు రచించిన 'బ్రాహ్మ వివాహం' తెలుగులో మొట్ట మొదటి సాంఘిక నాటకం దీన్ని 'ప్రహసనం' అని అన్నారేకాని నేటి సాంఘిక నాటకానికి ఉండవలసిన లక్షణాలన్నీ దీనికి ఉన్నాయి. ఏడంకాలుగా విభజించబడి రచించబడిన దీన్ని నాటకమని అనడమే సమంజసం.

పంతులుగారు 1876 లో తమ 'హాస్య సంజీవని' పత్రికలో దీన్ని సీరియల్‌గా ప్రకటించారు. వావిలాల వాసుదేవశాస్త్రిగారి 'నందక రాజమ్యే' తెలుగులో మొట్ట మొదటి సాంఘిక నాటకమని కొందరు పరిశోధకుల అభిప్రాయం.[2] అయితే ఇది ప్రచురితమైనది 1880లో కనుక 'బ్రాహ్మ వివాహమే' మొట్టమొదటి సాంఘిక నాటకమని చెప్పవచ్చు.

---

2. "వాసుదేవశాస్త్రిగారు తొట్టతొలుతగా ఆంగ్ల రూపకానువాదమును వెలయించుటే కాక, తొలి సాంఘిక రూపకమును గూడ (నందక రాజ్యం) రచించిరని చెప్పవచ్చును." వీరేశలింగం పంతులు—సమగ్ర పరిశీలన.

డా॥అక్కిరాజు రమాపతిరావు. పేజి 59.

తెలుగు నవలా సాహిత్యాన్ని సమీక్షించినప్పుడు గోపాలకృష్ణమ్మ చెట్టి విరచితమైన శ్రీరంగరాజ చరిత్రము తొలి నవలగా కనిపిస్తుంది. ఇది 1872 లో ప్రకటించబడింది. వీరేశలింగం పంతులుగారి 'రాజశేఖర చరిత్ర' 1878 లో వెలువడింది.

"నవలకు తెలుగు భాషయందు వచన ప్రబంధమను పదమును సృష్టించి వ్యాప్తిలోనికి తెచ్చినది గోపాలకృష్ణమ్మ సెట్టిగారే. ఆధునిక యుగమున జనుల ఆచార వ్యవహారములను విమర్శించు గ్రంథములను రచించుటకు వీరాద్యులు. వీరి రంగరాజ చరిత్రము యొక్క ప్రభావము వీరేశలింగం పంతులుగారిపై కలదని చెప్పుటకు సాక్ష్యములున్నవి."[3]

ఒక కవితా ప్రక్రియ తప్ప ఆధునిక సాహితీ ప్రక్రియలన్నీ 19 వ శతాబ్దంలోనే తెలుగు సాహిత్యంలోకి ప్రవేశించాయి. ఇరవైయవ శతాబ్దంలో, అంటే 1910 లో గురజాడ అప్పారావుగారి 'ముత్యాల సరాలు' తో తెలుగు కవితా రంగం నవ్యతను సిద్ధింప జేసుకొన్నది. సాహిత్యంలో ఈ మార్పులు రావడానికి ఆ నాటి సాంఘిక రాజకీయ పరిస్థితులే కారణం.

పాశ్చాత్య విద్యాభ్యాసం, స్వాతంత్ర్యోద్యమంవల్ల కలిగిన జాతీయదృక్పథం తెలుగు వారిలో కొత్త ఆలోచనలను రేకెత్తింపజేశాయి. జాతీయోద్యమం అన్ని ప్రాంతాల మధ్య సన్నిహితత్వం ఏర్పరచినట్టుగానే సారస్వతాలను కూడా దగ్గర చేసింది. జాతీయోద్యమంవల్ల వంగ దేశం, దేశంలోని తక్కిన ప్రాంతాలకు మాతృక కాగలిగింది. తెలుగుదేశం ఈ ఉద్యమాలకు స్పందించింది. దీనితో సంఘానికి, సాహిత్యానికి ఎంతో మేలు జరిగి, తెలుగుదేశం జాతీయ జీవన స్రవంతిలో భాగస్వామ్యమైనది.

---

3. వీరేశలింగం పంతులు-సమగ్ర పరిశీలన.
డా॥ అక్కిరాజు రమాపతిరావు. పేజి 137.

## తెలుగుదేశం - తెలుగు సాహిత్యం :

ఆంగ్లేయులు దేశంలోని సంస్థానాలను అతి చాకచక్యంతో తమ ఆధీనం లోకి తెచ్చుకున్నారు. దీనికి వారు అనుసరించిన పద్ధతులు మూడు. ఒకటి సహాయక సంధి విధానం (Policy of subsidiary alliance). ఈ విధానాన్ని అమలులో పెట్టినవాడు వెలస్లీ. ఈ పద్ధతి ప్రకారం సంస్థానాలతో ఒక ఒప్పదం జరుగుతుంది. దాని ప్రకారం సంస్థానాలకు ఆంగ్లేయులు సహాయాన్ని అందిస్తారు. సంస్థానాల కొలువుల్లో ఆంగ్లేయులను తప్ప తక్కిన విదేశీయులను చేర్చుకోరాదు. స్వంత సైన్యాలను తగ్గించుకొని ఆంగ్లేయుల సైన్యాన్ని పెట్టుకొని దానికయ్యే ఖర్చు సంస్థానాలే భరించవలె.

ఇక రెండో పద్ధతి. అధీన సంబంధ నిరోధ విధానం (Subordinate isolation). దీన్ని హేస్టింగ్స్ ప్రవేశ పెట్టినాడు. మూడవది డల్‌హౌసి ప్రవేశ పెట్టిన రాజ్య సంక్రమణ సిద్ధాంతం (Policy of Annezation).

పై మూడు పద్ధతులలో మొదట్టి పద్ధతితోనే అంగ్లేయులు దేశంలోని అనేక సంస్థానాలలో ఆధిపత్యం సంపాదించుకున్నారు దీని లోగుట్టు తెలియకనే తెలుగు దేశంలోని చాలా సంస్థానాలు వారు పన్నిన ఉచ్చులో పడ్డాయి. ఈ రకంగా 19 వ శతాబ్దం ప్రారంభం నాటికే తెలుగుదేశం పరోక్షంగా ఆంగ్లేయుల పరిపాలనలోకి వచ్చింది. జమీందారీలు ఉన్నా పేరుకు మాత్రమే. పాలనా బాధ్యత అంతా కంపెనీ ప్రభుత్వానిదే.

ప్రాచీన కాలంలో భారతదేశాన్ని ఎన్ని రాజవంశాలు పాలించినా స్థానిక పరిపాలన మాత్రం చెక్కు చెందరకుండా ఉండేది. ఆంగ్లేయుల కాలంలో ఇది చిన్నాభిన్నమైపోయింది. వారి ఆధిపత్యం గ్రామాల దగ్గరి నుండి ఆరంభమయింది కనుకనే అన్నేళ్ళు మనం వారికి దాసులం కావలసివచ్చింది.

మొదట విశాఖపట్టణం నుంచి మచిలీపట్టణం వరకు స్థాపితమైన క్రైస్తవ మిషనరీలు క్రమేపీ తెలుగుదేశం మూరుమూల గ్రామాలకు వ్యాపించాయి. మన

సంఘం మీద, సంస్కృతి మీద అధిపత్యాన్ని నెలకొల్పాలనే లక్ష్యంతో ఇవి పని చేశాయి.

ఒకప్రక్క పారతంత్ర్య రాక్షసి, మరొక ప్రక్క మూఢాచార పిశాచం ఆనాడు సంఘాన్ని పీల్చి పిప్పిచేసినై. ఈ తరుణంలో ఉత్తర భారతంలో వ్యాపించిన బ్రహ్మసమాజం దక్షిణ భారతానికి ప్రాకింది. కేశవ చంద్రసేన్ బ్రహ్మ సమాజాన్ని ప్రప్రథమంగా దక్షిణ భారతంలో ప్రచారం చేశారు. ఆ తరువాత మన్నవ బుచ్చయ్య పంతులు, వీరేశలింగం పంతులు, రఘుపతి వెంకటరత్నం నాయుడు మొదలైన మహామహులు, సంఘ సంస్కరణ ప్రియులు బ్రహ్మసమాజాన్ని తెలుగు దేశంలో ప్రచారం చేసి, తెలుగు వారిలో చైతన్యం కలిగించారు.

## సాహిత్యం :

బైబిలు అనువాదంతో తెలుగులో గ్రంథాల ప్రచురణ మొదలైనది. 1806 నాటికి మద్రాసులో ముద్రణా యంత్రశాల స్థాపితమై, బైబిలుకు తెలుగు అనువాదాలు వచ్చాయి. అయితే 1830 నాటికిగాని తెలుగులో గ్రంథాల ప్రచురణ అభివృద్ధి చెందలేదు. గ్రంథ ప్రచురణ అభివృద్ధి చెందినా, సాహిత్యంలో చెప్పుకో దగిన మార్పు రాలేదు.

19 వ శతాబ్దంలో తెలుగు సాహిత్యం తీరుతెన్నులను డాక్టర్ సి నారాయణ రెడ్డి గారు ఈ క్రింది విధంగా పేర్కొన్నారు:

"జాతి జీవితము నిర్వీర్యమైనది. సారస్వత రంగము నిస్తేజమైనది. ప్రాచీన సాహిత్య సంప్రదాయములను ఆకళించుకొని క్రొత్త పుంతలో రచనలు చేయు మహాకవి ఆనాడుద్భవించలేదు. అనుకరణ శీలము పెరిగినది. చిత్ర కవిత్వముపై మమకారము హెచ్చినది.........ఇంచుమించు 19 వ శతాబ్ది మధ్య భాగమువరకిట్టిస్థితియే పట్టినది."[4]

---

4. ఆధునికాంధ్ర కవిత్వము. డా॥ సి. నారాయణరెడ్డి. పేజి 128.

కవిత్వ విషయంలో నారాయణరెడ్డి గారి మాట యథార్థం. అయితే ఇదే సమయంలో కాంబెల్, మెకంజీ, బ్రౌన్ తెలుగు భాషా సాహిత్యాలను ఉద్ధరించి భావి కదలికకు కారణభూతులైనారు. 1820 లో మద్రాసులో ఏర్పడిన 'దేశ భాషా గ్రంథకరణ' సభ (Madras Vernacular School Book Society) పాఠశాలల్లో తెలుగు భాషా బోధనకు దేశ చరిత్రలను, వైజ్ఞానిక గ్రంథాలను ప్రచురించింది. దీనివలన కొత్తతరం, కొత్త ఆలోచనలు ఉద్భవించి, భావి సాహిత్య విప్లవానికి పునాదులు ఏర్పడినాయి.

ఆంగ్లేయులు అమలులోనికి తెచ్చిన నూతన విద్యావిధానం దేశీయులలో విజ్ఞాన కాంతులను వెదజల్లినది ప్రపంచంలో జరిగే సంఘటనలతో, పాశ్చాత్య నాగరికతతో సంబంధాన్ని చేకూర్చింది. విద్యారంగంలో శరవేగంతో వస్తున్న ఈ మార్పుకుతోడు సాంస్కృతికోద్యమం బూజుపట్టిన అభిప్రాయాలకు, ఆచారాలకు తిలోదకాలిచ్చి ప్రజల కళ్ళు తెరపించింది.

రాజకీయోద్యమం బలంపుంజుకొని యువతను మేల్కొల్పింది. ఈ యుగ సంధిలోనే వీరేశలింగం పంతులు అవతరించి, అప్పటికే అవతారికను సిద్ధంచేసుకొన్న అభ్యుదయ రంగానికి సారథ్యం వహించారు.

వీరేశలింగం పంతులుగారు నాటకము, ప్రహసనము, వచన ప్రబంధము, కవుల చరిత్ర, శాస్త్రీయ గ్రంథము, సాహిత్య విమర్శ మొదలైన నవీన సాహితీ ప్రక్రియలను చేపట్టి, వాటికి విశేషమైన ప్రాచుర్యాన్ని కలిగించారు. తన సంఘ సంస్కరణ లక్ష్యంతో తెలుగు సాహితీ క్షేత్రాన్ని సుసంపన్నం చేశారు.

పంతులుగారి రాకతో పద్యానికి ప్రాధాన్యత తగ్గింది. వచనానికి పీఠం లభించింది. ఈ రకంగా సాహిత్యాన్ని సామాన్యుల ముంగిళ్ళలోనికి తీసుకవెళ్ళిన ఘనత పంతులుగారికే చెందుతుంది.

ఉత్తరభారతంలో రాజా రామ్మోహనరాయలు దేశీయులను మేల్కొల్పితే, ఆయన తరువాత దక్షిణ భారతంలో వీరేశలింగం పంతులుగారు అవతరించి

సంఘాన్ని, సాహిత్యాన్ని సంస్కరించారు. సనాతన కుటుంబంలో పుట్టినా, ఆ సంకెళ్ళను తెంచుకొని అధునాతనుడుగా సాహిత్యానికి, సంఘానికి తనను తాను అంకితం చేసుకొన్నాడు. దక్షిణ రామ్మోహనుడనదగిన స్థాయికి ఆయన వ్యక్తిత్వం ఎదిగింది. సాహితీరంగంతో రామ్మోహనరాయల కంటే వీరేశలింగం పంతులుగారు ఒకడుగు ముందే ఉన్నారు.

భారతదేశ సాహిత్య జగత్తులో ప్రప్రథమంగా సాహిత్యాన్ని సంఘ సంస్కరణ లక్ష్యంతో ఒక ఉద్యమంగా నడిపించిన మహనీయుడుగా పంతులు గారు కనిపిస్తారు. మహారాష్ట్రంలో జ్యోతిబా పులే ఉన్నా పంతులుగారిలో ఉన్న ఉద్ధృతి ఆయనలో లేదు. అయితే పంతులుగారు పుట్టడానికి ముందే వంగదేశంలో రామ్మోహనరాయలు, మహారాష్ట్రంలో జ్యోతిబాపులే సంఘంలో కదలికను తీసుకవచ్చారు.

తెలుగు దేశంలో పంతులుగారి ఉద్యమానికి రఘుపతి వెంకటరత్నం నాయుడు, గురుజాడ అప్పారావు, గిడుగు రామ్మూర్తి, కొమర్రాజు లక్ష్మణరావు ఒకరి తరువాత ఒకరు ఆ తరువాత కలసివచ్చారు. రఘుపతి వెంకటరత్నం నాయుడు కాకినాడలో బ్రహ్మసమాజాన్ని స్థాపించి, యువకులు ఇతర మతాలలో చేరిపోకుండా వారి దృష్టిని భారతీయ సంస్కృతి వైపు మళ్ళించారు.

గిడుగు వ్యవహారిక భాషా ఉద్యమం, గురుజాడ నవ్యకవితోద్యమం, కొమర్రాజు పరిశోధనా వ్యాసంగం తెలుగు సాహిత్యానికి జీవం పోశాయి. వీరేశ లింగం పంతులు ప్రారంభించిన సాహిత్యోద్యమానికి వీరివల్లే సమగ్రత్వం సిద్ధించింది. వీరిలో ఏ ఒక్కరిని తీసివేసినా తెలుగు సాహిత్యం అసమగ్రమే.

మన తెలుగు సాహిత్యానికి సేవ చేసిన పాశ్చాత్యుల గురించి కూడా ఇక్కడ ప్రస్తావించడం సముచితం.

తెలుగు భాషకే కాక దక్షిణ దేశ భాషా సాహిత్యాలకన్నింటికీ ఎనలేని సేవ చేసిన ప్రప్రథమ పాశ్చాత్యుడు కల్నల్ కాలిన్ మెకంజీ. ఈయన ప్రత్యే

కించి తెలుగు భాష కొరకు కృషి చేయకున్నప్పటికీ ఈయన సాముదాయక కృషి తెలుగు భాషా సాహిత్యాల వికాసానికి ఉపకరించింది. మెకంజీకి భారతీయ విజ్ఞాన సముపార్జనలో సహకరించిన తెలుగువాడు కావలి బొర్రయ్య (Kavali Borraiah). మెకంజీ కృషి ఫలితంగా దక్షిణ భారత భాషా సాహిత్యాలకు చెందిన అనేక గ్రంథాలు, శాసనాలు సేకరింపబడినాయి.

మెకంజీ మరణించిన తరువాత 'రివరెండ్ విలియమ్ టెయిలర్' అనే పండితుడు వాటిని పరిశోధించి భావితరాలవారికి ఉపయుక్తమయ్యేటట్లు 'కేటలాగు' సిద్ధంచేశాడు. ఆ తరువాత బ్రౌన్ తెలుగు దేశంలో పర్యటించి అనేక తాళపత్ర గ్రంథాలను, శాసనాలను సేకరించి, పరిశోధించి, వాటికి శుద్ధప్రతులను వ్రాయించి తెలుగు సాహిత్య చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోయినాడు.

మెకంజీ, బ్రౌన్-వీరిద్దరి పరిశోధనా ఫలితమే ఈనాటి మన తెలుగు సాహిత్య చరిత్ర నిర్మాణము. తెలుగుసాహిత్యంలో పరిశోధనకు ప్రారంభకులు, మార్గదర్శకులు వీరే. పాశ్చాత్య భాషా సాహిత్యాలను గురించి క్షుణ్ణంగా తెలిసిన వారు కావడంవల్ల వాటి ఒరవడిలోనే వారు తమ కృషిని కొనసాగించారు. వీరితో సమానంగా సంస్మరించదగిన తెలుగువాడు కావలి బొర్రయ్య.

కావలి బొర్రయ్యను గురించి కొమర్రాజు లక్ష్మణరావుగారు అన్న మాటలు: "దక్షిణ హిందూ దేశమందు పుట్టిన మొదటి ఎపిగ్రఫిస్టు అని ఇతనిని చెప్పవలెను......ఉత్తరదేశమునందలి శాసనములు చదువుటకు ప్రథమమున ప్రయత్నించినందులకు ప్రిన్సెప్ అను దొరకెట్టి గౌరవమును, ఖ్యాతియునుగలదో అట్టి గౌరవము, ఖ్యాతి నీ యాంధ్రదేశపు పండితునకు నుండవలసినది."[5]

"ఆధునిక పరిశోధనకు పునాదులు వేసిన పాశ్చాత్యుడు మెకంజీ. అతనికి సహాయము చేసిన ప్రథమ భారతీయుడు బొర్రయ్య ఆంధ్రుడు. వీరి తరువాత కృషి చేసినవారికందరికీ వీరే మార్గదర్శకులు."[6]

---

5. ఆంధ్ర పరిశోధక మండలి పంచమ వార్షికోత్సవ సంచిక-1922. పేజి. 9.
6. తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము-డా॥ కె. వీరభద్రరావు. పేజి.117.

కాంబెల్, కాల్డ్వెల్ ద్రావిడ భాషల పరిశోధనకు కృషి చేసి, వాటి వికాసానికి తోడ్పడిన భాషా పరిశోధకులు. కాల్డ్వెల్ రచించిన 'ద్రావిడ భాష వ్యాకరణం' ఆధునిక ద్రావిడ భాషల అధ్యయనానికి ప్రామాణిక గ్రంథంగా పరిగణించబడుతున్నది.

తెలుగు భాషను, తెలుగు సాహిత్యాన్ని తీర్చుదిద్దడానికి తన జీవితాన్నంతా ధారపోసిన త్యాగధనుడు బ్రౌన్.

బ్రౌన్ నాటికి తెలుగు సాహిత్యాన్ని ఉద్ధరించే నాథుడు లేడు. ఎవరికి తోచిన రీతిలో వారు రచనా వ్యాసంగాన్ని కొనసాగిస్తూ తెలుగు సాహిత్యాన్ని సంస్కరించవలసిన అవసరాన్ని విస్మరించారు.

తన కాలం నాటికి తెలుగు సాహిత్యం స్థితిని బ్రౌన్ ఇలా పేర్కొన్నాడు:

"When I begun these tasks, Telugu literature was dying out, the flame was just glimmering in the socket."[7]

బ్రౌన్ తన అధికారాన్ని, పలుకుబడిని ఉపయోగించి అనేక తాళపత్ర గ్రంథాలను వెలికితీయించి పాశ్చాత్య పద్ధతిలో వాటికి శుద్ధప్రతులను తయారు చేయించాడు.

ముద్రణకు ముందు వివిధ పాఠభేదాలు గల ప్రతులు తెప్పించి తగిన విధంగా సంస్కరిస్తూ, అవసరమైన చోట్ల తన వ్యాఖ్యానాన్ని జతచేస్తూ, బ్రౌన్

7. Some Account of the literary life of C. P. Brown. Printed in the II edition- 1895 of Brown's English - Telugu dictionery and written by Brown at the instance of his friends un the eve of his leaving India - 1855.

అనేక కావ్యాలను తెలుగు దేశానికి పరిచయం చేశాడు. తెలుగు ముద్రణ కళలో కూడా బ్రౌన్ చక్కని సంస్కరణలను ప్రవేశపెట్టినాడు.

1845 లో ఇంగ్లీషు-తెలుగు, తెలుగు-ఇంగ్లీషు నిఘంటువులను ప్రకటించాడు. ఈ నిఘంటువులలో వ్యవహారిక భాషను ప్రవేశపెట్టి, వ్యవహారిక భాషా వాదానికి బలం చేకూర్చాడు. నిఘంటువులలో ఆయా శాస్త్రాలకు చెందిన పదాలను ప్రవేశపెట్టడంలో బ్రౌన్ ఎంతో శ్రద్ధ తీసుకొన్నాడు. ఇంతటి విశిష్టమైన పద్ధతిలో వెలువడినవి కనుకనే ఈ నిఘంటువుల ప్రభావం ఆ తరువాత తెలుగులో వచ్చిన నిఘంటువులపై ప్రసరించింది. 1840 లో బ్రౌన్ రచించిన వ్యాకరణం పాశ్చాత్యులు తెలుగు నేర్చుకోవడానికి ఉద్దేశింపబడినదే అయినా, తెలుగులో వ్యాకరణ గ్రంథాల రచనకు అది మార్గదర్శకమైనది. చరిత్ర అధ్యయనానికి ఉపకరించే రీతిలో బ్రౌన్ పాశ్చాత్య పద్ధతిలో హిందూ, మహ్మదీయ చరిత్రలకు సంబంధించిన 'కాలక్రమ' పట్టికను తయారుచేయించి అచ్చు వేయించాడు.

బ్రౌన్ పాశ్చాత్య పద్ధతిలో సంస్కరించి అందించిన తెలుగు సాహితీ క్షేత్రంలో నవ్య ప్రక్రియలను పండించిన నవయుగ వైతాళికుడు వీరేశలింగం పంతులుగారు.

పంతులుగారు రచించిన కవులచరిత్ర తెలుగు సాహిత్యంలో మొట్టమొదటి పరిపూర్ణమైన పరిశోధనా గ్రంథం. మెకంజీ, కావలి బొర్రయ్య, బ్రౌన్ అందించిన సామాగ్రితో పంతులుగారు శాస్త్రీయమైన పద్ధతిని అనుసరించి కవుల చరిత్రను స్వతంత్రమైన పరిశోధనా గ్రంథంగా తీర్చిదిద్దినారు. ఈ గ్రంథం 1895 లో వెలువడింది. దీనికి ముందు 1876 లో గురజాడ శ్రీరామ్మూర్తి పంతులుగారు కొందరు కవుల జీవితాలను సంచికా రూపంలో ప్రకటించారు. అయితే వీటిలో అన్నీ పుక్కిటి పురాణాలే. 1829 లో కావలి బొర్రయ్య సోదరుడు కావలి వెంకట రామస్వామి ఆంగ్లంలో 'దక్కను కవుల చరిత్ర' (Biographical Sketchcs of Dakkan Poets) అనే గ్రంథాన్ని

రచించాడు. ఇది ఆంగ్ల భాషలో రచించబడడంవల్ల తెలుగు దేశంలో ప్రాచుర్యం పొందలేదు.

పంతులుగారి కవుల చరిత్ర ప్రామాణికమైనది. తంజావూరు సరస్వతీ మహలులోని పుస్తకాలను, చెన్నపట్టణం ప్రాచ్య లిఖిత గ్రంథాలయంలోని గ్రంథాలను, కైఫీయతులను, శాసనాలను పరిశోధించి, సప్రమాణికమైన గ్రంథంగా పంతులుగారు దీన్ని రచించారు.

పంతులుగారి తరువాత తెలుగు పరిశోధనా రంగంలో విశేషమైన కృషి చేసిన మానవల్లి రామకృష్ణ కవిగారిని గురించి ప్రస్తావించవలసి ఉన్నది.

రామకృష్ణ కవిగారు సంస్కృత, ఆంగ్ల, ఆంధ్ర, తమిళ, కన్నడ భాషలలో పండితులు.

సాహిత్య పరిశోధనలో కవిగారు విశేషమైన ఖ్యాతి గడించారు. 'విస్మృత కవులు' అను పేర ప్రప్రథమంగా ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో పరిశోధన ప్రారంభించి, నన్నెచోడ కుమారసంభవ కావ్యాన్ని ప్రకటించి కవిగారు ఆంధ్ర సాహితీ ప్రపంచంలో సంచలనం కలిగించారు.

రాజనీతి శాస్త్రాలు, వేదసంహితలు, క్షేత్ర మాహాత్మ్యాలు, ఉదాహరణ కావ్యాలు, ప్రబంధాలు, పురాణాలు మొదలైన పెక్కు గ్రంథాలను పరిశోధించి ఆయన లోకానికి పరిచయం చేశారు. తంజావూరు గ్రంథాలయంలో తాళపత్ర రూపంలో మూలుగుతున్న అనేక తెలుగు కావ్యాలను పరిష్కరించి ప్రచురించారు. ప్రాచీన గ్రంథాలను పరిశోధించి, పరిష్కరించి, తెలుగు దేశానికి పరిచయం చేసిన వారిలో బ్రౌన్ తరువాత కవిగారే పేర్కొనదగినవారు.

'కవిగారు ఆంధ్ర వాఙ్మయ చరిత్రగాని, సాహిత్య చరిత్రగాని వ్రాయక పోవచ్చును. కాని ఇప్పటి వాఙ్మయ చారిత్రకులకందరకంటే ముందుగా దానికి ప్రాతిపదికగా ఒక ప్రణాళిక నేర్పరచినవారు కవిగారే.'[8]

8. మానవల్లి కవి-రచనలు. శ్రీ నిడదవోలు వెంకటరావు. పేజి. 32.

రామకృష్ణకవి మార్గంలో సాహితీ సేవ చేసిన మరో విద్వాంసులు వేటూరు ప్రభాకరశాస్త్రిగారు.

వీరేశలింగం పంతులు, గురజాడ, గిడుగు మొదలైన సాహితీవేత్తలు సాహిత్యోద్యమంలో సంచలనం కలిగిస్తున్న తరుణంలో కొమర్రాజు లక్ష్మణ రావుగారు తనకొక ప్రత్యేక మార్గాన్ని ఎంపిక చేసుకొని, ఆ ఉద్యమంలో పాలు పంచుకొన్నారు.

తెలుగు దేశానికి మొట్టమొదట ప్రామాణికమైన దేశచరిత్రను పరిచయం చేసిన తెలుగువాడు కొమర్రాజు లక్ష్మణరావు పంతులు. ఆయన చరిత్ర పరిశో ధనవల్ల తెలుగు పరిశోధనా రంగానికి సమగ్రత చేకూరింది. తన కాలంనాటికి విభిన్న ధోరణులతో సాగుతున్న తెలుగు పరిశోధనకు సమన్వయం కుదిర్చి, దానికి నిర్దిష్టమైన రూపకల్పన చేసి, లక్ష్యాన్ని నిర్ణయించిన పరిశోధకులు లక్ష్మణ రావుగారు. ఆయన పరిశోధనా దృక్పథం, విమర్శనా పాటవం, మాతృభాషాభి మానం ఆయనకు అనన్యమైన గౌరవ ప్రపత్తులను సంపాదించిపెట్టాయి. తెలుగు సాహిత్యంలో ఆయనే ఒక వ్యవస్థ.

విజయనగర సామ్రాజ్యం మధ్యయుగ భారత రాజకీయాలలో కీలకమైన పాత్రను నిర్వహించినది. దక్షిణాపథంలోనే కాక యావద్భారత దేశంలో హైందవ సంస్కృతి పరిరక్షణకు కంకణం కట్టుకొని, దాదాపు రెండు శతాబ్దాల పాటు ఈ సామ్రాజ్యం దేశంలో రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక సాహిత్య రంగాలకు సంగమ స్థానమైనది.

ఎంతోమంది కవులు, పండితులు ఈ సామ్రాజ్యాన్ని ఆశ్రయించి సాహిత్య సౌరభాలను దశదిశలకు వెదజల్లగల దివ్యమైన కావ్యాలనెన్నింటినో రచించారు. మను చరిత్ర, పారిజాతాపహరణం, వసు చరిత్ర వంటి రసవత్తరమైన కావ్యాలతోపాటు భక్తి ప్రధానమైన శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్యం, పాండురంగ మాహాత్మ్యం, నవీన కల్పనలతో కూడిన కళాపూర్ణోదయం వంటి కావ్యాలు ఈ కాలంలో రచించబడి తెలుగు సాహిత్యం కీర్తి ప్రతిష్ఠలను ఇనుమడింపజేశాయి.

తరతరాలుగా సాగివస్తున్న ఒరవడిలో విజయనగర సామ్రాజ్యం తెలుగు సాహిత్యాన్ని ఆదరించి తన ఉనికి ఉండేవరకు దాన్ని పోషించింది.

విజయనగర సామ్రాజ్యం అంతరించిన తరువాత తెలుగు సాహిత్యానికి సామ్రాజ్యాల ఆదరణ లేకుండాపోయింది తెలుగుదేశం ఛిన్నాభిన్నమై, అక్కడక్కడ అవతరించిన చిన్న చిన్న రాజ్యాలలో తెలుగు సరస్వతి తలదాచుకుంది. తంజావూరు, పుదుక్కోట, చెంజి, మైసూరు, మహారాష్ట్ర రాజ్యాలను తెలుగు కవులు ఆశ్రయించవలసివచ్చింది. విజయ విలాసం వంటి ఒకటి రెండు కావ్యాలు తప్ప సాహిత్యాన్ని ప్రభావితం చేయగలిగిన రచనలు ఈ కాలంలో వెలువడలేదు. సామాజిక మూల్యాలకన్న ఆశ్రయమిచ్చిన ప్రభువుల అభిరుచులే మిన్న అనే ధోరణిలో చాలామంది కవులు తమ రచనలు సాగించారు.

ప్రాచీన కాలంలో ప్రభువులకు ధర్మచింతన ఉండేది. దాన్నిబట్టే ధర్మోపదేశకాలైన కావ్యాలను కవులు రచించేవారు. తెలుగు సాహిత్యంలో క్షీణ యుగంగా, అంధకార యుగంగా పిలువబడే ఈ కాలంలో సామాజిక

స్పర్శ ఉన్న ప్రభువులు, కవులు కరువయ్యారు. 'యథారాజా తథా ప్రజా' అన్నట్టు రాజుల అభిరుచులకు తగినట్టు సాహిత్యం రూపుదిద్దుకొన్నది. అందరు రాజులు, అందరు కవులు ఈ విధంగా ఉండేవారనికాదు. ఆ విధంగా ఉంటే మనం ఈనాడు అమూల్యమైనవిగా పరిగణిస్తున్న కావ్యనిధులు వెలువడేవే కావు. అయితే రాజుల మెప్పుపొందాలనే తహతహతోనో లేక వారి మాటను కాదనలేక భక్తితోనో, భయంతోనో కావ్యాలను రచించిన కవులు అన్ని యుగాల లోను కనిపిస్తారు. అలాంటివారు ఈనాడూ ఉన్నారు. అయితే కాలపరిస్థితులను అర్థం చేసుకొని, సాహితీసేవను మహత్తరమైన అవకాశంగా, మహోన్నతమైన కార్యంగా భావించి, తదనుగుణంగా నడచిన వ్యక్తులే సాహిత్య చరిత్రలో నిలిచారు. నిలుస్తారు.

రాజ్యాలు అంతరించిన తరువాత సంస్థానాలు వెలిశాయి. పూర్వపు ఆడంబరాలు, అట్టహాసాలు లేకున్నా ఈ సంస్థానాలు వాటి లక్షణాలన్నీ పుణికి పుచ్చుకున్నవే. మనకు స్వాతంత్ర్యం సిద్ధించేవరకూ ఈ సంస్థానాలు సాహిత్య కళా రంగాల వ్యాప్తికి ఆధారంగా నిలిచాయి. ఈ సంస్థానాలలో విజయనగరం, పిఠాపురం, పెద్దాపురం, చల్లపల్లి, నూజివీడు, ఆలంపురం, జటప్రోలు, గద్వాల, వనపర్తి, మునగాల పేర్కొనదగినవి. ఎంతోమంది కవులు ఈ సంస్థానాలను ఆశ్రయించి కావ్యాలను రచించారు. ఈ సంస్థానాలన్నింటిలో విజయనగరం, మునగాల ఈ రెండూ ప్రత్యేకతను సంతరించుకొన్నాయి.

విజయనగర సంస్థానాధిపతి ఆనందగజపతి, మునగాల సంస్థానాధిపతి నాయని రంగారావు-వీరిద్దరు ఆనవాయితీగా వస్తున్న సంప్రదాయపరమైన అభిప్రాయాలను ప్రక్కకు నెట్టి, క్రొత్తకు స్వాగతం పలికి, అభ్యుదయోద్యమానికి యథాశక్తి తోడ్పడ్డారు. ఈ రెండు సంస్థానాలు సాహిత్యోద్యమంలో గురజాడ అప్పారావు గారికి, కొమర్రాజు లక్ష్మణరావు గారికి ఆసరాగా నిలిచి, వారికి ధైర్యస్థైర్యాలను అందించాయి. వీరిద్దరు ఈ రెండు సంస్థానాలకు తమ జీవితాలను ధారపోసినప్పటికీ వారు చేపట్టిన సాహిత్యోద్యమాలకు ఆ సంస్థానాధిపతుల

ప్రోత్సాహం ఉన్నదనే వాస్తవాన్ని విస్మరించరాదు. ఈ సంస్థానాధిపతులు కాలంతోపాటు నడిచారు. ఈ కారణంగానే తెలుగు సాహిత్య చరిత్రలో గురజాడను గురించి పేర్కొనవలసి వచ్చినప్పుడు ఆనందగజపతి, కొమర్రాజును గురించి ప్రస్తావించవలసి వచ్చినప్పుడు నాయని రంగారావు స్ఫురణకు వస్తారు. వారి సాహిత్య జీవితాలు వీరితో ముడివడి ఉన్నాయి.

## జననం - విద్యాభ్యాసం :

లక్ష్మణరావుగారి పూర్వీకుల నివాస స్థానం కృష్ణాజిల్లాలోని పెనుగంచిప్రోలు. క్రీ. శ. 1580 ప్రాంతానికి చెందిన కొమర్రాజు వీరి వంశానికి మూల పురుషుడు. ఈ కొమర్రాజు పేరే తరువాత తరాల వారికి ఇంటి పేరుగా మారిపోయింది. కొమర్రాజు వంశంలో ఎనిమిదవ తరంవాడు వెంకట నారాయణ. వెంకట నారాయణకు ముందు తరం వారు ఏ మతానికి చెందిన వారో తెలియక పోయినా ఈయన తరం నుండి వీరు ఆరాధ్యులు. "వెంకట నారాయణగారు చాల కాలము వరకు సంతతి లేనివారగటచే శ్రీశైలమునకు మూడు సారులు ప్రదక్షిణములు చేసి, శైవ మతమును స్వీకరించి లింగధారులయిరి."[1]

ఆరాధ్య సంప్రదాయాన్ని స్వీకరించడంతోపాటు వెంకట నారాయణ తన పేరును కూడా మార్చుకొన్నాడు. అప్పటినుండి ఆయన పేరు శంకరుడుగా మారిపోయింది. ఈయన సతీమణి బుచ్చమ్మ. వీరిద్దరికి కలిగిన సంతానం నాగేశ్వరుడు. క్రీ. శ. 1716 నుండి క్రీ. శ 1770 వరకు అమరావతి సంస్థానానికి అధిపతిగా ఉండిన రాజా వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడుకు ఈ నాగేశ్వరుడు మంత్రిగా ఉండేవాడు.[2]

---

1. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము-పేజి 66.
2. వరదరాజు నందికేశ్వరశాస్త్రి రచితమైన 'సేతుమాహాత్మ్యం' అనే పద్యకావ్యం కూడా దీన్ని సమర్థిస్తున్నది. ఈ కావ్యం లక్ష్మణరావు గారి తండ్రిగారైన వెంకటప్పయ్యకు అంకితంగా రచించబడింది. ఇది అముద్రితము. ప్రస్తుతం ఇది తిరుపతి ప్రాచ్యపరిశోధనాలయంలో ఉన్నది దీని అవతారికలో కృతికర్త, వెంకటప్పయ్య వంశాన్ని వర్ణించాడు.

నాగేశ్వరుని కుమారుడు లక్ష్మణరాయడు. లక్ష్మణరాయడు దేశపాండ్య అనే అధికారాన్ని పొందడం జరిగింది. "ఆసఫ్ జాహీ వంశీకులలో నాలుగో నైజాము దగ్గర దివానుగా ఉండిన చందూలాల్ ద్వారా ఈ పదవి, అధికారము లక్ష్మణ రాయనికి ప్రాప్తించాయి."[8]

లక్ష్మణ రాయనికి తండ్రి తరువాత ఆనవాయితీగా అమరావతీ సంస్థానానికి మంత్రిగా ఉండే భాగ్యం దక్కలేదు. అయితే ఆ రోజుల్లో 'దేశపాండ్య' అనే బిరుదు లభించడం గొప్ప విషయమే.

లక్ష్మణరాయనికి ఒక కుమారుడు. అతని పేరు వెంకటప్పయ్య. వెంకటప్పయ్యకు ఇద్దరు భార్యలు. మొదటి భార్య అచ్చమ్మ, రెండవ భార్య గంగమ్మ.

అచ్చమ్మ సంతానం శంకర్రావు. గంగమ్మకు కూతురు తరువాత ఒక కుమారుడు. అతడే కొమర్రాజు వెంకట లక్ష్మణరావు. కూతురు పేరు అచ్చమాంబ. వెంకటప్పయ్య మొదటి భార్య అచ్చమ్మ, శంకర్రావు జన్మించిన తరువాత ఈ లోకాన్ని విడిచిపెట్టింది అప్పటినుండి శంకర్రావు సవతి తల్లి గంగమ్మ ఒడిలోనే పెరిగాడు.

---

8. కొమర్రాజు వెంకటలక్ష్మణరావు—డా॥ అక్కిరాజు రమాపతిరావు, పేజి 12. నిడదవోలు వెంకటరావు గారు 'భారతి' 1978 జూన్ సంచికలో ప్రచురింపబడిన తమ వ్యాసంలో లక్ష్మణరాయడు చందూలాల్‌కు మంత్రిగా పనిచేసినాడని పేర్కొన్నారు. కాని ఇది సరియైనది గాదు. క్రీ శ. 1788 వరకు గుంటూరు మండలం నైజామ్ నవాబు ఆధీనంలోనే ఉంది. నైజామ్ నవాబు చాలామందికి దేశపాండ్య, దేశముఖ్ అనే బిరుదులిచ్చి, వారి ద్వారా ఆయా ప్రాంతాలను తన స్వాధీనంలో ఉంచుకొన్నాడు. ఇప్పటికీ తెలంగాణా ప్రాంతంలో ఈ బిరుదులున్నవారు కనిపిస్తారు. అదేవిధంగా లక్షణరాయనికి నైజామ్ నవాబుకు మంత్రిగా ఉన్న చందూలాల్ ద్వారా ఈ పదవి లభించి ఉంటుంది. అంతేకాని, చందూలాల్‌కు లక్ష్మణరాయడు మంత్రికాదు. రమాపతిరావు గారు వెలిబుచ్చిన అభిప్రాయం చారిత్రకాధారాలతో సరిపోతున్నది

వెంకటప్పయ్య గంగమ్మకు కుమారుడు పుట్టిన తరువాత పిల్లవాడికి తన తండ్రి పేరు పెట్టుకున్నాడు. లక్ష్మణరావుగారు క్రీ. శ. 1876 మే 18వ తేదీన పెనుగంచిప్రోలులో జన్మించారు.[4] అప్పుడు వెంకటప్పయ్య మునగాల సంస్థానానికి మేనేజర్‌గా ఉండేవాడు. ఆ సంస్థానాధిపతి వెంకట్రామయ్య. ఆయన నివాస స్థానం నడిగూడెం.[5] కాబట్టి తన కుటుంబం పెనుగంచి ప్రోలులో ఉన్నా వ్యవహార రీత్యా వెంకటప్పయ్య ఎక్కువ రోజులు నడిగూడెంలో గడిపేవాడు.

మునగాల జమీందారు వెంకట్రామయ్య మరణించడంతో సంస్థానం ఎన్నో చిక్కులకు లోనైంది. ఈ చిక్కులు పరిష్కరించలేకనో లేక మరేదైనా కారణం వల్లనో వెంకటప్పయ్య తన మేనేజర్ పదవికి రాజీనామా ఇచ్చి పెనుగంచి ప్రోలుకు తిరిగి రావడం జరిగింది. పెనుగంచిప్రోలుకు తిరిగివచ్చిన తరువాత ఎక్కువ రోజులు బ్రతుకలేదు. 1880 లో ఆయన శాశ్వతంగా కన్ను మూశాడు. అప్పటికి లక్ష్మణరావు గారికి నాలుగేళ్ళు.

తండ్రి చనిపోయేనాటికి శంకర్రావు యుక్తవయస్కుడు. భువనగిరిలో ఉద్యోగం చేస్తున్నాడు. ఆపత్కాల సమయంలో ఆయన తమ కుటుంబానికి కొండంత అండగా నిలిచాడు. సవతి తల్లిని, ఆమె సంతానాన్ని భువనగిరికి తీసుకపోయి, వారి పోషణభారం స్వీకరించాడు.

---

4. "1877వ సంవత్సరం మే నెల 18వ తేదీన లక్ష్మణరావుగారు జన్మించారు." కొమర్రాజు లక్ష్మణరావు — డా॥ అక్కిరాజు రమాపతిరావు. పేజి. 13. లక్ష్మణరావు గారు పుట్టింది 1877 లో కాదు. లక్ష్మణరావు గారితో వ్యక్తిగతంగా పరిచయమున్న ఆదిరాజు వీరభద్రరావుగారు సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశంలో ఆయన 1876 మే నెల 18వ తేదీన జన్మించినట్టు పేర్కొన్నారు. నిడదవోలు వెంకటరావు గారు లక్ష్మణరావుగారు 1876 లోనే జన్మించినట్టు వ్రాశారు (భారతి - జూన్ 1978). లక్ష్మణరావు గారి బావమరది కానూరి వీరభద్రేశ్వరరావుగారి లెక్కలో సంప్రదించి తాను ఈ వివరాలు రూపొందించినట్టు వెంకటరావు గారు పేర్కొన్నారు. నేను లక్ష్మణరావు గారి బంధువులను కలసినప్పుడు వారు లక్ష్మణరావు గారు 1876 లో జన్మించినట్టు చెప్పినారు. కాబట్టి అదే వాస్తవం.

5. ఈ నడిగూడెం ఇప్పుడు నల్లగొండ జిల్లాలో ఉన్నది

లక్ష్మణరావు గారికి అక్షరాభ్యాసం భువనగిరిలో జరిగింది. తల్లి గంగమ్మ, అన్న శంకర్రావు ఆయనకు ప్రథమ గురువులు. వారి శ్రద్ధాసక్తులవల్ల చదువులో ఆయనకు గట్టి పునాది ఏర్పడింది. తరువాత కొన్నాళ్ళకు శంకర్రావు దేవర కొండకు బదిలీ కావడంతో ఆయన సంసారం కూడా అక్కడికి మారింది. లక్ష్మణరావుగారి ప్రాథమిక విద్యాభ్యాసం కొంతకాలం దేవరకొండలో సాగడానికి ఇదే కారణం.

లక్ష్మణరావుగారికి ఇద్దరు మేనమామలు. వారు భండారు మాధవరావు, భండారు దండపాణి. మాధవరావు నాగపూర్‌లో ప్రజాపనుల శాఖలో (P.W.D) ఇంజనీరుగా ఉద్యోగం చేస్తుండేవాడు. దండపాణి ఖర్గపూర్‌లో రైల్వే ఉద్యోగి.

భండారు మాధవరావుకు 1882లో భార్యా వియోగం కలుగడంతో గంగమ్మ తన కూతురు అచ్చమాంబను మాధవరావుకు ఇచ్చి వివాహం చేసింది. ఈ వివాహం దేవరకొండలో శంకర్రావు ఇంటిలోనే జరిగింది. ఈ వివాహం జరిగిన తరువాత గంగమ్మ తమ్ముడికి పెద్ద దిక్కుగా ఉంటుందని, తనకు అండగా ఉంటాడని భావించి తాను కూడా కుమారునితోపాటు మాధవరావు వెంట నాగ పూర్‌కు వెళ్ళిపోయింది. బహుశా 1883 ప్రాంతంలో ఇదంతా జరిగి ఉంటుంది. 1883 నుండి లక్ష్మణరావుగారి జీవితం మహారాష్ట్ర వేష భాషలతో పెనవేసుకు పోయింది.

నాగపూర్ చేరేనాటికి లక్ష్మణరావుగారి వయస్సు ఏడు సంవత్సరాలు. అచ్చమాంబ వయస్సు తొమ్మిది సంవత్సరాలు. లక్ష్మణరావుగారికి, అచ్చమాం బకు మధ్య తేడా రెండేళ్ళు. ముక్కుపచ్చలారని తొమ్మిదేళ్ళ అచ్చమాంబను అప్పటికే ఒక బిడ్డకు తండ్రి అయిన మాధవరావుకు ఇచ్చి వివాహం చేయడం శోచనీయంగానే కనిపిస్తుంది.[6] గంగమ్మకు తోబుట్టువుపై ఎంత ప్రేమ ఉన్నా ఈ వివాహం సాంఘికంగా నిరసించదగిందే. అచ్చమాంబ ఆ తరువాత మహిళల

6. "మాధవరావుగారికి మొదటి భార్య చనిపోయేనాటికి మీనా అను రెండేడ్ల కూతురు గలదు." – శ్రీ నిడదవోలు వెంకటరావు, భారతి, జూన్ 1973, పేజి 49.

అభ్యున్నతికి సాగించిన ఉద్యమానికి ఆమె స్వీయ చరిత్ర కూడా ప్రేరణ కలిగించి ఉంటుంది.[7]

ప్రాథమిక దశనుండి డిగ్రీ స్థాయివరకు లక్ష్మణరావుగారి విద్యాభ్యాసం నాగపూర్‌లోనే జరిగింది. భువనగిరిలో, దేవరకొండలో ఆయన ప్రాథమిక విద్యాభ్యాసం చేసినప్పటికి అది కొద్ది రోజులు మాత్రమే. కనుక ఆయన విద్యాభ్యాసమంతా నాగపూర్‌లోనే జరిగిందని చెప్పాలి. మెట్రిక్యులేషన్ వరకు ఆయన మరాఠీ భాషలో చదివారు. మెట్రిక్యులేషన్ తరువాత మారిస్ కాలేజీలో ఎఫ్.ఏ. లో ఆయన విద్యాభ్యాసం ఇంగ్లీషు మీడియంలో అయినప్పటికీ సంస్కృతాన్ని ద్వితీయ భాషగా తీసుకొన్నారు. బి.ఏ. లో కూడా ఆయన విద్యాభ్యాసం ఇదే పద్ధతిలో సాగింది. మారిస్ కళాశాలలో చదువుతున్న రోజుల్లోనే ఆయనకు ఆనాటి సాంఘిక దురాచారాలమీద ఏవగింపు, సాంఘికోద్యమాలపట్ల ఆసక్తి కలిగాయి. ఆ రోజుల్లో మహారాష్ట్రలో ప్రఖ్యాతి వహించిన సమాచార్, వివిధ జ్ఞాన విస్తార్ వంటి పత్రికలతో సాన్నిహిత్యాన్ని పెంపొందించుకోవడం సాహిత్య పరంగా, సాంఘికంగా ఆయన ఎదగడానికి కారణమైంది.

ఒకసారి లక్ష్మణరావుగారు మరాఠీలో వ్రాసిన 'వృద్ధ వివాహ'మనే ప్రహసనం పత్రికలో ప్రచురితమైంది.[8]

7. ఆంధ్రప్రదేశంలో ప్రప్రథమంగా స్త్రీ సమాజాన్ని స్థాపించడానికి భండారు అచ్చమాంబ గారి ప్రోత్సాహం న్నట్టూ, ఆమె భర్తతో పాటు ఆంధ్ర ప్రదేశంలో పర్యటించి, స్త్రీల అభ్యున్నతి కొరకు అనేక ఉపన్యాసాలనిచ్చినట్టు అయ్యదేవర కాశేశ్వరరావు గారు తమ స్వీయ చరిత్రలో పేర్కొన్నారు. నా జీవితము—నవ్యాంధ్రము. పేజి. 71.

8. ఆంధ్రప్రభ దినపత్రిక (హైదరాబాద్)లో విలేఖరిగా పనిచేస్తున్న శ్రీ జి. కృష్ణగారు లక్ష్మణరావుగారి గురించి క్లుప్తంగా ఇంగ్లీషులో చిన్న పుస్తకం వ్రాశారు. ఇది అముద్రితము. నాగపూర్‌లో నివసించే లక్ష్మణరావుగారి చిన్ననాటి మిత్రుడు భవానిశంకర నియోగితో ఆయన ఉత్తరప్రత్యుత్తరాలు జరిపి, లక్ష్మణరావుగారి చిన్ననాటి విషయాలను తెలుసుకొన్నారు. నియోగి వ్రాసిన ఉత్తరాన్ని కృష్ణగారు నాకు చూపించారు. లక్ష్మణరావుగారి చిన్నప్పటి విషయాలను నేను దీనినుండే తీసుకొన్నాను. భవానిశంకర నియోగి కొంతకాలంపాటు నాగపూర్ విశ్వవిద్యాలయానికి ఉపాధ్యాయులుగా పని చేశారు.

ఈ ప్రహసనం ఎవరిమీదో వ్రాసింది కాదు. తరచుగా మేనమామ మాధవరావు ఇంటికి వస్తూ ఆయన కుటుంబంతో సన్నిహిత పరిచయం ఉన్న వ్యక్తిని గురించే. ఆ వ్యక్తి వృద్ధుడు. ఒక బాలికను వివాహం చేసుకొన్నాడు. ఈ సంఘటన లక్ష్మణరావుగారి లేత మనస్సుపై ముద్రవేసి, ఒక ప్రహసనంగా రూపుదిద్దుకొన్నది. ఆ తరువాత ఆ వృద్ధుడు ఆ ప్రహసనాన్ని చదవడం, దాన్ని వ్రాసింది లక్ష్మణరావు అని గ్రహించి చిందులు త్రొక్కుతూ మాధవ రావు ఇంటికి వచ్చి ఆగ్రహాన్ని ప్రకటించడం జరిగిపోయాయి. వృద్ధుడికి కోపాన్ని, మాధవరావుకు నవ్వును తెప్పించినప్పటికి ఈ సంఘటన ఆయనను ఎంతో ఎత్తుకు పెంచింది. అప్పటికే మహారాష్ట్ర ప్రాంతంలో ప్రారంభమైన సాహిత్య, సాంఘికోద్యమాల పట్ల లక్ష్మణరావుగారి మనస్సు లగ్నమైందని ఈ సంఘటన చెబుతున్నది.

చిన్న వయస్సులోనే లక్ష్మణరావుగారికి రచనాశక్తి అలవడిందని చెప్ప డానికి మరో ఉదాహరణ, ఆయన ఎఫ్.ఏ. చదువుతున్న రోజుల్లో వ్రాసిన ఒక భావగీతం.[9] అప్పటికి ఆయనకింకా వివాహం కాలేదు. ఈ గీతం మరాఠీలో వ్రాసింది. పత్నీ వియోగం దీని ఇతివృత్తం. నిజంగా తన ప్రియపత్నిని పోగొట్టుకున్నట్టు ఎంతో భావోద్వేగంతో లక్ష్మణరావుగారు దీన్ని రచించారు. ఇది ప్రచురితమైన తరువాత ఆయన మిత్రులెందరో నిజంగా ఆయనకు పత్నీ వియోగం కలిగిందని ఆయనను పరామర్శించడానికి వచ్చారు చిన్న వయస్సు లోనే ఆయన ఎంతటి ప్రతిభావ్యుత్పత్తులను ఆకళించుకున్నారో దీన్నిబట్టి తెలుసు కోవచ్చు.

అయితే లక్ష్మణరావు గారు ఆ తరువాత ఎప్పుడూ భావగీతాల జోలికి పోలేదు. సమాజంలోని అన్ని రకాల వారికి అందుబాటులో ఉండాలని ఆయన వచనాన్నే స్వీకరించారు.

9. భవానీశంకర నియోగి ద్వారా తెలుసుకొన్న వృత్తాంతం.

తన భావి జీవితానికి ఒక ప్రణాళికను సిద్ధం చేసుకుంటున్న తరుణంలో ఆయన ప్రతిభను ద్విగుణీకృతం చేసే ఒక సంఘటన జరిగింది. అప్పటికి ఆయన వయస్సు దాదాపు ఇరవై రెండు సంవత్సరాలు. బి. ఏ. పూర్తి చేశాడు.

1899 లో బాలగంగాధర తిలక్ రామాయణంలోని పర్ణశాల మహారాష్ట్రలోని నాసికా త్ర్యంబకం దగ్గర ఉన్నదని ఒక వాదాన్ని లేవనెత్తుతూ మరాఠీ పత్రికలో ఒక వ్యాసాన్ని ప్రకటించారు ఈ వాదనలో ఆనాటి అతిరథ మహారథులందరూ పాల్గొని. తిలక్ వాదాన్ని బలపరచారు. అప్పుడు లక్ష్మణ రావు గారు ఆ వాదాలన్నింటినీ ఆమూలాగ్రంగా పరిశీలించి, వాల్మీకి రామాయణంలో పర్ణశాలతో పాటు గోదావరి నది వర్ణన కూడా ఉన్నదని నిరూపించారు. దాన్నిబట్టి ఆ పర్ణశాల నాసికా త్ర్యంబకం దగ్గర కాక, ఆంధ్ర దేశంలోని భద్రాచలం సమీపంలో ఉన్నదని సోదాహరణంగా తన వాదాన్ని దేశానికి చాటి చెప్పి తిలక్, వాదాన్ని ఖండించారు. ఈ సంఘటన లక్ష్మణరావు గారికి మహా రాష్ట్రంలో అఖండ ఖ్యాతిని తెచ్చి పెట్టింది. ముఖ్యంగా తిలక్‌తో పరిచయమేర్పడి, సాహిత్య సాంస్కృతిక రంగాలలో ఆయనతో సాన్నిహిత్యాన్ని ఏర్పరచింది.

కాలేజీలో విద్యాభ్యాసం చేస్తున్న రోజుల్లోనే ఆయన మరాఠీలో సుప్రసిద్ధ కవిగా ఖ్యాతి గడించిన మోరోపంతు 'మహా భారతం'లోని కర్ణపర్వాన్ని పరిష్కరించి, శుద్ధప్రతిని ప్రకటించాడు.[10] ఆయన ప్రప్రథమంగా సంపాదకత్వం వహించింది ఈ కావ్యాన్ని ప్రకటించే సందర్భంలోనే ఆ తరువాత కొంతకాలం ఆయన 'వివిధజ్ఞాన విస్తార్' పత్రికకు ఉప సంపాదకుడుగా పని చేశారు.

---

10. లక్ష్మణరావు గారు పరిష్కరించి, ప్రకటించిన ఈ భాగం ఇప్పటికీ మహారాష్ట్రలో ప్రామాణికమైనదిగా పరిగణింపబడుతున్నది.

1899 లో నాగపూర్‌లో బి. ఏ. పూర్తి చేసిన తరువాత లక్ష్మణరావు గారి విద్యాభ్యాసం ఆగిపోయింది. అప్పటికి ఆయన సంస్కృతాంధ్రాంగ్ల మరాఠీ భాషల్లో మంచి ప్రావీణ్యం, గుజరాతీ, బెంగాలీ, హిందీ భాషలతో పరిచయం సంపాదించి, మహారాష్ట్రలోని విద్వాంసుల జాబితాలో చేరిపోయారు.

నాగపూర్‌లో కళాశాల విద్యాభ్యాసం ఆగిపోయిన తరువాత ఆయన ఆంధ్రదేశంతో సంబంధాన్ని పెంచుకున్నారు

మునగాల సంస్థానంతో తిరిగి సంబంధం పెట్టుకోవాలని తల్లివేసిన ప్రోద్బలం, తెలుగు సాహిత్యానికి, తెలుగు ప్రజలకు సేవచేయాలన్న సంకల్పం ఇందుకు కారణాలుగా కనిపిస్తాయి

లక్ష్మణరావుగారు నాగపూర్‌లో ఒకప్రక్క తన విద్యాభ్యాసం, సాహితీ వ్యాసంగం కొనసాగిస్తూ తన అక్కగారిని రచయిత్రిగా తీర్చిదిద్దడానికి శ్రద్ధ తీసుకున్నారు. ప్రతి రోజు ఆమెకు సంస్కృతం, మరాఠీ, హిందీ, తెలుగు, ఇంగ్లీషు గ్రంథాలనుండి ముఖ్యమైన భాగాలను చదివి వినిపించేవారు. ఈ రకంగా ఆమె ప్రాచీన సాహిత్యాన్ని ఆకళింపు చేసుకోగలిగింది. ప్రపంచంలో ప్రసిద్ధి పొందిన మహిళామణుల జీవిత చరిత్రలతో 'అబలా సచ్చరిత్రమాల' అనే గ్రంథాన్ని రచించిఆమె 1902 నాటికే ఆంధ్రదేశంలోని ప్రముఖ రచయిత్రులలో స్థానం సంపాదించింది. అంతేకాకుండా, భర్తతోపాటు ఆంధ్రదేశంలో విస్తృతంగా పర్యటించి, స్త్రీల అభ్యున్నతికోసం మహిళాసంఘాల ఏర్పాటుకు ఎంతో కృషి చేసింది. దీనికి లక్ష్మణరావుగారి ప్రోత్సాహం, ప్రోద్బలం ఉన్నా యని ఘంటాపథంగా చెప్పవచ్చు.

## మునగాల సంస్థానంతో సంబంధం :

మునగాల సంస్థానాధిపతి వెంకట్రామయ్య మరణించిన తరువాత లక్ష్మణ రావు గారి తండ్రి వెంకటప్పయ్య తన మేనేజర్ పదవికి రాజీనామా ఇచ్చినట్టు లోగడ చెప్పడమైనది. ఆ తరువాత సంస్థాన వ్యవహారాల భారం వెంకట్రా

మయ్యే సతి లచ్చమ్మారావు మీద పడింది (జమీందారిణి). సంస్థానంలో ఉద్యోగిగా ఉన్న అయ్యదేవర లక్ష్మయ్య[11] జమీందారిణికి సమ్మకస్థుడుగా ఉంటూ సంస్థాన వ్యవహారాలల్లో తోడ్పడుతుండేవాడు.

వెంకట్రామయ్యకు సంతపంేదు. ఆయన బ్రతికి ఉన్న రోజుల్లోనే బంధువర్గంలోని వాడైన నాయని వెంకట రంగారావును దత్తు చేసుకొన్నాడు. వెంకట్రామయ్య మరణించిన దాదాపు రెండు మూడు సంవత్సరాలకు జమీందారిణి లచ్చమ్మారావు కూడా స్వర్గస్థురాలైంది. అప్పటికి నాయని రంగారావుకు పధ్నాలుగు సంవత్సరాలు.

మైనరు బాలుడైనందువల్ల ప్రభుత్వం సంస్థానాన్ని స్వాధీనం చేసుకొని 'కోర్టాఫ్ వార్డ్స్'ను నియమించి, విద్యాభ్యాసం నిమిత్తం ఆయనను బందరులోని నోబుల్ కళాశాలలో చేర్పించడం జరిగింది. నాయని రంగారావు బందరులో చదువుకుంటున్న రోజుల్లో లక్ష్మణరావుగారు తల్లి ప్రోద్బలంతో 1898 లో మొట్టమొదటిసారి ఆయనను సందర్శించారు. ఆ తరువాత అప్పుడప్పుడూ నాగపూర్‌నుండి ఆయన బందరు రావడం, రంగారావుతో కొన్ని రోజులు కలసి ఉండడం జరుగుతుండేది.

లచ్చమ్మారావు పోయిన తరువాత అయ్యదేవర లక్ష్మయ్య రంగారావుకు పెద్ద దిక్కుగా నిలిచాడు. లక్ష్మయ్య కుమారుడే కాళేశ్వరరావు. కాళేశ్వరరావు గారు కూడ బందరులో చదువుతుండేవారు. అక్కడే ఆయనకు రంగారావుతో చెలిమి ఏర్పడింది.

సెలవు రోజులు రాగానే మిత్రులందరు బందరులో నాయని రంగారావు, ఇంటిలో దేశకాల పరిస్థితులు చర్చిస్తూ కాలం వెళ్ళబుచ్చేవారు. ఈ మిత్ర,

11. అయ్యదేవర కాళేశ్వరరావుగారి తండ్రి.

బృందంలో పింగళి పురుషోత్తం, పింగళి లక్ష్మీనారాయణ, పిన్నలి కుటుంబరావు కొండిపర్తి వీరభద్రరావు మొదలైనవారు ఉండేవారు.

లక్ష్మణరావుగారికి నాయని రంగావుతో, అయ్యదేవర కాళేశ్వరరావుతో గాఢమైత్రి ఏర్పడింది. రంగారావుకు కాళేశ్వరరావు కంటే లక్ష్మణరావుగారిమీద అభిమానం ఎక్కువ.[12] లక్ష్మణరావుగారి వ్యక్తిత్వం, ఆయనకున్న బహుభషా పాండిత్యం ఇందుకు కారణం కావచ్చు. భావి సాహిత్య విప్లవానికి ఈ మిత్ర త్రయం బందరులోనే పునాదులు వేసుకొన్నారు.

1899 లో బి ఏ. పూర్తిచేసిన తరువాత లక్ష్మణరావుగారు ఎక్కువ రోజులు రంగారావు దగ్గరే గడుపుతూ సంస్థాన వ్యవహారాలతో సంబంధం పెట్టుకొన్నారు.

1900 సంవత్సరంలో ప్రభుత్వం నాయని రంగారావుకు సంస్థానాన్ని అప్పగించింది. అప్పటికి ఆయన మేజర్ కనుక ఇరవై రెండేళ్ళ ప్రాయంలో అడుగుపెట్టి ఉంటాడు. అంటే లక్ష్మణరావుగారు రంగారావుకన్నా వయస్సులో రెండేళ్ళు పెద్దవాడన్నమాట.

సంస్థానం చేతికి రాగానే నాయని రంగారావు లక్ష్మణరావుగారిని 'దివాన్'గా, కాళేశ్వరరావు తండ్రి లక్ష్మయ్యను మేనేజర్‌గా నియమించుకొన్నాడు దాదాపు ఇదే సమయంలో లక్ష్మణరావుగారికి కంకిపాడు వాస్తవ్యులైన కానూరు మల్లికార్జునరావు కూతురు కోటమాంబతో వివాహం జరిగింది. ఈ మల్లికార్జునరావు కాళేశ్వరరావుకు దగ్గరి బంధువు. ఈ వివాహం జరిగిన తరువాత కాళేశ్వరరావుకు, లక్ష్మణరావుగారికి మధ్య మిత్రత్వంతోపాటు బంధుత్వమూ

12. లక్ష్మణరావుగారి తండ్రి మునగాల సంస్థానంలో మేనేజర్‌గా పని చేశాడు. రంగారావు లక్ష్మణరావుగారిని అంతకంటే పెద్ద పదవిలో(దివాన్)నియమించి ఆంతరంగికునిగా చేసుకొన్నాడు.

ఏర్పడింది. వ్యవహారంలోను, వయస్సులోను అనుభవజ్ఞుడు పెద్దవాడైన అయ్యదేవర లక్ష్మయ్య ప్రోత్సాహంతో, పట్టుదలతో ఈ వివాహం జరిగి ఉంటుంది.

లక్ష్మణరావుగారికి బరువు బాధ్యతలు పెరిగాయి. ఆయన మకాం నాగ్‌పూర్ నుండి నడిగూడెం మారింది. ఈ రకంగా ఆయన 1900 సంవత్సరంలో ఆంధ్రదేశానికి శాశ్వతంగా తరలివచ్చారు.

మునగాల సంస్థానానికి చెందిన పరగణాలు అటు ఆంధ్ర ప్రాంతంలోనూ ఇటు తెలంగాణలలోను వ్యాపించి ఉన్నాయి. దివాను పదవి లక్ష్మణరావుగారికి ఈ రెండు ప్రాంతాలను బాగా పరిచయం చేసింది. చిన్నతనంలో ఆయన కొంత కాలం భువనగిరిలోను, దేవరకొండలోను ఉన్నప్పటికి, పెద్దవాడైన తరువాత ఆయన నడిగూడెంలో ఉండడం ప్రధానంగాచెప్పుకోదగింది.

## గ్రంథాలయోద్యమ నిర్వహణ:

తెలంగాణా ప్రజలు నైజామ్ పరిపాలనలో ఎంతటి బానిసత్వంతో బ్రతుకుస్నది ఆయన ప్రత్యక్షంగా చూడగలిగారు. నిజామ్ నిరంకుశ పాలనాబంధం తెలుగు సోదరులకు ప్రతిబంధకంగా ఉన్నదనీ, దాన్ని విచ్ఛినం చేస్తేనేగాని తెలుగు జాతికి మనుగడలేదని ఆనాడే ఆయన ఊహించారు. తెలంగాణా గ్రంథాలయోద్యమంలో ఆయన ప్రముఖ పాత్ర వహించిది ఈ కారణం వల్లనే. గ్రంథాలయాల ద్వారా ప్రజల్లో చైతన్య దీప్తిని కలిగించి, వారిని అంధకారం నుండి విముక్తం చేయాలని లక్ష్మణరావుగారు సంకల్పించారు.

లక్ష్మణరావుగారు చేపట్టిన ప్రతి పనికి నిర్దిష్టమైన ప్రణాళిక కనిపిస్తుంది. ఆ ప్రణాళిక అవిచ్ఛిన్నమైనది. తన అంతరంగంలో ఉత్పన్నమైన భావానికి పటిష్ఠమైన పునాదులు వేసుకొన్న తరువాతే ఆయన రూప కల్పనకు సిద్ధమవుతాడు. చేపట్టే ప్రతి పనికి లక్ష్యాన్ని నిర్ణయించుకోవడం ఆయనకు అలవాటు. శాశ్వతంగా నిలచే ఫలితాల కోసమే ఆయన జీవితాంతం ఆరాటపడ్డారు.

1901 లో హైదరాబాదులో శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ స్థాపనతో గ్రంథాలయోద్యమానికి అంకురార్పణ జరిగినప్పుడే విభిన్న ప్రాంతాల లోని తెలుగు ప్రజల మధ్య భావసమైక్యతకు పునాది ఏర్పడింది. ఒక ప్రాంతం లోని ప్రజలను జాగృతంచేసి తక్కిన ప్రాంతాలలోని ప్రజలను వారితో అనుసంధించడం ఈ ఉద్యమ లక్ష్యం. లక్ష్మణరావు గారి లక్ష్యంఇంత నిగూఢమైంది. ఆయన పరిశ్రమను ఆసాంతం పరిశీలిస్తే ఆయన చేపట్టిన ప్రతి పనిలో ఇంతటి విలక్షణమైన లక్ష్యాలు నిక్షిప్తమై ఉంటాయి. అందుకే ఆయనను మొదట్లో ఒక వ్యవస్థగా అభివర్ణించాను.

లక్ష్మణరావుగారు నడిగూడెంలో ఉన్న రోజులలో హైదరాబాదు ఆయన కార్యకలాపాలకు ప్రధాన కేంద్రమైనది. అక్కడ ఆయనకు రావిచెట్టు రంగా రావుతో పరిచయ మేర్పడింది. రావిచెట్టు రంగారావు అభ్యుదయ భావాలు గలవాడు. తెలంగాణా గ్రంథాలయోద్యమంలో ఆయన లక్ష్మణరావు గారికి తోడుగా నిలిచాడు. మునగాల రాజా నాయని రంగారావు ఆర్థిక సహకారాన్ని అందించి ఈ ఉద్యమ స్థాపకులలో ఒకడుగా కీర్తి ప్రతిష్ఠలు తెచ్చుకున్నాడు.

ఈ ముగ్గురి ప్రయత్న ఫలితంగా శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం ఏర్పడి, తెలంగాణంలో సాహిత్య, సాంస్కృతికోద్యమాలకు కేంద్ర స్థానంగా పని చేసింది. వీరందరితో వ్యక్తిగతంగా పరిచయమున్న ఆదిరాజు వీరభద్రరావు గారి మాటల్లో —

"ఈ త్రిమూర్తులును తెలంగాణములోని ఆంధ్రభాషాస్థితిని బాగుపర చుటకు మంతనములు సలిపిరి. తత్ఫలితముగా శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయము స్థాపితమయ్యెను. అఖిలాంధ్ర దేశములో అధునాతన పద్ధతులమీద స్థాపితమైన మొట్టమొదటి ప్రజాగ్రంథాలయ మిదియే. ఈ గ్రంథాలయ స్థాప నకు స్ఫూర్తి నిచ్చినవారు లక్ష్మణరావుగారు ...... లక్ష్మణరావు గారు ఆంధ్ర దేశమునందు అడుగిడగనే మొట్టమొదట చేసిన మహాకార్య మీ ఆంధ్ర భాషా

నిలయ స్థాపనమే ... ... ఇది తెలంగాణమునందలి ఆంధ్రులకు కనువిప్పు చేసి, విజ్ఞాన భిక్ష పెట్టి, మహోద్యమాలకు దారితీసినది."[18]

హైదరాబాదులో ఈ గ్రంథాలయం స్థాపించేనాటికి నెలకొని ఉన్న పరిస్థితిని, తరువాత ఈ గ్రంథాలయోద్యమం సాధించిన ప్రగతిని గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారు ఈ క్రింది విధంగా పేర్కొన్నారు:

''అప్పటి నిజామ్ నిరంకుశ పరిపాలనలో ప్రజలు ఒకచోట చేరి మాట్లాడు కోవటానికే అవకాశం లేదు. ఏ చిన్న సమావేశం, ఏ సాంఘిక కార్యక్రమం జరుపవలసి ఉన్నా, అధికారుల ఉత్తర్వులు ముందుగా పొంది జరుపవలసి ఉండేది. హైద్రాబాదు సంస్థాన ప్రజల బహిరంగ జీవితమంతా కూడా అధికారుల పర్యవేక్షణ క్రిందనే జరుగుతుండేది. హైదరాబాదు సంస్థానానికి మా బోటి వారెవరూ పోవడానికి అవకాశాలుండేవి కావు. హైదరాబాదు ఇలాకాలో రైలు నడచినంత కాలము ప్రయాణం చేస్తూవుంటే హైదరాబాదు భూమి మీద కాలు పెట్టకపోయినా మమ్మ హైదరాబాదు పోలీసువారు కాపలా చేస్తూ, అక్కడక్కడా మా యోగ క్షేమాలు కనుక్కుంటూ ఉండేవారు. ఇటువంటి పకడ్బందీకల నిరంకుశ రాజకీయ వాతావరణంలో హైదరాబాదు సంపూర్ణ స్వాతంత్ర్యం సంపాదించే వరకు అచ్చటి గ్రంథాలయాలు చక్కగా ప్రజల చైతన్యానికి తోడ్పడినవి.''[14]

పైకి గ్రంథాల యోద్యమంగా కనిపించినా దీని అసలు ఉద్దేశం ప్రజల కళ్ళు తెరిపించి, తెలుగు భాషాభిమానాన్ని కలిగించి, నిజామ్ నిరంకుశ రాజ్యాన్ని కూకటివేళ్ళతో పెళ్ళగించాలన్నదే. అ నాటి పరిస్థితులలో విప్లవాత్మకమైన ఈ గ్రంథాలయోద్యమాన్ని ప్రారంభించడం నిజంగా ఒక సాహసమే

ఒక రకంగా లక్ష్మణరావుగారు గ్రంథాలయోద్యమ రూపంలో నైజామ్‌కు వ్యతిరేకంగా తెలంగాణా పోరాటానికి 1901 లోనే అంకురార్పణ చేశారు. నాయని రంగారావు వంటివారు దీనిలో పాల్గొనడం ఆశ్చర్యాన్నే కలిగిస్తుంది.

---

13. సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశము - మూడవ సంపుటం. పేజి 68.
14. ''శ్రీ సర్వోత్తమరావు జీవితము''— మాదల వీరభద్రరావు. పేజి. 224.

నాయని రంగారావు విశిష్టమైన వ్యక్తిత్వంగలవాడనడానికి ఇది దృష్టాంతం. సంస్థానానికి అధిపతి అయినా దేశం పట్ల అభిమానం, స్వాతంత్ర్యోద్యమంపట్ల సానుభూతి ఆయనకుండేవి. ఎన్నో సంస్థలకు, కళాశాలలకు భూరి విరాళాలిచ్చి సాహిత్య, సాంస్కృతికోద్యమాల వికాసానికి ఆయన ఎంతో సహాయం చేశారు. లక్ష్మణరావుగారి చెలిమితో ఎదిగిన ఆయన వ్యక్తిత్వం ఆయనను ఇంతటి విశిష్టమైన వ్యక్తిగా తీర్చిదిద్ది ఉంటుంది.

ఆయనకు లక్ష్మణరావుగారి చెలిమి లేకున్నట్టయితే మునగాల సంస్థానం కూడా కాలానికి ఎదురీది భారతదేశ అభ్యుదయోద్యమంలో రూపు మాసిపోయిన సంస్థానాల జాబితాలో చేరిపోయి ఉండేది.[15]

రంగారావు వివేకానంద స్వామికి శిష్యుడు. వివేకానందుడు అప్పటికే హిందూమత వైశిష్ట్యాన్ని ప్రపంచానికి చాటిచెప్పి, భారతజాతి ప్రతిష్ఠను విశ్వవ్యాప్తం చేశాడు. 1893 లో అమెరికాలోని చికాగో నగరంలో ఆయన ఇచ్చిన ఉపన్యాసం ప్రపంచ వ్యాప్తంగా ఆయనకు అనేక మంది శిష్యులను తయారు చేసింది. ఆయన ఉపన్యాసాలను మననం చేసుకుంటూ క్రైస్తవ మతాన్ని ఢీకొన్న యువకులు ఆనాడు కోకొల్లలు. నాయని రంగారావుకూడా ఆ కోవకు చెందినవాడే. అంతేకాకుండా ఆయన తరచుగా వివేకానందుని సందర్శించేవాడు. ఈ సందర్భంలో ఆయనవెంట లక్ష్మణరావుగారు కూడా ఉండేవారు. భారతీయ సంస్కృతిపై వివేకానందుడిచ్చిన ఉపన్యాసాలు లక్ష్మణరావుగారిని ఆకర్షించాయి.

లక్ష్మణరావుగారు వివేకానందుని సందర్శనానికి వెళ్ళినప్పుడు కలకత్తా విశ్వవిద్యాలయంతో సంబంధం పెట్టుకున్నారు. ఆ తరువాత ఆయన 1902 లో

15. కొన్నాళ్ళకు నాయని రంగారావు భూస్వామ్య నిరంకుశ విధానాలను పట్టుకొని ప్రాకులాడి, సంస్థానం పరిధిలోని రైతాంగంలో అసంతృప్తి కలుగడానికి కారకుడయ్యాడు. ఈ అసంతృప్తి ఆ తరువాత కమ్యూనిస్టు విప్లవంగా పరిణమించింది. అయితే ఈ కారణంతో అప్పటివరకు ఆయన అభ్యుదయోద్యమంలో నిర్వహించిన పాత్రను కొట్టివేయడానికి వీలులేదు.

ఇదే విశ్వవిద్యాలయంలో ఎమ్ ఏ పరీక్షకు ప్రైవేట్‌గా కూర్చొని ఉత్తీర్ణులు కావడం జరిగింది సంస్కృతం, తత్త్వశాస్త్రాలను ప్రధాన విషయాలుగా తీసుకొని ఆయన ఈ ఎమ్.ఏ. పూర్తి చేశారు ఆంగ్ల పట్టభద్రుల్లో సంస్కృతం బాగా చదివి, అపారమైన పాండిత్యం సంపాదించిన ప్రతిభాశాలిగా ఆయన పరిగణనలోకి వచ్చారు. ఆయన మేధాసంపత్తి ఇంత ఎత్తుకు ఎదిగినా ఆయన వయస్సు కేవలం ఇరవై ఆరు సంవత్సరాలే. ఇంత చిన్న వయస్సులో యింత ప్రతిభను సంపాదించడం సామాన్యులకు సాధ్యమయ్యేది కాదు. లక్ష్మణరావు గారు అసామాన్యమైన వ్యక్తి. అందుకే ఆయనకు సాధ్యమైనది.

వయస్సులో చిన్నవాడైనా, సంస్థానానికి చెందిన వ్యవహారాలను పరిష్కరించడంలో ఆయన ఎంతో ప్రతిభను ప్రదర్శించేవాడు ఒక్కొక్కసారి నాయని రంగారావు దర్పంవల్ల జటిలమయ్యే సమస్యలు కూడా ఆయన చాకచక్యం కారణంగా అవలీలలగా పరిష్కరింపబడుతుండేవి.

ఒకసారి 1904 లో సంస్థానానికి చెందిన రెండు కేసులను కృష్ణాజిల్లా న్యాయమూర్తి కొట్టివేయడం జరిగింది. దానిపై ప్రతిపక్షంవారు తిరిగి మద్రాసు హైకోర్టుకు అప్పీలు చేసుకొన్నారు. సంస్థానం బరువు బాధ్యత అంతా లక్ష్మణ రావు గారిదే కనుక ఆయన తరచుగా మద్రాసుకు వెళ్ళడం తటస్థపడుతుండేది. ఎక్కువ రోజులు మద్రాసులోనే ఉండవలసిన పరిస్థితి రావడంతో ఆయన 1905 లో కుటుంబాన్ని మద్రాసుకు మార్చారు. ఆయన సాహితీ కార్యరంగం కూడా మద్రాసుకు మారింది. అక్కడ అయ్యదేవర కాళేశ్వరరావు వంటి మిత్రుల తోడు లభించింది కాళేశ్వరరావు అప్పుడక్కడ న్యాయశాస్త్రం చదువు తుండేవారు.

కోర్టు కేసుల కారణంగానో, లేక న్యాయశాస్త్రం చదువుతున్న మిత్రులు తోడైనందువల్లనో ఆయనకు మళ్ళీ చదువుకోవాలన్న అభిలాష కలిగింది. ఆ తరువాత ఆయన ఎఫ్.ఎల్ లో ఉత్తీర్ణులై, బి.ఎల్.లో కూడా ప్రవేశించారు. అయితే బి.ఎల్.ను పూర్తిచేయకుండానే మధ్యలో మానుకున్నారు. సంస్థాన

వ్యవహారాలకు సంబంధించిన పనిభారం, సాహితీ వ్యాసంగం మరుకుగా కొనసాగించాలన్న పట్టుదల ఇందుకు కారణాలు కావచ్చు. దేశవ్యాప్తమైన జాతీయోద్యమం కూడా ఆయనను ఆకర్షించి ఉంటుంది. జాతీయోద్యమాన్ని సమీక్షించుకొని తన కార్యరంగాన్ని సిద్ధం చేసుకోవాలన్న ఆకాంక్షతో ఆయన తన పూర్తి ధ్యాసను సమకాలీన పరిస్థితి వైపు మళ్ళించారు.

## సమకాలీన పరిస్థితులు - దేశసేవ

భారతదేశానికి రిప్పన్ తరువాత గవర్నర్ జనరల్‌గా వచ్చిన లార్డ్ కర్జన్ 1905 లో పరిపాలనా సౌలభ్యం పేరుతో బెంగాల్ రాష్ట్రాన్ని రెండుగా విభజించాడు. పైకి పరిపాలనా సౌలభ్యమని చెప్పినా, బెంగాలీలు కలసికట్టుగా ఉంటే తమకు ముప్పుతిప్పలు తప్పవన్న భయంతో, సంకుచిత స్వభావంతో కర్జన్ బెంగాల్‌ను విభజించడం జరిగింది. కర్జన్ తీసుకొన్న నిర్ణయం వెంటనే అమలులోకి వచ్చింది. ఈ చర్య దేశవ్యాప్తంగా పెద్ద సంచలనాన్ని కలిగించింది. ఆంగ్లేయులు తమ స్వార్థంకోసమే బెంగాల్‌ను విభజించారన్న వాస్తవం ప్రతి భారతీయుడికి తెలిసిపోయింది.

అప్పటివరకు సత్తనడక నడుస్తున్న జాతీయోద్యమం కర్జన్ తీసుకొన్న ఈ నిర్ణయంతో మళ్ళీ ఊపు నందుకొన్నది. జాతీయ నాయకులు ఆంగ్లేయులకు వ్యతిరేకంగా నడుం బిగించారు. జమీందారులు, న్యాయవాదులు, విద్యార్థులు, ధనికులు, పేదలు-ఒక్కరేమిటి సమస్త ప్రజలు వీరికి అండగా నిలిచారు. మాకు కావలసింది సంస్కరణలు కాదు, మా దేశాన్ని మాకు అప్పగించి మీరు తక్షణం వెళ్ళిపొండి అనే నినాదాలతో అతివాద వర్గం బయలుదేరింది. ఈ వర్గంలో అరవింద ఘోష్, లోకమాన్య బాలగంగాధర తిలక్, లాలా లజపతిరాయ్, బిపిన్ చంద్రపాల్ ముఖ్యులు.

సంస్కరణలతో సరిపెట్టుకొని దశలవారీ ప్రయత్నాల ద్వారా స్వాతంత్ర్యం సంపాదించుకోవాలన్న దృక్పథంగలవారు మితవాదులు. వీరిలో ముఖ్యులు దాదాభాయి నౌరోజీ, ఫిరోజ్‌షా మెహతా, గోపాలకృష్ణ గోఖలే.

బెంగాల్ విభజనకు నిరసనగా దేశవ్యాప్తమైన 'వందేమాతరోద్యమం' అతివాదుల ఉద్యమం. వీరి దృష్టిలో భారతదేశం ఆరాధ్య దైవం భారతదేశం అంటే భరత మాత. భారతమాతకు ఇతర పేర్లు కాళి, దుర్గభవాని మొదలైనవి. కాళీమాతను పూజించినట్లు భరతమాతను పూజించవలె దేవతను ప్రసన్నురాలిగా చేసుకోవడం కొరకు ఏ విధంగా బలి కూడా ఇస్తామో అదేవిధంగా దేశం కొరకు అవసరమయితే ప్రాణాలను సైతం అర్పించాలని వీరు ఉద్బోధించారు. వీరంతా ఉచ్చరించే మంత్రం 'వందే మాతరం'. దీనికి బంకిమ చంద్రుని గీతం ప్రాణం పోసింది.

బెంగాల్‌లో బయలుదేరిన ఈ వందేమాతరోద్యమం దావానలంలా దేశం నలు మూలలకు వ్యాపించింది.

మహారాష్ట్రలో బాలగంగాధర తిలక్ గణేశోత్సవాలను, శివాజీ ఉత్సవాలను తిరునాళ్ళవలె జరిపించాడు. అదేవిధంగా అరవింద ఘోష్, బిపిన్ చంద్రపాల్ బెంగాల్‌లో కాళీ, దుర్గ పూజలను పెద్ద ఎత్తున మారుమూల ప్రాంతాలలో కూడా నిర్వహించారు సామాన్యులను స్వాతంత్ర్యోద్యమంలో భాగస్వాములను చేయాలన్న సంకల్పం ఈ ఉత్సవాల నిర్వహణలోని లక్ష్యం. దీనివల్ల ప్రజల్లో దేశాభిమానం పెంపొంది, స్వాతంత్ర్య సమరానికి కదలి వస్తారని వీరి విశ్వాసం.

భారత దేశంలో అనాది నుండి ఆచరణలో ఉన్న సంస్కృతీ, సంప్రదాయాలకు దేశభక్తిని అన్వయించినందువల్లనే ఈ వందేమాతరోద్యమం చదువురాని సామాన్యులను సైతం కదలించింది. స్వాతంత్ర్యోద్యమంలో నవశకాన్ని ప్రారంభించి, సమస్త ప్రజానీకాన్ని కర్తవ్యోన్ముఖులను చేసింది.

ప్రపంచంలోని తక్కిన దేశాల స్వాతంత్ర్యోద్యమాలకు భారత దేశ స్వాతంత్ర్యోద్యమానికి తేడా ఉంది. ఐరోపా దేశాల స్వాతంత్ర్యోద్యమం రాజకీయ ఐక్యం మీదనే కేంద్రీకృతమై నడచింది. భారతదేశంలో స్వాతంత్ర్యం

కోసం పోరాటం సాగించే తరుణంలో సంస్కృతి కోసం కూడా పోరాడవలసి వచ్చింది. సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమాన్ని ఆసరాగా చేసుకొని భారతదేశ స్వాతంత్ర్యోద్యమం నడచింది.

ప్రజలు చైతన్యవంతులైతేనే గాని స్వాతంత్ర్యోద్యమానికి కదలి రాలేరు. ప్రజల్లో చైతన్యం కలిగించడం సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమ లక్ష్యం. ఆ తరువాత ప్రజలను సమీకృతం చేసి స్వాతంత్ర్యోద్యమాన్ని నడిపించడం రాజకీయోద్యమ బాధ్యత. వందేమాతరోద్యమం ఈ రెండు లక్షణాలతో అతివాద పద్ధతిని అనుసరించి నడచింది.

ఈ ఉద్యమ నాయకులు దేశమంతటా పర్యటించి, విదేశీ వస్తువులను, ప్రభుత్వ పాఠశాలలను, ప్రభుత్వ న్యాయస్థానాలను బహిష్కరించాలని దేశ ప్రజలకు పిలుపు నిచ్చారు

దేశమంతటా జాతీయతా భావం నెలకొన్నది. జాతీయ పాఠశాలలు, జాతీయ న్యాయస్థానాలు వెలిశాయి

మద్రాసులో కొందరు విద్యార్థులు సమావేశమై, వందేమాతరోద్యమంలో పాల్గొన్న విద్యార్థులను అభినందిస్తూ, వారి మార్గాన్ని అనుసరించాలని తీర్మా నించుకొన్నారు. ఈ ఉద్యమం ప్రజలను ఆకర్షించడానికి ఒక పెద్ద సభ జరుపాలని కూడా నిర్ణయించడమైనది. ఈ సమావేశంలో పాల్గొన్న వారిలో కొమర్రాజు లక్ష్మణరావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, అయ్యదేవర కాళేశ్వర రావు, గొల్లపూడి సీతారామశాస్త్రి మొదలైనవారు ఉన్నారు. సుప్రసిద్ధ తమిళ కవి సుబ్రమణ్యభారతి సమావేశంలో పాల్గొన్నవారిలో ఉన్నాడు. లక్ష్మణ రావుగారు అప్పుడు విద్యార్థులలో లెక్క. అప్పుడాయన న్యాయశాస్త్రం చదువు తున్నారు.

సభ జరపాలన్న వీరి నిర్ణయాన్ని కొందరు పెద్దలు హేళన చేశారు. అయినా దాన్ని లెక్క చెయ్యకుండా సభ జరిపి తీరాలని నిశ్చయించుకున్నారు.

సభకు అధ్యక్షత వహించమని ఎవరిని అడిగినా లాభం లేకపోయింది. చివరికి స్వదేశీమిత్రన్ సంపాదకుడైన జి. సుబ్రమణ్య అయ్యర్ అంగీకరించడంతో అనుకున్న ప్రకారం 1905 సెప్టెంబర్‌లో ఈ సభను జయప్రదంగా నిర్వహించారు.

దాదాపు ఐదారు వేలమంది విద్యార్థులు పాల్గొన్న ఈ మహాసభలో స్వదేశీ ఉద్యమాన్ని ప్రోత్సహించడానికి జాతీయ నిధిని ఏర్పాటు చేయాలని నిర్ణయించుకున్నారు ఈ నిర్ణయం ప్రకారం నిధిని వసూలు చేయడానికి లక్ష్మణరావుగారు మద్రాసులోని పగడాల వీధిని ఎన్నుకొన్నారు. ఈ రకంగా అందరూ పెద్ద మొత్తంలో నిధిని వసూలు చేసి జాతీయ నాయకులకు అప్పగించడం జరిగింది.

ఆ తరువాత 1907 లో బిపిన్ చంద్రపాల్ ఆంధ్ర దేశానికి వచ్చినప్పుడు కొమర్రాజు లక్ష్మణరావు, నాయని రంగారావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు- వీరందరూ ఆయనకు ఘన స్వాగతమిచ్చి, ఆంధ్ర దేశంలోని ప్రధాన పట్టణాలలో ఆయన ఉపన్యాసాలను ఏర్పాటు చేశారు.

లక్ష్మణరావుగారు ఎంతటి దేశభక్తులో ఈ సంఘటనలు నిరూపిస్తున్నాయి. లక్ష్మణరావు గారు స్వాతంత్ర్యోద్యమంలో నిర్వహించిన పాత్ర వేరు. అది విభిన్నమైనది. విలక్షణమైనది.

రాజకీయ రంగంలో గాడిచర్ల హరిసర్వోత్తమ రావు, భోగరాజు పట్టాభి సీతారామయ్య మొదలైనవారు, సంఘ సంస్కరణోద్యమంలో వీరేశలింగం పంతులుగారు, వ్యవహారిక భాషోద్యమంలో గిడుగు రామ్మూర్తి పంతులుగారు, నవ్య కవితోద్యమంలో గురజాడ అప్పారావు గారు వీరావేశంతో విహరిస్తున్న రోజులవి

లక్ష్మణరావుగారు ఈ ఉద్యమాలన్నింటినీ మూర్తీభవించుకొన్నవారే. ఆయన గొప్ప సంఘ సంస్కర్త అని చాలా మందికి తెలియదు. అచ్చమాంబ సాగించిన మహిళాభ్యుదయోద్యమంలో ఆయన పాత్ర ఉన్నది.

వీరేశలింగం పంతులు ప్రారంభించిన సంఘ సంస్కరణోద్యమం ఆయనను బాగా ఆకర్షించింది. పంతులుగారివలె లక్ష్మణరావుగారు సంప్రదాయకమైన సనాతన కుటుంబంలో జన్మించారు ఆయనవలె ఈయన కూడా సనాతన సంప్రదాయాలను ఛేదించుకొని అభ్యుదయ పథంలో పయనించారు లక్ష్మణరావుగారి ప్రోత్సాహంవల్లనే ఆయన రెండవ మేనమామ భండారు దండపాణి వితంతు వివాహం చేసుకున్నారు.

లక్ష్మణరావుగారు సంఘ సంస్కర్త అని నిరూపించడానికి మరో ఉదాహరణ 1907 లో నందిగామలో జరిగిన కాంగ్రెస్ మహాసభ.

1907 వ సంవత్సరం వేసవిలో ఈ సభ ఏర్పాటు చేయబడింది. ఈ సందర్భంగా ఏర్పాటైన రాజకీయ, సాంఘిక సభల ఆహ్వాన సంఘాలకు నాయని రంగారావు అధ్యక్షుడు. రాజకీయ సభ ఆహ్వాన సంఘానికి అయ్యదేవర కాళేశ్వరరావు, సాంఘిక సభ ఆహ్వాన సంఘానికి కొమర్రాజు లక్ష్మణరావు కార్యదర్శులు.

రాజకీయ సభ రెండు రోజులు, సాంఘిక సభ ఒక రోజు జరిగాయి. ఈ సభలకు మాడపాటి హన్మంతరావు, ఆదిరాజు వీరభద్రరావు, రావిచెట్టు రంగారావు, ఆచంట లక్ష్మీపతి, ఆదిపూడి సోమనాథరావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు తదితరులు హాజరయ్యారు రాజకీయ సభకు పల్లూరి సూర్యనారాయణరావు, సాంఘిక సభకు కొండా వెంకటప్పయ్య అధ్యక్షత వహించారు.

సాంఘిక సభలో వితంతు వివాహాలను, అస్పృశ్యత నివారణను సమర్థిస్తూ తీర్మానాలు ఆమోదించబడినాయి.

సాంఘిక సభ ముగిసిన రోజు రాత్రి అన్ని కులాలవారితో సహపంక్తి భోజనం ఏర్పాటు చేశారు. లక్ష్మణరావుగారే దీనికి ఆధ్వర్యం వహించారు. ఈ సహపంక్తి భోజనం ఆ రోజుల్లో ఒక విప్లవాత్మక చర్య అభ్యుదయ భావాలు గల వారందరూ ఆరోజు సహపంక్తి భోజనమే చేశారు. సహపంక్తి భోజనం ఇష్టంలేని వారికి విడిగా ఏర్పాట్లు చేశారు అయితే లక్ష్మణరావుగారు దానిగురించి

పట్టించుకోలేదు. తిన్నగా సహపంక్తి భోజనం చేసే వారి దగ్గరికి వెళ్ళి వారితో పాటు భోజనం చేసి, అక్కడ తన అభ్యుదయ భావాన్ని ప్రకటించారు. ఈ సంఘటన తరువాత లక్ష్మణరావుగారు చాలామంది బంధువులకు దూరం కావలసి వచ్చింది.

ఆ రోజుల్లో బెజవాడలో పూర్వాచార పరాయణులు, సంఘ సంస్కర్తలు పోటీ సభలను నిర్వహిస్తుండేవారు. పూర్వాచార పరాయణులు సంఘ సంస్కరణను ఖండిస్తూ సభను నిర్వహిస్తే, వారిని ఇంకా ఉడికించాలని సంఘ సంస్కరణాభిలాష గలవారు ఎక్కువ సభలను జరుపుతుండేవారు. సంఘ సంస్కర్తల సభలకు అయ్యదేవర కాళేశ్వరరావు ఆధ్వర్యం వహించేవారు. లక్ష్మణరావుగారు మద్రాసునుండి ఈ సభలకు హాజరయి, సంఘాన్ని సంస్కరించవలసిన అవసరాన్ని ఉద్ఘాటిస్తూ ప్రసంగాలు చేసేవారు.

ఆ రోజుల్లో కొమర్రాజు లక్ష్మణరావు, అయ్యదేవర కాళేశ్వరరావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, పింగళి లక్ష్మీనారాయణ-వీరందరూ ఒక ముఠాగా వ్యవహరించేవారు. వీరందరికి లక్ష్మణరావుగారిపై అభిమానం ఎక్కువ. ఆయన సలహాను తీసుకొన్న తరువాతే వారు ముందడుగు వేసేవారు. లక్ష్మణరావు గారిని వారందరూ 'అన్నయ్యా' అని పిలిచేవారంటే ఆయనకు ఎంత విశిష్టమైన స్థానం ఉండేదో తెలుసుకోవచ్చు.

ఒకసారి ఒక వింత సంఘటన జరిగింది. 1908 లో 'సర్కార్' అనే బెంగాలీ యువకుడు కలకత్తానుండి బెజవాడకు వచ్చాడు. అతనికి అయ్యదేవర కాళేశ్వరరావు ఇంటిలో విడిదిని ఏర్పాటు చేశారు.[16] హరి సర్వోత్తమరావు, పింగళి లక్ష్మీనారాయణ అతనితో సంప్రదింపులు జరిపారు.

---

16. అయ్యదేవర కాళేశ్వరరావు 1906 వ సంవత్సరం జూన్ నెలనుండి బెజవాడలో న్యాయవాద వృత్తిని ప్రారంభించారు. లక్ష్మణరావుగారు బెజవాడకు వచ్చినప్పుడు కాళేశ్వరరావు ఇంటిలో దిగేవారు

నా జీవితము-నవ్యాంధ్రము పేజి. 85

ఆ యువకుడు బ్రిటిషు ప్రభుత్వంపై బెంగాల్ యువకులు సాయుధ విప్లవం లేవదీయాలని ప్రయత్నిస్తున్నట్టు తెలియజేశాడు. బాంబులు తయారు చేయడం, నదులమీది వంతెనలు కూలద్రోయడం, అధికారులను హత్య చేయడం వారి పథకంలోని భాగాలు. ఈ విప్లవంలో ఆంధ్రప్రాంతంలోని యువకులు పాల్గొనాలని అతడు అభ్యర్థించాడు.

వారికి ఆ యువకుడు చెప్పిందంతా అర్థమైంది దేశం కోసం ప్రాణత్యాగం చేయడానికి సిద్ధమైన ఆ యువకులపట్ల గౌరవాభిమానాలు ఉన్నప్పటికి సాయుధ విప్లవం నాటి పరిస్థితుల్లో సరియైనది కాదని ఈ మిత్రబృందం భావించింది. ప్రజల్లో రాజకీయ పరిజ్ఞానం లేనిదే ఇటువంటి విప్లవాలవల్ల ప్రయోజనం ఉండదు. హత్యలు చేయడం, అల్లకల్లోలాన్ని సృష్టించడం-ఇటువంటివి ప్రజలకు ఉద్యమ కారులపట్ల వ్యతిరేక భావాన్ని కలిగించవచ్చు. శాంతియుత పద్ధతులను అనుసరించి ప్రజలను సమీకృతం చేయడమే సరియైనది. దీనివల్ల ఫలితాలు ఆలస్యమైనా అవి శాశ్వతమైనవి. ఈ విధంగా ఊహించిన ఈ మిత్రబృందం బెంగాలీ యువకుడికి తమ అసమ్మతిని తెలిపి అతన్ని పంపించి వేసింది.[17] ఈ సంఘటన ముఠాగా వ్యవహరించే మిత్రబృందం భావాలకు ప్రతిబింబం. ఈ సంఘటనతో లక్ష్మణరావుగారికి సంబంధం లేకున్నప్పటికీ ఆయన ఈ బృందంలోనివాడే కనుక ఆయన భావాలకు ప్రతీకగా దీన్ని తీసుకోవచ్చు. ఒకే భావాలు గల యువకులందరూ ఒకచోట చేరి లక్ష్మణరావుగారి సలహాలతో వ్యవహరిస్తుండే వారంటే ఆయన ప్రభావం కూడా వారందరిపై తప్పక ఉంటుంది.

లక్ష్మణరావుగారు రాజకీయోద్యమంలో గాని, సంఘ సంస్కరణోద్యమంలో గాని నాయకత్వం వహించలేదు. ఒక ప్రత్యేక మార్గాన్ని అనుసరించి తన లక్ష్యసాధనకు కృషి చేయాలన్న సంకల్పమే ఇందుకు కారణం. ఆయన లక్ష్యంలో సాహితీ వికాసం, సంఘ సంస్కరణ, స్వాతంత్ర్యాభిలాష- ఇవన్నీ మిళితమై ఉన్నాయి.

---

17. నా జీవితము - సవ్యాంధ్రము. అయ్యదేవర కాళేశ్వరరావు. పేజి. 102.

అయ్యదేవర కాళేశ్వరరావు లక్ష్మణరావుగారి గురించి తన అభిప్రాయాన్ని ఈ విధంగా వెల్లడించారు:

"కొమర్రాజు లక్ష్మణరావుగారు రాజకీయ భావములయందును, మహారాష్ట్రములో వ్యాసములు వ్రాయుటలోను తిలకుగారికి శిష్యులు సంఘ సంస్కరణలో గోఖలేగారికి శిష్యులు."[18]

తిలక్ ఆనాడు స్వాతంత్ర్యోద్యమంలో అతివాది. ఆయన భారతీయ సంస్కృతీ సంప్రదాయాలను చాటి చెప్పి, ప్రజలలో దేశాభిమానాన్ని రేకెత్తింపజేశారు. గ్రామాల దగ్గరి నుండి ఆరంభమైన ఆంగ్లేయుల పెత్తనాన్ని మారుమూల ప్రాంతాలలో నివసించే సామాన్య ప్రజల అండదండలతో భేదించాలన్నది తిలక్ లక్ష్యం. దీనికొరకే సామాన్య ప్రజలను సమీకృతం చేయగలిగే కాశీ పూజాది కార్యక్రమాలను అతివాదులు నిర్వహించారు

స్వాతంత్ర్యోద్యమంలో ప్రత్యక్షంగా పాల్గొని నాయకత్వం చేపట్టేకంటే, ముందు ప్రజలను చైతన్యవంతులుగా చేసి, వారిని స్వాతంత్ర్యోద్యమం వైపు మళ్ళించాలని లక్ష్మణరావుగారు సంకల్పించారు. దీనికి సాహిత్యం మంచి సాధనమని భావించారు.

స్వాతంత్ర్యోద్యమం సఫలీకృతం కావాలంటే దానికి గట్టి పునాదులు అవసరం. ప్రజలకు సమకాలీన పరిస్థితులను అవగతం చేసుకొనే శక్తి ఉన్నప్పుడే ఇది సాధ్యమవుతుంది. ప్రజల్లో చైతన్యం రావాలంటే వారి భావనలో మార్పు రావాలి. భావనలో మార్పు తీసుక రాగలిగేది సాహిత్యం. ఈ దృష్టితో లక్ష్మణరావుగారు ఆలోచించారు.

---

18. సంఘ సంస్కరణలో, స్వాతంత్ర్యోద్యమంలో గోపాలకృష్ణ గోఖలేమితవాది. లక్ష్మణరావుగారికి సహజంగా ఉన్న సౌమ్య స్వభావాన్నిబట్టి ఆయనను ఆయన మిత్రులు గోఖలేతో పోల్చారు.

తిలక్ స్వాతంత్ర్యోద్యమంలో భారతీయ సంస్కృతి సంప్రదాయాలను ప్రతిబింబించే ఉత్సవాలను నిర్వహిస్తూ ప్రజలను సమీకృతం చేయడానికి ప్రయత్నిస్తే, లక్ష్మణరావుగారు సాహిత్యంలో తిలక్ మార్గాన్ని అనుసరించారు.[19] చిన్నప్పుడే ఆయన శివాజీ చరిత్రను రచించడంలోని ఉద్దేశం ఇదే. లక్ష్మణరావు గారి సాహిత్య కృషిని ఈ దృష్టితో పరిశీలించాలి. అప్పుడే ఆయన మనకు అర్థమవుతారు. సాహిత్యానికి సామాజిక ప్రయోజనం ఉండాలన్న సిద్ధాంతానికి కట్టుబడి ఆయన సాహితీ వ్యాసంగం సాగింది.

ఆయన విజ్ఞాన చంద్రికామండలిని స్థాపించినా, విజ్ఞాన సర్వస్వ రచనను చేపట్టినా, చరిత్రను తెలుగు ప్రజలకు తెలియజెప్పాలని సంకల్పించినా-వీటన్నింటి వెనుక మహత్తరమైన ఆశయం కనిపిస్తుంది.

సామాజిక ప్రయోజనాన్ని లక్ష్యంగా పెట్టుకొని సాహితీసేవ చేయాలన్నది ఆయన ఆశయం. ఇంతటి ఉదాత్తమైన ఆశయంతో తెలుగు సారస్వతానికి, తెలుగు దేశానికి అంకితమైపోయిన మహానుభావు డాయన.

---

19. అందుకే కాశీశ్వరరావు, లక్ష్మణరావు గారు రాజకీయ భావాలలో తిలక్ శిష్యులని పేర్కొన్నారు.

ఎటువంటి ఉద్యమానికైనా వేదిక అనేది ఉండాలి. ఆ వేదికను ఆధారం చేసుకొని అది విజృంభిస్తుంది. ఉన్నవారికి మార్గం చూపెడుతూ, కొత్తవారిని ఆకర్షిస్తూ ముందుకు నడిపించడం ఆ వేదిక విధ్యుక్తధర్మం. ఒక లక్ష్యాన్ని సాధించాలనుకొన్నప్పుడు భిన్న భిన్న ఉద్యమాలు ఆరంభమవుతాయి. వాటి గమనాలు వేరైనా సాధించదలచుకొన్న లక్ష్యం మాత్రం ఒక్కటే ఉదాహరణకు మన స్వాతంత్రోద్యమాన్నే తీసుకుంటే దాని అంతర్గర్భితంగా నడచిన ఉద్యమాలు ఎన్నో కనిపిస్తాయి. ఒక్కొక్కరకమైన ఉద్యమం ఒక్కొక్కరకంగా ప్రజలను ఉత్తేజితులను చేసి ముందుకు నడిపించింది. సాంస్కృతికోద్యమం, సాహిత్యోద్యమం ప్రజలను మేల్కొల్పి వారిని కర్తవ్యోన్ముఖులను చేస్తే, రాజకీయోద్యమం వారికి మార్గదర్శకత్వం వహించి ముందుకు నడిపించింది.

భారత స్వాతంత్రోద్యమ కాలంలో సాంస్కృతికోద్యమానికి బ్రహ్మ సమాజం, ఆర్యసమాజం, రామకృష్ణమఠం, దివ్యజ్ఞాన సమాజం ఇవన్నీ పటిష్ఠమైన వేదికలుగా ఉపయోగపడి ప్రజలను మన సంస్కృతి వైపు మళ్ళించాయి. అట్లాగే దేశంలో సాహిత్యోద్యమాలు బయలుదేరి ప్రజల హృదయాంతరాళాలలో స్వాతంత్ర్య భావాలకు బీజా వాపనం చేశాయి. ఎంతో మంది సాహితీవేత్తలు, కవులు, పండితులు, గాయకులు, కళాకారులు తమ కలాల ద్వారా, గళాల ద్వారా సమస్త ప్రజానీకాన్ని స్వాతంత్ర్యోద్యమం వైపు కదను త్రొక్కించారు. దేశంలోని వివిధ ప్రాంతాలలో అనేక సాహితీ సంస్థలు వెలసి సాహితీవేత్తలకు వేదికలుగా ఉపయోగ పడ్డాయి. ఈ సాంస్కృతిక, సాహిత్యోద్యమాలవల్ల చైతన్యవంతులైన ప్రజలను రాజకీయోద్యమం సమీకృతం చేసి, సారథ్యం వహించి లక్ష్యాన్ని సాధించి పెట్టింది.

సాంస్కృతిక, సాహిత్యోద్యమాలకు పటిష్ఠమైన వేదికలు అవసరమైనట్టుగానే రాజకీయోద్యమానికి కూడ పటిష్ఠమైన రాజకీయ వేదిక అవసరం. అప్పుడే అది వివిధ ఉద్యమాలను తనలో గర్భీకరించుకొని లక్ష్యాన్ని సాధించగలుగుతుంది. మన స్వాతంత్ర్యోద్యమ కాలంలో భారత జాతీయ కాంగ్రెస్ ఇదే రకమైన పాత్రను నిర్వహించింది.

ఈ ఉద్యమాలన్నింటిలో సాహిత్యోద్యమానికి ఒక ప్రత్యేక లక్షణం ఉంది. సున్నితంగా మానవుని హృదయాన్ని స్పృశించి సంచలనాన్ని రేకెత్తించి, కర్తవ్యోన్ముఖున్ని చేయడంలో సాహిత్యాన్ని మించిన సాధనం మరొకటిలేదు. దీన్ని గమనించిన ఎందరో మహానుభావులు సాహిత్యంతో సమాజ సేవకు పూనుకొన్నారు.

## విజ్ఞాన చంద్రికావిర్భావం :

స్వాతంత్ర్యోద్యమ కాలంలో దేశవ్యాప్తంగా ఎన్నో సాహితీ సంస్థలు స్థాపించబడి సమాజ పురస్కరణకు, స్వాతంత్ర్య సాధనకు, నూత్న సాహిత్య సృష్టికి విశిష్టమైన కృషి చేశాయి. తెలుగు దేశంలో ఈ ఆశయాల సాధనకు వెలసిన మొట్టమొదటి సాహితీ సంస్థ విజ్ఞాన చంద్రికా మండలి. దీని నిర్మాత కొమర్రాజు లక్ష్మణరావుగారు. ఆ రోజుల్లో సాహితీవేత్తలను ఒక వేదిక మీదకు తీసుకువచ్చి సాహిత్యానికి, తద్వారా దేశానికి సేవ చేయాలన్న మహత్తరమైన ఆశయంతో లక్ష్మణరావుగారు ఈ సాహితీ సంస్థను స్థాపించారు.

విజ్ఞాన చంద్రిక అవతరణకు ముందు దాదాపు ఎనమిది దశాబ్దాల క్రిందట 1820 లో మద్రాసులో "The Madras School Text Book and Vernacular Society" అనే పేరుతో ఒక సంస్థ వెలిసింది. ఆ రోజుల్లో మొట్టమొదటిసారిగా తెలుగు గ్రంథాల ప్రచురణను ఈ సంస్థ చేపట్టింది. అయితే పాశ్చాత్య విజ్ఞాన సంస్కృతులను దేశీయ పాఠశాలల్లో విద్యనభ్యసించే విద్యార్థులకు తెలియజెప్పాలన్నంతవరకే దీని కృషి పరిమితమైంది. ఆనాటి ఆంగ్ల ప్రభుత్వం అండదండలు దీనికి దండిగా ఉండేవి. పెద్ద బాల శిక్ష మొదలుకొని ఇంగ్లాండు దేశ చరిత్ర, భూగోళశాస్త్రం వంటి గ్రంథాలను ఈ సంస్థ తెలుగులో ప్రకటించింది. ఈ గ్రంథాలు విషయ బోధనకే తప్ప వివరణకు ప్రామాణికతకు అద్దం పట్టినవి కావు. కేవలం పాఠ్యపుస్తకాల ప్రచురణే దీని లక్ష్యం. కనుక ఇది సాహితీ సంస్థ కాదు

ఇక తెలుగు దేశంలో అక్కడక్కడా సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమ వ్యాప్తికి వెలసిన అనుబంధ సంస్థలు తప్ప చెప్పుకోదగిన సాహితీ సంస్థలు విజ్ఞాన చంద్రికకు ముందు ఆవిర్భవించలేదు. ఈ తరుణంలో స్వాతంత్ర్యోద్యమానికి అండగా తెలుగు దేశంలో ఒక సాహితీ సంస్థ ఉండవలసిన అవసరాన్ని మొదట గుర్తించిన మహానుభావులు లక్ష్మణరావు పంతులుగారు.

ఆయన ప్రయత్నాల ఫలితంగా, ఆయన అభిప్రాయాలకు ప్రతిబింబంగా విజ్ఞాన చంద్రిక వెలసింది. దీనిని ఆయన ఒక ఆదర్శ సంస్థగా తీర్చిదిద్దారు. తెలుగు దేశంలో ఆ తరువాత వెలసిన సాహితీ సంస్థల కన్నింటికి విజ్ఞాన చంద్రికే స్ఫూర్తిని కలిగించింది.

ఈ సంస్థ అవతరణకు లక్ష్మణరావుగారు ఎంతో శ్రమించారు. మునగాల రాజా కోర్టు వ్యవహారాల పరిష్కారం కొరకు మద్రాసులో మకాం పెట్టినప్పుడే ఒక సాహితీ సంస్థను స్థాపించాలన్న ఆలోచన ఆయనకు కలిగింది. ఆ రోజుల్లో మద్రాసు నగరంలో సి.బి. రామారావు అనే ఒక డాక్టరు ఉండేవాడు. ఆయన సంఘ సంస్కరణ ప్రియుడు. అభ్యుదయ భావాలు కలిగిన కొందరు యువకులు ఆయన ఇంటిలో అప్పుడప్పుడూ సమావేశమై, సమకాలీన పరిస్థితులపై చర్చలు జరుపుతుండేవారు. లక్ష్మణరావుగారు, అయ్యదేవర కాళేశ్వరరావుగారు, గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారు మొదలైన మిత్రులు కూడా ఈ సమావేశాలకు హాజరయి 'ప్రపంచాన్ని మరమ్మతు'[1] చేసే మాటలు మాట్లాడుకునే వారు. వీటి ఫలితంగా తమ అభిప్రాయాలను ప్రపంచానికి చాటి చెప్పడానికి ఒక వేదికను ఏర్పరచుకోవాలన్న భావన ఈ మిత్రుల హృదయాలలో నాటుకొన్నది.

అయ్యదేవర కాళేశ్వరరావుగారు అప్పుడు మద్రాసులో కచ్చాలేశ్వర అగ్రహారం బసలో ఉంటుండేవారు లక్ష్మణరావుగారు హరి సర్వోత్తమరావుగారు తరచుగా ఆయన బసకు వెళ్ళి ఆయనతో సమకాలీన పరిస్థితుల గురించి

1. ''తెలుగు తల్లి'—లక్ష్మణరాయ వర్ధంతి సంచిక, పేజీ 6.

చర్చిస్తుండేవారు. తెలుగు భాషను అభ్యుదయ మార్గంలో నడిపించాలన్నది లక్ష్మణరావుగారి పట్టుదల. కాశేశ్వరరావుగారు వీరేశలింగం పంతులుగారి సంఘ సంస్కరణోద్యమంపట్ల విశ్వాసం పెంచుకున్నారు. హరి సర్వోత్తమరావుగారికి రాజకీయ చైతన్యమే ప్రాణం. ఈ ముగ్గురూ ముగ్గురే. ఈ ముగ్గురి దృక్పథం సమన్వయ రూపం ధరించి విజ్ఞాన చంద్రిక ఆవిర్భవించింది విజ్ఞాన చంద్రిక ఆవిర్భవించిన తీరును హరి సర్వోత్తమరావుగారు ఈ విధంగా వివరించారు:

''శ్రీ లక్ష్మణరావు 100 పేజీల పత్రిక ఆరంభించి విజ్ఞాన ప్రచారం చేయవలెనని అన్నాడు. అచ్చు కాగితం, చిత్రాలు ఫస్టురేటువి కావలెనన్నాడు నేను పుస్తక రూపంలో వెలువరిస్తాం అన్నా. విమర్శించుకొన్నాం ఆరంభంలో పుస్తకాలు వేయడమే మేలనుకొన్నాం. మా ఉద్యమానికి పేరేమి పెడ్దాం అన్నాం ఎన్ని పేర్లో ఆలోచించాం. లక్ష్మణరావు చేసిన సలహాయే అనుకుంటూ 'విజ్ఞాన చంద్రిక' అనేది స్థిరపరచాం. ఈ మాటలు మాట్లాడుతూనే సహాయకులను నిర్ణయించుకొన్నాం. మునగాల జమీందారు, రావిచెట్టు రంగారావు 1905 సెప్టెంబరులోనే లక్ష్మణరావు అరతావు కాగితం అప్పీలు అచ్చు వేయించాడు. ప్రపంచం మీద విసిరివేసినాం.''[2]

విజ్ఞానచంద్రిక ఉద్యమం అరతావు అచ్చు కాగితంతో వెంటనే ఊపునందుకోలేదు. అంకురార్పణ మాత్రం జరిగింది. ఏదో ఒకటి చేయాలనే ఆవేశంతో ఉన్న మిత్రులకు లక్ష్మణరావు పంతులుగారు మార్గం చూపించారు. అప్పటికే ఆయన మహారాష్ట్ర ప్రాంతంలోని చైతన్యోద్యమాలతో సంబంధం పెట్టుకొని కొంత అనుభవం గడించారు. ఆ తరువాత తెలుగుదేశంలో విస్తృతంగా పర్యటించి సంఘ సంస్కరణ ప్రియులలో, సాహితీ వేత్తలలో కొత్త ఆలోచనలను రేకెత్తింపజేశారు.

ఆ రోజులలో ఒక సంస్థను నిర్వహించడం మాటలతో అయ్యేపని కాదు. దానికి తగినంత అర్థబలం, అంగబలం అవసరం. అర్థబలం మాట అటుంచి

2. ''తెలుగు తల్లి'' లక్ష్మణరాయ వర్థంతి సంచిక. పేజీ 7

అంగబలం సంపాదించుకోవడం ఆ రోజుల్లో కష్టసాధ్యమైనట్టిదే. లక్ష్మణరావు గారికి రాజా రంగారావు వంటి 'అర్థబలం' గల ఉదార స్వభావులు, కాశేశ్వర రావు, హరి సర్వోత్తమరావు వంటి నిస్వార్థ దేశభక్తులు లభించడం నిజంగా అదృష్టమనే చెప్పాలి. కనుకనే ఆయన తలపెట్టిన విజ్ఞానచంద్రిక ఉద్యమం కార్యరూపం ధరించింది.

ఆరతావు కాగితం దేశంమీదకు విసరివేసిన తరువాత మిత్రులు తెలుగు దేశంలోని పలు ప్రాంతాలలో పర్యటించి తమ ఉద్యమానికి మరికొంతమంది మిత్రులను సమకూర్చుకొన్నారు. ఆనాటి వందేమాతరోద్యమం కూడా వీరికి కలసివచ్చింది.

మొదటి అప్పీలు వేసిన ఆరు మాసాలకు, అంటే 1906 వ సంవత్సరం వేసవిలో మద్రాసులోని నాయని వెంకట రంగారావు ఇంటిలో లక్ష్మణరావు, కాశేశ్వరరావు, హరి సర్వోత్తమరావు, రావిచెట్టు రంగారావు మొదలైనవారు సమావేశమై 'విజ్ఞాన చంద్రికకు' రూపురేఖలు దిద్దినారు దీనితో లక్ష్మణరావు గారి సంకల్పం పూర్తిగా ఆచరణలోనికి వచ్చింది.

మహారాష్ట్ర, బెంగాలీ భాషల్లోని నవీన సాహిత్య సృష్టిని గురించి లక్ష్మణరావుగారు ఈ సమావేశంలో మిత్రులకు వివరించారు. దేశ భాషల సాహితీ వికాసాన్ని దృష్టిలో పెట్టుకొని ఈ సమావేశంలో వీరు తమ ప్రణాళికను రూపొందించుకొన్నారు. సమకాలీన పరిస్థితులను సమీక్షించుకొన్న తరువాత ఒక తీర్మానాన్ని రూపొందించి ఆమోదముద్ర వేశారు. ఆ తీర్మానంలోని ముఖ్యమైన భాగం ఇలా ఉంది:

"స్వరాజ్యము కొరకు ఆంధ్ర దేశములోను, యావద్భారత దేశములోను కూడ గాఢవాంఛ ప్రబలియున్నది. కుల మత భేదములు లేక యుక్తవయసు వచ్చిన ప్రతి పురుషునికి, స్త్రీకిని ఓటును కలిగిన స్వరాజ్యమే మన గమ్యస్థానము. భారతదేశములో ఆరు కోట్ల జనసంఖ్య గల పంచముల అస్పృశ్యత రూపుమాపవలె

స్వరాజ్యము రానేరాదు. వచ్చినను నిలువనేరదు......నవీన ప్రపంచములో భారతదేశము ఒక స్వతంత్ర ప్రజా రాజ్యముగా నిర్మాణ మగుటకు యావద్భారత ప్రజలకు, ఆంధ్ర ప్రజలకు నవీన ప్రపంచములో అత్యంతముగ వృద్ధియైన ప్రకృతిశాస్త్ర, చారిత్రక, రాజకీయార్థిక విజ్ఞానము నిచ్చుట యావశ్యకము...... ఆంధ్ర భాషలో కవిత్వ వాఙ్మయము, ప్రబంధ సముదాయము గొప్పగా నున్నవి. ఇవి ఆధ్యాత్మిక, నైతిక విషయములకు ఉపయోగమే కాని, ఆంధ్ర జాతిని నవీన పద్ధతులమీద ఐహికముగ నడిపించుటకు యుక్తము కావు. పురాణయుగమునుంచి ప్రకృతి శాస్త్ర, రాజకీయ, ఆర్థిక యుగమునకు మన ప్రజలను తీసుకపోవలసి యున్నది.''[3]

రెండు విధాలైన ప్రయోజనాలను సాధించాలన్న లక్ష్యంతో విజ్ఞాన చంద్రిక వెలసిందని పై తీర్మానంలోని సారాంశం స్పష్టం చేస్తున్నది. దానిలో ఒకటి ప్రజలను విజ్ఞానవంతులను చేయడం. రెండవది స్వాతంత్ర్యోద్యమానికి అండగా నిలవడం.

సామాన్యులు అర్థం చేసుకొనేరీతిలో రాజకీయార్థిక శాస్త్రాలు, వైజ్ఞానిక గ్రంథాలు, దేశ చరిత్రలు, మహా పురుషుల జీవితాలు, చారిత్రాత్మక నవలలు ప్రచురించాలని ఈ సమావేశంలో నిర్ణయం తీసుకొన్నారు లక్ష్మణరావు గారు సంపాదకుడుగా, హరి సర్వోత్తమరావు గారు కార్యదర్శిగా, నాయని రంగారావు, రావిచెట్టు రంగారావు, కాశేశ్వరరావు సభ్యులుగా కార్యవర్గం ఏర్పాటయింది. నాటినుండి 1923 లో ఈ లోకాన్ని వీడి వెళ్ళిపోయేవరకు లక్ష్మణరావు గారు విజ్ఞాన చంద్రికకు ఊపిరిగా నిలచారు. అది ప్రచురించిన ప్రతి గ్రంథానికి, చేపట్టిన ప్రతి కార్యక్రమానికి ఆయనే రూపకల్పన చేశారు.[4]

---

3. నా జీవిత కథ - నవ్యాంధ్రము. అయ్యదేవర కాళేశ్వరరావు పేజి 139.

4. విజ్ఞాన చంద్రికను నడిపించిన శక్తియుక్తులు ప్రధానంగా లక్ష్మణరావు గారివేననీ, ఆ తరువాత తెలుగుదేశంలో వెలసిన సాహిత్య ప్రచురణ సంస్థలకు విజ్ఞాన చంద్రిక వేగుచుక్క వంటిదని మల్లంపల్లి సోమశేఖరశర్మగారన్నారు. 'తెలుగు తల్లి' - లక్ష్మణరాయ వర్ధంతి సంచిక. పేజి. 58.

తెలుగు దేశంలో ప్రప్రథమంగా ఒక ఉత్తమ సాహితీ సంస్థను స్థాపించిన గౌరవాన్ని లక్ష్మణరావు గారు దక్కించుకొన్నారు.

విజ్ఞాన చంద్రిక గ్రంథాలు ప్రచురించింది కదా, సాహితీ సంస్థ ఎట్లా అవుతుందని భావించేవారుంటారు. వ్యాపార దృష్టితో గ్రంథాలు ప్రచురించే నేటి గ్రంథ ప్రచురణ సంస్థల వంటి సంస్థకాదు విజ్ఞాన చంద్రిక. దాని ఆశయాలలో ప్రజలకు అన్ని రంగాలకు చెందిన విజ్ఞానాన్ని అందించడమనేది ప్రధానమైంది. దీనిలో వ్యాపార దృష్టి లేదు. సమాజోద్ధరణే దాని దృక్పథం. కనుకనే వివిధ రంగాలకు చెందిన విజ్ఞాన సాహిత్యాన్ని ఆంధ్రదేశం నలుమూలలకు వెదజల్లి, అశేష ప్రజానీకాన్ని ఆకర్షించకలిగింది. సామాజిక శ్రేయస్సుకు తోడ్పడే సాహిత్యం అందించింది కనుక అది సాహితీ సంస్థ. కేవలం గ్రంథ ప్రచురణ సంస్థకాదు. విజ్ఞాన చంద్రిక ఆశయం ఉదాత్తమైంది.

విజ్ఞాన చంద్రిక స్థాపనతో తెలుగు సాహితీ జగత్తులో 'విజ్ఞాన చంద్రికా ఉద్యమం' ప్రారంభమైనది. వందేమాతరోద్యమం యావద్భారత దేశంలో జాతీయ భావాన్ని వ్యాపి పజేస్తున్న తరుణంలో ఈ విజ్ఞాన చంద్రికా ఉద్యమం విజ్ఞాన రేఖలను వెదజల్లి ప్రజల దృష్టిని సమకాలీన పరిస్థితులవైపు మళ్ళించింది.

లక్ష్మణరావు గారు విజ్ఞాన చంద్రికా ఉద్యమాన్ని వీరేశలింగం పంతులు గారు ప్రారంభించిన సామూహిక సాహితీ ఉద్యమంలో అంతర్వాహినిగా నడిపించారు. ఆధునిక తెలుగు సాహిత్యంలో వీరేశలింగం పంతులు, గురుజాడ, గిడుగు మొదలైన సాహితీమూర్తులు సాహిత్యోద్యమాలను సృష్టించి సారథ్యం వహించినట్టుగానే లక్ష్మణరావుగారు కూడా విజ్ఞాన చంద్రికా ఉద్యమం సృష్టించి సారథ్యం వహించి, సాహితీ విప్లవ శంఖారావం పూరించారు. తెలుగు సాహిత్య చరిత్రలో నవ్య కవిత్వోద్యమానికి కర్తగా గురుజాడను, వ్యవహారిక భాషా ఉద్యమానికి కర్తగా గిడుగు రామ్మూర్తి పంతులును పేర్కొన్నట్టుగానే విజ్ఞాన చంద్రికా ఉద్యమానికి విశిష్టమైన స్థానం కల్పిస్తూ, లక్ష్మణరావు గారిని ఈ ఉద్యమ కర్తలుగా ఉపహరించాలి.

విజ్ఞాన చంద్రికకు తుదిరూపం ఇచ్చిన తరువాత దీని కార్యస్థానం గురించి తర్జన భర్జనలు జరిగాయి. ఒక్క లక్ష్మణరావు గారు తప్ప తక్కిన వారందరూ మద్రాసుకు దూరంగా ఉంటున్నారు. అంతేకాకుండా ఆనాటి రాజకీయ పరిస్థితులు మద్రాసులోకంటే హైదరాబాదులో తమకు అనుకూలంగా ఉన్నట్టు వీరికి తోచింది. మద్రాసులోనైతే ఆంగ్ల ప్రభుత్వం తమపై నిఘా ఉంచి, తమ కార్యకలాపాలకు ఆదిలోనే అంతరాయం కలిగించవచ్చని వీరు భావించారు వీటన్నింటిదృష్ట్యా హైదరాబాదులోనైతే బాగుంటుందని అక్కడే విజ్ఞాన చంద్రిక కార్యస్థానాన్ని ఏర్పాటు చేశారు.

హైదరాబాదులో శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం ఏర్పడినప్పుడు తెలుగు ప్రజలు అందించిన సహాయ సహకారాలు విజ్ఞాన చంద్రిక కార్యస్థానాన్ని కూడా అక్కడే ఏర్పాటు చేయడానికి ప్రోత్సహి చాయని చెప్పవచ్చు.

విజ్ఞాన చంద్రిక కార్యస్థానం హైదరాబాదులో ఏర్పాటైన తరువాత లక్ష్మణరావు గారు ఎక్కువ రోజులు హైదరాబాదులోనే ఉండవలసివచ్చింది. కార్యనిర్వహణ బాధ్యతను రావిచెట్టు రంగారావు గారు స్వీకరించారు అప్పుడు హైదరాబాదులోనే ఉంటున్న ఆదిరాజు వీరభద్రరావు గారు రంగారావుగారికి తోడైనారు.

విజ్ఞాన చంద్రిక రూపు దిద్దుకుంటున్నప్పుడే ముమ్మందు అది ప్రచురించబోయే గ్రంథాలకు విక్రయ ధరలను నిర్ణయించడం జరిగింది. ఇది దీని వ్యవస్థాపకుల నిజాయితీని, నిస్వార్థతను, సేవా తత్పరతను చాటి చెప్పుతున్నది.

వీలైనంత ఎక్కువ మందిని శాశ్వత చందాదారులుగ చేర్చుకొని సంస్థను పటిష్ఠంగా రూపొందించాలని దీని నిర్వాహకులు సంకల్పించుకొన్నారు ఏడాదికి నాలుగు గ్రంథాల చొప్పున ప్రకటించి చందాదారులకు ప్రతి నూరు పేజీలకు

నాలుగు అణాల చొప్పున, ఇతరులకు ఆరణాల చొప్పున విక్రయించాలని అనుకొన్నారు.[5]

లక్ష్మణరావు గారి దృష్టి ఎప్పుడూ 'ఫస్టురేటు' గ్రంథాలపై ఉండేది. ఖర్చు ఎక్కువైనా మంచి కాగితం, మంచి ముద్రణ, మంచి బైండింగ్ ఉండాలన్నది ఆయన అభిప్రాయం. ఈ అభిప్రాయానుగుణంగానే విజ్ఞాన చంద్రిక గ్రంథాలు వెలువడ్డాయి ఆకర్షణీయంగా, అమూల్యమైన సమాచారంతో గ్రంథాలను ప్రచురించి, స్థాపించబడిన రెండేళ్ళలో ఈ సంస్థ దాదాపు 1200 మందికి పైగా శాశ్వత చందాదారులను సమకూర్చుకోగలిగింది.

## అబ్రహామ్ లింకన్ జీవితచరిత్ర :

కార్యనిర్వాహక వర్గం ఏర్పడింది. కార్యక్రమ సరళి రూపు దిద్దుకొన్నది. కార్యస్థానం వెలసింది. ఉబుసుపోకకు ఏర్పడిన సంస్థకాదు ఇది. దీని లక్ష్యం ప్రజాబాహుళ్యానికి మంచి చేయాలన్నది డబ్బు చేసుకోవడానికి గారడీనవలలు ప్రచురించాలన్న దృక్పథం ఈ సంస్థకు లేదు. 'విజ్ఞాన చంద్రిక' పేరులోనే పెన్నిధిని నింపుకొన్న సంస్థ.

దాస్య శృంఖలాలను ఛేదించుకోవడానికి దేశవ్యాప్తంగా ఆందోళనలు జరగుతున్న రోజులవి. విజ్ఞాన చంద్రిక వ్యవస్థాపకుల ఆశయం 'లోకాన్ని మరమ్మతు' చేయడమని దీని ప్రారంభం నాటికే తెలిసిపోయింది. ఈ మరమ్మతు క్షణంలో సాధ్యమయేదికాదు. దానికి ప్రజల మేధస్సులో పరిపక్వత రావాలి

---

5. విజ్ఞాన చంద్రిక ప్రచురించిన తొలిగ్రంథం 'అబ్రహామ్ లింకన్' జీవిత చరిత్ర. ఈ గ్రంథం చివరలో విజ్ఞాన చంద్రిక ఆశయాన్ని తెలుపుతూ ఒక ప్రకటన ప్రచురించబడింది. దానిలో కొంత భాగం. ''దేశాభివృద్ధికి ఆవశ్యకములైన గ్రంథములు ప్రచురించి భాషాభివృద్ధి చేయుటయే దీనియొక్క ఉద్దేశము..." ''...మా గ్రంథములన్నియు ముఖ్యముగా జనసామాన్యము కొరకు వ్రాయబడుచున్నందున వానిని సులభమైన వెలకు నియ్యదలచినాము.''

అందుకు ప్రేరణ అవసరం. ఈ ప్రేరణ కలిగించడానికి సాహిత్యం చక్కని సాధనం. విజ్ఞాన చంద్రికా మండలి ఆశయంలో ఇంతటి దూరదృష్టి దాగి ఉంది.

లోకం మరమ్మతు ప్రజాశక్తిపై ఆధారపడి ఉంది. తెలుగు దేశంలో ప్రజానీకాన్ని ఒక మహత్తరమైన శక్తిగా రూపొందించాలంటే వారిలో ముందు ప్రేరణ కలగాలి. ఈ ప్రేరణ బలీయమైనదై ఉండాలి. ఇందుకు ఒక ఆదర్శ మూర్తి జీవిత గాథను అందించాలనుకొన్నారు లక్ష్మణరావుగారు. వెంటనే ఆయన స్మృతిపథంలో నాటి బాధామయ ప్రజల నాథుడుగా ప్రపంచ ప్రసిద్ధి కెక్కిన అబ్రహామ్ లింకన్ మెదిలాడు. లక్ష్మణరావుగారు తన అభిప్రాయాన్ని తక్కిన సభ్యుల ముందుంచారు. అందరూ గొప్పగా ఉందన్నారు. ఏకీభవించారు. దీనితో విజ్ఞాన చంద్రికా ఉద్యమ రథం కదలింది.

కొత్త కార్యక్రమాన్ని ప్రారంభించే ముందు ఇష్ట దైవాన్ని తలవడం, కొలవడం అనాదినుంచి వస్తున్న సంప్రదాయం. ఈ సంప్రదాయాన్ననుసరించి ఏ దేవతా మూర్తి గాథనో యెంచుకోకపోవడం విజ్ఞాన చంద్రికా మండలి విశిష్టత. పీడిత ప్రజలకు అండగా నిలిచి, వారి హక్కుల కోసం పోరాడిన ఒక మానవ మూర్తి జీవిత గాథతో గ్రంథ ప్రచురణను ఆరంభించడం నిజంగా ప్రశంసనీయం. లక్ష్మణరావుగారి అభ్యుదయ కాముకత్వానికి విజ్ఞాన చంద్రిక ప్రథమ గ్రంథం సాక్ష్యంగా నిలిచింది.

"విఘ్నేశ్వర పూజగా అబ్రహామ్ లింకన్ జీవితాదర్శమును ఆంధ్ర యువజనులకు మేమిచ్చినాము" అని కాశేశ్వరరావుగారు తమ స్వీయ చరిత్రలో సగర్వంగా చెప్పుకొన్నారు[6]

ఈ గ్రంథం ఆంగ్లంలో థేయర్స్ రచించిన దానికి అనువాదం. గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి లేఖిని నుండి ఈ ప్రథమ గ్రంథ కుసుమం వెలువడింది.

---

6. 'నా జీవితము-నవ్యాంధ్రము' అయ్యదేవర కాశేశ్వరరావు.

దీని పరిమళాలు తెలుగుదేశం నలుదిశలకు వ్యాపించి, నాటి యువజనులను సమ్మోహితులను చేశాయి. ఈ గ్రంథం వెలువడిన తరువాత పిన్నలు, పెద్దలు అందించిన అభినందన పరంపరలు కార్యవర్గ సభ్యుల్లో ఆత్మస్థైర్యాన్ని కలిగించి ముందుకు నడిపించాయి.

ఈ తొలి గ్రంథానికి వ్రాసిన పీఠికలో విజ్ఞాన చంద్రిక ఆశయాలు వివరంగా పేర్కొనబడ్డాయి.[7] "... ఇండియా, ఇంగ్లాండు, గ్రీస్, రోమ్, అమెరికా, ఫ్రాన్సు మొదలైన దేశముల చరిత్రలు మన భాషయందు లేవు. హిందూదేశ చరిత్రమను పేరిట నొకటి రెండు చిన్న పొత్తములు కలవు కాని యవి చరిత్రయను నామమునకంతగా తగినవి కావు ప్రకృతి శాస్త్రములన్ననో తెలుగులో బొత్తిగా లేవు. ఈ శాస్త్రములలో నొక్కొక్క దానిపై ఇంగ్లీషులో వందలకొలది గ్రంథములు వ్రాయబడి యున్నవి. అంకగణితము, బీజగణితము, రేఖాగణితము, క్షేత్రగణితము, త్రికోణమితి మొదలైన గ్రంథముల గురించి ప్రత్యేకమైన గ్రంథం ఒకటియు తెలుగులో లేనేలేదు. ...ఏ విషయమును గురించి విచారించినను మన భాషలో తగిన గ్రంథములు లేవు. ఇట్లు తలచి యుడుత భక్తి చందంబున మా యల్ప శక్తికొలది యాంధ్ర మాతృభాషా సేవ చేయ యత్నింప వలయునని యిచ్ఛగలవారమై విజ్ఞాన చంద్రికా మండలి యను పేరిట నొక భాషాభివృద్ధి సంఘము నేర్పరచినాము."[8]

---

7. "నేను పరీక్షకు చదువుతూ ఉండడంచేత ప్రూఫులు దిద్దడం వగైరా పని అంతా లక్ష్మణరావు మీదే పడ్డది. ఆ కూర్పుకు వ్రాసిన తొలిపలుకు మా ఐదుగురి చేవ్రాళ్ళతో ఉంది... తొలిపలుకు వ్రాత అంతా లక్ష్మణరావుదే. ఆనాటి మా అభిప్రాయాలు, ఆశయాలు అందులో ప్రతిఫలించినవి. లక్ష్మణరావు తన స్వభాషలో దీనిని ముద్దులు తీర్చినాడు"- హరి సర్వోత్తమరావు, లక్ష్మణరాయ వర్ధంతి సంచిక - పేజి. 8.

8. ఇది సుదీర్ఘమైన పీఠిక. దానిలోని ప్రధాన భాగం మాత్రమే ఇక్కడ పేర్కొనబడింది.

తెలుగుదేశాన్ని, తెలుగు సాహిత్యాన్ని సమీక్షిస్తూ, ఈ పీఠికలో విజ్ఞాన చంద్రిక కార్యవర్గం తమ ఆశయాలను ప్రకటించింది.

విజ్ఞాన కాంతులను వెదజల్ల గలిగి సమకాలీన పరిస్థితులవైపు దృష్టిని మళ్ళించగల గ్రంథాలను ప్రచురించాలని తలపెట్టడం సరికొత్త ఆలోచన. అబ్రహామ్ లింకన్ జీవిత చరిత్రను ప్రప్రథమ గ్రంథ కుసుమంగా వెలువరించడంలోనే విజ్ఞాన చంద్రిక అభ్యుదయ దృక్పథం మనకు తెలుస్తున్నది.

అబ్రహామ్ లింకన్ జీవిత చరిత్ర తరువాత హిందూ మహాయుగం, మహ్మదీయ మహాయుగం, రాణీ సంయుక్త అనే మూడు గ్రంథాలను విజ్ఞాన చంద్రిక హైదరాబాదు నుండి ప్రచురించింది.

సంవత్సరానికి నాలుగు గ్రంథాలను తెలుగు ప్రజలకు అందించాలన్న లక్ష్యాన్ని నిర్వాహకులు నిర్విఘ్నంగా నెరవేర్చగలిగారు. అయితే ఈ మండలి కార్యనిర్వాహకులలో ఒకరైన గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు ఆనాడు రాజకీయాలలో చురుకుగా పాల్గొంటూ, అనేక ఉపన్యాసాలలో ఆంగ్ల ప్రభుత్వాన్ని ఘాటుగా విమర్శిస్తుండేవారు. 1907 జూలైలో ఆయనను బ్రిటిషు ప్రభుత్వం రాజద్రోహ నేరం క్రింద నిర్బంధించడంతో నైజామ్ ప్రభుత్వం కళ్ళు హైదరాబాదులోని విజ్ఞాన చంద్రిక కార్యస్థానంపై ప్రసరించాయి. నైజామ్ రహస్య పోలీసు శాఖ వీరి కార్యకలాపాలపై నిఘా ఉంచింది. దీనితో గ్రంథాల ప్రచురణను స్వేచ్ఛాయుత వాతావరణంలో కొనసాగించడానికి వీలులేకపోయింది. కార్యస్థానాన్ని మద్రాసుకు మార్చడం అనివార్యమైంది. చింతాద్రి పేటలో ఆచంట లక్ష్మీపతిగారి ఇంటిలో విజ్ఞాన చంద్రిక కొత్త కార్యస్థానం ఏర్పాటయింది.

హరి సర్వోత్తమరావు గారు సభ్యులుగా కొనసాగడం వల్ల తమ కార్యకలాపాలకు భంగం కలుగుతుందేమోనన్న అనుమానం తక్కిన కార్యవర్గ సభ్యులకు కలిగింది. ఒక వ్యక్తి కారణంగా మహోన్నతమైన తమ ఆశయాలు నీరుకారిపోవడం వారికి నచ్చలేదు. హరి సర్వోత్తమరావు గారిని కార్యవర్గం నుండి తీసివేసి ఆయన స్థానంలో ఆచంట లక్ష్మీపతిగారిని వేసుకొన్నారు.

ఇక్కడ ఒక ముఖ్యమైన విషయాన్ని గమనించాలి ప్రభుత్వానికి జడిసి సర్వోత్తమరావు గారిని కార్యవర్గం నుండి తొలగించారని అనుకోవడం పొరపాటు. ప్రజలను విజ్ఞానవంతులను చేయడం ద్వారా సమాజాన్ని, దేశాన్ని బాగుచేసుకోవచ్చనే సంకల్పంతో విజ్ఞాన చంద్రిక వెలసింది. దీన్ని నిర్విఘ్నంగా నడపగలిగినప్పుడే సంస్థాపకుల ఆశయం నెరవేరుతుంది. సర్వోత్తమరావు గారు కార్యవర్గ సభ్యులుగా కొనసాగినట్లయితే ప్రభుత్వం తమ సంస్థనే మూసి వేయవచ్చు. ఈ కారణంగానే కేవలం హరి సర్వోత్తమరావు గారి పేరును మాత్రం కార్యవర్గం జాబితానుండి తొలగించారు. ఆయనతో అనుబంధాన్ని తెంచుకోలేదు. జాబితానుండి ఆయన పేరు పోయిందే కాని విజ్ఞాన చంద్రికతో అనుబంధం తెగిపోలేదు. ఆ తరువాత సర్వోత్తమ రావుగారు వ్రాసిన ఢిల్లీ దర్బారు గ్రంథాన్ని విజ్ఞాన చంద్రిక ప్రచురించింది.

మద్రాసుకు మారిన తరువాత విజ్ఞాన చంద్రిక కర్యకలాపాలు యథా ప్రకారం చురుకుగా సాగినాయి. ఆదిరాజు వీరభద్ర రావుగారు కూడా తమ మకాంను మద్రాసుకు మార్చారు.

1912 లో రావిచెట్టు రంగారావు మరణించడంతో విజ్ఞాన చంద్రికకు తీరని లోటు ఏర్పడింది. రాజకీయ పరిస్థితుల కారణంగా మునగాల రాజా నాయని రంగారావు బయటవుండి సహాయం అందిస్తానని మండలి సభ్యత్వం నుండి విరమించుకొన్నారు. సర్వోత్తమరావుగారికి మండలితో సంబంధం ఉన్నప్పటికీ ఆయన మళ్ళీ కార్యవర్గంలో చేరలేదు. ఈ పరిస్థితులలో కార్య వర్గాన్ని పునర్వ్యవస్థీకరించవలసి వచ్చింది. బయ్యా నరసింహేశ్వర శర్మగారు అధ్యక్షులుగా కొత్త కమిటీ ఏర్పడింద. కొమర్రాజు లక్ష్మణరావు, ఆచంట లక్ష్మీపతి, గూడూరు రామచంద్రరావు, వేమూరి విశ్వనాథ శర్మ, తాడినాడ వెంకట్రామయ్య, కాశేశ్వరరావు మొదలైనవారు సభ్యులయ్యారు. లక్ష్మణరావు గారు ఎప్పటివలె సంపాదకత్వ బాధ్యతను స్వీకరించారు. పేరుకు మాత్రమే కార్యవర్గం కాని కాని బాధ్యత అంతా లక్ష్మణరావు గారిదే. ఆయన నిర్దేశించిన మార్గంలో విజ్ఞాన చంద్రిక నడచింది.

## విజ్ఞాన చంద్రికా పరిషత్తు :

పునర్వ్యవస్థీకరణతో పాటు 1912 లో విజ్ఞాన చంద్రికా మండలికి అను బంధంగా విజ్ఞాన చంద్రికా పరిషత్తు వెలసింది. గ్రంథాలను ప్రచురించడమే కాకుండా సాహిత్య, వైజ్ఞానిక, చారిత్రక విషయాలలో పరీక్షలను నిర్వహించి తెలుగు భాషను ప్రోత్సహించాలన్న సంకల్పంతో దీన్ని ఏర్పాటు చేశారు.[9] పరీక్షలను నిర్వహించి యోగ్యతా పత్రాలను ఇవ్వడం విజ్ఞాన చంద్రిక కార్య క్రమం. ఈ పరిషత్తు ఏర్పాటుతో విజ్ఞాన చంద్రిక సర్వసమగ్రమైన సాహితీ సంస్థగా రూపుదిద్దుకొన్నది. తెలుగుదేశంలో ఇటువంటి పరీక్షలను నిర్వహించడ మనేది విజ్ఞాన చంద్రికతోనే ఆరంభమైనది. పోటీ పరీక్షల నిర్వహణలో కూడా విజ్ఞాన చంద్రిక, తరువాత తెలుగు దేశంలో వెలసిన సాహితీ సంస్థలకు మార్గ దర్శకమైంది.[10] ఈ పరీక్షల నిర్వహణకు హైద్రాబాదు, గుంటూరు, బెజవాడ, నరసాపురం, రాజమహేంద్రవరం, కాకినాడ, బందరు మొదలైన పట్టణాలలో పరీక్షా కేంద్రాలు ఏర్పడ్డాయి. ఆనాడు అనేక మంది ఈ పరీక్షలకు హాజరయి, తాము విజ్ఞానాన్ని ఆర్జించడమే కాకుండా, తెలుగు భాషా వికాసానికి తోడ్పడ్డారు.

ఈ పరీక్షలలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులైన వారికి 116 రూపాయల నగదును, బంగారు, వెండి పతకాలను బహూకరించారు. కందుకూరి వీరేశలింగం పంతులు, కట్టమంచి రామలింగారెడ్డి, వనప్పాకం శ్రీనివాసాచార్యులు ఈ పరీక్ష

---

9. ఈ పరిషత్తు నిర్వహించిన సాహిత్య పరీక్షలకు ఆంధ్ర మహాభారతం వంటి ఐతిహాసిక గ్రంథాలు, చారిత్రక పరీక్షలకు ఆంధ్రుల చరిత్రవంటి చారిత్రక గ్రంథాలు (చిలుకూరి వీరభద్రరావు వ్రాసింది), వైజ్ఞానిక పరీక్షలకు విజ్ఞాన చంద్రిక ప్రచురించిన వైజ్ఞానిక గ్రంథాలు నిర్ణీత పాఠ్య గ్రంథాలుగా ఉండేవి. (**Prescribed Books**).

10. విజ్ఞాన చంద్రికా పరిషత్తును మార్గదర్శకంగా తీసుకొని ఆ తరువాత అక్కి రాజు ఉమాకాంతం మొదలైన సాహితీవేత్తలు మద్రాసులో 'ఆంధ్ర సాహిత్య పరిషత్తును' ఏర్పాటు చేశారు.

లకు న్యాయ నిర్ణేతలుగా వ్యవహరించేవారు. ఈ పరిషత్తు ద్వారా చారిత్రక నవలా రచన పోటీని నిర్వహించి విజ్ఞాన చంద్రిక ఉత్తమ చారిత్రక నవలల రచనకు ప్రోత్సాహం అందించింది.

1923 లో లక్ష్మణరావుగారు ఈ లోకాన్ని వీడి వెళ్ళిపోయేవరకు విజ్ఞాన చంద్రిక తెలుగు దేశంలో ఉచ్ఛస్థితితో విరాజిల్లింది. అప్పటివరకు దానికి లక్ష్మణరావుగారే ఊపిరి. 1924 లో దాని కార్యస్థానం మద్రాసునుండి బెజవాడకు మారింది. అక్కడ కాశేశ్వరరావుగారు దాని నిర్వహణ బాధ్యతను స్వీకరించారు. ఆచంట లక్ష్మీపతి అధ్యక్షుడుగా, కాశేశ్వరరావు మేనేజరుగా కొత్త కార్యవర్గం ఏర్పడింది. బెజవాడలో కొంతకాలం వరకు ఆచంట లక్ష్మీపతిగారు, కాశేశ్వర రావుగారు కలసి విజ్ఞాన చంద్రిక గ్రంథప్రచురణను చురుకుగా కొనసాగించారు. ఈ సమయంలో కొన్ని ఉత్తమ గ్రంథాలు వెలువడ్డాయి.

లక్ష్మణరావుగారు వెళ్ళిపోయిన తరువాత విజ్ఞాన చంద్రికా పరిషత్తు పక్షాన పరీక్షల నిర్వహణ కుంటువడి పోయింది. ఆచంట లక్ష్మీపతి వంటి కార్య దక్షులు, కాశేశ్వరరావు వంటి వ్యవహారదక్షులు ఉన్నప్పటికీ లక్ష్మణరావుగారు లేని లోటును వారు భర్తీ చేయలేకపోయారు.

1934 నాటికి మండలి కార్యవర్గంలో కుమ్ములాటలు ప్రారంభమై మండలి కార్యస్థానం, కార్యవర్గసభ్యుల్లో ఒకరైన అయ్యంకి వెంకట రమణయ్య గారితో జయంతిపురం వెళ్ళిపోయింది. అక్కడినుండి పది కాలాల పాటు నిలబడే గ్రంథమేదీ ప్రచురించబడలేదు. పేరుకు విజ్ఞాన చంద్రిక కార్యస్థానం జయంతి పురంలో ఉన్నదే తప్ప, అక్కడికి వెళ్ళిన తరువాత దాని కార్యకలాపాలు పూర్తిగా స్తంభించి పోయాయనే చెప్పాలి. దీనితో 1934 లో విజ్ఞాన చంద్రికా ఉద్యమం అంతరించింది. అయితే దాని ప్రభావం మాత్రం అంతరించ లేదు. విజ్ఞాన చంద్రిక ప్రచురించిన గ్రంథాలవల్ల, అది నిర్వహించిన పరీక్షల వల్ల

సమాజంలో, సాహిత్యంలో ఎంతో కదలిక వచ్చింది. తెలుగుదేశంలో ఎన్నో సాహితీ సంస్థలు, గ్రంథప్రచురణ సంస్థలు వెలసి, విజ్ఞాన చంద్రికను ఆదర్శంగా పెట్టుకొని తమ కార్యకలాపాలను కొనసాగించాయి.

విజ్ఞాన చంద్రిక ప్రచురించిన ప్రతి గ్రంథం వెనుక ఒక ప్రణాళిక, ఒక ఆశయం ఉంది. ప్రతి గ్రంథం సమకాలీన పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని రచించబడినట్టిదే. ఆ రోజుల్లో విజ్ఞాన చంద్రిక సృష్టించిన సాహితీ విప్లవం తెలుగుజాతి సర్వతోముఖాభివృద్ధికి దోహదం చేసింది.

## విజ్ఞాన చంద్రిక ప్రచురణలు :

1906 లో విజ్ఞాన చంద్రిక స్థాపించబడిన నాటినుండి 1923 లో లక్ష్మణరావుగారు తనువు చాలించేవరకు ఆయన జీవితం, విజ్ఞాన చంద్రిక జీవితం ఒక్కటే. దాదాపు 17 సంవత్సరాల పాటు విజ్ఞాన చంద్రిక కార్యకలాపాలతో లక్ష్మణరావుగారి జీవితం పెనవేసుక పోయింది. 1923 వరకు విజ్ఞాన చంద్రిక ప్రచురించిన ప్రతి పుస్తకం వెనుక పంతులుగారి ప్రమేయం ఉంది.[11] 1915 నుండి విజ్ఞాన సర్వస్వరచనలో నిమగ్నమైనప్పటికి ఆయన విజ్ఞాన చంద్రిక కార్యకలాపాలకు దూరంగా వెళ్ళలేదు.

---

11. "విజ్ఞాన చంద్రికా గ్రంథమాల స్థాపించి లక్ష్మణరావుగారు తాము గ్రంథములు వ్రాసినారు. ఇతరులచేత వ్రాయించి ఉత్తమ రచయితలను తయారు చేసినారు. ప్రకటితమైన ప్రతి గ్రంథమూ ఆయన తీవ్ర పర్యవేక్షణమునకు గురియైనదే...దానిలోని గ్రంథాలు సానబట్టిన రత్నాలు అని పేరు రావాలనే ఆయన ఆకాంక్ష... ప్రకటన అయ్యే గ్రంథంలో ఎక్కడ ఏ భాగం శైలిలోగాని, విషయంలోగాని, మరే విషయంలోగాని సరిగా లేనట్లు తోచినా తిరిగి వ్రాయవలసినదే. సంస్కరింప వలసినదే."- మల్లంపల్లి సోమశేఖర శర్మ. లక్ష్మణరాయ వర్థంతి సంచిక. పేజి. 59.

సోమశేఖరశర్మగారు ఆ రోజులలో లక్ష్మణరావుగారికి అతి సన్నిహితులు. ఆయన చరిత్ర పరిశోధన ప్రథమ పాఠాలను లక్ష్మణరావుగారి దగ్గరే నేర్చుకొన్నారు.

విజ్ఞాన చంద్రిక కృషిని రెండు భాగాలుగా విభజించవచ్చు. 1906 నుండి 1923 వరకు మొదటి భాగం. ఆ తరువాతదంతా రెండవ భాగం. మొదటి భాగంలో విజ్ఞాన చంద్రిక 40 గ్రంథాలను ప్రచురించింది. ఈ 30 గ్రంథాలతో లక్ష్మణరావుగారికి ప్రత్యక్ష సంబంధం ఉంది. రెండవ భాగంలో 19 గ్రంథాలు ప్రచురించబడ్డాయి. సమాజాన్ని ప్రభావితం చేయగలిగే శిఖరాయమానమైన గ్రంథాలు లక్ష్మణరావుగారి హయాములోనే ప్రచురితమయ్యాయి. విజ్ఞాన శాస్త్ర గ్రంథాలన్నీ ఆయన జీవించి ఉన్నప్పుడే వెలువడ్డడం ఒక విశేషం.

విజ్ఞాన చంద్రిక ప్రచురించిన వానిలో చారిత్రకాలు, వైజ్ఞానికాలు, జీవిత చరిత్రలు, ఆర్థిక శాస్త్రాది గ్రంథాలు ఉన్నాయి.

## చారిత్రక గ్రంథాలు :

విజ్ఞాన చంద్రిక సభ్యులు 'అబ్రహామ్ లింకన్' జీవిత చరిత్రను వెలువరిస్తూ ''పద్యకావ్యములు, నాటకములు, భాషావిషయిక చర్చలు, వాఙ్మయ విషయక చర్చలు, భాషాభివృద్ధికి అత్యంత ఆవశ్యకంబులైనను ఈ విషయిక గ్రంథములు మేము ప్రస్తుతము వ్రాయను, వ్రాయించను తలచుకొనలేదు'' అని అన్న మాటలు గమనింప దగినవి. పద్యకావ్యాలు మొదలైనవి వాఙ్మయాభివృద్ధికి తోడ్పడతాయనడంలో సందేహంలేదు. విజ్ఞాన చంద్రిక అవతరించడానికి ముందే పద్య రచన, గద్య రచన, నాటక రచన మొదలైన ప్రాచీన సాహితీ ప్రక్రియలు బహుళ వ్యాప్తిలో ఉన్నాయి. వీరేశలింగం పంతులుగారు నవ్య ప్రక్రియలను ప్రవేశ పెట్టి తెలుగు సాహిత్యానికి సరికొత్తదారిని చూపించారు. గిడుగు, గురుజాడ తాము ప్రత్యేక మార్గంలో పయనించడానికి సమాయత్తమౌతున్నారు. వీరి మార్గాన్నే అనుసరించినట్టయితే ప్రత్యేకత లేదు. పాత బాటే అవుతుంది. భిన్నమైన మార్గంలో పయనించి దేశానికి సేవ చేయాలన్న సంకల్పమే విజ్ఞాన చంద్రికకు నాంది పలికింది. తరతరాలనుండి వస్తున్న మన సంస్కృతిని, నాగరికతను చాటి చెప్పి, ఆధునిక శాస్త్రీయ విజ్ఞానాన్ని అందించి, దేశీయులను మేల్కొల్పాలన్నది తమ ఆశయంగా విజ్ఞాన చంద్రిక పేర్కొన్నది. ఈ కారణం

గానే వాఙ్మయ చర్చల జోలికి పోలేదు. ఉద్దండులైన పండితులకు, మహామహులకు ఈ కార్యరంగాన్ని అప్పగించి, ఒక ప్రత్యేక తరహాలో సమాజాన్ని, సాహిత్యాన్ని సముద్ధరించడానికి విజ్ఞాన చంద్రిక సారథులు పూనుకొన్నారు.

చారిత్రక గ్రంథాలు వర్తమానాన్ని సరిదిద్దుకొని భవిష్యత్తుకు మంచి పునాదులు వేసుకోవడానికి ఉపకరిస్తాయి. గతంలో జరిగిన లోటుపాట్లు చరిత్రాధ్యయనంవల్లనే అవగతమవుతాయి. నీరసించి పోతున్న జాతికి ఆ జాతి గత చరిత్రను గుర్తు చేయడం ఎంత అవశ్యకమో లక్ష్మణరావుగారికి బాగా తెలుసు. కనుకనే ఆయన తెలుగుదేశంలో చరిత్ర పరిశోధనకు పునాదులు వేశారు.

చారిత్రక గ్రంథాలు జాతిని ఉత్తేజితం చేస్తాయన్న వాస్తవాన్ని గుర్తించి, తెలుగుదేశంలో మొట్టమొదట అటువంటి రచనలకు ప్రోత్సాహం అందించిన మహనీయులు లక్ష్మణరావు పంతులుగారు. విజ్ఞాన చంద్రిక ద్వితీయ కుసుమంగా వెలువడిన 'హిందూ మహాయుగం' ఆనాడు భారతజాతి వైభవాన్ని చాటిచెప్పి, ఎంతో సంచలనాన్ని కలిగించింది. హిందూదేశ చరిత్రను పరాయి భాషలో (ఆంగ్ల భాషలో) చదువుకోవలసిన పరిస్థితిని ఇది తారుమారు చేసింది. మాతృభాషలో తమ దేశచరిత్రను చదివే అవకాశం తెలుగు ప్రజలకు కలిగింది. హిందూ మహాయుగం తరువాత విజ్ఞాన చంద్రిక ప్రచురించిన చారిత్రక గ్రంథాలు రాణీ సంయుక్త, మహ్మదీయ మహాయుగం, ఆంధ్రుల చరిత్ర, విమలాదేవి, ఢిల్లీ దర్బారు, రాయచూరు యుద్ధము, విజయనగర సామ్రాజ్యము, పాతాళభైరవి మొదలైనవి. ఇవి లక్ష్మణరావుగారు జీవించి ఉన్న కాలంలో వెలువడిన చారిత్రక గ్రంథాలు. వీనిలో హిందూ మహాయుగం, మహ్మదీయ మహాయుగం ఈ రెండూ లక్ష్మణరావుగారి స్వీయ రచనలు. కాబట్టి వీటిని ఆయన ఇతర రచనలతో పాటు ప్రత్యేకంగా పరిశీలించడం జరుగుతుంది.

ఫ్రెంచి స్వాతంత్ర్య విజయము, బౌద్ధ మహాయుగం, ఫాహియాను భారత వర్షయాత్ర, దక్షిణాఫ్రికా చరిత్ర, అల్లాహో అక్బర్, వైదిక నిలయము, తురుష్క ప్రజాస్వామిక, అధినివేశ స్వరాజ్యము, ఆంగ్ల రాజ్యస్థాపనము మొద

లైనవి లక్ష్మణరావుగారు మరణించిన పిమ్మట ప్రచురించబడిన చారిత్రక గ్రంథాలు.

## దేశచరిత్రలు :

ఒక జాతి పరంపరాగత చారిత్రే ఆ జాతి దేశచరిత్ర. ఒక్కొక్క దేశానికి ఒకొక్క రకమైన చరిత్ర ఉంటుంది. భౌగోళిక పరిస్థితుల కారణంగా విభిన్న దేశాలలో విభిన్న జాతులు స్థిరపడి, వేనికవే ప్రత్యేకమైన నాగరకతా సంస్కృతులను సృష్టించుకొని మనుగడను సాగిస్తున్నాయి. అభ్యుదయ సాధనలో ప్రపంచంలోని వివిధ జాతులు పోటీ పడుతుండడం అనాదిగా వస్తున్నదే. తన నాగరకతా సంస్కృతులను పదిలపరచుకొని విచక్షణాదృష్టితో వ్యవహరించిన జాతి మాత్రమే ముందడుగు వేయగలుగుతుందనేది చరిత్ర నేర్పిన పాఠం.

గత అనుభవాన్ని దృష్టిలో ఉంచుకొని భవిష్యత్తుకొరకు వర్తమానంలో మనం ఏ విధంగానైతే పునాదులు వేసుకొంటామో అదే విధంగా ఒక జాతి అభ్యుదయ పథంలో పయనించడానికి గతాన్ని నెమరువేసుకోవడం అవసరం. గతం మనను గుర్తు చేస్తుంది. మనం వేసే ముందడుగు తప్పటడుగు కాకుండా కాపాడుతుంది. దేశ చరిత్రను మననం చేసుకుంటూ సాగిపోయే జాతికి ఒడుదొడుకులు తారసపడవు. ఒకవేళ అటువంటి పరిస్థితులు ఎప్పుడైనా ఎదురైతే సంభాళించుకొని ముందుకు దూసుకుపోయే ధైర్యస్థైర్యాలు ఉంటాయి. గత చరిత్ర సముజ్జ్వలంగా ఉన్న జాతిని మరోజాతి కబళించలేదు. దాన్ని ప్రభావితం చేయవచ్చు. ఇలా చేయడంలో ఒక జాతి తనను తాను మరచిపోయి, మరో జాతికి 'దాసోహం' అనే ప్రమాదం ఉంది గత వైభవాన్ని నెమరువేసుకొనే జాతి ఈ ప్రమాదాన్ని గుర్తించి, బయటపడగలుగుతుంది. దీన్నిబట్టి ఒక జాతి ఔన్నత్యానికి ఆ జాతి దేశ చరిత్ర ఎంతగానో తోడ్పడుతుందని చెప్పవచ్చు. ఒక జాతి తన దేశాన్ని గురించే కాకుండా ఇతర దేశాల గురించి కూడా తెలుసుకోవడం అవసరం. ప్రపంచ దేశాల గురించి, వాటి అభ్యుదయ పరంపరల

గురించి తెలుసుకునే అవకాశం దీనివల్ల కలుగుతుంది. దేశ చరిత్రలు కలిగించే ప్రయోజనాన్ని గుర్తించి విజ్ఞాన చంద్రిక వీటి ప్రచురణకు ప్రాముఖ్యత నిచ్చింది. విజ్ఞాన చంద్రిక స్థాపనతో తెలుగులో ప్రామాణికమైన చారిత్రక గ్రంథాల రచనకు అంకురార్పణ జరిగింది. విజ్ఞాన చంద్రికకు ముందు చారిత్రకాంశాలను కొంతవరకు వెల్లడించే సిద్ధేశ్వర చరిత్రవంటి కావ్యాలు, రాయవాచకం వంటి వచన గ్రంథాలు తప్ప తెలుగులో ప్రామాణికమైన చారిత్రక గ్రంథాలు లేవు.

వీరేశలింగం పంతులు గారు కొన్ని సంస్థానాల చరిత్రలను రచించారు. ఇవి 1894-1895 సంవత్సరాల మధ్య కాలంలో చింతామణి పత్రికలో ప్రచురింపబడ్డాయి. ఆ తరువాత పంతులు గారు 1895 లోనే వాటిని ఒక సంపుటంగా ప్రకటించారు. ఈ సంస్థానాల చరిత్రలలో పంతులు గారు చారిత్రకాంశాల కంటె సాంఘికాంశాలకు ప్రాధాన్యత నిచ్చారు.[12] ఇంగ్లీషు ప్రభుత్వానికి జేజేలు పలికే ధోరణి ఈ వ్యాసాలలో కనిపిస్తుంది.

తెలుగు సాహిత్యంలో చారిత్రక గ్రంథాలకొరత లక్ష్మణరావు గారికి కొట్టవచ్చినట్టు కనిపించింది. పరాయి పాలనలో ఉన్న ప్రజానీకానికి గతాన్ని గుర్తుచేయడం అత్యంతావశ్యకమైనది. దేశచరిత్రలు గతవైభవాన్ని చాటిచెప్పి స్వాతంత్ర్యాభిలాషను రేకెత్తిస్తాయి. అదే విధంగా వివిధ దేశాల అభ్యుదయోద్యమాలను గురించి తెలియజేసినట్టయితే ప్రజలు వాటి ద్వారా స్ఫూర్తిని పొంది, స్వాతంత్ర్యోద్యమానికి సమాయత్తమవుతారు.

---

12. ''పంతులు గారీ స్వదేశ సంస్థానముల చరిత్రలందు ఆంగ్లేయ ప్రభుత్వం వారి వలన నీ సంస్థానములన్నియు వృద్ధిపొందెననియు, సంస్థాన ప్రజలకు మేలు కలిగెననియు నభిప్రాయపడిరి. పంతులుగారి తరము వారికి ఇంగ్లీషు ప్రభుత్వముపై భక్తి శ్రద్ధలు మెండు. ఈ కారణమున వారు ఇంగ్లీషు ప్రభుత్వము వారిని ప్రశంసించుట వింతగాదు.''

వీరేశలింగం పంతులు-సమగ్ర పరిశీలన.
డా॥ అక్కిరాజు రమాపతిరావు పేజి. 291.

దేశ చరిత్రలను ప్రచురించాలని నిర్ణయించడంలో విజ్ఞాన చంద్రికకు ఇంతటి మహత్తరమైన ఆశయాలు ఉన్నాయి. లక్ష్మణరావుగారు రచించిన హిందూ మహాయుగం ఈ ఆశయాలకు ప్రతిబింబం వంటిది. ఇది విజ్ఞాన చంద్రిక ప్రచురించిన దేశ చరిత్రలలో మొదటిది. ఆ తరువాత వెలువడినది ఆంధ్రుల చరిత్ర ఈ రెండూ ఉత్కృష్టమైన గ్రంథాలు. ఆంధ్రుల చరిత్ర రెండు భాగాలుగా రచించబడింది ఆంధ్ర దేశానికి దీన్ని అందించిన చిలుకూరి వీరభద్రరావుగారు ఆంధ్రులందరికీ ప్రాతఃస్మరణీయులు. ఆంధ్రుల చరిత్ర ఆనాడు ఆంధ్రుల వికాసానికి తోడ్పడింది. మల్లంపల్లి సోమశేఖర శర్మగారు దీని ప్రాశస్త్యాన్ని ఈ విధంగా వర్ణించారు:

''ఆంధ్రదేశ చరిత్ర వచ్చి ఆంధ్రులలో జాతీయాభిమాన దర్పాలను రేకెత్తించింది. ఎక్కడ ఏ సభలు జరిగినా నాయకులు తమ ప్రాచీన వైభవ గాథలను త్రవ్వి సభ్యులలో జాతీయ భావోద్దీపనం కలిగించేవారు. ఆంధ్రోద్యమం రావడానికి కారణము ఆంధ్రదేశ చరిత్ర ప్రకటనమే అని ఆనాడు దేశాభిమాని మొదలైన పత్రికలలో వ్యాసములు కూడా పడినవి.''[13]

సారస్వతం కొన్ని సందర్భాలలో ఎంత గొప్పగా పనిచేస్తుందో ఈ మాటలు చెప్తున్నాయి విజ్ఞాన చంద్రికకు ముందు తెలుగు దేశంలో ప్రామాణికమైన దేశ చరిత్రల రచనకు ఎటువంటి ప్రయత్నం జరుగలేదు సరియైన పరిశోధనా దృక్పథం లేకపోవడం దేశ చరిత్రల అవసరాన్ని మన పూర్వులు గుర్తించకపోవడం దీనికి ప్రధాన కారణాలు. ఆంధ్రుల చరిత్ర ప్రథమ సంపుటి పీఠికలో చిలుకూరి వీరభద్రరావుగారు ఈ విధంగా పేర్కొన్నారు-

''దేశము యొక్క పురోభివృద్ధికి ప్రబలశత్రువై, జనసామాన్యము నావహించి యుండిన దురభిమాన పిశాచమును బోద్రోలి ప్రజలను నీతి వర్ధిష్ణువులనుగాను, విజ్ఞానవంతులనుగాను జేసి, భావికాల పరంపరాభివృద్ధి భావనమునకు

13 'తెలుగుతల్లి' - లక్ష్మణరాయ వర్ధంతి సంచిక. పేజి 59.

మూలబంధమై యొప్పునది దేశచరిత్రమైనను దేశచరిత్రము యొక్క ప్రయోజన మెరుంగని వారగుటచేత మన పూర్వులు మనకొరకు దేశ చరిత్రమును వ్రాసి పెట్టి యుండలేదు. దేశ చరిత్రము లేకపోవుట మన నాగరకతకును మన భాష కును నొక గొప్ప కొరంతగా నున్నది.''

లక్ష్మణరావు గారు వ్రాసిన చారిత్రక గ్రంథాలకు. వీరభద్రరావుగారు వ్రాసిన 'ఆంధ్రుల చరిత్ర'కు ఆంగ్లేయులు సంపాదించి పెట్టిన చారిత్రక సామాగ్రి చాలా వరకు ఉపయోగపడింది. ''సత్యాన్వేషణ పరులైన పాశ్చాత్య పండితులకు ఆంధ్రులమైన మనము ముఖ్యముగా కృతజ్ఞత దెలుపవలసియున్నది. మన ప్రాచీనాంధ్రుల యొక్క యౌన్నత్యము బయటపడుటకు ముఖ్యముగా వీరు చేసిన నిరంతర కృషియే కారణము ఈ పాశ్చాత్యపండితులు చరిత్రములు వ్రాయుటలో మన గ్రంథములలోని లోపములను కనిపెట్టి క్రమక్రమముగా వానిని అబద్ధపు కూతలని నిరసించివైచి శాసనములను, పురాతన కట్టడములను, మన దేశమును గురించి యన్య దేశస్థులు వ్రాసి యుంచిన వ్రాతలను... నాధార ముగా గొని యొక విధముగా దేశ చరిత్రమున కనుకూలములగు విషయముల వ్రాసిరి'' అని వీరభద్రరావుగారు పాశ్చాత్యపండితులను ప్రస్తుతించారు.[14]

పాశ్చాత్య పండితులు పుస్తక భాండాగారములలో దాచి ఉంచిన వ్రాత ప్రతులు, శాసన ప్రతులు ఇవన్నీ, ఆ తరువాత రచయితలు ప్రామాణికమైన గ్రంథాలు రచించడానికి ఉపయోగపడ్డాయి.

ఆంధ్రుల చరిత్ర మొదటి సంపుటి 1910 లో వెలువడింది. పూర్వ యుగం, మధ్యయుగం, నవీనయుగం అని విడదీసి ఆంధ్రుల చరిత్రను మూడు సంపుటాల్లో రచించాలని వీరభద్రరావుగారనుకొన్నారు. మొదటి సంపుటిలో పూర్వయుగం అంటే ఐతరేయ బ్రాహ్మణం మొదలుకొని క్రీ.శ. 12వ శతాబ్ది వరకు జరిగిన చారిత్రక పరిణామాలు వివరించబడ్డాయి. ప్రాచీన ఆంధ్రదేశ

14. "ఆంధ్రుల చరిత్ర" - ప్రథమ సంపుటి పీఠిక (విజ్ఞాన చంద్రిక ప్రచురణ.)

స్థితిగతులు, ఆంధ్ర వంశం, శాతావాహన, పల్లవ, చాళుక్య, కళింగ రాజ వంశాల చరిత్ర, వారి పరిపాలనావిధానం-ఇవన్నీ చారిత్రకాధారాలతో నిరూపించబడ్డాయి.

ద్వితీయ సంపుటి 1912 లో ప్రచురితమైంది. దీనిలో మధ్యయుగ చరిత్ర వివరించబడింది. కాకతీయుల చరిత్రతో ఆరంభమై, విజయనగర ప్రభువుల వృత్తాంతంతో ఈ గ్రంథం అంతమైంది. ఆంధ్ర కలికాల చోడవంశం, కోట వంశం, రెడ్డిరాజుల వంశాలు, యాదవ వంశాల చరిత్ర దీనిలో వర్ణింపబడ్డాయి.

ఆధునిక యుగం వరకు ఆంధ్రుల చరిత్ర రచించ తలపెట్టినట్టు వీరభద్ర రావుగారు ప్రథమ సంపుటి పీఠికలో పేర్కొన్నారు అయితే విజ్ఞాన చంద్రిక పక్షాన అటువంటి సంపుటం ఏదీ వెలువడలేదు. వీరభద్రరావుగారు కేవలం రెండు సంపుటాలను మాత్రమే రచించారు. ఈ రెండు సంపుటాలు మరుగున పడిన ఆంధ్రుల వైభవాన్ని ఆంధ్ర ప్రజలకు తెలియజేశాయి.

ఆంధ్రుల చరిత్రలో వీరభద్రరావుగారు చేసిన విషయ విభజనకు, అధునిక చరిత్రకారుల విభజనకు దాదాపుగా సరిపోయింది అయితే ఈ గ్రంథాన్ని ఇప్పటి చారిత్రక గ్రంథాలతో పోల్చి చూసినట్టయితే దీనిలో ప్రస్తావించిన కొన్ని విషయాలు ఆధునిక చారిత్రక ప్రమాణాలకు సరిపోకపోవచ్చు. దీనికి కారణం చరిత్ర పరిశోధనారంగం విస్తరిస్తున్నకొద్దీ, కొత్త విషయాలనేకం బయటపడుతుండడమే. కొత్తను తనలో ఇముడ్చుకొని చరిత్ర పరిశోధన ముందుకు సాగిపోతుంది. సానపెట్టినకొద్దీ బంగారం వన్నె పెరిగినట్టు పరిశోధనలు జరుగుతున్నాకొద్దీ చరిత్ర ప్రామాణికత పెరుగుతుంది. కొత్త విషయాలనేకం బయటపడి, పాత వాటిని సరిదిద్దుతుంటాయి.

"......... సమగ్రమును సప్రమాణమునగు చరిత్ర యొకనిచేగాని బహుజనులచేగాని యేకకాలమునందు వ్రాయనలవికాదని తెలిసికొనవలయును."

"ఆంధ్రదేశ చరిత్రము వ్రాయుటకు శాసనములు ముఖ్యాధారములు. ఇయ్యవి వేలకొలది కలవు. కొన్ని ప్రకటింపబడినవి. మరికొన్ని ప్రకటింపబడవలసి యున్నవి ఇంకను వేలకొలది ప్రతు లెత్తుకొనబడవలసి యున్నవి. వీని నన్నింటిని పరిశోధించి సమన్వయించుకొనవలయును. ఇంకను భావి కాలమున శిలాశాసనములు, తామ్ర శాసనములు బయలుపడి క్రొత్త చరిత్రాంశములను వెలువరింపవచ్చును. అట్లగుటవలన సమగ్రమయినట్టియు, సప్రమాణమైనట్టియు దేశ చరిత్రము వ్రాయుట కెవ్వరికి సాధ్యమగును."[15] చిలుకూరి వీరభద్రరావు గారు వెలిబుచ్చిన ఈ అభిప్రాయం అన్ని కాలాలకు వర్తిస్తుంది.

ఫెర్గూసన్ (Fergusson), బర్గెస్ (Burgess) మొదలైన పాశ్చాత్య పండితుల గ్రంథాలు. రావు బహదూర్ వెంకయ్య, జయంతి రామయ్య పంతులు మొదలైన స్వదేశీ పండితులు వ్రాసిన వ్రాతలు ఈ గ్రంథ రచనకు తోడ్పడినట్టు వీరభద్రరావు గారు పేర్కొన్నారు. ఎంతో శ్రమకోర్చి ఆయన ఈ గ్రంథాన్ని ఉత్తమ చారిత్రక గ్రంథంగా తీర్చిదిద్దినారు.[16]

ఆంధ్రుల చరిత్ర తరువాత దేశచరిత్రల విభాగం క్రింద విజ్ఞాన చంద్రిక ప్రచురించిన గ్రంథాలలో స్వదేశ చరిత్రలు, విదేశ చరిత్రలు ఉన్నాయి.

---

15. 'ఆంధ్రుల చరిత్ర' - ద్వితీయ సంపుటి పీఠిక (విజ్ఞాన చంద్రిక ప్రచురణ)

16 "లక్ష్మణరావు గారు మొదటి చారిత్రకులు, పరిశోధకులు అందుచేత హిందూదేశ చరిత్రను, ఆంధ్రుల చరిత్రను వ్రాసి యుంచవలెనని ఆయన ఆశయం. యావద్భారతీయ చరిత్రను తాను గ్రహించి, ఆంధ్రుల చరిత్రను చిలుకూరి వారికి వదలినారు ఈయనకు పట్నములో వలసినన్ని సౌకర్యములిచ్చి పరిశోధనలు చేయించినారు. ఈయన (చిలుకూరి) పరిశోధనచేసే దినాలలో బయట కనబడేవాడు కాడు కనబడినప్పటికి ఇప్పటి చరిత్ర పరిశోధకుల వలె మ్రోతలేదు అందుచేత ఎవరూ కనుగొనకలిగేవారు కారు. వీరి ఆంధ్రుల చరిత్ర ఒక గని వీరు ప్రథములగుట చేత దానిలోని విషయం కొంచెం పాతకలిగి గాని, పొరపాటుగాని ఉండవచ్చును. కాని పునాది వారిది.''— కురుగంటి సీతారామయ్య. ''లక్ష్మణరాయ వర్ధంతి సంచిక''- పేజి. 42.

ఫ్రెంచి స్వాతంత్ర్య విజయం, బౌద్ధ మహాయుగం, ఫాహియాను భారత వర్షయాత్ర, దక్షిణాఫ్రికా చరిత్ర, వైదిక నిలయము, తురుష్క ప్రజాస్వామిక, అమెరికా సంయుక్త రాష్ట్రములు, అధినివేశ స్వరాజ్యము, ఆంగ్ల రాజ్యస్థాపనము మొదలైనవి దేశచరిత్రల జాబితాలోనివి. ఈ గ్రంథాలన్నీ లక్ష్మణరావుగారు మరణించిన తరువాత రచించబడినట్టివి. ఫ్రెంచి స్వాతంత్ర్యం విజయం, అమెరికా సంయుక్త రాష్ట్రములు ఈ రెండు గ్రంథాలు ప్రకటించాలని లక్ష్మణ రావుగారే నిర్ణయం తీసుకొన్నారు. అయితే ఇవి ఆయన మరణించిన తరువాత ప్రచురించబడ్డాయి. 1922 ఫిబ్రవరిలో పన్నుల నిరాకరణోద్యమంలో పాల్గొన్నం దుకు కాశేశ్వరరావుగారిని బ్రిటిషు ప్రభుత్వం కడలూరు జైలులో ఒక ఏడాది పాటు నిర్బంధించింది. ఆ సమయంలో లక్ష్మణరావుగారు "American war of Independance", "French Revolution" అనే ఆంగ్ల గ్రంథాలను తెలుగులో అనువదించడానికి కాశేశ్వరరావుగారికి అప్పగించారు. ఈ రెండు గ్రంథాలు అమెరికా, ఫ్రాన్స్ దేశాల స్వాతంత్ర్య పోరాటాలను వివరించేవి. వీటిని తెలుగులోనికి అనువదించాలని తలపెట్టడంలోనే వీరి ఆశయం ఏమిటో స్పష్టమైపోతున్నది. జాతీయత, ప్రజాస్వామ్యం, స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వం అనే సిద్ధాంతాల ప్రాతిపదికపై నడిచి విజయవంతమైన ఫ్రెంచి విప్లవం, ఇంగ్లాండుతో పోరాడి సంపూర్ణ ప్రజాస్వామ్యాన్ని స్థాపించుకొన్న అమెరికా సంయుక్త రాష్ట్రాల చరిత్ర ఆనాడు ప్రపంచ ప్రజలను ఎంతగానో ఆకర్షించాయి ఈ రెండు ఉద్యమాల చరిత్రను తెలుగు వారికి అందించాలని లక్ష్మణరావుగారు తాపత్రయపడ్డారు. ఆయన సలహా ననుసరించి కాశేశ్వరరావుగారు కడలూరు జైలులో ఉన్నప్పుడు ఈ రెండు గ్రంథాలను అనువదించారు. అయితే ఫ్రెంచి స్వాతంత్ర్య విజయం అచ్చుపడుతున్న రోజుల్లో లక్ష్మణరావుగారు హఠాత్తుగా కన్నుమూశారు. ఆ తరువాత 1923 నవంబరులో ఈ గ్రంథం బయటికి వచ్చింది.

తన జీవిత కాలంలో దేశస్వాతంత్ర్యం కొరకు పరితపించిన లక్ష్మణరావుగారికి ఈ గ్రంథాన్ని అంకితం చేసి కాశేశ్వరరావుగారు ఋణం తీర్చుకొన్నారు.

ఇక రెండో గ్రంథమైన 'అమెరికా సంయుక్త రాష్ట్రాలు' 1925 లో ప్రచురించబడింది. లక్ష్మణరావుగారు మరణించిన తరువాత ప్రకటించబడినప్పటికీ ఈ రెండు గ్రంథాలకు ప్రేరణ ఆయనదే.

'తురుష్క ప్రజాస్వామిక' (Turkish Republic) అనే గ్రంథాన్ని కూడా కాశేశ్వరరావుగారే వ్రాశారు. ఈ గ్రంథం టర్కీ ప్రజలు ముస్తాఫా కెమాల్ పాషా నాయకత్వంలో స్వాతంత్ర్యాన్ని సంపాదించిన తీరును వివరిస్తుంది. విజ్ఞాన చంద్రిక ప్రచురించిన గ్రంథాల వరుసలో ఇది 39 వది. 1933లో ఇది ప్రచురితమైంది మన స్వాతంత్ర్యోద్యమానికి ఉద్దీపనం కలిగించిన మరో గ్రంథం "దక్షిణాఫ్రికా చరిత్ర" దీన్ని దిగవల్లి వెంకటశివరావుగారు వ్రాశారు దక్షిణాఫ్రికాలో భారతీయులు పడిన పాట్లు, గాంధీ మహాత్ముని సత్యాగ్రహోద్యమం దీనిలో వివరించబడ్డాయి దిగవల్లి వెంకటశివరావుగారు వ్రాసిందే మరో గ్రంథం 'అధినివేశ స్వరాజ్యం.' రచయిత భారతదేశ అధినివేశ ప్రతిపత్తిని (బ్రిటిషు పాలన నాటి) గురించి దీనిలో వివరించారు. ఇది 1933 లో వెలువడింది. 1933లోనే మానికొండ సత్యనారాయణగారు అనువదించిన "ఆంగ్ల స్థాపన''మనే గ్రంథాన్ని విజ్ఞాన చంద్రిక ప్రచురించింది. భారతదేశంలో బ్రిటిషు సామ్రాజ్య స్థాపన ఏవిధంగా జరిగిందో దీనిలో తెలుపబడింది మానికొండ సత్యనారాయణగారు వ్రాసిన 'వైదిక నిలయం' అనే మరో గ్రంథాన్ని కూడా విజ్ఞాన చంద్రిక ప్రచురించింది ఇది బాలగంగాధర తిలక్ ఆంగ్లంలో వ్రాసిన 'The Arctic home of the Vedas' అనే గ్రంథానికి అనువాదం. 1930 లో ఇది వెలువడింది బౌద్ధమహాయుగం, ఫాహియాన్ భారత వర్ష యాత్ర-ఈ రెండింటిని వేలూరి సత్యనారాయణగారు వ్రాశారు. ఇవి స్వతంత్ర గ్రంథాలు. దీనిలో భారత దేశ చరిత్ర వివరించబడింది. 'బౌద్ధమహాయుగం' బుద్ధుని యుగంలో భారత దేశ ఔన్నత్యాన్ని చాటి చెప్పే గ్రంథం.

1912 లో విజ్ఞాన చంద్రిక ప్రచురించిన 'చంద్రగుప్త' అనే చారిత్రక గ్రంథం కూడా దేశచరిత్రలలో చేరుతుంది. స్వామి విద్యానంద పరమహంస

దీన్ని రచించారు. "ఈ గ్రంథము మేము తలపెట్టిన హిందూదేశ పాలక చరిత్ర మాల (Rulers of India Series) యందు మొదటి సంపుటము" అని దీని సంపాదకులు లక్ష్మణరావుగారు సంపాదకీయ భూమికలో పేర్కొన్నారు. హైందవ చక్రవర్తులను గురించి వరసగా గ్రంథాలు ప్రచురించాలని తలపెట్టి నప్పటికీ, విజ్ఞాన చంద్రిక ఒక్క చంద్రగుప్తుని గురించి మాత్రమే గ్రంథాన్ని వెలువరించింది. ఆ తరువాత ఇటువంటి గ్రంథాలు వెలువడ లేదు ఈ గ్రంథంలో చంద్రగుప్తుని పాలననాటి దేశ పరిస్థితులు, ఆయన పరిపాలనా విధానం వివరించ బడ్డాయి.

ఒక చక్రవర్తి చరిత్ర అంటే ఒక దేశ చరిత్ర అని చెప్పవచ్చు అయితే అది సమగ్రమైన దేశచరిత్ర కాదు. ఆ చక్రవర్తి పాలనాకాలంనాటి దేశచరిత్రను మాత్రమే అది తెలియజేస్తుంది. కనుక చంద్రగుప్తుని గురించి వ్రాసిన ఈ గ్రంథాన్ని దేశచరిత్రలలో చేర్చవచ్చు.

పైన పేర్కొన్న గ్రంథాలు సాహిత్య ప్రమాణాల కొరకు, విలువల కొరకు వ్రాసినట్టివి కావు. ప్రజాలను విజ్ఞానవంతులను చేయడానికి వెలువరించి నట్టివి. ప్రపంచంలోని ఆయా దేశాల స్వాతంత్ర్యోద్యమాలను తెలియజేసి, విజ్ఞాన చంద్రిక తెలుగు ప్రజల దృష్టిని మన దేశ స్వాతంత్ర్యోదమంవైపు మళ్ళించింది. విజ్ఞాన చంద్రికా ఉద్యమంలో దేశచరిత్రల ప్రచురణ ఒక ప్రధాన ఘట్టం.

## చారిత్రాత్మక నవలలు :

దేశ చరిత్రలు దేశ భక్తిని ప్రేరేపిస్తే చారిత్రాత్మక నవలలు ధైర్య సాహసాలకు హేతువులుగా నిలుస్తాయి. అలాగే సాంఘిక నవలలు సామాజిక విలువలకు అద్దంపడితే, చారిత్రక నవలలు ఒక జాతి సంఘటిత శక్తిగా రూపొందడానికి దోహదం చేస్తాయి ఒక జాతి నిర్వీర్యమైపోయే ప్రమాద పరి స్థితులు ఉత్పన్నమైనప్పుడు శౌర్య ప్రతాపాలను చాటి చెప్పే సంఘటనల ఆధా

రంగా చారిత్రక నవలలు రచించబడి జాతిలో ఉత్తేజాన్ని కలిగిస్తాయి. ప్రపంచంలోని ఏ దేశ చారిత్రక నవలలను పరిశీలించినా అవి వెలువడడానికి ఒక ప్రత్యేక ప్రేరణ కనబడుతుంది. "ఏ దేశ చారిత్రక నవలల్ని పరిశీలించినా అందులో ఎక్కువ భాగం జాతీయ పునరుజ్జీవనం ఆవశ్యకమైనప్పుడే అవి కోకొల్లలుగా వచ్చాయని తెలుస్తుంది. ఆ విధంగా జాతిని కర్తవ్యోన్ముఖులను చేసి వారి విధుల్ని వారికి సక్రమంగా నేర్పుతుంది చారిత్రక నవల".[17]

తెలుగులో చారిత్రక నవలల రచనకు మొట్ట మొదట ప్రోత్సాహం కల్పించింది 'చింతామణి' పత్రిక. ఈ పత్రిక చారిత్రక నవలల పోటీని నిర్వహించి, అనేక చారిత్రక నవలలు వెలువడడానికి కారణభూతమయింది. ఖండవల్లి రామచంద్రుడు రచించిన 'ధర్మవతీ విలాసం' చింతామణి పత్రిక పోటీలో ప్రప్రథమంగా బహుమతి గెలుచుకొన్న చారిత్రక నవల ఇదే తెలుగు సాహిత్యంలో మొదటి చారిత్రక నవలగా పరిగణింపబడుతున్నది. అయితే ఈ నవలలో చారిత్రక విలువల కంటే కాల్పనిక సంఘటనలకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వబడింది. ధర్మవతీ విలాసం తరువాత వెలువడిన చారిత్రక నవలల్లో చిలకమర్తి వారి హేమలత, అహల్యాబాయి, మొదలైనవి చెప్పుకోదగినవి. విజ్ఞాన చంద్రిక వెలసిన తరువాత చారిత్రక నవలల రచనకు ప్రాధాన్యం హెచ్చింది. విజ్ఞాన చంద్రిక అవతరించిన రోజుల్లోనే బెంగాలీలోని సుప్రసిద్ధ చారిత్రక నవలలు కొన్ని తెలుగులోనికి అనువదింపబడ్డాయి. వానిలో బంకిమ చంద్ర ఛటర్జీ రచించిన 'ఆనందమఠం' చెప్పుకోదగింది.

1893 నుండి 1930 వరకు వెలువడిన చారిత్రక నవలలు అనువాదాలు మాత్రమేనని కొందరి అభిప్రాయం.[18]

---

17. 'తెలుగు నవలా వికాసం'—మొదలి నాగభూషణశర్మ. పేజీ 148.

18. మొదలి నాగభూషణ శర్మగారు తమ 'తెలుగు నవలా వికాసం'లో ఈ అభిప్రాయాన్ని వ్యక్తీకరించారు. పేజి. 152

కాని ఇది సరియైన అభిప్రాయం కాదు. విజ్ఞాన చంద్రిక ప్రచురించిన చారిత్రక నవలలను విస్మరించి ఈ అభిప్రాయాన్ని ప్రకటించడం జరిగింది. విజ్ఞానచంద్రిక ప్రచురించిన చారిత్రక నవలలన్నీ స్వతంత్ర నవలలే. ఏ ఇతర నవలలకు అనువాదాలు కాని, అనుసరణలు కాని కావు. తెలుగు నవలా [illegible] 1922 లో 'మాలపల్లి' వెలువడే వరకు చారిత్రక నవలలే మకుటాయమానంగా విరాజిల్లినవి. 'మాలపల్లి' వెలువడిన తరువాత సాంఘిక నవల ఊపునందుకొన్నది. ఈ ఊపు తాకిడికి తట్టుకొని కూడా చారిత్రక నవలలు నిలిచాయి.

1907 లో విజ్ఞాన చంద్రిక 'రాణీ సంయుక్త' అనే చారిత్రక నవలను హైదరాబాదునుండి ప్రకటించింది. దీని తరువాత విమలాదేవి, రాయచూరు యుద్ధము, విజయనగర సామ్రాజ్యము, పాతాళభైరవి, అల్లాహో అక్బర్ మొదలైన నవలలు ప్రచురింపబడ్డాయి. చింతామణి పత్రికవలె విజ్ఞాన చంద్రిక చారిత్రక నవలల పోటీని నిర్వహించి, స్వతంత్ర నవలలను మాత్రమే ప్రోత్సహించినది.[19]

ప్రాచీన చారిత్రక గాథలు ప్రజలను త్వరిత గతిన ప్రభావితం చేస్తాయన్న విశ్వాసంతో విజ్ఞాన చంద్రిక చారిత్రక నవలల ప్రచురణను చేపట్టింది. విజ్ఞాన చంద్రిక ప్రచురించిన నవలల్లో ఒక్క 'అల్లహో అక్బర్' అనే నవల తప్ప తక్కినవన్నీ 1923 కు పూర్వమే వెలువడ్డాయి. సంఖ్యకు తక్కువే అయినా, విజ్ఞాన చంద్రిక నవలలుగా వీటికి విశేషమైన ప్రాచుర్యం లభించింది.

నవల బహుళ ప్రచారం పొందిన సాహితీ ప్రక్రియ. ప్రజలను సునాయాసంగా తనవైపు ఆకర్షించుకునే శక్తి దీనికుంది దేశభక్తి ప్రపూరితాలైన

19. ''స్వతంత్ర నవలలను మాత్రమే ప్రోత్సహించినాము కాని, ఇతర భాషల నుండి నవలలను తెలుగులోకి అనువాదము చేయించుటను మేము తలపెట్టలేదు''— అయ్యదేవర కాళేశ్వరరావు - 'నా జీవితము - నవ్యాంధ్రము.' పేజి. 146.

గాథలను హృదయానికి హత్తుకునే రీతిలో చెప్పినట్లయితే ప్రజలకు ప్రయోజనం కలుగుతుందని విజ్ఞానచంద్రిక ఆశించింది.

ఇటువంటి ఆశయంతో విజ్ఞాన చంద్రిక విశిష్టమైన నవలలను అందించింది. దీన్ని గమనిస్తే, 1930 వరకు తెలుగు చారిత్రక నవలలు అనువాదలని పేర్కొనడం సహేతుకంకాదని తెలిపోతున్నది.

సంఖ్యాబలంతో కాకుండా వస్తు విన్యాసంతో ఆనాడు చారిత్రక నవలలు ప్రజలను ప్రభావితం చేశాయి.

1907 లో వేలాల సుబ్బారావు రచించిన 'రాణీ సంయుక్త' వెలువడిన తరువాత 1910 లో 'విమలాదేవి' అనే నవల ప్రకటించబడింది. దీన్ని భోగరాజు నారాయణమూర్తి రచించారు. ఈ రెండు రాజపుత్రుల శౌర్యప్రతాపాలను, దేశభక్తిని, ధర్మాసక్తిని ఉగ్గడించే విశిష్టమైన గ్రంథాలు. 'విమలాదేవి' ఆంగ్ల భాషలోకి కూడా అనువదింపబడింది. 'విజయనగర సామ్రాజ్యం' 1913 లో ప్రచురితమైంది. దుగ్గిరాల రాఘవ చంద్రయ్య దీన్ని రచించారు. విజయనగర ప్రభువుల దేశభక్తి, హైందవ సంస్కృతిపట్ల వీరికిగల గౌరవ ప్రతిపత్తి దీనిలో చర్చింపబడ్డాయి. 'పాతాళభైరవి' నవలను ఏ. వి. నరసింహం పంతులు రచించారు.

భోగరాజు నారాయణమూర్తి లేఖినినుండి వెలువడిని మరో విశిష్టమైన నవల 'అల్లాహో అక్బర్'. 1925 లో హిందూ మహమ్మదీయుల ఐక్యతకు చిహ్నంగా ఈ నవల వెలువడింది. నాటి దేశకాల పరిస్థితులను బట్టి ఈ నవలకు విశేష ప్రాధాన్యం ఉంది. 1919 లో మహాత్మాగాంధీ భారత స్వాతంత్ర్యోద్యమానికి సారథ్యం వహించి, స్వాతంత్ర్య సముపార్జనకు కలసికట్టుగా కదలి రావలసిందిగా హిందూ మహమ్మదీయ సోదరులకు పిలుపునిచ్చారు. ఆర్య సమాజ ప్రవర్తకుడు శ్రద్ధానంద స్వామి జుమ్మామసీదులో అడుగుపెట్టి తన మతాన్ని ప్రబోధించడం, డాక్టర్ కిచ్లూ అనే మహమ్మదీయుడు అమృత్‌సర్ లోని సిక్కు దేవాలయంలో ప్రవేశించడం ఆనాడు చెప్పుకోదగిన సంఘటనలు.

ఖిలీఫా వ్యవస్థ తొలగిపోయినందుకు నిరసనగా భారతదేశంలో మహ్మమదీయులు ఉద్యమాన్ని ప్రారంభించారు. ఈ ఉద్యమాన్ని మహాత్మా గాంధీ బలపరచి, స్వాతంత్ర్యోద్యమానికి వారి సానుభూతిని సంపాదించారు. ఈ రీతిగా సాగిపోతున్న హిందూ-మహ్మమదీ యుల ఐక్యతా భావం చెక్కుచెదరకుండా నిలిచిపోవాలన్న లక్ష్యంతో అక్బర్ కాలంనాటి హిందూ మహ్మదీయుల సుహృద్భావ చరిత్రను విజ్ఞాన చంద్రిక ఈ నవలా రూపంలో తెలుగు ప్రజలకు అందించింది.

చారిత్రక నవలల పోటీలో ఉత్తమమైనవిగా ఎంపికైన వాటిని మాత్రమే విజ్ఞాన చంద్రిక ప్రచురించింది. ఇప్పటివరకు సమీక్షించిన నవలలన్నీ ఆ రకంగా బహుమతులందుకొన్నవే.

విజ్ఞాన చంద్రిక ప్రచురించిన మరో చారిత్రక గ్రంథం 'ఢిల్లీ దర్బారు' హరిసర్వోత్తమరావు గారు రచించిన ఈ గ్రంథం లక్ష్మణరావుగారి పేరుతో ప్రచురితమైంది. ఆనాటి రాజకీయ పరిస్థితుల కారణంగా హరి సర్వోత్తమరావు గారి పేరు ఉండడం మంచిది కాదని భావించి ఆయన పేరును ప్రచురించలేదు. 'లక్ష్మణరావు గారి రచన' అని కాకుండా 'లక్ష్మణరావు గారి సంపాదితం' అని పేర్కొనబడింది.[20]

---

20. "ఢిల్లీ దర్బారు నేను వ్రాసింది. ప్రకటనకు దగ్గరకు వచ్చేటప్పటికి గ్రంథకర్తగా నా పేరు వేయడానికి కొన్ని కష్టాలు అప్పటికి మిత్రులకు తోచినవి. నే వ్రాసిన దానిలో ఏ లోపముంటుందో అని వకీలు రామదాసు చేత పుస్తకమంతా చదివిపించినారు. నా పేరు వేయడం మానివేసి లక్ష్మణరావు గారి సంపాదితమని ప్రకటించినారు...... లక్ష్మణరాయ సంపాదితమంటే లక్ష్మణరావుగారు వ్రాసినారనుకొని పత్రికల వారందరూ గ్రంథాన్ని తెగ శ్లాఘించినారు. అన్నయ్య లక్ష్మణరావు చనిపోయేవరకు ఇది ఆయన మనసులో మెదలుతుండేది. ఇంకకొంత తాను వ్రాసిచేర్చి నా పేరు తన పేరూ రెండూ గ్రంథకర్తల పేళ్ళుగా వేసుకొందామని పాపమాయన ఎన్ని పర్యాయములో హెచ్చరించినాడు. కాని తుదివరకు అది సాగిందికాదు... విజ్ఞాన చంద్రిక ప్రకటనలు తరువాతి కాలమున వేసేటప్పుడు గ్రంథకర్త క్రింద అందులో నా పేరు వేయించి అతడు కొంత మనశ్శాంతి పొందినట్లు గోచరిస్తుంది."
—హరిసర్వోత్తమరావు. 'తెలుగు తల్లి' - లక్ష్మణరాయ వర్ధంతి సంచిక. పేజి. 10.

ఎడ్వర్డు చక్రవర్తి తరువాత అతని కుమారుడు జార్జి, 'ఐదవ జార్జి' చక్రవర్తి పేరుతో ఇంగ్లాండు సింహాసనాన్ని అధిష్ఠించాడు. బ్రిటిషు ఆధిపత్యంలోని రాజ్యాలలో కూడా చక్రవర్తి పట్టాభిషేక మహోత్సవం జరిపించడం ఆనవాయితీ. 1911 డిసెంబర్ 12 వ తేదీన ఢిల్లీ దర్బారులో ఆయన పట్టాభిషేకం జరిగింది. ఈ పట్టాభిషేక మహోత్సవంలో బ్రిటిషు చక్రవర్తి మాట్లాడుతూ, భారతీయులను విద్యావంతులుగా తీర్చిదిద్దవలసిన అవసరాన్ని నొక్కి చెప్పినాడు. దీనికొరకు 50 లక్షల రూపాయలను కేటాయిస్తున్నట్టు ప్రకటించాడు. బ్రిటిషు పాలకుల్లో వచ్చిన ఈ మార్పు పట్ల దేశవ్యాప్తంగా విద్యాధికుల్లో హర్షామోదాలు వ్యక్తమయ్యాయి. ప్రజలు విద్యావంతులైతేనే దేశానికి విముక్తి లభిస్తుందన్న నమ్మకంతో కాయశక్తులా అందుకు కృషిచేస్తున్న సంస్థ కనుక విజ్ఞాన చంద్రిక కూడా ఈ ప్రకటనపట్ల సంతోషాన్ని వ్యక్తం చేసింది. ఈ సందర్భంలోనే 'ఢిల్లీ దర్బారు' పేరుతో ఢిల్లీ చరిత్రను వివరించే గ్రంథాన్ని విజ్ఞాన చంద్రిక ప్రకటించింది.

ఈ గ్రంథానికి వ్రాసిన ఆంగ్ల పీఠికలో దీని సంపాదకులైన లక్ష్మణ రావు గారు ఈ విధంగా పేర్కొన్నారు:

"His majesty has by one of his boons indicated without doubt that the immediate work before us is the education of the people of our mother-land. And it is but right that those who have been engaged in that department of work, be they among the rulers or the ruled, should treat the 12th of December last as a landmark in the history of Indian education. As a token of the humble appreciation of the events that happened on that historic day in that historic city of Delhi, we feel happy in presenting this book to the public."

ఐదవ జార్జి చక్రవర్తి ఇంగ్లాండులో పట్టాభిషిక్తుడగుటకు దారితీసిన పరిస్థితులు, అతని జీవిత చరిత్ర, ఢిల్లీ దర్బారులో ఆయనకు జరిగిన పట్టాభిషేక మహోత్సవం, ఢిల్లీ పూర్వచరిత్ర, హైదరాబాదు, బరోడా, మైసూరు మొదలైన బ్రిటిషు సామంత సంస్థానాల చరిత్ర దీనిలో వర్ణింపబడ్డాయి.

విజ్ఞాన చంద్రిక వంటి అభ్యుదయ సంస్థ బ్రిటిషు చక్రవర్తి చేసిన ప్రకటనను ప్రశంసిస్తూ, ఆ సందర్భంగా ప్రత్యేక గ్రంథాన్ని ప్రచురించడం లోని ఔచిత్యాన్ని కొందరు ప్రశ్నించవచ్చు.

ఐదవ జార్జి ఢిల్లీ దర్బారులో ఇచ్చిన ఉపన్యాసం బ్రిటిషు పాలకుల వైఖరిలో మార్పును తెలియజేస్తుంది. భారతదేశంలో విద్యావ్యాప్తికి శ్రద్ధ తీసుకొంటారన్న శుభవార్త విజ్ఞాన చంద్రికను ఉత్సాహపరచింది.

1912 నుండి బ్రిటిషు పాలకులు మన దేశంలో విద్యా సౌకర్యాలను కల్పించారు. వారు పాశ్చాత్య విద్యను ప్రోత్సహించినప్పటికీ, అది మన దేశీయులకు మేలే చేసింది. ప్రజలలో విద్యావ్యాప్తి జరిగి, వారు తమ స్వదేశంపట్ల అభిమానం పెంచుకోవడానికి అవకాశ మేర్పడింది.

ఢిల్లీ దర్బారులో పట్టాభిషేక మహోత్సవం జరిగిన తరువాత ఒక నెల రోజులకు విజ్ఞాన చంద్రిక ఈ గ్రంథాన్ని ప్రకటించింది దీనిలో మొత్తం ఎనిమిది ప్రకరణాలున్నాయి. వీనిలో రెండు ప్రకరణాలు మాత్రమే బ్రిటిషు చక్రవర్తి వృత్తాంతాన్ని తెలుపుతున్నాయి తక్కిన ఆరు ప్రకరణాలలో మన దేశ చరిత్ర వివరించబడింది ఈ భాగాలలో బ్రిటిషువారి ప్రశంస మచ్చుకు కూడా లేదు.

ఇటువంటి గ్రంథాన్ని ప్రచురించినట్టయితే నాటి బ్రిటిషు పాలకుల దృష్టి తమ కార్యకలాపాల మీద ప్రసరించకుండా ఉంటుందని, తద్వారా జాతిని ప్రబోధించే తమ గ్రంథాల ప్రచురణ నిరాటంకంగా కొనసాగుతుందని విజ్ఞాన చంద్రిక నిర్వాహకులు భావించి ఉండవచ్చు.

ఒకవేళ విజ్ఞాన చంద్రిక నిర్వాహకులకు బ్రిటిషువారి మన్నలను పొందాలన్న ఆకాంక్షఉంటే వారు ఈ గ్రంథంలో పూర్తిగా బ్రిటిషు చక్రవర్తి ఘనతను మాత్రమే వర్ణించేవారు మన ప్రాచీన ఔన్నత్యాన్ని చెప్తూ సముద్రంలో నీటి బొట్టులా బ్రిటిషు చక్రవర్తి వృత్తాంతాన్ని ప్రచురించేవారుకాదు.

లక్ష్మణరావుగారు కార్యసాధకులు. తాను చేపట్టిన పనికి అంతరాయం కలుగకూడదని ఆయన భావన. పైకి పాలకుల సంతృప్తి కొరకు వెలువడిన గ్రంథంగా కనిపించినా, దీనివెనుక బలమైన శత్రువును తెలివితో ఎదుర్కోవాలన్న సిద్ధాంతం దాగి ఉంది.

## వైజ్ఞానిక గ్రంథాలు :

ఒక దేశ ప్రజలు తమ దేశ చరిత్రను తెలుసుకోవడం ఎంత ముఖ్యమో విజ్ఞాన శాస్త్రంతో సంబంధాన్ని కలిగిఉండడం అంతకంటే ముఖ్యం. దేశ చరిత్ర ఆ దేశ ప్రజల సంస్కృతీ నాగరికతలను పరిరక్షించుకోవడానికి తోడ్పడితే విజ్ఞాన శాస్త్రం ప్రజా జీవనాన్ని తీర్చిదిద్దడానికి ఉపయోగపడుతుంది.

వైజ్ఞానిక రంగంలో పాశ్చాత్యులు ఎంతో ప్రగతిని సాధించారు. వారి పరిశోధనల మూలంగా ప్రపంచ వ్యాప్తంగా ప్రజా జీవనంలో ఊహించని పరిణామాలు ఉత్పన్నమయ్యాయి

వైజ్ఞానిక విషయాలలో కూడా మనం పాశ్చాత్యులపై ఆధారపడవలసి వచ్చింది. ఆరోజుల్లో విద్యా విషయికంగా మనం వెనుకబడి ఉండడమే దీనికి కారణం. మన వారికి ఆంగ్లభాషతో పరిచయం కలిగిన తరువాత అనేక శాస్త్రీయ గ్రంథాలు చదివే అవకాశం కలిగింది. అయితే ఈ అవకాశం కేవలం ఆంగ్ల భాష నేర్చుకొన్నవారికి మాత్రమే పరిమితమైంది. ఆంగ్లభాషలోని అసంఖ్యాక శాస్త్రీయ గ్రంథాలు మనవారిని ఆకర్షించాయి. ఆంగ్లభాష పట్ల వెర్రివ్యామోహం కలుగడానికి ఇదికూడా ఒక కారణం. దేశీయ భాషలలో శాస్త్రగ్రంథాలు లేక

పోవడం వల్ల ప్రజలు ఆంగ్లభాషను తప్పనిసరిగా నేర్చుకోవలసిన పరిస్థితి ఏర్పడింది దేశ భాషలు వెనుకబడి ఆంగ్ల భాష అధ్యయనానికి ప్రోత్సాహం లభించింది.

ఈ పరిస్థితి ఒక్క మన మన భారతదేశంలోనే కాదు- ఆరోజులలో విశ్వవ్యాప్తంగా ఇదే పరిస్థితి నెలకొని ఉంది. ఆంగ్లేయులు ప్రపంచ మానవాళిపై అన్ని విధాల తమ ప్రభావాన్ని ప్రసరింప జేశారు. ఆంగ్లభాష విశ్వవ్యాప్తమై వివిధ దేశాలలోని వైజ్ఞానిక విషయాలను తనలో జీర్ణించుకొన్నది. ఆ భాషలో వైజ్ఞానిక గ్రంథాలు అసంఖ్యాకంగా వెలువడి, ఆ భాషను సుసంపన్నం చేశాయి. ఆగ్లం భాష విశ్వవ్యాప్తమైనందువల్ల, ప్రపంచ ప్రజల మధ్య 'భావ వినిమయం' సాధ్యమైందని చెప్పవచ్చు ఆంగ్లభాష కారణంగా ప్రాంతీయ భాషల పట్ల అభిమానం సన్నగిల్లింది.

తెలుగు దేశానికి చెందిన ఆంగ్లభాషా పండితులు కొందరు, ఆ భాషలోని వైజ్ఞానిక గ్రంథాలను తెలుగు భాషలోనికి అనువదించి తెలుగు భాషా వికాసానికి, తోడ్పడ్డారు.

మద్రాసులో దేశభాషా గ్రంథకరణ సభ (Madras Vernacular School Book Society) ఏర్పడిన తరువాత తెలుగు భాషలో విజ్ఞానశాస్త్ర గ్రంథాల ప్రచురణ ప్రారంభమైంది. విద్యార్థులకు విజ్ఞాన శాస్త్రాన్ని బోధించాలన్న ధ్యేయంతో ఈ సభ ఈ గ్రంథాలను ప్రచురించింది. ఇవి పాఠ్యగ్రంథాలు కాబట్టి, విషయ వివరణ జోలికిపోలేదు ప్రామాణికంగా నిలిచే, వివరణాత్మకమైన విజ్ఞాన శాస్త్ర గ్రంథాలను ఈ సభవారు ప్రచురించలేదు.

వీరేశలింగం పంతులుగారు శరీర శాస్త్రం (1889), జంతు స్వభావ శాస్త్రం (1896). దేహారోగ్య ధర్మబోధిని (1889) వంటి వైజ్ఞానిక గ్రంథాలు రచించారు. పంతులుగారు వివిధ సాహితీ ప్రక్రియలను రచించాలన్న తలంపుతో వీటిని వ్రాసినారే తప్ప వాటిని ప్రామాణికంగా ఉద్యమస్థాయిలో అందించాలని

కాదు. తెలుగులో మొట్టమొదట ప్రామాణికమైన శాస్త్ర గ్రంథాలను ఉద్యమ స్థాయిలో వెలువరించిన ఘనత విజ్ఞాన చంద్రికకు దక్కుతుంది.

''సర్వ జనులకు జ్ఞానాభివృద్ధి కలుగవలెనన్నచో వారి వారి దేశభాషల మూలముననే కలుగవలెను. ప్రస్తుతము వారు శాస్త్రములన్నియు ఇంగ్లీషుతో చదువుకొనుచున్నందువలన నెక్కుడు కాలము, పరిశ్రమయు, నెక్కుడు ధనమును వ్యయమగుచున్నది.''

విజ్ఞాన చంద్రికను స్థాపించే సందర్భంలో దాని నిర్వాహకులు వెలిబుచ్చిన అభిప్రాయం ఇది.

మాతృభాషలో తగినన్ని శాస్త్రీయ గ్రంధాలు ఉన్నప్పుడే ఎక్కువమంది ప్రజలు విజ్ఞానవంతులు కాగలుగుతారు. ఈ ఉద్దేశంతో విజ్ఞాన చంద్రిక విజ్ఞాన శాస్త్ర గ్రంథాలను ప్రచురించింది. ఒకప్రక్క మాతృభాషలో విద్యాభ్యాసం చేస్తూనే, ఆంగ్లభాషను ద్వితీయ భాషగా తీసుకొని, ఆ భాష నేర్చుకోవాలని విజ్ఞాన చంద్రిక అభిప్రాయ పడింది.[21]

కేవలం మాతృభాషలోనే విద్యాభ్యాసం చేసినట్టయితే విజ్ఞానం పరిమితమైపోయే ప్రమాదం ఉంది. ఆంగ్ల భాషను కూడా అభ్యసించి, దాన్ని అనుసంధాన భాషగా ఉపయోగించుకోవాలని దీని భావం.

అనుభవజ్ఞులైనవారితో విజ్ఞానశాస్త్ర గ్రంథాలను వ్రాయించి, విజ్ఞాన చంద్రిక ప్రచురించింది. విజ్ఞాన శాస్త్రంలో పరీక్షలను నిర్వహించి ఇది తన విశిష్టమైన సేవాభావాన్ని చాటుకొన్నది.

విజ్ఞాన చంద్రిక ప్రచురించిన తొలి విజ్ఞాన శాస్త్ర గ్రంథం ఆచంట లక్ష్మీపతిగారు వ్రాసిన ''జీవశాస్త్రం'' ఇది ఆంగ్లభాషలోని గ్రంథానికి

---

21. 'అబ్రహామ్ లింకన్ జీవిత చరిత్ర'- పీఠిక (విజ్ఞాన చంద్రిక ప్రచురణ).

అనువాదం. దీనితరువాత 1923 వరకు 13 విజ్ఞాన శాస్త్ర గ్రంథాలను విజ్ఞాన చంద్రిక ప్రచురించింది 1923 తరువాత విజ్ఞాన చంద్రిక విజ్ఞాన శాస్త్ర గ్రంథాలను ప్రచురించలేదు.

మంత్రిప్రగడ శ్రీనివాసరావు రచించిన పదార్థ విజ్ఞాన శాస్త్రం, వేమూరి విశ్వనాథ శర్మ రచించిన 'రసాయన శాస్త్రం' ఆంగ్లంలోని అనేక గ్రంథాలను పరిశీలించి వ్రాసిన ఉత్తమ గ్రంథాలు. తక్కిన విజ్ఞాన శాస్త్ర గ్రంథాలలో జంతుశాస్త్రం (Zoology), వృక్షశాస్త్రం (Botany), శారీరక శాస్త్రం, భౌతిక శాస్త్రం మొదలైనవి ఉన్నాయి.

తెలుగులో విజ్ఞాన శాస్త్ర గ్రంథాల రచనకు విజ్ఞాన చంద్రికే మార్గదర్శక మైంది. ఆ రోజుల్లో విద్యాభ్యాసం చేస్తున్న వారికి విజ్ఞాన చంద్రిక ప్రచురించిన గ్రంథాలు ఎంతగానో తోడ్పడ్డాయి.

విజ్ఞాన చంద్రిక ప్రచురించిన కలరా, చలిజ్వరం - ఈ రెండు గ్రంథాలకు ఒక ప్రత్యేకత ఉంది. ఇవి తక్కిన శాస్త్ర గ్రంథాల కంటె భిన్నమైనవి. ఇవి వైద్య శాస్త్ర గ్రంథాలు. 'కలరా' నూరు పేజీల గ్రంథం. 1910 లో ప్రచురించబడింది. కలరా వ్యాధి లక్షణాలు, చికిత్సా విధానం దీనిలో చక్కగా వివరించబడ్డాయి. పాశ్చాత్య చికిత్సా విధానం, ఆయుర్వేద చికిత్సా విధానం-ఈ రెండింటిని సమన్వయం చేసి ఇది రచించబడింది. ఈ రెండు గ్రంథాలను ఆచంట లక్ష్మీపతిగారు వ్రాశారు ఆయన వీటిని వ్రాయడానికి కొన్ని కారణాలున్నాయి.

ఆ రోజుల్లో 'కలరా' వ్యాధిని నయం చేయడం సాధ్యపడేదికాదు. చదువు సంధ్యలులేని పల్లెటూరి ప్రజలు పారిశుధ్యం ప్రాధాన్యత తెలియక తరచుగా ఈ వ్యాధికి గురి అవుతుండేవారు. మందులపై కాకుండా మంత్ర తంత్రాలపై ఆనాడు గుడ్డినమ్మకం ఉండేది. ఈ పరిస్థితులలో కొందరు మిత్రుల అభ్యర్థనపై లక్ష్మీపతిగారు ఈ గ్రంథాన్ని వ్రాయవలసి వచ్చింది. వైద్య సమపాయాల్లు

అందుబాటులో లేని మారుమూల గ్రామాలలో ఆయన రచించిన ఈ చిన్న గ్రంథం ఆ రోజులలో ఎంతగానో ఉపయోగపడింది.[22]

ఆ రోజుల్లో ప్రజలకు బాగా ఉపకరించిన మరో వైద్యగ్రంథం 'చలిజ్వరం.' దీనిలో నూటపదహారు పేజీలున్నాయి.

ఇప్పుడు మలేరియాగా పిలువబడుతున్న ఈ చలిజ్వరం ఆ రోజుల్లో-ప్రమాదకరమైన వ్యాధిగా పరిగణింపబడుతుండేది. దీన్ని నయం చేయడానికి సరియైన చికిత్సావిధానం ఆనాడు ఉండేదికాదు. ఆచంట లక్ష్మీపతిగారు ఈ గ్రంథాన్ని రచించి, ఆ లోటును భర్తీచేశారు. ఆయుర్వేద, అలోపతి వైద్య విధానాలను పరిశీలించి, చలిజ్వరానికి చికిత్సచేసే పద్ధతిని ఆయన దీనిలో వివరించారు. చలిజ్వరం రావడానికి కారణాలు, అది రాకుండా తీసుకోవలసిన జాగ్రత్తలు, దాన్ని నయం చేయడానికి అనుసరించవలసిన చికిత్సావిధానం చాలా చక్కగా గ్రామాల్లోని సామాన్యులకు సైతం బోధపడే రీతిలో పొందు పరచబడ్డాయి.

## ఆర్థిక శాస్త్రం:

తెలుగులో మొట్టమొదటి ఆర్థిక శాస్త్రం విజ్ఞానచంద్రిక ప్రచురించిందే. కట్టమంచి రామలింగారెడ్డిగారు దీన్ని రచించారు. 1913 లో ఈ గ్రంథం వెలువడే నాటికి తెలుగులో ఆర్థిక శాస్త్రాలు లేవు.

ఇది రెండు సంపుటాల గ్రంథం. దీనికి లక్ష్మణరావుగారు సుదీర్ఘమైన ఉపోద్ఘాతం వ్రాశారు. దీనిలో ఆయన ఒక దేశంలోని జీవన సరళికి, వృత్తులకు, ఆర్థిక వ్యవస్థకు ఆర్థిక శాస్త్రంతోగల సంబంధాన్ని వివరించారు.

---

22. ఈ గ్రంథం ఎంత ప్రాచుర్యాన్ని పొందిందో, ఎంతగా ఉపయోగపడిందో ఆచంట లక్ష్మీపతిగారు తమ స్వీయచరిత్రలో వ్రాసుకొన్నారు.
''ఆ రోజులలో గ్రామాలలో 'కలరా' వచ్చినది అని తమాషాగా చెప్పుకునే వారు. కలరా అంటే, కలరా వ్యాధి కాదు. నేను వ్రాసిన 'కలరా' అను గ్రంథం''- స్వీయచరిత్ర, ఆచంట లక్ష్మీపతి. పేజి. 140

ఆర్థిక శాస్త్రాధ్యయనం మన అభ్యున్నతికి కావలసిన శాస్త్రీయ దృక్పథాన్ని అలవరుస్తుంది. విజ్ఞాన సంపత్తికి తక్కిన గ్రంథాలవలె ఆర్థిక శాస్త్రం కూడా అవసరమే.

''ఈ శాస్త్రమంతయు హిందూ దేశమునకుం జేరిన విషయములతో నెక్కువ సంబంధము కలిగియున్నది. ప్రకృతము మన విద్యాశాలలలో వాడబడు నర్థశాస్త్ర పుస్తకము లనేకములు విదేశ వర్తమానములనే సూచించునవిగా నుండబట్టి మన వారికి ఐరోపా, అమెరికా మొదలగు దేశములంగూర్చి తెలిసి నంత తమ దేశముంగూర్చి తెలియకుండుట యెంతయు జింతనీయము.'' ఈ గ్రంథానికి వ్రాసిన తొలిపలుకులో రామలింగారెడ్డిగారు వెలిబుచ్చిన అభిప్రాయం ఇది.

మన దేశ పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని తెలుగులో వ్రాయబడిన మొట్టమొదటి ఆర్థిక శాస్త్రంగా దీన్ని పరిగణించవచ్చును. దీనిలో భాష క్లిష్టంగా ఉంది. శాస్త్రీయ గ్రంథాలలో క్లిష్టమైన భాషను వాడినట్టయితే చదవాలనే అభిలాష సన్నగిల్లుతుంది. భాష విషయంలో తక్కిన శాస్త్రీయ గ్రంథాలకు దీనికి చాలా తేడా కనిపిస్తుంది.

విజ్ఞాన చంద్రిక 'భారతదేశము-ఆర్థిక చరిత్ర' అనే మరో అర్థశాస్త్ర గ్రంథాన్ని ప్రకటించింది దీన్ని ఆత్మకూరి గోవిందాచారి వ్రాశారు.

విజ్ఞాన చంద్రిక ప్రచురించిన మరో ఉత్తమ గ్రంథం 'మహాపురుషుల జీవితాలు.' ప్రపంచంలో వివిధ రంగాలలో సుప్రసిద్ధులైన మహాపురుషుల జీవితాలను గ్రంథాల రూపంలో వెలువరించాలని విజ్ఞాన చంద్రిక సంకల్పించింది. అయితే ఈ విభాగం క్రింద ఈ ఒక్క గ్రంథం మాత్రమే వెలువడింది. పసుమర్తి శ్రీనివాసరావుగారు వ్రాసిన ఈ గ్రంథం 1913 లో ప్రకటించబడింది.

"ఆంధ్ర భాషయందు పాశ్చాత్య మహాపురుష జీవిత చరిత్రములు లోపంబులు తల్లోప పూరితార్థంబీ మదీయ ప్రథమోద్యమంబు. ఈ గ్రంథము

స్వకల్పన శక్తి శూన్యంబు సరసవచన పరిహితంబు."[23] ఈ గ్రంథంలో మహా పురుషుల జీవితాలను యథార్థంగా చిత్రించడం జరిగిందని, కల్పనకు తావు లేదని రచయిత అభిప్రాయం. ఈ గ్రంథంలో మొదటిభాగంలో వివిధ రంగాలలో సుప్రసిద్ధులైన ఇరవై ముగ్గురు మహాపురుషుల జీవితాలను గురించి క్లుప్తంగా వివరించబడింది రెండవ భాగంలో బెంజమిన్ ఫ్రాంక్లిన్ జీవితచరిత్ర విపులంగా వ్రాయబడింది.

విజ్ఞాన చంద్రిక తెలుగు సాహిత్యానికి అందించిన మరో ఉత్తమ గ్రంథం వీరేశలింగం పంతులుగారి స్వీయచరిత్ర. పంతులుగారి స్వీయచరిత్రను విజ్ఞాన చంద్రిక మొట్టమొదటిసారి గ్రంథరూపంలో ప్రకటించింది. అంతకుముందు 'వివేకవర్థిని' పత్రికలో ఇది ప్రచురితమైంది. ఇది తెలుగు సాహిత్యంలో వెలసిన మొదటి స్వీయచరిత్ర. దీన్ని రెండు సంపుటాలుగా విజ్ఞాన చంద్రిక ప్రచురించింది. లక్ష్మణరావుగారి ప్రోద్బలంతో తాము స్వీయచరిత్రను పూర్తిచేయగలిగినట్లు పంతులుగారు దీని ముందుమాటలో వ్రాశారు.

ఇంతవరకు పేర్కొన్న గ్రంథాలే కాకుండా విజ్ఞాన చంద్రిక ప్రధాన గ్రంథాలకు అనుబంధంగా కొన్ని చిన్న చిన్న గ్రంథాలనూ ప్రచురించింది.

ఆదిరాజు వీరభద్రరావుగారి 'రావిచెట్టు రంగారావు జీవితము'; అయ్యదేవర కాళేశ్వరరావుగారి 'చైనా యువజనోద్యమము'; వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వర ప్రసాదుగారి 'భారతదేశపు రైళ్ళు'; దిగవల్లి వెంకట శివరావుగారి 'ఆంగ్ల రాజ్యాంగము', 'భారతదేశ స్థితిగతులు', 'రాష్ట్రీయ స్వపరిపాలనము' మొదలైనవి ఈ అనుబంధ గ్రంథాలు.

## భాషోద్యమాలు-విజ్ఞాన చంద్రిక :

గ్రాంథిక భాషకు, వ్యవహారిక భాషకు మధ్యస్థమైన పద్ధతి విజ్ఞాన చంద్రిక గ్రంథాలలో కనిపిస్తుంది.

23. 'మహాపురుషుల జీవితములు' - పీఠిక - పసుమర్తి శ్రీనివాసరావు. (విజ్ఞాన చంద్రిక ప్రచురణ).

తరతరాలనుండి ప్రామాణిక భాషగా పరిగణింపబడుతూ పండితులకు మాత్రమే పరిమితమైన తెలుగు రచనా ధోరణిని వీరేశలింగం పంతులుగారు కొంతవరకు మార్చివేశారు. సంప్రదాయం పేరుతో నీరాజనాలందుకొంటున్న గ్రాంథిక వ్యవస్థ పంతులుగారి లేఖిని ధాటికి బీటలువారింది. ఆ తరువాత గిడుగు రామ్మూర్తి పంతులుగారి భేరీ మ్రోతలకు కూలిపోయి, ఆయన ప్రయత్నంతోనే వ్యావహారిక భాషా సౌధం వెలసింది. సాహిత్యం అందరి సొత్తు అనే భావం, వ్యవహారిక భాషవల్లే సాహిత్యం సుసంపన్నమవుతుందనే వాస్తవం ఈ మార్పుకు దోహదం చేశాయి.

మనం ఈనాడు ప్రామాణిక భాషగా పరిగణిస్తున్న శిష్టవ్యవహారికం గుర్తింపు పొందడానికి రెండు ఉద్యమాలు అవసరమయ్యాయి. మొదటి దాన్ని వీరేశలింగం పంతులుగారు ప్రారంభించారు. భాషా ఉద్యమం పేరుతో పంతులుగారు దీన్ని ప్రారంభించలేదు గ్రాంథికతను ఛేదించి సామాన్య ప్రజలు అర్థం చేసుకొనే రీతిలో గ్రంథరచనను చేపట్టడం ద్వారా దీనికి అంకురార్పణ చేశారు. కాబట్టి వ్యవహారిక భాషా ఉద్యమంలో దీన్ని మొదటి ఘట్టంగా పేర్కొనవచ్చు.

ఇక రెండవ ఉద్యమం గిడుగు రామ్మూర్తి పంతులుగారి హయాము లోనిది. భాషా ఉద్యమం పేరుతో భాషాప్రపంచంలో రామ్మూర్తి పంతులుగారు విప్లవం లేవదీశారు. ఈ విప్లవం ఫలితంగా వ్యావహారిక భాషకు గౌరవప్రపత్తులు సిద్ధించాయి.

విజ్ఞాన చంద్రిక వీరేశలింగం పంతులుగారిని ఆదర్శంగా స్వీకరించింది. పంతులుగారివలె సమాజ శ్రేయస్సుకు అంకితమై, భాషా విషయంలో కూడా ఆయన మార్గాన్నే అనుసరించి గ్రంథాలను వెలువరించింది.

"వీరేశలింగం పంతులుగారి, చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి, లక్ష్మణ రావుగారి తెలుగు శైలియే మాకు ఆదర్శనంతమైనది. ఎవరైనను దానికంటె కొంచెము భేదముగా వ్రాసినను మాకు అభ్యంతరము లేదు గ్రామ్యమను పేర

ప్రజల కర్థము కాకుండ వ్రాయుట మాత్రము మేము ఒప్పుకొనము. పూర్తి గ్రాంథికమే కావలయునని మాకు పట్టుదల లేదు. తెలుగు ప్రజలకు హృద్యముగా నుండునట్లు వ్రాయుటయే మాకు కావలసినది." అని కాశీశ్వరరావుగారు భాషా విషయంలో విజ్ఞాన చంద్రిక అనుసరించిన మార్గాన్ని వెల్లడించారు.[24]

ప్రజలకు అర్థంకాని 'గ్రామ్యం' అక్కరలేదన్నారు గాని ప్రజల భాషను కాదనలేదు. భాష ప్రజలకు సులభంగా అర్థంకావాలి అది హృద్యంగా ఉండాలి. ఇది విజ్ఞాన చంద్రిక అభిప్రాయం. సంప్రదాయంగా వస్తున్న గ్రాంథిక భాషను కాదని ప్రజలకు అర్థమయ్యే రీతిలో గ్రంథాలు వెలువరించాలని ఆలోచించడం లోనే అభ్యుదయ దృక్పథం ఉంది. విజ్ఞాన చంద్రిక ప్రచురించిన దేశచరిత్రలు, వైజ్ఞానిక గ్రంథాలు సులభంగా అర్థమయ్యే రీతిలో రచించబడ్డాయి. కొన్ని గ్రంథాలు ఈనాటి శిష్టవ్యవహారికానికి అతి సన్నిహితంగా ఉన్నాయి. కాశీశర్వ రావుగారి గ్రంథాలు, ఆచంట లక్ష్మీపతిగారి గ్రంథాలు, లక్ష్మణరావుగారి చారిత్రక గ్రంథాలు ఇందుకు దృష్టాంతాలు. లక్ష్మణరావుగారు అర్థిక శాస్త్రానికి వ్రాసిన సుదీర్ఘమైన ఉపోద్ఘాతంలో గ్రాంథిక దోరణి కనిపిస్తుంది ఈ గ్రంథంలో కట్టమంచి రామలింగారెడ్డిగారి రచన కూడా అట్లాగే ఉంది. అబ్రహామ్ లింకన్ జీవిత చరిత్రలో ప్రచురించిన సంయుక్త ప్రకటనను లక్ష్మణరావుగారే రూపొం దించారు దీనిలో గ్రాంథిక భాష కనిపించదు.

మొత్తంమీద ఒకటి రెండు గ్రంథాలు తప్ప విజ్ఞాన చంద్రిక ప్రచురించిన గ్రంథాలన్నీ గ్రాంథిక భాషతో విభేదించినట్టివే భాషలో అభ్యుదయ దృక్పథం కనిపిస్తుంది కాబట్టే, విజ్ఞాన చంద్రిక ప్రచురించిన గ్రంథాలు విశేషప్రాచుర్యం పొంది, ఆంధ్రదేశం నలుమూలలకు వెళ్ళగలిగాయి.

ఎవరు ఎటువంటి అభ్యంతరం చెప్పినా, విజ్ఞాన చంద్రిక అనుసరించిన భాషా విధానం ఆనాటి పరిస్థితులలో అభ్యుదయమే భాషా ఉద్యమంలో విజ్ఞాన చంద్రిక వీరేశలింగం పంతులుగారి తరానికి చెందినది.

---

24. 'నా జీవితము-నవ్యాంధ్రము' అయ్యదేవర కాళేశ్వరరావు. పేజి 140.

## ప్రచార సరళి :

ఒక వస్తువు విశేషంగా ప్రాచుర్యం పొందాలంటే 'ప్రచారం' అవసరం. పత్రికలు, సినిమాలు, రేడియోవంటి ప్రచారసాధనాలు విస్తృతంగా ఉన్న ఈ రోజుల్లో ఇవి సులభమైనది. అయితే ఈ శతాబ్దపు తొలిరోజుల్లో వీటి ఉనికి తక్కువ. ఆనాడు తెలుగుదేశంలో సినిమాలు కాని, రేడియో కాని లేవు. పత్రికలు ఉన్నప్పటికి అవి దినపత్రికలు కాదు. వారపత్రికలో, మాసపత్రికలో, త్రైమాసిక పత్రికలో ఉండేవి. వాటి పరిధి కూడా విస్తృతం కాదు.

ఇటువంటి పరిస్థితుల్లో విజ్ఞాన చంద్రిక తమ గ్రంథాలు ప్రాచుర్యం పొందడానికి కొత్త పద్ధతిని అనుసరించింది. ప్రతి గ్రంథం చివర ఐదారు పేజీలలో తాము ప్రచురించిన గ్రంథాలకు ముందు ప్రచురించబోయే గ్రంథాలకు సంబంధించిన సమాచారాన్ని ప్రకటించేది. దాదాపు 1200 మంది శాశ్వత చందాదారులతో నడచిన సంస్థ కనుక ఈ ప్రకటనల మూలంగా విజ్ఞాన చంద్రిక గ్రంథాలకు విశేషమైన ప్రచారం లభిస్తుండేది.

అన్ని విధాల ఎంతో అభివృద్ధిని సాధించిన ఈరోజుల్లో ఇటువంటి ప్రచారం కొత్తగాను, వింతగాను అనిపించదు. కాని అప్పుడప్పుడే చైతన్య భాను రేఖలు ఉదయిస్తున్న ఆ రోజుల్లో ఇది నవీనమైనది. ఈ ప్రచార పద్ధతితో విజ్ఞాన చంద్రిక ఎంతోమంది పాఠకులను సంపాదించుకోగలిగింది. ఇది ప్రచురించిన గ్రంథాలు తెలుగుదేశంలో నలుమూలలకు వెళ్ళి, విద్యావ్యాప్తికి ఎంతగానో దోహదం చేశాయి.

విజ్ఞాన చంద్రిక తమ గ్రంథాలను గురించి ఏ విధంగా ప్రకటించుకునేదో ఈ క్రింది ప్రకటనను బట్టి తెలుసుకోవచ్చు.

''పౌరుషము నందును, పాండిత్యాతిశయము నందును, రాజ్య విస్తారంబు నందును పూర్వపు ఆంధ్రులు హిందూదేశములోని యితర దేశముల వారికి దీసిపోవువారు కారని ఈ గ్రంథము సప్రమాణముగా సిద్ధాంతీకరించుచున్నది. ఇప్పటి యాంధ్రులవలె మన పూర్వపుటాంధ్రులు కూడ కూపమండూకములు అని అను

కొంటిరా? ఆంధ్రులొకప్పుడు మగధ సామ్రాజ్యమును, ఇంకొకప్పుడు మహా రాష్ట్రమును, మరియొకప్పుడు యవద్వీపమును, వేరొకప్పుడు పాండ్య చోళ దేశంబులు జయించిరని మీరు కలనైన నెరుంగుదురా? ఎరుగని యెడల ఈ గ్రంథము జదువుడు.''[25]

ఉత్తేజాన్ని, పుస్తకం చదవాలనే కుతూహలాన్ని కలిగించే శక్తి ఈ ప్రకటనకు ఉంది. ఆంధ్రుల పూర్వ వైభవాన్ని చాటి చెప్పుతూ, ''పూర్వపు ఆంధ్రులు ఇప్పటి ఆంధ్రులవలె కూపమండూకములు అనుకొంటిరా?" అని పేర్కొనడంలో విదేశీపాలనలోనున్న నాటి దేశ ప్రజలకు, ముఖ్యంగా ఆంధ్రులకు కర్తవ్య ప్రబోధం చేయాలన్న తలపు ధ్వనిస్తున్నది.

ఇంతవరకు ఈ అధ్యాయంలో విజ్ఞాన చంద్రిక ఆవిర్భావం మొదలుకొని అది ప్రచురించిన గ్రంథాలను గురించి, తెలుగు సాహిత్యంలో వాటి విలువలను గురించి సవివరంగా పేర్కొనడం జరిగింది. ఈ సిద్ధాంత వ్యాసంలో విజ్ఞాన చంద్రికను గురించి ఇంత విపులంగా వ్రాయడం ఎందుకని సందేహం రావచ్చు. ఇక్కడ ఒకటి గమనించాలి. విజ్ఞాన చంద్రికకు బీజం వేసింది లక్ష్మణరావుగారు. అది పెద్దదయి శాఖోపశాఖలుగా విస్తరిల్లింది. 1923 వరకు లక్ష్మణరావుగారు దీన్ని నడిపించారు. తక్కిన మిత్రులందరూ ఈ మహా ప్రయత్నంలో ఆయనకు అండగా నిలిచారు. 1923 తరువాత ఆయన ప్రభావంతో ఆయన మిత్రులు దీన్ని నడిపించారు. కాబట్టి విజ్ఞాన చంద్రికతో లక్ష్మణరావుగారి అనుబంధం విడదీయ రానిది. ఒకవిధంగా చెప్పాలంటే లక్ష్మణరావుగారు లేకుంటే 'విజ్ఞాన చంద్రిక' ఉదయించేది కాదు. భారతదేశంలో స్వాతంత్ర్య సాధనకు ప్రయత్నాలు జరుగు తున్న తరుణంలో తెలుగుదేశంలో విజ్ఞాన చంద్రికను స్థాపించి, జాతీయోద్యమానికి అభిముఖంగా లక్ష్మణరావుగారు దాన్ని నడిపించారు. విజ్ఞాన చంద్రిర ప్రచురించిన గ్రంథాలు తెలుగుదేశంలో విజ్ఞాన రేఖలను వెదజల్లి, తెలుగు ప్రజల వికాసానికి తోడ్పడ్డాయి. మన స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో, తెలుగు సాహిత్య చరిత్రలో విజ్ఞాన చంద్రికకు విశిష్టమైన స్థానం ఉంది.

---

25. హిందూదేశ కథాసంగ్రహం. (నాలుగవ కూర్పునుండి). విజ్ఞాన చంద్రిక ప్రచురణ.

విజ్ఞానం ఎన్నటికీ తరగని ఒక గనివంటిది. అనాగరకమైన ఆదిమ కాలం నాటి మానవునికీ, నాగరకతా సంస్కృతులతో విరాజిల్లుతున్న నేటి ఆధునిక మానవునికి ఎంత తేడా! తరతరాలుగా సాగిన మార్పుల ఫలితమే నేటి ఆధునిక జీవనం. సుఖజీవనం కొరకు మార్గాలను అన్వేషిస్తూ మానవుడు ఎంతో ప్రగతిని సాధించాడు. అయితే ఎంత ప్రగతిని సాధించినా అసంతృప్తి అతన్ని వెన్నాడుతూనే వుంది. కొత్త అనుకున్నది పాతదైపోతుంటే సరికొత్త విజ్ఞానం కొరకు మానవుని మేధ పరుగులు తీస్తున్నది.

విజ్ఞానం అనంతమైనది కనుక మానవుని అన్వేషణ నిరంతరంగా సాగుతూనే వుంటుంది. వైజ్ఞానిక రంగంలో ఎన్నో విజయ పరంపరలను సాధిస్తూ అంతరిక్ష యుగంలోకి అడుగు పెట్టిన మానవుడు మరెన్ని ప్రగతి శిఖరాలను అధిరోహిస్తాడో కాలమే చెప్పాలి.

శాస్త్ర, సాంకేతిక, సాహిత్య రంగాలలో జరిగే వినూత్నమైన మార్పుల 'వినిమయం' ఈనాడు ప్రపంచ వ్యాప్తమై కనబడుతున్నది. ఒక దేశంలో జరిగిన అభివృద్ధిని ఆదర్శంగా తీసుకొని ముందడుగు వేయాలన్న 'స్పర్థ' నేటి ఆధునిక ప్రపంచానికి సర్వసామాన్యమైన లక్షణంగా పరిణమించింది. అయితే ఏ రంగంలోనైనా అభివృద్ధి అనేది ఒకనాటితో సాధించగలిగేది కాదు. అది ఒక క్రమ పరిణామం.

ఈనాడు విభిన్న రంగాలలో కనిపిస్తున్న పురోభివృద్ధి వెనుక తరతరాల కృషి దాగి ఉంది. ఎందరో మేధావులు ఈ ప్రపంచంలో ఉద్భవించి, విశ్వ కళ్యాణానికి తమ మేధాసంపత్తిని అంకితం చేశారు. వారు గ్రంథ రూపంలో భద్రపరచిన జ్ఞాన సంపత్తి భావితరాల వారికి మార్గం చూపెడుతున్నది. వారు అందించిన విజ్ఞాన సంపత్తిని ఊతగా తీసుకొని, సరికొత్త ఆలోచనలతో నేటి ఆధునిక మానవుడు ప్రగతి బాటలను నిర్మించుకొంటున్నాడు.

ప్రతి పౌరుడు విజ్ఞానవంతుడై ఉండాలన్నది ప్రతి దేశానికి, ప్రతి సమాజానికి వర్తించే సర్వ సామాన్యమైన లక్షణం. విజ్ఞానం వ్యక్తి వికాసానికి, తద్వారా సామాజిక వికాసానికి దోహదం చేస్తుంది. విజ్ఞానవంతుడైన పౌరుడు సమాజానికి, దేశానికి ఉపయోగపడగలుగుతాడు. 'చదువు - సంస్కారం' మానవునికి తప్పకుండా ఉండి తీరవలసినవి. ఇక్కడ చదువు అంటే పుస్తకాలను మాత్రమే చదవడం కాదు. విజ్ఞానవంతుడై ఉండాలన్నది దాని భావం. మానవుడు ఆ రకంగా విజ్ఞానవంతుడు కాగలిగినప్పుడే సమాజాభివృద్ధి, దేశప్రగతి సాధ్యమవుతాయి. మానవుణ్ణి విజ్ఞానవంతుడుగా తీర్చిదిద్దడమనేది విశ్వకళ్యాణానికి చేసే ప్రయత్నంలో మొదటి దశగా భావించవచ్చు. విశ్వకళ్యాణం వ్యక్తి విజ్ఞానంతో ముడివడి ఉందన్నమాట. విశ్వకళ్యాణం కొరకు చేపట్టిన ప్రతి పని ఈ సిద్ధాంతంపై ఆధారపడి నడుస్తుంది.

## విజ్ఞాన సర్వస్వం - విజ్ఞాన సర్వస్వ ప్రాధాన్యత :

ప్రజలలో విజ్ఞాన కాంతులను వెదజల్లడానికి ఎందరో మహానుభావులు ఎన్నో రకాలుగా ప్రయత్నాలు చేశారు. సమస్త విజ్ఞానాన్ని గ్రంథరూపంలో అందించాలన్నది అటువంటి ప్రయత్నాలలో ఒకటి. ఈ ప్రయత్నానికి ప్రతిరూపమే 'Encyclopaedia' గ్రంథాలు.

Encyclopaedia పేరుతో విజ్ఞాన సంపుటీకరణం తొట్టతొలుత ఆంగ్ల భాషలో ప్రారంభమైంది.

ఈ Enclyelopaedia అనే పదం గ్రీకు భాషనుండి ఉద్భవించింది. గ్రీకు భాషలో 'Enkyklios' అంటే Circle అనీ, 'paideia' అంటే learning అని అర్థాలున్నాయి. ఈ రెండు పదాలను కలిపినట్టయితే 'Circle of learning' అనే రూపం సిద్ధిస్తుంది. దీన్నిబట్టి మన దేశంలో Enclyopaedia గ్రంథాలకు సమగ్రమైన అర్థం స్ఫురించే విధంగా 'విశ్వకోశ్', 'విజ్ఞాన సర్వస్వం' అనే పేర్లు పెట్టబడ్డాయి.[1]

1. బెంగాలీ విశ్వకోశ్ మొదటి సంపుటంలోనూ, సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశం మొదటి సంపుటంలోను **Encyclopaedia** పదానికి సంబంధించిన చరిత్ర ప్రస్తావించబడింది. ఈ వివరణ వాటి ఆధారంగా రూపొందించబడిందే.

ఇక ఈ Encyclopaedia పద ప్రయోగానికి సంబంధించిన చరిత్రను పరిశీలించినట్లయితే సర్ థామస్ ఇలియట్ 1531 లో ప్రప్రథమంగా దీన్ని ప్రయోగించినట్టు తెలుస్తున్నది. అంతకుముందు దీనికి గ్రంథనామంగా ప్రయోగం లేదు. ఆ తరువాత 1541 లో 'రిన్‌గెల్' (Rin Gell), 1606 లో బెర్గియస్ (Bergius) అనే ఆంగ్ల విద్వాంసులు గ్రంథనామంగా ఈ పదాన్ని ప్రయోగించారు వీరి తరువాత 'అలాలెడ్' వివిధ విజ్ఞాన విషయాలను Encyclopaedia అనే పేరుతో గ్రంథ రూపంగా ప్రకటించి, 17 వ శతాబ్దిలో ఈ పదానికి విశేషమైన ప్రాచుర్యాన్ని, రూఢిని కలిగించాడు. అప్పటి నుండి ఈ పదం 'విజ్ఞాన సర్వస్వం', 'విజ్ఞాన కోశం' అనే అర్థంలో ఆంగ్ల భాషలో చోటుచేసుకొని విశ్వవ్యాప్తంగా ప్రయోగింపబడింది.

అయితే 'అలాలెడ్' ప్రకటించిన Encyclopaedia అకారాది క్రమంలో రూపొందినది కాదు. ఆంగ్లభాషలో అకారాద్యక్షర క్రమంలో 'Encyclopaedia' ను ప్రకటించినవాడు 'జాన్ హారిస్' అనే లండన్ మతాచార్యుడు. 'Encyclopaedia of Arts and Science' అనే పేరుతో 1704 లో జాన్ హారిస్ దీన్ని ప్రకటించాడు. ఆ తరువాత దాని ననుసరించి Encyclopaedia Britanica of Arts and Science ప్రచురించబడింది. 1768 లో దీని మొదటి సంపుటి వెలువడింది. అప్పటి నుండి ప్రపంచంలో ప్రామాణికమైన ఎన్‌సైక్లోపీడియాగా అది పరిగణింపబడుతున్నది.

జర్మన్ భాషలో 1732 లో ఎన్‌సైక్లోపీడియా రచన ప్రారంభమైంది. ఫ్రెంచి ఎన్‌సైక్లోపీడియా మొదటి సంపుటి 1751 లో వెలువడింది. 1780 నాటికి దీని రచన పూర్తయింది. రూసో, వాల్టేరు, డిడిరో మున్నగు మహా తాత్త్వికులు తమ రచనలను అందించి దీని నిర్మాణానికి తోడ్పడ్డారు.

ఆంగ్ల భాషలోని 'Encyclopaedia Britanica' ను ఆదర్శంగా తీసుకొని ప్రపంచంలోని అనేక భాషలలో విజ్ఞాన సర్వస్వాలు రచించబడ్డాయి.

ఈ విధంగా రచించబడినవాటిలో రెండు రకాల విజ్ఞాన సర్వస్వాలు ఉన్నాయి. సమస్త విషయాలను ప్రస్తావించిన విజ్ఞాన సర్వస్వం మొదటి రకానికి చెందితే, ఒకానొక ప్రత్యేక రంగానికి మాత్రమే పరిమితమైన విజ్ఞాన సర్వస్వం రెండో రకానికి చెందినది. వీటినే స్థూలంగా చెప్పాలంటే 'General Encyclopaedias', 'Subject Encyelopaedias' అని పిలువవచ్చును. కేవలం 'Encyelopaedia Britanica' ను అనుసరించి దాని ప్రణాళికను తు.చ తప్పకుండా పాటించినవి 'General Encyclopaedias' గా పరిగణిత మవుతున్నాయి వీటిలో సమస్త విషయాల ప్రస్తావన ఉంటుంది

Encyclopaedia Britanica లో ప్రస్తావించబడిన శాస్త్ర. సాంకేతిక, కళాత్మక రంగాలకు చెందిన సమాచారాన్ని ఇంతా విపులీకరిస్తూ ఆ తరువాత ఆంగ్ల భాషలో విడివిడిగా అనేకమైన విజ్ఞాన సర్వస్వాలు వెలువడ్డాయి. 'The Internatinal Encyclopaedia of Science' ఇందుకు ఒక ఉదాహరణ.

అనేక రంగాలకు సంబంధించిన విషయాలను విపులంగా 'General Encyclopaedia' లో అందించడం సులభతరం కాదు. అంతేకాకుండా, నిరంతరమైన పరిశోధనలవల్ల విజ్ఞానశాస్త్రం పరిధి రోజురోజుకు విస్తరిస్తున్నది. దీనిమూలంగా వివిధ రంగాలకు చెందిన విజ్ఞానాన్ని విడివిడిగా, విపులంగా క్రోడీకరించడం అనివార్యమవుతున్నది.

విజ్ఞాన సర్వస్వాలు ఏ రకానికి చెందినా, ఏ రూపంలో ఉన్నా వాటి పరమార్థం విజ్ఞాన స్వరూపాన్ని సర్వసమగ్రంగా, ప్రామాణికంగా మానవాళికి అందించడమే.

ఈనాడు ప్రపంచంలోని నాగరక భాషలన్నింటిలో విజ్ఞాన సర్వస్వాలు వెలిశాయి. ఆయా భాషలలోని విజ్ఞాన సర్వస్వాలు, ఆ భాషాప్రజల అభిరుచులకు, వారి సాంస్కృతిక, సంప్రదాయాలకు అనుగుణంగా రూపుదిద్దుకొన్నాయి.

విజ్ఞాన సర్వస్వాలు ప్రతి భాషలో ఉండడం అనేది అత్యంతావశ్యకం. వీటివల్ల ఆయా భాషా ప్రజల సాంస్కృతిక, సాహిత్య, వైజ్ఞానిక పురోభివృద్ధిని సర్వసమగ్రంగా తెలుసుకోవడానికి వీలు కలుగుతుంది. ఒక భాషా వికాసాన్ని, ఆ భాషా ప్రజల ఔన్నత్యాన్ని ఆ భాషలోని విజ్ఞాన సర్వస్వం చాటిచెప్పు తుంది. విజ్ఞాన సర్వస్వాన్ని రూపొందించుకొన్న భాష, విజ్ఞానాన్ని ఇనుమడింప జేసే శక్తిని కలిగి ఉంటుంది.

ప్రాంతీయ భాషలలో విజ్ఞాన సర్వస్వాల రచన ఈనాడు విశ్వవ్యాప్తమై కనబడుతున్నది. మన భారతదేశాన్నే ఉదాహరణగా తీసుకొంటే, మన దేశంలో సాహిత్యాన్ని సృష్టించుకొన్న అన్ని భాషల్లో ఇవి సాక్షాత్కరిస్తాయి.

ప్రాంతీయ భాషల్లో విజ్ఞాన సర్వస్వాలు అవతరించడం ఎంత అవసరమో స్వర్గీయ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు వెలిబుచ్చిన ఈ క్రింది అభిప్రాయం తెలుపుతున్నది:

"విశ్వ విజ్ఞాన కోశముల లక్ష్యము నిర్వాహకుల లక్ష్య సంకల్ప సంస్కారముల కనురూపముగ నుండును. ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా యొక్క లక్ష్య మాంగ్ల సంస్కారమును, పాశ్చాత్య సంస్కారమును సమర్థించు టకును, విశదము చేయుటకును వినియోగింపబడిన విధమున ప్రాచ్య సంస్కారమును, హిందూ సంస్కారమును విశదము చేయుటకు వినియోగపడ జాలదు. ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా యందు ప్రాచ్య విజ్ఞానమునకు, హిందూ స్థానమునకు, వైదిక విజ్ఞానమునకును సంబంధించిన విషయములను పరిశీలించి నపుడు తద్విషయ విజ్ఞాన మసమగ్రముగానున్న విధము విశదమగుచున్నది. ఆంధ్రత్వమునకు సంబంధించిన విజ్ఞాన మత్యంతమును అసమగ్రమని విస్పష్ట మగుచున్నది."2

---

2. 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము'-పునర్ముద్రణ. మొదటి సంపుటి పీఠిక చూడండి- year of publication 1932.

ఇక ఈ విజ్ఞాన సర్వస్వాల రచనకు పరిమితి ఏదైనా ఉందా అనే విషయాన్ని ఆలోచించాలి. చీనీ భాషలో విజ్ఞాన సర్వస్వ సంపుటాలు వెయ్యికి పైగా ఉన్నాయి. "Encpclopaedia of Americana" 30 సంపుటాలలో రచించబడింది.

The International Encyclopaedia of Science సంపాదకుడు James R. Newman ఈ విషయాన్నే ప్రస్తావిస్తూ - "The largest of modern Encyclopaedias may run to 50 or 60 Volumes" అని పేర్కొన్నాడు.[3]

విజ్ఞాన సరస్వాలను ఎన్ని సంపుటాలుగా వెలువరించాలన్నది మన చేతులలో పని. చెప్పదలచుకొన్న విషయం పెరుగుతున్నా కొద్దీ సంపుటాల సంఖ్య పెరుగుతూపోతుంది. విజ్ఞాన సర్వస్వాలు నిరంతర నిర్మాణం వంటివి. విజ్ఞాన సర్వస్వ రచన పూర్తయిపోయిన తరువాత అంతటితోటే ఆ పని పూర్తయినట్టు కాదు. కాల ప్రవాహంలో అప్పుడప్పుడూ దానిలో చెప్పబడిన కొన్ని కొన్ని విషయాలను సవరించడమో, విస్తరించడమో జరుగుతూనే ఉంటుంది. ఎప్పుడో ఒక అంశాన్ని గురించి ప్రచురించిన ఒక సంపుటాన్ని మళ్ళీ సవరించి ప్రచురించాలనుకొన్నప్పుడు రెండు సంపుటాలుగా ప్రకటించవలసి రావచ్చు. దీనికి కారణం ముందు చెప్పినట్టు పరిశోధనల కారణంగా అనేక నూతన విషయాలు వెల్లడి కావడమే.

దీన్ని గమనిస్తే విజ్ఞాన సర్వస్వ సంపుటాలు ఎన్ని ఉండాలన్నదానికి పరిమితి, ప్రాధాన్యత లేదనిపిస్తుంది. దీనికంటే విజ్ఞాన సర్వస్వ స పుటాలు ఎంతవరకు ప్రామాణికమైనవి అన్నది ప్రధానం.

ప్రామాణికమైన విజ్ఞానాన్ని అందించడం విజ్ఞాన సర్వస్వ ప్రధాన లక్ష్యం కనుక తదనుగుణంగా దాని రచనాప్రణాళిక రూపుదిద్దుకోవాలి అలాగే

3. 'The International encyclopaedia of Science'- Editor's introduction.

పాఠకునికి ఆసక్తి కలిగించే రీతిలో దీని రచనావిధానం ఉండాలి. ఆకర్షణీయమైన చిత్రాలు, విషయాన్ని చెప్పేతీరు, విషయ ప్రామాణికత్వం ఇవన్నీ ముఖ్యమైనవే.[4]

విజ్ఞాన సర్వస్వం విజ్ఞానశాస్త్రం వంటిది. ఇది వాస్తవికతకు ప్రతిబింబంగా ఉండాలి దీనిలో ప్రస్తావించిన అంశాలు ఎప్పటికప్పుడు ప్రామాణికతకు దీటైనవై నిలవాలి. పరిశోధనల కారణంగా విజ్ఞానం పరిధి విస్తరిస్తున్నది. ఒక్కొక్కప్పుడు ఈ పరిశోధనా ఫలితాలు గతంలో చూపిన అభిప్రాయాలను తలక్రిందులు చేయవచ్చును. కాబట్టి ఆధునిక పరిశోధనా ఫలితాలకు అనుగుణంగా విజ్ఞాన సర్వస్వాలను సరిదిద్దుకోవడం అనివార్యం. మారుతున్న వైజ్ఞానిక విశేషాలను చేర్చుతూ వీటిని ఎప్పటికప్పుడు సవరించినప్పుడే వాటి విలువ పెరుగుతుంది. ఈ సందర్భంలో Encyclopeadia Britanica సంపాదకుడు Warren E. Preece వెలిబుచ్చిన అభిప్రాయం గమనింపదగింది.

"Whether it takes place on a continuous curve or as quantum jumps, the growth of knowledge represents at every newlevel the conquest of old frontiers and the attainment of new ones Indisputably it is a major function of any responsible encyclopaedias to keep its picture of the state of those frontiers up to date."[5]

మార్పులనేవి వైజ్ఞానిక రంగంలోనేకాక సాహిత్య రంగ లో కూడా జరుగుతుంటాయి ఇప్పుడు మనం ఫలానా కావ్యం ఫలానా కవి వ్రాసింది అని

4. "An encyclopaedia, almost like an anthology, is a work of compramise, selection, Preference, and taste." By James R. Newman. Editor- The International Encylopaedia of Science - editor's introduction.

5. 'Encyclopaedia of Britanica' - Volume I. Editor's preface.

చెప్పుకుంటున్నాం. కొంతకాలానికి చారిత్రకమైన ఆధారాలు బయల్పడి, అది మరొక కవి వ్రాసిందిగా తేటతెల్లం కావచ్చు అప్పుడు మన సాహిత్య చరిత్రను వాస్తవిక ఆధారాలకు అనుగుణంగా మార్చుకోక తప్పదు.

ఒకవిధంగా విజ్ఞాన సర్వస్వాలు మానవ చరిత్ర సంపుటాలు మానవుడు వివిధ రంగాలలో సాధించిన ప్రగతిని అని చాటి చెప్పుతాయి. చరాచర వస్తు జాలానికి చెందిన సమస్త విషయాలు వీటిలో చోటు చేసుకుంటాయి. తన మేధాశక్తి మూలంగా మానవుడు ఈ ప్రపంచంలో తక్కిన వాటన్నింటిపై ఆధిపత్యం వహించి, వాటిని తన అవసరాలకు వినియోగించుకుంటున్నాడు. ఈ ప్రపంచంలో ఏదో ఒక రకంగా మానవుని ప్రభావం సోకని వస్తువంటూ లేదు. చివరకు అంతరిక్షంలోకి కూడా మానవ ప్రభావం దూసుకువెళ్ళింది.

విజ్ఞాన సర్వస్వాలు ఈ విషయాల కన్నింటికి అద్దంపడుతూ, విజ్ఞాన ప్రపంచంలో మానవుని సర్వతోముఖ ప్రగతిని నిరూపిస్తుంటాయి. కనుక అవి మానవ చరిత్ర సంపుటాలని చెప్పడంలో అతిశయోక్తి లేదు.

## భారతీయ భాషల్లో విజ్ఞాన సర్వస్వం :

Encyclopaedia అనే ఆంగ్ల పదానికి భారతీయ భాషలలో జ్ఞాన కోశ్, విజ్ఞానకోశ్, విజ్ఞాన సర్వస్వం అనే పేర్లు వ్యవహారంలో ఉన్నాయి. ఈ పేర్లన్నీ 'Encyclopaedia' అనే పదానికి సమానార్థంలో దానికి అనువాద రూపాలుగా ఉద్భవించినట్టివి.

Encyclopaedia Britanica ప్రభావం వల్లనే భారతీయులు విజ్ఞాన సర్వస్వాల వంటి గ్రంథాల రచనకు పూనుకున్నారా ? లేక ప్రాచీన కాలంలో కూడా భారతీయ భాషలలో ఇటువంటి గ్రంథాలు ఉన్నాయా ? అనే అంశాలను పరిశీలించాలి. ఒకటిమాత్రం ఘంటాపథంగా చెప్పవచ్చు. వివిధ విషయాలకు సంబంధించిన విజ్ఞానాన్ని ఒకచోట చేర్చి గ్రంథ రూపంలో ప్రజానీకానికి అందించాలన్న ప్రయత్నాన్ని మన ప్రాచీనులు కూడా చేశారు,

విజ్ఞాన సర్వస్వసం, విజ్ఞాన కోశం వంటి పేర్లు వాటికి లేకపోవచ్చుగాని అవి విశ్వ విజ్ఞానాన్ని కొంతవరకు విపులీకరించినట్టివే ఇటువంటి గ్రంథాలు సంస్కృత వాఙ్మయంలో విస్తృతంగా ఉన్నాయి.

వైదిక వాఙ్మయం, సూత్ర వాఙ్మయం ఇటువంటివే. ఆ తరువాత వెలసిన షడ్దర్శనాలు విజ్ఞాన స్వరూపాన్ని విపులీకరించడానికి ఉద్దేశించినట్టివి. ఈ షడ్దర్శనాలలో సాంఖ్య, న్యాయ, యోగ, వైశేషికాలు సృష్టినీ, ప్రపంచ స్వరూపాన్నీ వ్యాఖ్యానించడంకోసం శాస్త్రీయ పద్ధతులను అనుసరించాయి. సాంఖ్యదర్శనం ప్రకృతి శక్తుల సమ్మేళనంతోనే జగత్తు ఏర్పడిందనీ, వైశేషిక దర్శనం 'అణువు' ప్రపంచానికి మౌలిక పదార్థమనీ వివరించాయి. మతపరమైన పూర్వ మీమాంస, ఉత్తర మీమాంస ఈ రెంటిని వదిలివేస్తే, తక్కిన దర్శనాలు విజ్ఞాన సర్వస్వ సంపుటాలను గుర్తుకు తెస్తాయి.

ఇవే కాకుండా ఒకటే గ్రంథంలో పెక్కు విషయాలను ప్రస్తావించినటు వంటి గ్రంథాలు కూడా సంస్కృత వాఙ్మయంలో ఉన్నాయి. పురాణాలు ఇటు వంటివే.

అమరసింహుడు పురాణం పంచలక్షణమని నిర్వచించాడు.

"సర్గశ్చ ప్రతి సర్గశ్చ వంశోమన్వంతరాణిచ
వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణమ్."

పురాణాలు ఒక విధంగా విజ్ఞానకోశాలవంటివి. సృష్టి, ప్రతిసృష్టి, దేవ దానవ వంశాదికము, మన్వంతరములు, పూర్వరాజవంశ చరిత్రలు వీటన్నింటిని తెలిపే సందర్భాలలో భూగోళ, ఖగోళాది అనేక విషయాలు వివరింపబడ్డాయి.

అగ్ని, నారద, గారుడ పురాణాలలో అమరసింహుడు చెప్పిన పంచ లక్షణాలకు తోడు వైద్యం, వ్యాకరణం, నాట్యం, సంగీతం, జ్యోతిషం మొదలైన విషయాలు ప్రస్తావించబడ్డాయి.

పద్మ, స్కాంద, భవిష్య పురాణాలు ప్రధానంగా తీర్థాల గురించి, వ్రతాల గురించి, బ్రహ్మాండ వాయుపురాణాలు చరిత్రాంశాల గురించి, మత్స్య పురాణం దేవప్రాసాదాలు, వాటి నిర్మాణం గురించి తెలుపుతున్నాయి. వరాహపురాణంలో ఆగమ శాస్త్ర విషయాలు, దేవాలయాలలో నిర్వహించే విధులు, అర్చనలు ఇంకా ఇతరత్రా నియమనిబంధనలు-వీటి గురించిన ప్రస్తావన ఉంది. కాబట్టి ఈ పురాణాలు విజ్ఞాన సర్వస్వాలను తలపింపజేస్తున్నాయి

పురాణాల తరువాత సంస్కృత వాఙ్మయంలోని "అభిలషితార్థ చింతామణి" పేర్కొనదగింది. దీనికే "మానసోల్లాసమనే" నామాంతరముంది. కుంతల చాళుక్య చక్రవర్తియైన భూలోకమల్ల సోమేశ్వర భూపతి ఈ గ్రంథ కర్త. ఇతడు 12 వ శతాబ్దికి చెందినవాడు ఈ గ్రంథంలోని ఐదు ప్రకరణాలలో రాజకుమారుడు నేర్వవలసిన విద్యలగురించి, కళలను గురించి సంస్కృత శ్లోకాల రూపంలో వివరించబడింది. దీనిలో ప్రసక్తానుప్రసక్తంగా గణితం, పంచాంగం, జ్యోతిషం, వాస్తుశాస్త్రం మొదలైన పెక్కు విషయాలు పేర్కొనబడ్డాయి. ఈ కారణంగా ఇదికూడా విజ్ఞాన సర్వస్వాన్ని తలపింపజేస్తున్నది.

ఇవన్నీ వివిధ విజ్ఞాన విషయాలను ఒకచోట క్రోడీకరించి రచించబడిన గ్రంథాలు. ఆధునిక విజ్ఞాన సర్వస్వాలవలె ఒక శాస్త్రీయమైన దృక్పథాన్ని అనుసరించి రూపొందకపోయినప్పటికీ ఇవి విజ్ఞానాన్ని ఒకచోట చేర్చి అందించాలన్న మన పూర్వీకుల అభిప్రాయాన్ని తెలుపుతున్నాయి.

ఇక ఆధునిక యుగంలో శాస్త్రీయమైన పద్ధతిని అనుసరించి విజ్ఞాన సర్వస్వాలు వెలువడడానికి కారణం 'ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా' అని నిర్ద్వంద్వంగా చెప్పవచ్చును

ఆంగ్ల విద్య భారతదేశంలో విస్తరించిన పిదప, ఆంగ్ల భాషలోని 'Encyclopaedia Britanica' వంటి విజ్ఞాన కోశాలను వెలువరించాలన్న అభిలాష భారతీయులకు కలిగింది.

సంస్కృత వాఙ్మయంలోని ఇంతకుముందు పేర్కొన్న గ్రంథాలకు, విజ్ఞాన సర్వస్వాల పేరుతో ఆధునిక యుగంలో వెలువడిన గ్రంథాలకు మౌలికంగా భేదం ఉంది. నేటి విజ్ఞాన సర్వస్వాలు ప్రామాణికమైన విజ్ఞానాన్ని ఒక చోట చేర్చి, సూటిగా ఆ విజ్ఞానాన్ని అందించడానికి ఉద్దేశించినట్టివి. వేద వాఙ్మయం, పురాణాలు అటువంటికావు భారతీయ భాషలలో నేడు కనిపిస్తున్న 'విజ్ఞాన సర్వస్వాలకు' ప్రేరణ కేవలం ఆంగ్ల భాషలోని 'Encyclopaedia Britanica' మాత్రమే. విశ్వకోశ్, విజ్ఞానకోశ్, విజ్ఞాన సర్వస్వం అనే పేర్లతో భారతీయులు ఇటువంటి గ్రంథాలను ప్రకటించారు.

''భారతీయ భాషలలో రచించబడిన విజ్ఞాన సర్వస్వాలలో బెంగాలీలోని 'విశ్వకోశ్' మొదట పేర్కొన దగింది" అని మల్లంపల్లి సోమశేఖర శర్మగారు తమ అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.[6] ఆంగ్ల భాషలోని 'Encyclopaedia Britanica' ను నమూనాగా పెట్టుకొని అకారాద్యక్షర క్రమంలో ఇది రచించబడింది.

బెంగాలీ విశ్వకోశ్ రచన 1885 లో ప్రారంభమై, 1911 లో పూర్తయింది. మొత్తం 22 సంపుటాల్లో ఇది రచించబడింది. వీనిలో మొదటి సంపుటానికి రంగలాల్ ముఖోపాధ్యాయ, త్రైలోక్యనాథ్ ముఖోపాధ్యాయ - వీరిద్దరూ సంపాదకత్వం వహించారు వీరే బెంగాలీ విశ్వకోశ్ రచనకు ఆరంభకులు. తరువాత వెలువడిన సంపుటాలన్నింటికి బాబు నాగేంద్రనాధ వసు ముఖ్య సంపాదకులు.

ఇక మల్లంపల్లి సోమశేఖర శర్మగారి అభిప్రాయం ప్రకారం బెంగాలీ విశ్వకోశ్‌ను భారతీయ భాషలలో ప్రప్రథమ విజ్ఞాన సర్వస్వంగా పేర్కొనవచ్చునా? లేదా? అనేది చర్చనీయాంశం. 7

6. 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం'-మూడవ సంపుటి (తెలుగు సంస్కృతి, **Year of publication 1959.** పేజి. 1082.

7. శర్మగారు ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం మూడవ సంపుటంలోనే మరో చోట 'ఉత్తర హిందూ స్థానమున దేశ భాషలలో ఇంగ్లీషు ఎన్ సైక్లోపీడియా వంటి

బెంగాలీ భాషలో విశ్వకోశ్ రచన ప్రారంభం కావడానికి ముందు, అంటే 1877 వ సంవత్సరంలో విశాఖ పట్టణం వాస్తవ్యులైన పరవస్తు వెంకట రంగాచార్యులు గారు 'లఘు శబ్దార్థ సర్వస్వము' అనే పేరుతో అకారాద్యక్షరక్రమంలో ఒక ఉద్గ్రంథాన్ని ప్రకటించారు. ఇది సంస్కృత భాషలో రచించబడింది. సంస్కృత వాఙ్మయంలో విజ్ఞాన సర్వస్వం నమూనాలో ఇటువంటి గ్రంథం రావడం ఇదే ప్రథమం.

మత, శాస్త్ర, వాఙ్మయ సర్వస్వరంగా తన ఒక్కడి చేతి మీదుగా రంగాచార్యులుగారు దీన్ని రూపొందించారు. 'విజ్ఞాన సర్వస్వము' లేక 'విజ్ఞాన కోశము' అనే పేరు లేకపోయినప్పటికి ఇది ఆంగ్ల భాషలోని 'ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా' ప్రభావంతో రచించబడిందని దీని రచనా ప్రణాళిక రుజువు చేస్తున్నది. 8 అకారాద్యక్షర క్రమంలో ఆయా పదాల అర్థాలను విపులీకరిస్తూ ఆ పదాలకు సంబంధించిన 'విషయం' విజ్ఞాన సర్వస్వంలో వలె విశదీకరించబడింది. 'లఘు శబ్దార్థ సర్వస్వము' అని పేరు పెట్టడంలోనే దీని రచనా ప్రణాళిక ఎటువంటిదో విదితమవుతున్నది నిఘంటువులో వలె అర్థవివరణ, విజ్ఞాన సర్వస్వంలో వలె విషయ వివరణ-ఈ రెండింటి సమ్మిళిత స్వరూపంతో ఈ గ్రంథం రూపొందించబడింది.

---

గ్రంథము రచింపబడుట కదియే ప్రథమ ప్రయత్నము' అని బెంగాలీ విశ్వకోశ్‌ను ఉద్దేశించి పేర్కొన్నారు. ఇక్కడ 'ఉత్తర హిందూస్థానమున' అని అన్నారేగాని 'మొత్తం హిందూస్థానమున' (భారత దేశంలో) అని ఉదాహరించలేదు. దీన్నిబట్టి బెంగాలీ విశ్వకోశ్ భారతీయ భాషల్లో వెలువడిన మొదటి విజ్ఞాన సర్వస్వం అవునా? కాదా? అనే విషయంలో శర్మగారికి కూడా సందేహం ఉండేదని తెలుస్తున్నది. దీనివల్లే కావచ్చు ఆయన ఒకచోట బెంగాలీ విశ్వకోశ్ 'మొదట పేర్కొనదగింది' అని, మరొక చోట 'ఉత్తర హిందూస్థానమున' పేర్కొనదగింది. అని పేర్కొన్నారు. భారతీయ భాషల్లో మొదటి విజ్ఞాన సర్వస్వం ఏదో ఆయన స్పష్టంగా చెప్పలేదు.

8. మల్లంపల్లి సోమశేఖర శర్మగారు కూడా ఇదే అభిప్రాయాన్ని వ్యక్తీకరించారు. 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం' మూడవ సంపుటం (తెలుగు సంస్కృతి) పేజి 1082

నిఘంటువుకు, విజ్ఞాన సర్వస్వానికి 'వివరించి చెప్పడం' అనేది సామాన్య లక్షణమైనప్పటికీ రెండింటి మధ్య తేడా ఉంది. నిఘంటువు పదాల వాచ్యార్థాన్ని, పర్యాయ పదాల స్వరూప స్వభావాలను వ్యక్తీకరిస్తుంది. విజ్ఞాన సర్వస్వం ఆయా పదాలకు చెందిన విషయాన్ని సాకల్యంగా బోధిస్తుంది. 'లఘు శబ్దార్థ సర్వస్వం'లో ఈ రెండు లక్షణాలున్నాయి. ముందు చెప్పినట్టు పదాల అర్థ వివరణతోపాటు, ఆ పదాలకు సంబంధించిన విషయ వివరణ కూడా ఉండడం దీని ప్రత్యేకత. ఈ ఉద్దేశంతోనే కావచ్చును రంగాచార్యులుగారు గ్రంథ నామానికి 'సర్వస్వం' అనే పదం చేర్చి, దాన్ని సార్థకం చేశారు.

ఈ 'లఘు శబ్దార్థ సర్వస్వ' రెండవ సంపుటం (ఆ అక్షరక్రమంలో రూపొందించినది) 1898 లో వెలువడింది. దురదృష్టవశాత్తు రంగాచార్యులుగారు పరమపదించడంచేత ఆ తరువాత దీని సంపుటాలు వెలువడలేదు.

భారతీయ భాషల్లో సంస్కృత భాషకు అనన్య గౌరవ ప్రతిపత్తులున్నాయి. ఆదియావద్భారత దేశ భాష. ఏదో ఒక ప్రాంతానికి పరిమితమైనదికాదు. భారతీయ భాషలు సంస్కృత భాషా సంపర్కంతో సుసంపన్నమై, విశిష్టమైన వాఙ్మయాన్ని సృష్టించుకొన్నాయి.

ఆధునిక యుగంలో రంగాచార్యులుగారు 'Encyclopaedia Britanica' ఛాయల్లో 'సంస్కృత విజ్ఞాన సర్వస్వం' అనదగిన 'లఘు శబ్దార్థ సర్వస్వాన్ని' రచించి, ఆ భాషా గౌరవాన్ని ఇనుమడింపజేశారు. 'Encyclopeadia Britanica' ఛాయలు కనిపిస్తున్నాయి కనుక లఘు శబ్దార్థ సర్వస్వం భారతీయ భాషల్లో మొట్టమొదట ప్రారంభించబడిన విజ్ఞాన సర్వస్వం అని స్పష్టంగా చెప్పవచ్చు. అయితే, దీని సంపుటాలు రెండే వచ్చాయి కనుక ఇది పూర్తి స్వరూపాన్ని సంతరించుకోలేదు దీని తరువాత ప్రారంభించబడిన (1885) బెంగాలీ విశ్వకోశ్ పూర్తి స్వరూపాన్ని సిద్ధింపజేసుకొన్నట్టిది. 1911 నాటికి దాని సంపుటాలన్నీ ప్రకటింపబడ్డాయి ఈ కారణంగా భారతీయ భాషల్లో మొట్టమొదట పూర్తిచేయబడిన విజ్ఞాన సర్వస్వంగా 'బెంగాలీ విశ్వ

కోశ్'ను స్వీకరించవచ్చు. అంతేగాని భారతీయ భాషల్లో ప్రప్రథమంగా ప్రారంభించబడిన విజ్ఞాన సర్వస్వంగా దాన్ని పరిగణించడానికి వీలులేదు. ఆ గౌరవం రంగాచార్యులుగారి 'లఘు శబ్దార్థ సర్వస్వానికి' దక్కుతుంది.

ఆచార్యులుగారు తెలుగువాడై ఉండి, తెలుగు భాషలో కాకుండా సంస్కృత భాషలో 'లఘు శబ్దార్థ సర్వస్వం' పేరుతో విజ్ఞాన సర్వస్వం వంటి ఈ గ్రంథాన్ని రచించడానికి కారణమేదై ఉంటుంది అని ఆలోచిస్తే, యావద్భారత దేశ వ్యాప్తంగా గుర్తింపు పొందాలన్న తలంపే దీనికి ప్రధాన కారణమని తెలుస్తుంది. ఆ రోజుల్లో సంస్కృత భాషలో నిష్ణాతుడైన పండితుడుగా ఆచార్యులుగారికి గొప్ప గుర్తింపు ఉండేది. ఆనాటి ఆంగ్ల ప్రభుత్వం ఆయన పాండితీ ప్రకర్షకు గుర్తింపుగా 'మహా మహోపాధ్యాయ' అనే బిరుదును ప్రదానం చేసి ఆయనను సత్కరించింది.[9]

సంస్కృతం యావద్భారతదేశ భాష. తమ ప్రతిభను నిరూపించుకోవడానికి ఆ రోజుల్లో సంస్కృత భాషను కొలమానంగా స్వీకరించిన వారెందరో మనకు కనిపిస్తారు సంస్కృతం అనాది నుండి విస్తృత వాఙ్మయంతో విరాజిల్లింది. ప్రాంతీయ భాషలు అట్లా కాకుండా ఉద్యమాల ద్వారా పరిపుష్టిని కలిగించుకొని, వాఙ్మయాన్ని సృష్టించుకొన్నట్టివి. ఆచార్యులుగారు 'లఘు శబ్దార్థ సర్వస్వం' రచించడం చెప్పుకోదగిన విశేషమే. అయితే అది సంస్కృత భాషలో ఉండడంవల్ల అందరికీ అందుబాటులో లేకుండా పోయింది. ఆచార్యులుగారిది ఉద్యమ స్వభావం కాదు. పండిత స్వభావం. వారికి ఉద్యమ స్వభావం ఉన్నట్టయితే తెలుగు భాషలో దాన్ని ప్రారంభించి ఉండేవారు. ఉద్యమ స్వభావం ఉన్నవారే ప్రాంతీయ భాషలలో నవీన ప్రయోగాలు చేసి, ఆ భాషా సాహిత్యాల వికాసానికీ, ఆ భాషా ప్రజల పురోభివృద్ధికీ తోడ్పడగలిగారు.

---

9. విక్టోరియా మహారాణి సింహాసనాధిరోహణ స్వర్ణోత్సవం సందర్భంగా ఆచార్యులుగారికి ఈ బిరుదును ప్రదానం చేశారు.

## దక్షిణాది భాషల్లో విజ్ఞాన సర్వస్వం :

తెలుగు భాషలో విజ్ఞాన సర్వస్వం ఏ విధంగా అవతరించిందో చెప్ప డానికి ముందు దక్షిణాది భాషల్లో దీని ఉనికిని గురించి పేర్కొనవలసి ఉంది.

తమిళం, తెలుగు, కన్నడం, మలయాళం, మరాఠీ - ఈ ఐదు భాషలు దక్షిణాది భాషలుగా వ్యవరింపబడుతున్నాయి వీనిలో మరాఠీ ఉత్తర, దక్షిణ సంప్రదాయాలను సంతరించుకొన్న భాష. తక్కిన నాలుగు దక్షిణాది భాషలు ద్రావిడ భాషా కుటుంబానికి చెందినవి ఈ భాషలన్నీ విస్తృత వాఙ్మయంతో విరాజిల్లుతున్నాయి. ఇవి వేర్వేరు ప్రాంతాలకు పరిమితమై, ఆ ప్రాంతాల అధికార భాషలుగా పరిగణింపబడుతున్నాయి. ప్రాంతాలకు పరిమితమైనప్పటికీ ఇవి జాతీయ జీవన స్రవంతిలో అంతర్వాహినులే

దక్షిణాది భాషలను గమనిస్తే ఒక భాషలోని సారస్వత ఉద్యమాల ప్రభావం మరొక భాషపై కొద్దిగానో, గొప్పగానో ఉన్నట్టు మనకు కనిపిస్తుంది. ద్రావిడ భాషా కుటుంబానికి చెందిన భాషల్లో ఈ సాన్నిహిత్యాన్ని మనం గమనించవచ్చు.

తమిళ విజ్ఞాన సర్వస్వానికి 'కలైక్కళంజియం' అని పేరు. పెరియ సామితురాన్‌గారు 1954 లో దీన్ని ప్రారంభించారు. ఈ 'కలైక్కళంజియం' అవతరించడానికి ముందు 1910 లో సింగారవేలు మొదలియార్ అనే విద్వాంసుడు 'అభిదాన చింతామణి' పేరుతో విజ్ఞాన సర్వస్వం వంటి ఒక సంకలన గ్రంథాన్ని ప్రకటించాడు. దీనిలో అనేక విషయాలు ప్రస్తావించబడి నప్పటికి ఆధునిక విజ్ఞాన సర్వస్వం లక్షణాలు దీనికి లేవు. 'కలైక్కళం జియం' అకారాద్యక్షర క్రమంలో ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికాను ఆదర్శంగా తీసుకొని ప్రారంభించబడింది. కాబట్టి దీన్నే ప్రప్రథమ ప్రామాణిక విజ్ఞాన సర్వస్వంగా పరిగణిస్తున్నారు ఇప్పటికి దీని సంపుటాలు తొమ్మిది వెలువడ్డాయి.

కన్నడ భాషలో విజ్ఞానాన్ని అందించే గ్రంథాలు అనేకం వెలువడినప్పటికీ ప్రామాణికమైన విజ్ఞానసర్వస్వం మాత్రం కొంచెం ఆలస్యంగానే ప్రారంభించబడింది. కన్నడ భాషలో సుప్రసిద్ధ రచయితగా ప్రసిద్ధికెక్కిన శివరామ కారంత్‌గారు కన్నడ భాషలో విజ్ఞానసర్వస్వాల వంటి గ్రంథాల రచనకు శ్రీకారంచుట్టారు. 1931లో 'బాలప్రపంచ' పేరుతో ఆయన ప్రకటించిన గ్రంథం ఎంతో విలువైనది. ఇది చిన్నపిల్లల కొరకు ప్రత్యేకంగా రచించబడింది. వివిధ శాస్త్రాలకు సంబంధించిన విషయాలు. మధ్య మధ్య కథలు, కవితలు సచిత్రంగా దీనిలో ప్రస్తావించబడ్డాయి. ఇది మూడు సంపుటాల రూపంలో ప్రకటింపబడింది. శివరామ కారంత్ గారే 'విజ్ఞాన ప్రపంచ' పేరుతో మరో విశిష్టమైన గ్రంథాన్ని రచించారు. ఇది మొత్తం నాలుగు సంపుటాలుగా ప్రకటించబడింది. మొదటి సంపుటం పేరు "ఈ జగత్తు". ఖగోళం, భూగోళం, సాగరం వీటికి సంబంధించిన విషయాలు దీనిలో ఉన్నాయి. రెండవ సంపుటం 'జీవ'. దీనిలో జంతు శాస్త్రం, వృక్షశాస్త్రం, మానవశాస్త్రం వీటి ప్రస్తావన ఉంది. మూడవ సంపుటమైన 'వస్తువు'లో పరమాణు చరిత్ర, భౌతిక రసాయన శాస్త్ర విషయాలు వివరించబడ్డాయి. నాలుగవ సంపుటంసాంకేతిక విజ్ఞానానికి సంబంధించినది. దీని పేరు 'విజ్ఞాన సాధన'. కారంత్‌గారు దీనిలో ఇంజనీరింగ్ రంగాన్ని విపులీకరించారు. ఈ నాలుగు సంపుటాలు 1959-1964 సంవత్సరాల మధ్య ప్రకటించబడ్డాయి. వీటన్నింటిని శివరామ కారంత్‌గారు స్వయంగా రచించారు.

శివరామ కారంత్‌గారు రచించిన ఈ గ్రంథాలు విజ్ఞానదాయకమైనవైనప్పటికి వీటిని 'విజ్ఞాన సర్వస్వాలు' అని పేర్కొనడానికి వీలులేదు. ఇవి అకారాద్యక్షర క్రమాన్ని అనుసరించి రూపొందినవి కావు. అదే విధంగా వీనిలో ప్రస్తావించబడిన అంశాలు ఆధునిక ప్రమాణాలకు దీటైనవి కావు. విజ్ఞాన సర్వస్వం 'విజ్ఞానశాస్త్రం' వంటిది దానిలో ఊహకు ఆస్కారం లేదు కన్నడ భాషలో 1969 లో విజ్ఞాన సర్వస్వ రచన ప్రారంభమైంది. మైసూరు విశ్వవిద్యాలయం 'కన్నడ విశ్వకోశ్' పేరుతో దీని రచనా ప్రణాళికను చేపట్టి ఇప్పటికి తొమ్మిది సంపుటాలను ప్రకటించింది.

మలయాళ భాషలో విజ్ఞాన సర్వస్వానికి 'సర్వ విజ్ఞాన కోశం' అనే పేరు పెట్టబడింది కేరళ ప్రభుత్వం ఆధ్వర్యంలో ఇది ప్రచురింపబడుతున్నది. 1962 లో దీని తొలిసంపుటం ప్రకటించబడింది. ఇప్పటికి నాలుగు సంపుటాలు వెలువడ్డాయి. ఈ సర్వవిజ్ఞాన కోశాన్ని ప్రారంభించడానికి ముందు, మాత్యూం కుళివేలిప్ అనే ఆయన 'విజ్ఞానం' పేరుతో 1956 లో ఒక గ్రంథాన్ని ప్రకటించాడు. ఆరు సంపుటాలలో దీన్ని రచించాలని తలపెట్టి, ఆయన మూడు సంపుటాలను మాత్రమే రచించగలిగారు. కుళివేలిప్ గారు ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికాను మార్గదర్శకంగా స్వీకరించి గ్రంథ రచనకు పూనుకొన్నారు. అ తరువాత కేరళ ప్రభుత్వం సర్వవిజ్ఞాన కోశం రచనను చేపట్టడానికి ఇదే ప్రేరణను కలిగించింది.

ఇక మరాఠీ భాషలో సుప్రసిద్ధ మరాఠీ విద్వాంసుడైన శ్రీధర వెంకటేశ్వర కేత్కర్ 'మరాఠీ విశ్వకోశ్' పేరుతో విజ్ఞాన సర్వస్వ రచనను చేపట్టి 1920 లో దీని తొలి సంపుటాన్ని ప్రకటించారు. ఈ తొలి సంపుటాన్ని ఆయన తన ఒక్కడి చేతిమీదుగా పూర్తి చేశారు. 1927 లో ఈ విశ్వకోశ్ రచన పూర్తయింది. మొత్తం 26 సంపుటాలు వెలువడ్డాయి. ఈ సంపుటాల కన్నింటికీ కేత్కర్‌గారే ప్రధాన సంపాదకులు. ఇది ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికాను అనుసరించి సంతరించబడింది.

దక్షిణాది భాషల్లో ప్రప్రథమంగా పూర్తి చేయబడిన విజ్ఞాన సర్వస్వంగా మరాఠీ విశ్వకోశ్ పరిగణింపబడుతున్నది. తక్కిన దక్షిణాది భాషల్లో వీటి రచన ఇంకా కొనసాగుతూనే వుంది. మరాఠీ విశ్వకోశ్ కంటె ముందు ప్రారంభించబడిన తెలుగు విజ్ఞాన సర్వస్వం ఇంతవరకు పూర్తికాలేదు.

దక్షిణాది భాషలలోని విజ్ఞాన సర్వస్వాలను గమనిస్తే వాటన్నింటికి ఒక సామాన్య లక్షణం కనిపిస్తుంది. ఆదిలో ఇవన్నీ ఒకే ఒక్కవ్యక్తి ప్రయత్నంతో ప్రారంభించబడినట్టివే.

ఆదిలో తెలుగు విజ్ఞాన సర్వస్వాన్ని లక్ష్మణరావుగారు స్వీయ ప్రయత్నంతోనే ప్రారంభించారు. తెలుగు విజ్ఞాన సర్వస్వాన్ని దక్షిణాది భాషలలో ప్రప్రథమంగా వెలువడిన విజ్ఞాన సర్వస్వంగా పేర్కొనవచ్చు. 1913 లో దీని రచన ప్రారంభమైంది. అయితే దక్షిణాది భాషలలో తొలి విజ్ఞాన సర్వస్వంగా పేరు తెచ్చుకొన్నప్పటికీ, తొలిసారి పూర్తిచేయబడిన విజ్ఞాన సర్వస్వం అనే గౌరవాన్ని అది దక్కించుకోలేదు. ఆ గౌరవం మరాఠ విశ్వకోశ్‌కు చెందుతుంది ఇక్కడ ఒక విషయాన్ని గమనించవలసి ఉంది. 'లఘు శబ్దార్థ సర్వస్వం' రచనతో యావద్భారత దేశవ్యాప్తంగా తొలి విజ్ఞాన సర్వస్వాన్ని వెలువరించిన ఘనతను తెలుగుదేశం దక్కించుకుంది. అలాగే దక్షిణాది భాషల్లో తొలిసారి విజ్ఞాన సర్వస్వ రచనను ప్రారంభించిన కీర్తిని కూడా తెలుగుదేశమే చేజిక్కించుకుంది. 'ఆరంభ' గౌరవాన్ని దక్కించుకొన్న ఈ రెండూ ఇప్పటికీ అసమగ్రాలే.

లక్ష్మణరావుగారు ఇంకో నాలుగైదేళ్ళు బ్రతికి ఉన్నట్టయితే తెలుగు విజ్ఞాన సర్వస్వం తప్పకుండా సమగ్ర స్వరూపాన్ని ధరించి ఉండేది. మరాఠీ విశ్వకోశ్ సృష్టికర్తగా పేరుతెచ్చుకొన్న శ్రీధర వెంకటేశ్వర కేత్కర్ 1937 దాకా బ్రతికి ఉండడం మహారాష్ట్రుల అదృష్టం. 1920 లో ఆయన దాన్ని ప్రారంభించి, 1927 లో పూర్తిచేశారు. లక్ష్మణరావుగారు 1923 లోనే, ఆదీ విజ్ఞాన సర్వస్వ రచన ఊపులో ఉన్న తరుణంలోనే పరమపదించడం తెలుగు వారి దురదృష్టం.

## తెలుగు విజ్ఞాన సర్వస్వం – లక్ష్మణరావు :

లక్ష్మణరావుగారు 'ఒక వ్యవస్థ' వంటివారు. ఒక వ్యవస్థగా వ్యవహరించ గలిగే సత్తా అందరికీ ఉండదు. అటువంటి మహానుభావులు కొందరే ఉంటారు. వారు మేధాసంపన్నులై ఇతరులను ప్రభావితుల్ని చేసి తమ వైపు ఆకర్షించుకొని ముందుకు నడిపిస్తారు.

లక్ష్మణరావుగారు తెలుగులో 'ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా' వంటి గ్రంథం ఉండాలని పట్టుబట్టి, దాని కొరకు అహర్నిశలు శ్రమించి, దానికి ఒక

ఆకృతిని కల్పించారు. 1913 జూలై నెల నుండి మాస సంచికల రూపంలో తెలుగు విజ్ఞాన సర్వస్వ రచన ప్రారంభమైంది.

డబుల్ క్రౌన్ $\frac{1}{8}$ వంతు సైజులో వంద పేజీలతో ఈ మాస సంచికలు వెలువడ్డాయి. ఈ రకంగా ప్రతి నెలా వెలువడిన సంచికలలోని సమాచారాన్ని క్రోడీకరించి 1915 లో లక్ష్మణరావుగారు విజ్ఞాన సర్వస్వం తొలి సంపుటిని ప్రకటించారు. ఆ తరువాత 1916 లో వెలువడిన సంచికలను రెండవ సంపుటం గానూ, 1917 లో వెలువడిన సంచికలను మూడవ సంపుటంగానూ ప్రచురించారు. ఈ మూడు సంపుటాలు అకారాద్యక్షరక్రమంలో రూపొందించబడ్డాయి. వీటిలోని విషయమంతా 'అ' నుండి 'అప్రిహి' వరకు అక్షరానుక్రమంగా సమకూర్చబడింది. ఆదిలో ప్రచురించిన మాస సంచికల్లో కూడా విషయ వివరణ అకారాద్యక్షరక్రమంలోనే కొనసాగింది.

ఈ విధంగా దక్షిణాది భాషల్లో ప్రప్రథమంగా విజ్ఞాన సర్వస్వాన్ని ప్రారంభించి లక్ష్మణరావుగారు తెలుగు భాషా గౌరవాన్ని ఇనుమడింపజేశారు. కొందరు దీన్ని తెలుసుకోకుండా మరాఠీ విశ్వకోశ్‌ను చూసి, దాని ప్రభావంతో లక్ష్మణరావుగారు తెలుగు విజ్ఞాన సర్వస్వాన్ని ప్రారంభించినట్టు అభిప్రాయపడ్డారు.[10]

మరాఠీ విశ్వకోశ్ మొదటి సంపుటం తెలుగు విజ్ఞాన సర్వస్వ రచన ప్రారంభమయిన తరువాత ఏడేళ్ళకు వెలువడింది. 1913 లో తెలుగు విజ్ఞాన సర్వస్వం ఆవిర్భవిస్తే, 1920 లో మరాఠీ విశ్వకోశ్ అవతరించింది. ఈ అంతర మొక్కటేచాలు తెలుగు విజ్ఞాన సర్వస్వం మొదటిదని చెప్పడానికి. అంతే కాకుండా, లక్ష్మణరావుగారి ప్రభావంతోనే శ్రీధర వెంకటేశ్వర కేత్కర్ మరాఠీ విశ్వకోశ్‌ను ప్రారంభించారని చెప్పడానికి బలమైన సాక్ష్యాధారాలున్నాయి.

---

10. లక్ష్మణరావుగారు కేత్కర్ ప్రభావంతో తెలుగు విజ్ఞాన సర్వస్వ రచనను ప్రారంభించినట్టు అయ్యదేవర కాళేశ్వరరావుగారు తమ స్వీయ చరిత్రలో పేర్కొన్నారు. 'నా జీవితము - నవ్యాంధ్రము' పేజి. 148.

మరాఠీ విశ్వకోశ్ ప్రథమ సంపుటిలో కేత్కర్ ఈ విషయాన్ని స్వయంగా చెప్పుకొన్నాడు. అలాగే మరాఠీలోని 'అర్వాచీన చరిత్రకోశ్' లో ఈ విషయం ప్రస్తావించబడింది.

లక్ష్మణరావుగారిని సుప్రసిద్ధ మరాఠీ విద్వాంసుడుగా ప్రస్తుతిస్తూ మరాఠీ సాహితీవేత్తలెందరో ఆయనను ఆకాశానికి ఎత్తివేశారు. సిద్ధేశ్వరశాస్త్రి చిత్రావ్ వారిలో ఒకరు. ఆయన సంపాదకత్వంలో వెలువడిందే ఈ 'అర్వాచీన చరిత్ర కోశ్'. ఇది మరాఠీ సాహిత్యంలోని విశిష్టమైన గ్రంథాలలో ఒకటి. దీనిలో మహారాష్ట్ర ప్రాంతంలోని ఆధునిక యుగంనాటి మహానుభావుల జీవిత చరిత్రలు వివరించబడ్డాయి. ఇది 1946 లో ప్రచురించబడింది. దీనిలో శ్రీధర వెంకటేశ్వర కేత్కర్ గురించి వివరిస్తూ రచయిత, కేత్కర్ లక్ష్మణరావుగారినుండి స్ఫూర్తిని పొంది, మరాఠీ విశ్వకోశ్ రచనను ప్రారంభించినట్లు పేర్కొన్నారు.[11]

కేత్కర్‌కు లక్ష్మణరావుగారితో వ్యక్తిగతంగా బాగా పరిచయం ఉండేది. మద్రాసులో 1914 లో జరిగిన 'సైన్స్ కాంగ్రెస్' సమావేశం సందర్భంగా వీరిద్దరు తొలిసారి కలుసుకున్నారు. లక్ష్మణరావుగారు అప్పటికే విజ్ఞాన సర్వస్వ రచనలో నిమగ్నమై ఉన్నారు. మద్రాసులో ఈ రకంగా కలిగిన పరిచయం ఆ తరువాత వీరిద్దరిమధ్య మైత్రిగా పరిణమించింది. కేత్కర్ తరచుగా మద్రాసును సందర్శించి, లక్ష్మణరావుగారి దగ్గర కొన్ని రోజులు గడుపుతుండేవాడు. ఈ సాన్నిహిత్యమే 'మరాఠీ విశ్వకోశ్' ను ప్రారంభించడానికి ఆయనను ప్రోత్సహించి ఉండవచ్చు. లక్ష్మణరావుగారి ప్రభావం కేత్కర్‌పై స్పష్టంగా ఉందనడానికి ఇవన్నీ ప్రబలమైన నిదర్శనాలే. వీటిని త్రోసిపుచ్చి, లక్ష్మణరావుగారు కేత్కర్ ప్రభావంతో తెలుగు విజ్ఞాన సర్వస్వ రచనకు పూనుకొన్నారని చెప్పడానికి వీలులేదు.

---

11. 'Arvacheen Charitra Kosh'- Edited by Siddeshwara Shastri chitrav. Published in 1946. Page No. 145.

కేత్కర్‌తో పరిచయం ఏర్పడక పూర్వమే లక్ష్మణరావుగారు 1913 లోనే మాస సంచికల రూపంలో బ్రిటిషు ఎన్‌సైక్లోపీడియాను మార్గదర్శకంగా తీసుకొని తెలుగు విజ్ఞాన సర్వస్వానికి శ్రీకారం చుట్టినారు.

సంపుటాల రూపంలో చూసినా మరాఠీ విశ్వకోశ్ కంటె ఐదేళ్ళు ముందుగానే తెలుగు విజ్ఞాన సర్వస్వ తొలిసంపుటం వెలువడింది. తెలుగు విజ్ఞాన సర్వస్వ ప్రభావం మరాఠీ విశ్వకోశ్‌పై ఉందని చెప్పడానికి ఇవన్నీ స్పష్టమైన ఉదాహరణలే. లక్ష్మణరావుగారి ఔన్నత్యానికి తెలుగు విజ్ఞాన సర్వస్వ రచన ఒక సోపానం వంటిది.

మూడు సంపుటాలు వెలువడిన తరువాత తెలుగు విజ్ఞాన సర్వస్వ రచన ఆగిపోయింది. ఇంతకుముందు చెప్పినట్టు లక్ష్మణరావుగారు హఠాత్తుగా మరణించడమే దీనికి ప్రధాన కారణం. ఈ మూడు సంపుటాలలో 'అ' కారాది విషయాలు సమకూర్చబడ్డాయి. లక్ష్మణరావుగారి తరువాత 1932 వరకు ఈ భారాన్ని మీద వేసుకొని నడిపించే నాథుడు కరువయ్యాడు. 1932 లో కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు విజ్ఞాన సరస్వ నిర్మాణ బాధ్యతను స్వీకరించి, లక్ష్మణరావుగారు వెలువరించిన మూడు సంపుటాలను రెండు సంపుటాలలోనికి కుదించి పునర్ముద్రించారు. ఈ రెండు సంపుటాలలో మొదటి సంపుటం 1932 లో, రెండవ సంపుటం 1934 లో వెలువడ్డాయి. వీటిలోని కొన్ని వ్యాసాలను ఆధునిక ప్రమాణాలకు అనుగుణంగా కొంత సవరించి, మరికొన్ని నూత్నాంశాలను చేర్చి పంతులుగారు ఆకర్షణీయంగా ఈ రెండు సంపుటాలను తీర్చిదిద్దినారు. అయితే నాగేశ్వరరావు పంతులుగారు 1938 లో పరమపదించడంతో తెలుగు విజ్ఞాన సర్వస్వ రచనకు మళ్ళీ ఆటంకం కలిగింది. ఈ భారాన్ని మీద వేసుకొని నడిపించే మహానుభావుడు మళ్ళీ కరువయ్యాడు. ఈ కారణంగా విజ్ఞాన సరస్వ రచన చాలా కాలం వరకు ఆగిపోవలసి వచ్చింది ఈలోగా ఉద్లామ్ జమీందారైన కందుకూరి బాలసూర్య ప్రసాదరావుగారు 'ఆంధ్ర విజ్ఞానం' అనే పేరుతో అకారాద్యక్షర క్రమంలో విజ్ఞాన సర్వస్వం వంటి గ్రంథాన్ని స్వయంగా రచించి,

1938-1941 సంవత్సరాల మధ్య ఏడు సంపుటాలుగా ప్రకటించారు. వీటిలో భౌగోళిక, భౌతిక, వేదాంత శాస్త్రాదిక విషయాలు చాలావరకు కొరవడ్డాయి. వాటిలో ప్రస్తావించబడిన విషయం కూడా సమగ్రంగా లేదు. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం అట్లాకాకుండా ఆధునిక ప్రమాణాలకు అనుగుణంగా, బ్రిటిష్ ఎన్‌సైక్లో పీడియాకు ఏ మాత్రం తీసిపోని విధంగా రూపొందించబడింది. లక్ష్మణరావుగారు వెలువరించిన మూడు సంపుటాలు ఈ మార్గాన్ని అనుసరించినట్టివే.

ఈ మూడు సంపుటాలకు విషయాన్ని సమకూర్చిన రచయితలందరూ ప్రాచ్య, పాశ్చాత్య గ్రంథాలను పరిశీలించి, తమ అభిప్రాయాలకు ప్రామాణిక మైన ఆధారాలను జత చేస్తూ తమ వ్యాసాలను రూపొందించారు. బాల సూర్య ప్రసాదరావు గారు స్వయంగా రచించిన 'ఆంధ్ర విజ్ఞానం' సంపుటాలు ఇంతటి విలక్షణమైనవి, ప్రామాణికమైనవి కావు. అందుకే వాటికి తగిన గుర్తింపు రాలేదు. ఇప్పుడున్న ఆంధ్ర విజ్ఞాన సర్వస్వానికి పునాది లక్ష్మణరావు గారు వేసిందే. ఆ పునాదిపైనే ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ నిర్మాణము జరుగుతున్నది. విజ్ఞాన సర్వస్వ రచనను ప్రారంభించి లక్ష్మణరావు గారు తెలుగు భాషా సాహిత్యాల వికాసానికి ఎంతగానో తోడ్పడ్డారు.

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు గారు పరమపదించిన తరువాత దాదాపు పదేళ్ళ వరకు, అంటే 1948 లో మద్రాసులో తెలుగు భాషా సమితి ఏర్పడేవరకు విజ్ఞాన సర్వస్వాన్ని పునరుద్ధరించే ప్రయత్నం జరుగలేదు.

1948 లో మార్చినెల 9 వ తేదీన పలువురు సాహితవేత్తలు మద్రాసులో సమావేశమై, తెలుగు భాషా సమితిని ఏర్పాటుచేసి, 12 సంపుటాలలో ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం ప్రకటించాలని నిర్ణయించారు. గిడుగు వెంకట సీతాపతి గారి ప్రధాన సంపాదకత్వాన, బెజవాడ గోపాలరెడ్డిగారి పర్యవేక్షణలో మళ్ళీ విజ్ఞాన సర్వస్వ రచన ఆరంభమైంది.

లక్ష్మణరావు గారు వెలువరించిన విజ్ఞాన సర్వస్వాలవలె అకారాద్యక్షర క్రమంతో పాటు విషయ వివరణ ఆధారంగా తిరిగి మొదటి నుండి సంపుటాలను ప్రచురించాలని ఈ సమితి నిర్వాహకులు తీర్మానించారు. ఈ తీర్మానానికి అను గుణంగా ప్రణాళికను సిద్ధం చేసుకొని మొదటి సంపుటిని 1954 లో ప్రక టించారు.

మొదటి సంపుటం 'చరిత్ర-రాజనీతి'కి సంబంధించినది. దీనిలో చరిత్ర-రాజనీతి రంగాలను గురించి మొదట సంక్షిప్తంగా వివరించి, ఆ తరువాత అవే విషయాలను విపులీకరించడం జరిగింది. ఈ విపులీకరించబడిన భాగం మాత్రం అకారాది క్రమంలో ఉంది. విజ్ఞాన సర్వస్వంలో ఈ మార్పును గురించి మొదటి సంపుటానికి వ్రాసిన సంపాదకీయంలో ఈ విధంగా వ్రాశారు:

"చరిత్ర విషయము గాని, రాజనీతి విషయము గాని ఇదివరకేమీ తెలియని వారికి అకారాది వివరణము ఉపయోగించుకునే సమర్థత ఉండదు. అట్టివారు సంక్షిప్త కథనము ముందుగా చదువుకొన్న యెడల వారికి కొన్ని విషయములు ఇంకను ఎక్కువగా తెలుసుకోవలెనన్న జిజ్ఞాస కలుగును.''

అకారాద్యక్షర క్రమంలో విజ్ఞాన సర్వస్వ రచన కాల విలంబనంతో పాటు ప్రయాసతో కూడుకొన్నట్టిది. అక్షర క్రమంగా విషయాన్ని వెతు క్కుంటూ రచనను కొనసాగించడం కన్నా, ఒక విషయాన్ని ముందే నిర్ణయించు కొని దాన్ని అకారాది క్రమంలో వివరించడం సులభమైన పద్ధతి. దీనివల్ల ప్రణాళికను సాధ్యమైనంత త్వరలో పూర్తి చేసుకోవడానికి అవకాశమున్నది. తెలుగు భాషా సమితి అవలంబించిన ఈ పద్ధతి ప్రశంసనీయమైనదే అయితే ఈ పద్ధతిని అనుసరించినప్పటికీ సమితి, విజ్ఞాన సర్వస్వ రచనను ఇప్పటికీ పూర్తి చేయలేకపోయింది

1948 లో నిర్ణయించిన 12 సంపుటాల ప్రణాళికను 1960 లో 16 సంపుటాలకు సవరించారు ఈ సవరణ జరిగి ఇరవయేళ్ళు దాటినా విజ్ఞాన

సర్వస్వ రచన ఇంకా కొనసాగుతూనే వుంది. దీని 14 వ సంపుటం ఇటీవలే వెలువడింది.

ఆంధ్ర విజ్ఞాన సర్వస్వరచన ఒకప్రక్క తెలుగు భాషా సమితి అధ్వర్యంలో జరుగుతున్న తరుణంలోనే హైదరాబాదులో 1958 లో 'సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశసమితి' పేరిట ఒక సంస్థ ఏర్పడి, 'సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశం' రచననుచేపట్టింది. ప్రతి శాస్త్రానికి సంబంధించిన ప్రధాన విషయాలను సంగ్రహ రూపంలో అందించాలన్నది వీరి లక్ష్యం. ఈ లక్ష్యానికి అనుగుణంగానే ఈ సంస్థ నిర్వాహకులు తమ విజ్ఞాన కోశానికి 'సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశం' అని పేరు పెట్టుకున్నారు.

ఈ విజ్ఞాన కోశం అకారాద్యక్షర క్రమంలో రూపొందించబడింది. దీని ప్రధాన సారథులు కూడా బెజవాడ గోపాలరెడ్డిగారే. ఖండవల్లి లక్ష్మీరంజనం గారు దీనికి వెన్నెముకగా నిలిచి, ఇప్పటివరకు ఎనిమిది సంపుటాలను ప్రకటించారు.

పైన పేర్కొన్న వివిధ విజ్ఞాన కోశాలు వెలువడినప్పటికీ 'సర్వసమగ్రమైన' విజ్ఞాన సర్వస్వం లేని కొరత తెలుగు భాషకు ఇప్పటికీ అలాగే ఉంది. 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం' పూర్తయ్యేదాకా ఈ కొరత అలాగే నిలిచి ఉంటుంది.

1913 లో లక్ష్మణరావుగారు విజ్ఞాన సర్వస్వాన్ని ప్రారంభించిన నాటి రోజులను, నేటి రోజులతో పోల్చిచూసినట్టయితే ఎంతో తేడా కనిపిస్తున్నది. వివిధ రంగాలలో అనేకమైన మార్పులు ఉత్పన్నమై, విజ్ఞాన ప్రపంచాన్ని విస్తృత మొనర్చాయి. ఈ దృష్టితో పరిశీలించినప్పుడు లక్ష్మణరావుగారి విజ్ఞాన సర్వస్వాలలోని 'విషయం' (కొన్ని వ్యాసాలలో) పాతదై పోవచ్చు. అయితే ఆయన చేసిన ప్రయత్నం అమూల్యమైనది. ఆదర్శప్రాయమైనది.

విజ్ఞాన సర్వస్వ సంపుటాల కొరకు ఆయన ప్రత్యేకంగా వ్రాసిన వ్యాసాలు ఆయన బహుముఖ ప్రజ్ఞాప్రాభవాలను చాటిచెప్పుతున్నాయి.

అకరములు, అక్షర సమామ్నాయము, అచ్చు తెలుగు, అథర్వణాచార్యుడు, అథర్వవేదము, అద్వైతము, అధికమాసము, అనంతాచార్యుడు, అనపోతారెడ్డి, అనవేమారెడ్డి, అనాగరక సంఘము, అనుమానము, అంక శ్రేఢులు, అనేక వర్ణ సమీకరణము, అన్నయ్య (తెనాలి), అల్లోపనిషత్తు, అబ్బయామాత్యుడు, అప్పకవి, అభావము, అభిజ్ఞాన శాకుంతలము, అభినయము, అర్థశాస్త్రములు, అవతారములు, అవధానము, అలంకారములు, అశోకవర్ధనుడు అనే ఇరవై ఆరు వ్యాసాలను లక్ష్మణరావుగారు విజ్ఞాన సర్వస్వం కొరకు ప్రత్యేకంగా వ్రాశారు [12]

ఒక్క 'అ' అక్షర క్రమంలో వెలువడిన సంపుటాలలోనే ఆయన ఇన్ని వ్యాసాలను వ్రాశారంటే, మొత్తం విజ్ఞాన సర్వస్వ సంపుటాలన్నీ ఆయన హయాములోనే వెలువడి ఉంటే ఇంకెన్ని వ్యాస పరంపరలను సాహిత్యలోకానికి అందించి ఉండేవారోనని అనిపిస్తుంది. ఆయన మేధాసంపత్తి అమోఘమైనది.

---

12. ఈ ఇరవై ఆరు వ్యాసాలు కూడ లక్ష్మణరావుగారి పేరుతో ఉన్నాయి. పేరు లేకుండా విజ్ఞాన సర్వస్వానికి ఆయన మరికొన్ని వ్యాసాలను రచించినట్టు లక్ష్మణరాయ వర్ధంతి సంచికలో ఆదిరాజు వీరభద్రరావు, గాడిచర్ల హరి సర్వోత్తమరావు మొదలైన వ్యాసకర్తలు పేర్కొన్నారు. లక్ష్మణరావుగారితో అతి సన్నిహితంగా ఉండి ఆయనతో కలిసి పనిచేసిన వారికే తప్ప, ఆ వ్యాసాల సంగతి ఇతరులకు తెలియదు ఆదిరాజు వీరభద్రరావుగారు, గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు – వీరిద్దరూ ఇప్పుడు లేరు. వాటిని కనుక్కోవడానికి వేరే దాఖలాలు కూడా ఏమీలేవు. ఒక్కటి మాత్రం నిజం. విజ్ఞాన సర్వస్వంలో ఆయన శ్రమే ఎక్కువ పాలు కనుక ఆయన వ్రాసిన వ్యాసాలే ఎక్కువగా ఉంటాయని ఊహించవచ్చు. అయితే ఊహించి, ఫలానా వ్యాసం లక్ష్మణరావుగారు వ్రాసింది అని చెప్పడానికి వీలులేదు. కాబట్టి ఆయన పేరుతో ఉన్న వ్యాసాలనే ఇక్కడ ఉదహరించాను.

విజ్ఞాన సర్వస్వానికి లక్ష్మణరావుగారు సమకూర్చిన ఈ స్వీయ వ్యాసావళిలో భాషా పరమైనవి, శాస్త్రసంబంధమైనవి, చారిత్రక ప్రధానమైనవి, సాహిత్య పరమైనవి, సామాజిక సంబంధమైనవి, ఉన్నాయి. సాహితీవేత్తగా, పరిశోధకుడుగా, విమర్శకుడుగా ఆయన ప్రతిభనుచాటిచెప్పే ఈ వ్యాసాలను, ఆయన ఇతర రచనలతోపాటు ఒక ప్రత్యేక విభాగంలో పరిశీలించడం సహేతుకం.

పరిశోధకుడుగా, విమర్శకుడుగా లక్ష్మణరావు గారు తెలుగు దేశంలో, తెలుగు సాహిత్యంలో ఒక సమున్నతమైన స్థానం సంపాదించారు. ఆయన చారిత్రక గ్రంథాలు, వివిధ విషయాలపై ఆయన లేఖిని నుండి వెలువడిన వ్యాస పరంపరలు ఈ సత్యాన్ని చాటి చెప్పుతున్నాయి.

లక్ష్మణరావు గారి మేధా సంపత్తినీ, తెలుగు భాషా సాహిత్యాల వికాసానికి ఆయన చేసిన సేవలను కొనియాడుతూ సుప్రసిద్ధ సాహితీవేత్త వేటూరి ప్రభాకర శాస్త్రిగారు ఆయనను గురించి చెప్పిన అమూల్యమైన మాటలను ఇక్కడ ప్రస్తావించడం సముచితం.

"లక్ష్మణరావుగారు వీరేశలింగం గారి త్రోవనే యనేక అపూర్వ విషయములలో పరిశ్రమించి తెలుగునాటికి మహోపకృతి గావించిరి. ఆంధ్రదేశ భాషా చరిత్రల గూర్చి, సాహిత్య విమర్శనము గూర్చి, ప్రాచీన శాసన పరిశోధనము గూర్చి, విజ్ఞాన సర్వస్వ విరచనము గూర్చి లక్ష్మణరావు గారివలె నంతకు ముందు తెలుగువాడై, తెలుగు విద్వాంసుడై పరిశ్రమించి మంచి విషయముల వెల్లడించినవాడు లేడనుట అతిశయోక్తి కాదు. లక్ష్మణరావు గారు వీరేశలింగము గారికంటె కొన్ని క్రొత్త తీరుల యపూర్వ విషయముల నుపక్రమించి నిర్వహము గావించిరి.''1

విజ్ఞాన చంద్రికను స్థాపించి, విజ్ఞాన సర్వస్వ రచనను చేపట్టి తెలుగు ప్రజల పురోభివృద్ధికి, తెలుగు భాషా సాహిత్యాల వికాసానికి లక్ష్మణరావుగారు ఏ విధంగా తోడ్పడ్డారో దీనికి ముందు వ్రాసిన రెండు ప్రత్యేక విభాగాలలో సవివరంగా పేర్కొన్నాను. ఇక పరిశోధకుడుగా, విమర్శకుడుగా ఆయన చేసిన సేవలను సప్రమాణంగా ఎత్తిచూపడం ఈ విభాగ లక్ష్యం.

తెలుగు సాహిత్యంలో వీరేశలింగం పంతులుగారి 'కవుల చరిత్ర' మొట్ట మొదటి పరిశోధనా గ్రంథమని చెప్పవచ్చు. ఇది 1885 లో ప్రచురించబడింది.

---

1. 'తెలుగు తల్లి' - లక్ష్మణరాయ వర్ధంతి సంచిక. పేజి. 30.

దీనికి ముందు కావలి వెంకట రామస్వామి 1829 లో 'Biographical Sketches of the Deccan Poets' అనే పేరుతో ఆంగ్లంలో ఒక కవుల చరిత్రను రచించారు. కాని ఇది సమగ్రమైనది కాదు. దీనిలో తెలుగు కవుల గురించి చెప్పిన భాగాలు సమగ్రంగా లేవు. పైగా ఇది ఆంగ్ల భాషలో ఉండడం వల్ల తెలుగు దేశంలో ప్రాచుర్యం పొందలేదు. గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారు 1876 నుండి 1882 సంవత్సరాల మధ్య, కొందరు కవుల జీవిత చరిత్రలను నాలుగు సంపుటాలలో ప్రకటించి ఆ తరువాత వాటినే 1693 లో ఒక గ్రంథంగా ప్రచురించారు అయితే ఈ కవుల చరిత్రలో శ్రీరామమూర్తి పంతులుగారు కవుల కాలవిభాగ మేర్పరుపలేదు. అట్లాగే ఆయా కవుల గూర్చి జన వ్యవహారంలో ఉన్న కట్టు కథలను ఆయన గ్రంథస్థం చేశారు. కాబట్టి ఆయన గ్రంథం ప్రామాణిక పరిశోధక గ్రంథం కాదు. వీరేశలింగం పంతులు గారు అనేక గ్రంథాలను, తాళపత్ర ప్రతులను పరిశోధించి ఒక క్రమంలో కవుల చరిత్రను వ్రాశారు. అక్కడక్కడ కొన్ని విషయాలు తరువాత వెలువడిన పరిశోధనా ఫలితాలతో విభేదించినప్పటికీ మొత్తం మీద ఈ గ్రంథం సమగ్రతను, ప్రామాణికతను సంతరించుకొన్నది. పరిశోధన అనేది ఒకనాటితో ఆగేదికాదు. అది నిరంతరమైనది. ఒక శాసనాన్నిబట్టి ఒక చారిత్రకాంశాన్ని మనం నేడు నిర్ణయిస్తాం. కొంత కాలానికి మరో శాసనం బయల్పడి మనం ముందు చేసిన నిర్ణయాన్ని మార్చవచ్చు. చరిత్ర పరిశోధనలో ఇది మామూలే. వీరేశలింగం పంతులుగారు తమ కవుల చరిత్ర ప్రథమ ముద్రణలో బమ్మెర పోతన ఒంటిమిట్ట నివాసి అని పేర్కొని, ఆ తరువాత 1917 లో తమ 'కవుల చరిత్రను' సంస్కరించే సందర్భంలో ఓరుగల్లు వాదాన్ని స్వీకరించారు.[2] అప్పటికి పోతన ఓరుగల్లు నివాసి అని చారిత్రకంగా నిర్ణయింపబడడమే దీనికి కారణం.

వీరేశలింగం పంతులుగారి తరువాత చెప్పుకోదగిన పరిశోధకుడు కొమర్రాజు లక్ష్మణరావుగారు. తెలుగు దేశంలో తెలుగులో వెలసిన మొట్ట

2. 'వీరేశలింగం పంతులు—సమగ్ర పరిశీలన' —డా॥ అక్కిరాజు రమాపతిరావు పేజీ 255.

మొదటి ప్రామాణికమైన చారిత్రక గ్రంథం ఆయన రచించిన 'హిందూ మహా యుగం.' లక్ష్మణరావుగారు కావలి వెంకట బొర్రయ్య తరువాత తెలుగు దేశంలో వెలసిన సుప్రసిద్ధ చారిత్రకవేత్త. ఆయన పరిశోధనా రంగం విస్తృత మైనది ఆయన కేవలం చారిత్రక పరిశోధనకే తనను పరిమితం చేసుకోలేదు; భాషా పరిశోధన, సాహిత్య పరిశోధన, శాస్త్ర పరిశోధన మొదలైన రంగాలలో ఆయన విశిష్టమైన కృషి చేశారు.

## చరిత్ర-చరిత్ర పరిశోధన :

లక్ష్మణరావుగారి చరిత్ర పరిశోధనను పరిశీలించేముందు 'చరిత్ర' అంటే ఏమిటో తెలుసుకుందాం.

చరిత్రను ఆంగ్లంలో 'హిస్టరీ' (History) అంటారు. ఈ హిస్టరీ అనే పదం 'Historia' అనే గ్రీకు పదం నుండి పుట్టింది. మన ప్రాచీనులు చరిత్రనే 'ఇతిహాసం' అని పిలిచారు. ఇతి + హ + అస 'ఇట్లుండెనట' అని దీని అర్థం.

మానవ సంఘం జీవన పరిణామ క్రమాన్ని వివరించేదే చరిత్ర. చరిత్ర కూడా ఒక శాస్త్రం వంటిది. (Social Science).

చరిత్ర విషయ ప్రధానమైనది. దీనిలో కల్పనకు తావులేదు. హృదయా లను రంజింపజేయడం దాని లక్ష్యం కాదు. గడచిపోయిన యథార్థ ఘటనలను వివరించడమే దాని పరమావధి.

"History is a Science of the development of mankind"—అని E. Bernheim చరిత్రను నిర్వచించాడు.[3]

---

3. Lehrbuch der historischen.
Methode und der Geschichts philosophie, Leipzig 1908.
P. 10.

మానవుడు ఈ భూమి మీద సాధించిన అభ్యుదయ పరంపరలే చరిత్రకు కథావస్తువు. ఈ అభ్యుదయ పరంపరలలో రాజకీయపరమైనవి, సాంఘికపరమైనవి, ఆర్థికపరమైనవి, నైతికపరమైనవి ఉన్నాయి చరిత్ర వీటన్నింటి కూడలి. చరిత్ర రాజకీయ, సాంఘిక పరిస్థితులకు అద్దం పడుతుంది కాని, తక్కిన విషయాలు దీనిలో ఎట్లా ఇమిడి ఉన్నాయి అనే సందేహం రావచ్చు,

గజనీ మహ్మద్ అనేక పర్యాయాలు మన దేశం మీద దండెత్తినాడని చరిత్ర చెప్తుంది గజనీ ఆఫ్ఘనిస్తాన్‌కు చెందినవాడు ఆ రోజుల్లో ఆఫ్ఘనిస్తాన్‌లో కరువు విలయతాండవం చేస్తుండేది. ఆ పరిస్థితుల్లో సుభిక్షంగా ఉన్న భారత దేశంపై అతని కన్ను పడింది. భారత దేశంలోని హిందూ దేవాలయాల్లో ఆనాడు అపారమైన ధనరాసులుండేవి. గజనీ వాటన్నింటిని దోచుకొన్నాడు. తన దేశానికి తరలించుకున్నాడు గజనీ మహ్మద్ దండయాత్రలో ఇటువంటి ఆర్థిక కారణాలు దాగిఉన్నాయి. అలాగే ఉత్తరాపథంలోని గంగామైదానాన్ని, దక్షిణాపథంలోని కృష్ణా, తుంగభద్రా నదుల అంతర్వేదిని ఆక్రమించుకోవడానికి ప్రాచీనకాలంలో ఎన్నో రాజవంశాలు పరస్పరం కలహించుకున్నాయి. ఈ ప్రాంతాలు సారవంతమైనవి కావడమే ఇందుకు కారణం. ఈ ప్రాంతాలలో వెలసిన రాజ్యాలే ఆర్థికంగా సుస్థిరతను సాధించుకునేవి సామ్రాజ్యాల స్థాపనకు ఈ ప్రాంతాలలోనే అంకురార్పణ జరిగింది. అట్లాగే రాజవంశాల చరిత్రలో, ప్రజల జీవన సరళిలో నైతికపరమైన అంశాలు నిక్షిప్తమై ఉన్నాయి. కనుకనే చరిత్ర అనేక విషయాలకు కూడలి వంటిది.

మానవుడు ఈనాడు విశిష్టమైన నాగరకతతో విలసిల్లుతున్నాడంటే దానికి గతంలోని క్రమ పరిణామమే కారణం. మన దేశ చరిత్రనే తీసుకుంటే శిలాయుగం నుండి మానవ జీవితం క్రమ పరిణామం చెందుతూ ఏ విధంగా నేటి ఆధునిక జీవన సరళిని సంతరించుకుందో తెలుస్తుంది.

"The intellectual form in which a civilizations renders account to itself of its past." అని J. Huizinga పేర్కొన్నాడు.[4]

4. Philosophy of History - Oxford 1936. P. 9.

జరిగిపోయిన సంఘటనలను చారిత్రకాధారాలతో ఏర్చి కూర్చడమే చరిత్రకారుని పని.

సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకుడు Dr. R C. Mazumdar దీన్ని చక్కగా ఈ క్రింది విధంగా వివరించాడు:

"Firstly, that history is no respector of persons or communities. Secondly that its sole aim is to findout the truth by following the cannons commenly accepted as sound by all historians, and thirdly, to express the truth, without fear, envy, malice, passion, or prejudice and irrespective of all extraneous considerations, both political and humane "[5]

## చరిత్ర-ప్రయోజనం :

ప్రాచీన వాస్తు విశేషాలు, శిల్పసంపద, పురాతన కట్టడాలు, శాసనాలు, నాణెములు, వాఙ్మయం వీటి ఆధారంతో చరిత్ర నిర్మించబడుతుంది. ఇవి ఆయా రాజుల కాలానికి చెందినవై ఉంటాయి. వీటిని పరిశోధించి చరిత్రకారులు చరిత్రను రూపొందిస్తారు చరిత్రకారులు వ్యక్తీకరించిన ప్రతి అభిప్రాయానికి ఆధారం ఉంటుంది.

చరిత్ర ఈ రకంగా వాస్తవికతను చెప్తుంది కనుక అది గతానికి ప్రతిబింబం వంటిది. గతం మానవుని మనుగడను తీర్చిదిద్దుతుంది. 'గతంలో ఈ రకంగా నడచుకుంటే ఈ పొరపాట్లు జరిగాయి. మళ్ళీ ఆ పొరపాట్లు జరుగకుండా జాగ్రత్త వహించు' అని చరిత్ర మానవుడిని ఉద్బోధిస్తుంది.

5. 'The History and Culture of the Indian People'— Struggle for freedom: Preface by Dr. R.C. Mazumdar. P. x x x.

వైజ్ఞానిక శాస్త్రాలను అభ్యసించడం ఎంత ముఖ్యమో చరిత్రను అధ్యయనం చేయడం- అంతే ముఖ్యం.

చరిత్రలో రెండు దేశాల మధ్య, రెండు జాతుల మధ్య జరిగిన పోరాటాలను వర్ణించే ఘట్టాలు ఉండవచ్చు. వాటిని వర్ణించి తిరిగి విద్వేషాలను రెచ్చగొట్టడం చరిత్ర ఉద్దేశంకాదు. ఏ పరిస్థితుల్లో రెండు దేశాల మధ్య లేదా రెండు జాతుల మధ్య విద్వేషాలు ఉత్పన్నమయ్యాయో, వాటివల్ల జరిగిన నష్టాలెటువంటివో వివరించి, మున్ముందు అటువంటి విద్వేషాలు మళ్ళీ తలెత్తకుండా చూడాలని పరోక్షంగా చరిత్ర ప్రబోధిస్తుంది.

చరిత్ర మానవుడిని ఉదాత్తమైన వ్యక్తిగా తీర్చిదిద్దుతుంది.

G.M. Trevelyan మాటల్లో- "The truth about the past if taught and read with broad human Sympathy, can give a noble education to the mind of the student not only in politics, but in all kinds of civic and Social relationships; and even in the domain of personal, religious, and ethical ideals."[6]

## చరిత్ర-సాహిత్యం :

హితంతో కూడింది సాహిత్యం. చారిత్రక, వైజ్ఞానిక గ్రంథాలు కూడా హితంతో కూడుకొన్నవే. గతాన్ని బోధించి, వర్తమాన ప్రవర్తనను తీర్చిదిద్దుతుంది చరిత్ర. విజ్ఞానాన్ని వెదజల్లి మానవుని సర్వతోముఖ వికాసానికి తోడ్పడుతుంది విజ్ఞానశాస్త్రం. కావ్యనాటకాదులవలె-ఇవి హితంతో కూడుకున్నట్టివే. అవి అనుసరించే పద్ధతులు మాత్రమే భిన్నమైనవి.

6. 'Present Position of History'- By G.M. Trevelyan. P.48.

అయితే సాహిత్యం అన్న పదానికి ఇంత విస్తృతమైన ప్రయోగం లేదు. సూక్ష్మంగా పరిశీలిస్తే దానికి అర్థ విస్తృతి కనిపిస్తుంది. కాని ప్రయోగంలో కేవలం కావ్యనాటకాదులకే అది పరిమితమై ఉంది. రసప్రధానములు, ఆనంద ప్రధానములైన గ్రంథజాలమే సాహిత్యం. రసము ఆనందానికి హేతువు.

"వాక్యమ్ రసాత్మకమ్ కావ్యమ్"- అని విశ్వనాథుని నిర్వచనం.

కావ్యం రసాత్మకమేకాదు ఉపదేశాత్మకం.

''కావ్యమ్ యశసేఽర్థకృతే వ్యవహార విదే శివేత రక్షతయే
సద్యఃపర నిర్వృతయే కాంతా సమ్మితతయోపదేశ యుజే"
-అని కావ్య ప్రకాశకర్త మమ్మటుడు.

చరిత్ర రసప్రధానం కాదు. విషయ ప్రధానమైనది. యథార్థ గాథలను యథాతథంగా చరిత్ర వివరిస్తుంది. చరిత్ర ఒక శాస్త్రం. అది శాస్త్రీయ దృష్టిని సంతరించుకొన్నట్టిది. సాహిత్యానిది కావ్యదృష్టి.

చరిత్రకారుడు శివాజి చరిత్రను యథాతథంగా చారిత్రిక ప్రమాణాలతో వివరిస్తాడు చరిత్రకారుడు వివరించిన చారిత్రకాంశాలనే ఆధారంగా తీసుకొని కవి, శివాజీని ఒక ఉదాత్తమైన నాయకునిగా తీర్చిదిద్దుతాడు. వాస్తవికమైన శివాజి చరిత్ర కవి చేతిలో రసవత్తరమైన కావ్యంగా రూపుదిద్దుకొంటుంది. చరిత్రకు, సాహిత్యానికి ఇంత భేదం ఉంది.

చరిత్ర ఉదాత్తమైన సాహిత్య సృష్టికి దోహదం చేస్తుంది. అదే విధంగా సాహిత్య చరిత్ర నిర్మాణానికి చరిత్రే ఆధారం కవుల చరిత్రను తెలుసుకోవడానికి చరిత్రను అధ్యయనం చేయాలి. మన ప్రాచీన కవులు రాజుల ప్రాపకంతో కావ్యాలను రచించారు. చరిత్ర రాజవంశాలను వర్ణిస్తుంది. వీటిని పరిశీలిస్తే మనకు కవుల చరిత్ర తెలుస్తుంది. దీన్నిబట్టి వారి కావ్యాలు ఎప్పుడు వెలువడ్డాయో తెలుసుకోవచ్చు. అలాగే కావ్యాలలోని కృతిపతి వర్ణనలు చరిత్ర నిర్మాణానికి సహకరిస్తాయి.

కావ్యాలలో, నాటకాలలో సాంఘిక స్థితిగతుల వర్ణన ప్రస్తావించబడుతుంది. ఈ వర్ణన కథాకథనంలో అంతర్భాగమైనప్పటికి, కవుల కాలం సరిగ్గా

తెలిస్తే, వారు వర్ణించిన సాంఘిక పరిస్థితులను వారి సమకాలీన సమాజానికి అన్వయించవచ్చు. కవులు సాధారణంగా తమ సమకాలీన పరిస్థితులనే అన్యాపదేశంగా తమ కావ్యాలలో పొందుపరుస్తారు.

చరిత్ర, సాహిత్యం ఈ రెండింటి ఆధారంతోనే ప్రామాణికమైన సాంఘిక చరిత్ర సాధ్యమవుతుంది చరిత్ర రచనలో వాస్తవిక దృష్టి లోపిస్తే సాంఘిక చరిత్రను అంచనా వేయడంలో పొరపాట్లు సంభవిస్తాయి. ఇంతటి విశిష్టమైన ప్రాధాన్యం ఉన్నందువల్లే పాశ్చాత్యులు చరిత్ర రచనకు, అధ్యయనానికి ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చారు. తక్కిన శాస్త్రాలతో సమానంగా దీన్ని పరిగణించారు.

పాశ్చాత్య విద్యావిధానం ప్రభావంతో చరిత్ర అధ్యయనంలో మనం శాస్త్రీయ దృక్పథాన్ని అలవరచుకున్నాం. అంతకుపూర్వం మన చుట్టూ మన ప్రాచీన చారిత్రక సంపద కుప్పలు తెప్పలుగా పడివున్నా మనవాళ్ళు దాన్ని పట్టించుకోలేదు. కట్టుకథలుగా మారిపోయిన చారిత్రక గాథలను మననం చేసుకుంటూ మురిసిపోయారే తప్ప ఆ గాథల వాస్తవిక స్వరూపాన్ని వ్యక్తీకరించే చారిత్రక సామాగ్రి తమ దగ్గరే ఉందన్న సంగతిని తెలుసుకోలేకపోయారు.

## తెలుగుదేశంలో చరిత్ర పరిశోధన - చరిత్రపరిశోధకులు :

మన దేశంలో శాస్త్రీయమైన అధ్యయనం ప్రారంభమైన తరువాత ప్రామాణికమైన చరిత్ర రచనకు ఆస్కారం ఏర్పడిందని చెప్పుకొన్నాం. అంతకు ముందు మనకు చరిత్ర గ్రంథాలు లేవని కాదు. ఉన్నాయి. అయితే 'చరిత్ర'కు మనం ఇప్పుడు చెప్పుకొనే నిర్వచనం వాటికి వర్తించదు. అవి ఆధునిక శాస్త్రీయ పద్ధతుల మీద ఆధారపడి రచించిన నేటి చరిత్ర గ్రంథాల వంటివి కావు. ప్రాచీన కాలంలో 'చరిత్ర'ను ఇతిహాసం అనేవారు. రామాయణ, మహాభారతాలు ఇతిహాసాలే. మన ప్రాచీనులది మత దృష్టి. కావ్యదృష్టి. చారిత్రక దృష్టి వీటి మరుగున పడిపోయింది. ఇతిహాసాన్ని చరిత్ర అని చెప్పుకొన్నప్పటికీ దాన్ని కావ్యంగానే మన ప్రాచీనులు తీర్చిదిద్దినారు.

"ధర్మార్థ కామ మోక్షాణాముపదేశ సమన్వితమ్
పూర్వవృత్త కథాయుక్త మితిహాసం ప్రచక్షత్"—7
—అని రాజశేఖరుడు ఇతిహాసానికిచ్చిన నిర్వచనం.

ధర్మార్థ కామ మోక్షాలతో కూడిన ఉపదేశంతో, ప్రాచీన గాధలతో కూడు కొన్నది ఇతిహాసమని దీని భావం.

భామహుడు కావ్యప్రయోజనాన్ని సూచిస్తూ చెప్పిన నిర్వచనం గమ నించదగింది.

''ధర్మార్థ కామ మోక్షేషు వైచక్షణ్యం కళాసుచ !
కరోతి కీర్తిం ప్రీతించ సాధుకావ్య నిషేవణం."

ధర్మార్థ కామ మోక్షాలను ప్రబోధించే లక్ష్యమే మన ప్రాచీనుల రచనా విధానంలో ప్రధానంగా చోటు చేసుకొన్నది. రాజశేఖరుడు ఇతిహాసానికిచ్చిన నిర్వచనంలో, భామహుడు కావ్యప్రయోజనాన్ని సూచించిన నిర్వచనంలో దీన్నే పేర్కొన్నారు. రచనా విధానంలో ఇద్దరిదీ ఒకే దృష్టి. ఇతిహాసం ప్రాచీన గాథలతో కూడి ఉంటుందని రాజశేఖరుడు చెప్పినప్పటికీ దానిలో కావ్యదృష్టికే ప్రాధాన్యత ఇవ్వబడింది. చారిత్రకమైన విలువ తగ్గిపోయి కావ్యప్రయోజన దృష్టికి ప్రాముఖ్యత ఏర్పడింది.

అయితే ప్రాచీన వాఙ్మయం కూడా చరిత్ర రచనకు ఉపయోగ పడు తున్నది. శాసన సామాగ్రి వలె ఖచ్చితమైన చారిత్రకాంశాలను అది వెల్లడి చేయలేక పోవచ్చు. కాని ఆధునిక పరిశోధనా ఫలితాలను ప్రాచీన వాఙ్మయంతో పోల్చి అధ్యయనం చేసినట్టయితే మనకు మరికొన్ని నూత్న విషయాలు తెలియ డానికి అవకాశం ఉంటుంది.

చరిత్ర పరిశోధనలో పాశ్చాత్య పద్ధతులను ప్రవేశపెట్టి, అమూల్యమైన చరిత్ర సామాగ్రిని సేకరించి దాచి ఉంచినందుకు కర్నల్ కాలిన్ మెకంజీకి

---

7. 'కావ్య మీమాంస' — ద్వితీయాధ్యాయం. శ్లోకం. 3.

మనం ఎంతో ఋణపడి ఉన్నాం. ప్రామాణికమైన చరిత్ర నిర్మాణానికి బాటలు వేసింది ఆయనే ఆయనకు ఈ బృహత్ప్రయత్నంలో తోడ్పడిన కావలి వెంకట బొర్రయ్యను కూడా మనం ఆయనతో సమానంగా సంస్మరించుకోవాలి.

వెంకట బొర్రయ్య తెలుగువాడు కాబట్టి తెలుగు దేశానికి చెందిన చారిత్రక పరిశోధకులలో అతడు ప్రథమ గణ్యుడు. అతని దగ్గర పనిచేసిన కావలి వెంకట రామస్వామి, వెంకటరావు, నారాయణరావు, నిట్టల నయనారు - వీరందరూ దక్షిణ భారతంలోని పలు ప్రాంతాలలో పర్యటించి, ప్రాచీన చారిత్రక సామగ్రిని సంపాదించారు. వీరిలో చాలామంది తెలుగువారు. వీరు సేకరించిన వ్రాత ప్రతులు, దాదాపు నాలుగు వందల సంపుటాల రూపంలో మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉన్నాయి. తరువాత బ్రౌన్ మహాశయుడు వీటిలోని అరవైకి పైగా ప్రతులకు శుద్ధ ప్రతులను వ్రాయించాడు. కావలి వెంకట బొర్రయ్య లిపి మర్మజ్ఞుడు. ప్రాచీన దాక్షిణాత్య శాసనాలను అధ్యయనం చేసే మార్గాన్ని ఆయన కనుగొన్నాడు. లిపి పరిశోధనలో అనంతర చరిత్ర పరిశోధకులకు ఆయన చూపిన మార్గమే అనుసరణీయమైనది.

గుంటూరుకు చెందిన శ్రీమాన్ బుక్కపట్టణం రాఘవాచార్యులుగారు ఆంధ్రదేశ చరిత్రను రచించడానికి పూనుకొన్నట్టు తెలుస్తున్నది. ఆ రోజుల్లో మద్రాసు గవర్నర్ కౌన్సిల్ మెంబర్‌గా పనిచేస్తున్న కార్మైకేల్ అనే ఆంగ్లేయుని ప్రోత్సాహంతో రాఘవాచార్యులు గారు ఆంధ్రదేశ చరిత్రను కొన్ని సంపుటాల రూపంలో రచించి, తిరిగి వాటిని కార్మైకేల్‌కు ప్రచురణ నిమిత్తం అప్పగించారు కార్మైకేల్ వీటిని సరిగా సంరక్షింప లేకపోయినందున అవి నష్టమైపోయాయి.[8]

8. ఒకసారి మానవల్లి రామకృష్ణ కవిగారు మద్రాసులోని ఒక వీధిలో వ్రాత ప్రతులను కొనగా, వాటిలో రాఘవాచార్యులు గారు రచించిన ఆంధ్రదేశ చరిత్ర సంపుటం ఒకటి (వ్రాత ప్రతి) ఉన్నదనీ, దాన్ని ఆయన వేటూరి ప్రభాకరశాస్త్రిగారికి అందజేయగా, శాస్త్రిగారు శిథిలావస్థలో ఉన్నదానిని మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారానికి చేరవేశారని నేలటూరి వెంకట రమణయ్యగారు 1949 భారతి రజతోత్సవ సంచికలో పేర్కొన్నారు.
—భారతి 1949 రజతోత్సవ సంచిక పేజి 153.

రాఘవాచార్యులు గారి ఆంధ్రదేశ చరిత్ర ప్రచురింపబడలేదు కాబట్టి ఆయన రచనా విధానం ఎటువంటిదో మనకు తెలియదు. అయితే చారిత్రక పరిశోధకు లలో ఆయనను కూడా ప్రస్తావించక తప్పదు.

వీరేశలింగం పంతులుగారు 1885 లో 'కవుల చరిత్ర'ను రచించి చరిత్ర పరిశోధనకు ప్రోత్సాహం అందించారు. చరిత్ర పరిశోధన పంతులుగారి అభిమతం కాదు వారికున్న భాషాభిమానం చరిత్ర పరిశోధనకు పురికొల్పింది. తెలుగు భాషా సాహిత్యాలను సుసంపన్నం చేసిన కవుల జీవితాలను గ్రంథస్థం చేయడానికై పంతులుగారు ప్రాచీన చరిత్ర సామగ్రిని అధ్యయనం చేశారు. ఆయా రాజవంశాల చరిత్రను పరిశీలించి, కవుల చరిత్రను రూపొందించారు.

పంతులుగారి 'కవుల చరిత్ర' ఆనాడు ఎంతో మంది విద్యార్థులను 'చరిత్ర పరిశోధనకు' పురికొల్పింది ఆ తరువాత లక్ష్మణరావుగారి రాకతో చరిత్ర పరిశోధనలో నూతనాధ్యాయం ప్రారంభమైంది.

లక్ష్మణరావుగారు ప్రప్రథమంగా తెలుగు భాషలో ప్రామాణికమైన దేశ చరిత్రను రచించి, చరిత్ర పరిశోధకులలో ప్రముఖ స్థానం సంపాదించారు.

కావలి వెంకటబొర్రయ్య తెలుగు దేశానికి చెందిన చరిత్ర పరిశోధకులలో అగ్రగణ్యుడు లక్ష్మణరావుగారు తెలుగు భాషలో దేశచరిత్రను రచించిన వారిలో ప్రథమ గణ్యుడు.

చరిత్రను ప్రధాన విషయంగా (optional subject) తీసుకొని ఎమ్ ఏ చదవడం వల్ల, పాశ్చాత్య పరిశోధనా పద్ధతులు ఆయనకు బాగా తెలిశాయి.

కేవలం మెకంజీ, కావలి బొర్రయ్య సేకరించి పెట్టిన వ్రాత ప్రతులపై ఆధారపడి చరిత్ర రచనకు లక్ష్మణరావుగారు పూనుకోలేదు. ప్రభుత్వ శాసన పరి శోధనాశాఖ ప్రకటించిన శాసనాలను, తాను స్వయంగా సేకరించిన శాసనాలను,

ప్రాచీన వాఙ్మయాన్ని పరిశీలించి ఆయన దేశ చరిత్రను రచించారు లక్ష్మణరావు గారి ప్రోత్సాహంతో చిలుకూరి వీరభద్రరావుగారు ఆంధ్రుల చరిత్రను రచించారు.

వీరి తరువాత చరిత్ర పరిశోధనలో కృషి చేసిన వారిలో మల్లంపల్లి సోమశేఖర శర్మగారు చెప్పుకోదగినవారు. శర్మగారు లక్ష్మణరావుగారికి అతి సన్నిహితులు. లక్ష్మణరావుగారి సాన్నిహిత్యం లభించడంవల్ల ఆయన విశిష్టమైన చరిత్ర పరిశోధకుడుగా రూపొందగలిగాడు. అమరావతీ స్థూపం, మన ప్రాచీన విద్యాసంస్థలు, "A forgotten chapter of Andhra History", "The History of the Reddy kingdoms"అనేవి ఆయన వ్రాసిన చారిత్రక గ్రంథాలలో పేర్కొనదగినవి. శర్మగారి తరువాత వేటూరి ప్రభాకరశాస్త్రి, భావరాజు వెంకట కృష్ణారావు, రాళ్ళబండి సుబ్బారావు, కురుగంటి సీతారామ భట్టాచార్యులు, మారేమండ రామారావు, నేలటూరి వెంకటరమణయ్య, పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు మొదలైనవారు తెలుగు దేశంలోని చారిత్రక పరిశోధకులలో చెప్పుకోదగినవారు.

ఆంధ్రేతిహాస మండలి, లక్ష్మణరాయ పరిశోధకమండలి తెలుగుదేశంలో చరిత్ర పరిశోధనకు కొంత ప్రోత్సాహాన్ని అందించాయి. ఆంధ్ర సారస్వత పరిషత్పత్రిక, శారద, భారతి మొదలైన పత్రికలు చరిత్ర పరిశోధకులను ప్రోత్సహించి, అనేక చారిత్రకాంశాలు వెల్లడి కావడానికి తోడ్పడ్డాయి.

## చారిత్రక పరిశోధకుడుగా లక్ష్మణరావు:

లక్ష్మణరావుగారు రచించిన చారిత్రక గ్రంథాలు మూడు. అవి హిందూ మహాయుగం, మహ్మదీయ మహాయుగం, శివాజీ చరిత్ర. ఈ మూడింటిలో హిందూమహాయుగం, మహ్మదీయ మహాయుగం ఉత్కృష్టమైన గ్రంథాలు. పురావస్తు సామగ్రిని, ప్రాచీనవాఙ్మయాన్ని, పాశ్చాత్యచరిత్రకారుల గ్రంథాలను ఉప్ యోగ చేసి లక్ష్మణరావుగారు వీటిని ఉత్తమ చారిత్రక గ్రంథాలగా తీర్చి

దిద్దినారు. ఆయన హిందూదేశ చరిత్రను నాలుగు సంపుటాలుగా రచించాలని తలపెట్టి రెండు సంపుటాలను మాత్రం పూర్తి చేయగలిగారు. ఆయన అనేక చారిత్రక వ్యాసాలను వ్రాశారు.

విజ్ఞాన చంద్రికను స్థాపించడంలోని ఉద్దేశాలలో దేశ చరిత్రలను అందించాలన్నది కూడా ఒకటి. ఈ ఉద్దేశాన్ని విజ్ఞాన చంద్రిక నిర్వాహకులు పూర్తిగా నెరవేర్చుకోగలిగారు.

లక్ష్మణరావుగారి చారిత్రక గ్రంథాలు ''ముందు రాగల గాంధీ యుగానికి తెలుగు వారి హృదయ క్షేత్రములను పదునుచేసిన గ్రంథ రాజములు'' అని మల్లంపల్లి సోమశేఖరశర్మగారు వ్యాఖ్యానించారు.[9]

మన ప్రాచీన సంస్కృతిని, ప్రాచీన వైభవాన్ని, గతంలోని ఒడుదొడుకులను తెలుగు ప్రజలకు తెలియపరచి, జాతీయోద్యమానికి వారి సానుభూతిని సంపాదించడంలో ఈ చారిత్రక గ్రంథాలు ఎంతగానో తోడ్పడ్డాయి.

మన దేశంలో చరిత్ర పరిశోధన ప్రారంభ దశలో ఉన్నప్పుడే లక్ష్మణరావుగారు హిందూ మహాయుగం, మహమ్మదీయ మహాయుగం వంటి విశిష్టమైన గ్రంథాలను రచించడం చెప్పుకోదగింది ఈ గ్రంథాలు ఇప్పటికీ ప్రామాణికమైనవే

ఆధునిక చరిత్రకారులు ప్రస్తావించని అనేక నూత్న విషయాలను లక్ష్మణరావుగారు తన చారిత్రక గ్రంథాలలో ప్రస్తావించారు.

ఆయన సంస్కృతాంగ్ల భాషల్లో నిష్ణాతుడు. దీనికి మించి శాసన పరిశోధకుడు. ప్రాచీన లిపిని అధ్యయనం చేయడంలో కావలి వెంకట బొర్రయ్యతో సమానుడు.

9 'తెలుగుతల్లి' – లక్ష్మణరాయ వర్ధంతి సంచిక. పేజి. 59

చరిత్రను ఎంత చక్కగా రూపొందించవచ్చునో ఆయన తన గ్రంథాల ద్వారా నిరూపించారు. చరిత్ర రచనలో ప్రమాణాలను అనుసరిస్తూనే పాఠకుడికి కుతూహలం కలిగించే విధంగా వాటిని తీర్చిదిద్దినారు.

## హిందూ మహాయుగం :

విజ్ఞాన చంద్రిక ద్వితీయ కుసుమంగా హిందూ మహాయుగం 1907 లో వెలువడింది. విజ్ఞాన చంద్రిక ప్రచురించిన మొదటి గ్రంథం అబ్రహామ్ లింకన్ జీవిత చరిత్ర. హిందూ మహాయుగం ఆరు ప్రకరణాలుగా విభజించబడి మొత్తం 231 పేజీలలో రచించబడింది.

లక్ష్మణరావుగారు ఈ గ్రంథం రచించే నాటికి మన ప్రాచీన నాగరికత ఋగ్వేద కాలంనుండే ప్రారంభమైందన్న అభిప్రాయం ఉండేది. అయితే 1922 లో సింధునది మైదానంలోని మొహింజొదారో, హరప్పా మొదలైన చోట్ల జరిగిన తవ్వకాల ఫలితంగా విస్తృతమైన ప్రాచీన నాగరికతా శిధిలాలు బయల్పడ్డాయి. దీనితో భారతీయ చరిత్ర ప్రాచీనతా పరిమితి క్రీ. పూ. రెండు వేల సంవత్సరాలనుండి క్రీ పూ. మూడువేల సంవత్సరాలకు పోయింది. దీనికి సింధులోయ నాగరికత (Indus Valley Civilization) అని మన వారు పేరుపెట్టినారు. ఈ నాగరికత శిధిలాలు బయల్పడక పూర్వం లక్ష్మణ రావుగారు హిందూ మహాయుగం రచించారు కాబట్టి దీనికి సంబంధించిన సమాచారం ఈ గ్రంథంలో కనిపించదు.

అయితే ఈ నాగరికతకు సంబంధించిన విషయాలు 1922 లో వెంటనే చరిత్ర గ్రంథాలలో చోటుచేసుకోలేదు. చరిత్ర పరిశోధకుల తర్జన భర్జనల అనంతరం ఇవి చరిత్ర గ్రంథాలలో ప్రవేశించాయి. లక్ష్మణరావుగారు 1923 లో పరమపదించకుండా ఉంటే తప్పకుండా సింధులోయ నాగరికతను హిందూ మహాయుగానికి చేర్చి, దాన్ని పునర్ముద్రించి ఉండేవారు.

ఆధునిక చరిత్రకారులు మన దేశచరిత్రను ప్రాచీన చరిత్ర (Ancient History), మధ్యయుగ చరిత్ర (Medival History), ఆధునిక చరిత్ర (Modern History) అని విభజించారు. లక్ష్మణరావుగారు హిందూ మహా యుగం, మహ్మదీయ మహాయుగం, మహారాష్ట్రుల మహాయుగం, బ్రిటిషు మహా యుగం అనే విభజనతో మన దేశ చరిత్రను రచించాలని సంకల్పించి, మొదటి రెండు సంపుటాలను మాత్రమే వెలువరించగలిగారు. ఆయన ఇంకా కొన్నాళ్ళు బ్రతికి ఉంటే తక్కిన రెండు సంపుటాలు కూడా వెలువడి ఉండేవి.

1907 నుండి 1910 వరకు హిందూ మహాయుగం నాలుగుసార్లు పునర్ముద్రింపబడింది. ప్రతి సంవత్సరానికి ఒకసారి చొప్పున వరుసగా నాలుగు సంవత్సరాలు ఇది పునర్ముద్రణ భాగ్యానికి నోచుకొన్నదంటే ఆ రోజుల్లో దీనికి ఎంత ప్రాచుర్యం ఉండేదో ఊహించవచ్చు "ప్రతి సంవత్సరము క్రొత్త కూర్పు అచ్చుపడులాగునజేసి యాంధ్రజనులు ఈ గ్రంథమునకు అనన్య సామాన్యమైన గౌరవము కలుగజేసిరి" అని లక్ష్మణరావుగారు నాల్గవ కూర్పులో కృతజ్ఞతలు తెలుపుకొన్నారు. తెలుగు భాషకు ప్రాధాన్యం అంతగాలేని ఆ రోజుల్లో ఈ గ్రంథం వెలువడి తెలుగు భాషా వికాసానికి ఎంతగానో తోడ్ప డిందంటే అది అతిశయోక్తి కానేరదు.

మద్రాసు విశ్వవిద్యాలయం 1909లో ఈ గ్రంథాన్ని మెట్రిక్యులేషన్ పరీక్షకు పాఠ్య గ్రంథంగా నిర్ణయించింది.

1906 ప్రాంతంలో ఉన్నత పాఠశాలలన్నింటిలో 'సిటిజన్ ఆఫ్ ఇండియా' అనే పుస్తకం పాఠ్యపుస్తకంగా ఉండేది ఈ పుస్తకాన్ని ప్రభుత్వమే ప్రకటించి పాఠ్య విషయంగా నిర్ణయించింది ఈ గ్రంథంలో బ్రిటిషు పరిపాలనవల్ల దేశానికి కలిగిన లాభాలు పేర్కొనబడ్డాయి లక్ష్మణరావుగారి హిందూ మహాయుగం పాఠ్య గ్రంథంగా నిర్ణయింపబడిన తరువాత ఉపాధ్యాయులు 'సిటిజన్ ఆఫ్ ఇండియా' లోని వ్రాతలను ఖండిస్తూ పాఠాలు చెప్తుండేవారని ఆచంట లక్ష్మీపతి గారు తమ స్వీయ చరిత్రలో పేర్కొన్నారు.[10]

10. 'స్వీయ చరిత్ర'—ఆచంట లక్ష్మీపతి. పేజి. 107.

"ప్రాచీన హిందువుల యొక్క ఔన్నత్యమును తెలిపెడి ఇట్టి చరిత్ర సిదివరకు నాంధ్ర భాషలో నెవ్వరును రచించియుండలేదు." అని ఆంధ్రకేసరి పత్రిక ఆ రోజుల్లో దీన్ని శ్లాఘించింది.

మన ప్రాచీన చరిత్ర గురించి ఆ రోజుల్లో చాలా మందికి తెలియదు. హిందూ మహాయుగం వెలువడి తెలుగు ప్రజలందరిని ఆశ్చర్యచకితులను చేసింది.

ప్రాచీన కాలంనాటి మన దేశ సాంఘిక పరిస్థితులను ఆయన చక్కగా వివరించారు దీనికి ఋగ్వేదం నుండి కొన్ని ఉదాహరణలను చూపించారు.

"అప్పటి వారిప్పటివలె జాతిభేద మెరుంగరు. ఆర్యు లనార్యులన్న భేదము తప్ప మరియే వర్ణ భేదమును అప్పుడు లేదు వృత్తినిబట్టి యప్పుడు జాతు లేర్పడ లేదు" అని పేర్కొంటూ, అందుకు సాక్ష్యంగా ఋగ్వేదంలోని "నేను వేద మంత్రములను రచించు వాడను, నా తండ్రి వైద్యుడు. నా తల్లి పిండి విసరును" అని ఒక మంత్రద్రష్ట చెప్పిన మాటలను ఉదహరించారు

లక్ష్మణరావుగారు చరిత్ర రచనలో ఎంతటి నిష్పక్షపాత దృష్టిని ప్రద ర్శించారో ఇవన్నీ రుజువు చేస్తున్నాయి.

నేటి చరిత్ర పాఠ్య గ్రంథాల కంటే లక్ష్మణరావుగారి చారిత్రక గ్రంథాలు ఎంతో వివరణాత్మకంగా ఉన్నాయి ఆయన తాను వెలిబుచ్చిన ప్రతి అభిప్రాయా నికి ప్రమాణం చూపించారు మధ్య మధ్య ప్రాచీన కాలంనాటి సాంఘిక పరి స్థితులు ఎట్లా ఉండేవో వివరించారు. వేద వాఙ్మయ క్రమ పరిణామాన్ని వివరంగా పేర్కొన్నారు

లక్ష్మణరావుగారు రాముడు అయోధ్య నుండి లంకకు (సింహళము) వెళ్ళిన మార్గాన్ని చారిత్రకంగా ఈ గ్రంథం తృతీయ ప్రకరణంలో సచిత్రంగా చూపించారు. దీనికి వాల్మీకి రామాయణాన్ని ఆధారంగా తీసుకొన్నారు.[11] ఇతి హాసాలు చరిత్ర రచనకు ఎట్లా ఉపయోగపడుతాయో ఇది తెలియజేస్తున్నది.

11. 'హిందూ మహాయుగం'. పేజి. 50.

వాల్మీకి రామాయణంలో వర్ణించిన శ్రీరాముని పర్ణశాల మహారాష్ట్ర ప్రాంతంలోని నాసికా పట్టణం సమీపంలో ఉందన్న మహారాష్ట్ర పండితుల వాదనలను త్రోసిపుచ్చి, ఆ పర్ణశాల తెలుగుదేశంలో భద్రాచలం సమీపంలో ఉండేదని చారిత్రకంగా నిరూపించారు.

ఆరవ ప్రకరణంలో 'శాస్త్రజ్ఞానాభివృద్ధి' శీర్షికన ప్రాచీన కాలంలో రచించబడిన వివిధ శాస్త్రాల గురించి వ్రాశారు.

సుశ్రుతుని శస్త్ర వైద్య గ్రంథాన్ని గురించి చెప్తూ, ''అరబ్బులీ విద్యలను హిందువుల వద్దనుండి నేర్చుకొని యైరోపావారికి నేర్పిరి.'' ''నూట ఇరువది యేడు సూక్ష్మ శస్త్రములు వర్ణింపబడినవి. ఈ శస్త్రములు చకచక లాడుచును, పదును గలవిగను, వెంట్రుకను నిలువుగ రెండు తునకలు చేయునంత సూక్ష్మముగను, తీక్షణముగను నుండవలెనని చెప్పబడియున్నది అప్పుడు శస్త్ర చికిత్సలు విశేషముగ జరుగుచుండెను'' అని పేర్కొన్నారు

సుశ్రుతుడు వైద్యగ్రంథం వ్రాశాడని ఒక్కమాటలో చెప్పి వదలివేయడం ఆయన అభిమతం కాదు. ఆ వైద్య గ్రంథాన్ని స్వయంగా పరిశీలించి ఆయన పై వాక్యాలను వ్రాశారు.

"యజ్ఞయాగాది క్రతువులు తగ్గుట వలన యజ్ఞ కుండములను గురించి యుద్భవించిన రేఖాగణితమును జనులు విశేషముగ నభ్యసింపరైరి. కాని నీ విద్యను హిందువుల వలన నేర్చుకొనిన గ్రీకు వారీ శాస్త్రమునందు హిందువుల కంటె నధికగతి కలవారైరి.'' అని గణిత శాస్త్రాన్ని గురించి ప్రస్తావించారు.

ఆంగ్లేయుల రాకవల్లే భారతీయులకు వివిధ శాస్త్ర విషయాలు తెలిశాయన్న ప్రచార వ్యాప్తిని హిందూ మహాయుగం నిరోధించింది. ఆంగ్లేయులకు ముందే మనకు శాస్త్ర విషయాలనేకం తెలుసు అయితే సరియైన అధ్యయన సౌకర్యాలు లేకపోవడంవల్ల అవి నిద్రాణమైన స్థితిలో ఉండిపోయాయని ఈ గ్రంథం తెలుగు ప్రజలకు తెలియజెప్పింది.

ఒక జాతి నిర్వీర్యమై ఉన్నతరుణంలో ఆ జాతిలో నవ చైతన్యం కలిగించి కర్తవ్యోన్ముఖులను చేయడం రచయిత విధి. అటువంటివాడే నిజమైన రచయిత. ''ఆంగ్లేయులు చాలా మంచివారు. వారు ఎంతో దూరంలో ఉన్న తమ దేశం నుండి భారతీయులను బాగుచేయడానికి వచ్చారు'' అనే ప్రచార ప్రవాహంలో మన దేశ ప్రజలు కొట్టుకుపోకుండా వారికి మన ప్రాచీన ఔన్నత్యాన్ని చాటి చెప్పి, 'ఐనైక్యతతో మనం, మన దేశాన్ని యిన్నేళ్ళనుండి బాగు చేసుకోలేకపోయాం. ఇప్పుడు బాగు చేసుకుందాం, రండి!' అని ఆనాడు పరోక్షంగా ఈ గ్రంథం కర్తవ్య ప్రబోధం చేసింది.

## మహమ్మదీయ మహాయుగం :

హిందూ మహా యుగం ప్రచురింపబడిన తరువాత ఒక ఏడాదికి అంటే 1908 లో విజ్ఞాన చంద్రిక ఐదవ కుసుమంగా మహమ్మదీయ మహాయుగం వెలువడింది. హిందూ మహాయుగం కంటే ఈ భాగాన్ని లక్ష్మణరావుగారు విస్తరించి వ్రాశారు.

మహమ్మదీయ మహాయుగంలో కేవలం మహమ్మదీయుల చరిత్రే వర్ణింపబడలేదు. 'మహమ్మదీయ మహాయుగం' అనేది కాల సూచకమైన గుర్తు. దీనిలో ఆనాటి హిందూ రాజ్యాల గురించి కూడా సవివరంగా పేర్కొనబడింది.

ఈ గ్రంథంలో ఆరు ప్రకరణాలున్నాయి. 412 పేజీలలో ఇది ప్రచురించబడింది.

ఈ గ్రంథం లక్ష్మణరావుగారి విశిష్టమైన ప్రతిభకు ఏ విధంగా అద్దం పట్టిందో మల్లంపల్లి సోమశేఖర శర్మగారు వివరించారు.

''మహమ్మదీయ మహాయుగం లక్ష్మణరావుగారి విమర్శనా పాటవం, సత్యప్రియత్వం-వీటిని మించి ఆయన జాతీయ దృష్టి ఎటువంటిదో వివరించే వాఖ్యాన గ్రంథం''.[12]

---

12. 'తెలుగు తల్లి'—లక్ష్మణరాయ వర్ధంతి సంచిక. పేజీ59.

చరిత్ర రచనలో లక్ష్మణరావుగారిది జాతీయ దృష్టి.

"Our main aim has been to present Indian History from the point of view of the fundamental unity of the country. People of different races, coloures, religious and languages have come to it from time to time. The culture of this country has absorbed their varied cultures, very often enriching its own in the Process".[13]

ఇదే విధమైన జాతీయదృక్పథాన్ని లక్ష్మణరావుగారు మహ్మదీయ మహా యుగానికి వ్రాసిన పీఠికలో వ్యక్తీకరించారు.

"పూర్వము మరాటా వారు బంగాళమును దోచుకొనిరని ప్రస్తుత కాల మందలి బంగాళీవారు మరాటా వారిని ద్వేషించుట యెంత హాస్యాస్పదమో, పూర్వమౌరంగజేబు హిందువులను బాధపెట్టెననియు, అళియ రామరాజు తురుష్కుల బాధపెట్టెననియు నిప్పటి హిందూ ముసల్మానులు పోరాడుట యంతే హాస్యాస్పదము."[14]

తనకు ముందు, పాశ్చాత్య చరిత్రకారులు వ్రాసిన చరిత్ర గ్రంథాలలో లేని అనేక నూత్న విషయాలను ఆయన ఈ గ్రంథంలో పొందుపరచారు.

వాస్తవిక దృష్టితో మంచీచెడుల ప్రస్తావనే ఈ గ్రంథ రచనకు ఆలంబన మైంది. "నేనీ చరిత్ర వ్రాయుటలో 'అయంనిజఃపరోవా' అన్న భేదము పాటింప లేదు" అని ఆయన పేర్కొన్నారు.

---

13. 'India through the Ages' — (Preface Page) Edited by Dr. K.C. Vyas, Prof. D.R. Sur Desai, Prof. S.R. Nayak.

14. మహ్మదీయ మహా యుగము—పీఠిక.

ఆయన సాహితీవేత్త, విద్యావేత్త కాబట్టి వివిధ భాషల్లోని ప్రాచీన చారిత్రక గ్రంథాలను, కావ్యాలను పరిశీలించి తనకు కావలసిన సమాచారాన్ని వాటి నుండి సేకరించారు.

మరాఠీ గ్రంథాలు, హిందీ గ్రంథాలు, మద్రాసులోని ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలోని స్థానిక చరిత్రలు, జైమినీ భారతం, వరాహ పురాణం, మను చరిత్ర, పారిజాతాపహరణం, వసు చరిత్ర, కళాపూర్ణోదయం, తపతీ సంవరణోపాఖ్యానం మొదలైన కావ్యాలను ఆయన ఈ మహ్మదీయ మహాయుగం రచనకు ఉపయోగించుకొన్నారు.

ప్రాచీన మహ్మదీయ చరిత్రకారులు తమ చరిత్ర గ్రంథాలలో ఏ విధంగా పక్షపాత వైఖరిని ప్రదర్శించారో ఆయన సోదాహరణంగా వివరించారు.

లక్ష్మణరావుగారు చెప్పిన ఆనందపాలుని వృత్తాంతాన్ని మన దేశ చరిత్ర వ్రాసిన పాశ్చాత్య చరిత్రకారులెవ్వరూ తమ గ్రంథాలలో ఉదహరించలేదు. ఆధునిక చరిత్రకారులు కూడా దీన్ని పట్టించుకోలేదు.

గజనీ మహ్మద్ 12 సార్లు మన దేశం మీదకు దండెత్తి, మన దేశాన్ని కొల్లగొట్టినాడని, అతన్ని ఆనాడు ఎవ్వరూ ఎదిరించలేదని పాశ్చాత్య చరిత్రకారులు, మహ్మదీయ చరిత్రకారులు తమ గ్రంథాలలో పేర్కొన్నారు.

లక్ష్మణరావుగారు ఇది నిజం కాదని, గజనీ మహ్మద్‌ను ఆనందపాలుడనే హిందూ రాజు ఓడించాడని, అందుకు ఆధారం చూపించారు.

ఆనందపాలుడు గజనీ మహ్మద్‌కు వ్రాసిన ఒక ఉత్తరాన్ని ఆల్ బెరూనీ తాను వ్రాసిన ''తారీఖ్-ఈ-హింద్'' అనే గ్రంథంలో ఉదహరించాడు. ఈ ఆల్ బెరూనీ గజనీమహ్మద్ ఆస్థానంలో ఉండేవాడు. ప్రాచీన కాలానికి చెందిన సుప్రసిద్ధ మహ్మదీయ చరిత్రకారులలో ఇతడొకడు. ఆల్ బెరూనీ కూడా గజనీ మహ్మద్‌ను ఎవ్వరూ ఎదిరించలేదని వ్రాశాడు. ఈ ఉత్తరం ప్రసక్తానుప్రసక్తంగా

ఈ గ్రంథంలో చోటు చేసుకొన్నది. ఈ ఉత్తరాన్ని క్షుణ్ణంగా పరిశీలించి దానిలోని అమూల్యమైన విషయాలను లక్ష్మణరావుగారు వెల్లడించారు.

ఒకసారి గజనీ మహ్మద్ మీదకు అతని శత్రువులు దండెత్తిపస్తున్నారని ఆనందపాలునికి తెలుస్తుంది. ఆ సమయంలో ఆనందపాలుడు గజనీ మహ్మద్‌కు సహాయం అందజేయడానికి ముందుకు వస్తాడు. ఆ విషయాన్నే తెలియజేస్తూ గజనీ మహ్మద్‌కు ఒక ఉత్తరం వ్రాస్తాడు. ఆ ఉత్తరంలో "నిన్ను ఓడించిన గౌరవం నా కొక్కడికే తప్ప ఇతరులకు దక్కకూడదని" ఆనందపాలుడు వ్రాసిన వాక్యాన్ని లక్ష్మణరావు గారు పేర్కొన్నారు. ఆపదలో ఉన్న శత్రువుకు ఆదుకొనే ఔదార్యం ఆనందపాలునికి ఉండేదని, ఆ రోజుల్లోని హిందూ రాజుల ప్రవృత్తిని ఇది తెలియజేస్తున్నదని ఆయన వ్యాఖ్యానించారు.

ఆల్ బెరూనీ ఆనందపాలుని శత్రు పక్షంలోనివాడు. అతడే ఈ ఉత్తరాన్ని తన గ్రంథంలో ఉదహరించాడంటే, దానిలోని అంశం ముమ్మాటికి నిజమై ఉంటుంది.

పాశ్చాత్య చరిత్రకారులు దీన్ని సరిగా పరిశీలించకపోవడం వల్ల మనకు అమూల్యమైన ఈ చారిత్రకాంశం తెలియకుండాపోయింది.

ఫెరిస్తా అనే మహ్మదీయ చరిత్రకారుడు కులీకుతుబ్ షా పానగల్లు దుర్గాన్ని కృష్ణరాయల దగ్గరి నుండి స్వాధీనం చేసుకొన్నాడనీ, కొండవీటి దగ్గర కృష్ణరాయలు ఓడిపోయాడని వ్రాశాడు. లక్ష్మణరావు గారు 'తపతీ సంవరణోపాఖ్యానం', 'కళా పూర్ణోదయం' ఈ రెండు కావ్యాల ఆధారంగా ఫెరిస్తా వ్రాతల్లో నిజం లేదని నిరూపించారు.

"తపతీసంవరణోపాఖ్యానం"లో అద్దంకి గంగాధర కవి కులీకుతుబ్ షాను వర్ణిస్తూ, అతడు పానగల్లు దుర్గాన్ని దమదిమిల్లా ఖానుడను మహ్మదీయుడి నుండి స్వాధీనం చేసుకొన్నాడని పేర్కొన్నాడు.

అట్లాగే కులీకుతుబ్‌షా కృష్ణరాయలను కొండవీటి దగ్గర ఓడించాడన్న వాదాన్ని 'కళాపూర్ణోదయం' ఆధారంగా త్రోసిపుచ్చుతూ, కులీకుతుబ్‌షాయే కొండవీటి దగ్గర ఆర్వీటి నారపరాజు చేతిలో ఓడిపోయాడని తెలియజేశారు.

అట్లాగే ఔరంగజేబును అయిదారుసార్లు ఓడించి స్వతంత్రుడైన ఛత్రసాల్ రాజు వృత్తాంతాన్ని లక్ష్మణరావుగారు స్వీయ పరిశోధన ద్వారా సేకరించి పొందుపరచారు. అంతకుముందు చరిత్రకారులెవ్వరూ దీన్ని ప్రస్తావించలేదు.[15]

అక్కన్న మాదన్నల చరిత్ర ఈ గ్రంథంలో సవిస్తరంగా వర్ణించబడింది. అంతకుముందు వీరి చరిత్ర ప్రజల నోళ్ళల్లో ఒక ఐతిహ్యంగా మాత్రమే ఉండేది. కుతుబ్‌షాహీల చరిత్రను, జనవ్యవహారంలోని గాథలను పరిశీలించి లక్ష్మణరావుగారు వీరి వృత్తాంతాన్ని చరిత్ర కెక్కించారు.[16]

ఉత్తమ స్వభావం గలవారు మహమ్మదీయులైనా సరే, వారిని గురించి పక్షపాతం లేకుండా వర్ణించారు.

గజనీమహమ్మద్, గియాజుద్దీన్‌తుగ్లక్, ఫిరోజ్‌తుగ్లక్, బాబర్, అక్బర్, ఔరంగజేబు మొదలైన మహమ్మదీయ రాజుల వర్ణనా ఘట్టాలలో మనం దీన్ని గమనించవచ్చు.

---

15. మహమ్మదీయ మహాయుగం - పేజి. 146.

16. "అక్కన్న మాదన్నగార్లను గూర్చిన చరిత్రాంశములు గూడ నేను నూతనముగా కనుగొన్నవే. ఇందు కొన్ని స్వీయముగను, మిత్రుల వలనను, హైద్రాబాదు రాజ్యములో దెలిసికొనిన విషయములును, కొన్ని మహారాష్ట్ర భాషలోని శివాజీ చరిత్ర నుండియు, కొన్ని 'ప్రెస్ లిస్ట్ ఆఫ్ డాక్యుమెంట్స్ ఇన్ ఫోర్ట్ సెంట్ జార్జ్' అను పొత్తము నుండియు కనుగొనిన విషయములు అగును. అక్కన్న మాదన్నల పేళ్లు గల వారెన్నడును గోలకొండలో నుండలేదని మైసూరులో బూర్వచరిత్ర శోధనాధికారియగు మిస్టర్ రైస్ ఇండియన్ ఆంటిక్వేరిలో వాదించెను." మహమ్మదీయ మహాయుగం - పీఠిక.

రాజుల వ్యక్తిగత విషయాలను స్థూలంగా పేర్కొంటూ, వారి పాలనా కాలం నాటి సాంఘిక స్థితిగతులను సవివరంగా వ్రాయడం ఆయన రచనలోని ప్రత్యేకత.

1351 నుండి 1388 వరకు ఢిల్లీ సింహాసనాన్ని పాలించిన ఫిరోజ్ తుగ్లక్ తన స్వీయచరిత్రను వ్రాసుకొన్నాడు. లక్ష్మణరావుగారు ఆ స్వీయ చరిత్రలోని కొన్ని భాగాలను ఈ మహ్మదీయ మహాయుగంలో ఉదహరించారు. ఇవి ఫిరోజ్ తుగ్లక్ కాలం నాటి సాంఘిక స్థితిగతులకు అద్దం పడుతున్నాయి.

"చిన్న చిన్న వర్తకుల యొద్దనుండి మా యుద్యోగస్థులిదివరకు దిసికొనుచున్న బహుమతులును, కట్నములును, బాధాకరములగు చిన్న చిన్న పన్నులను ఇకముందునుండి తీసికొనగూడదు. బంజరు భూములలో పశువుల మేపుటకును, పుష్పములు, చేపలు మొదలైన వాని నమ్ముటకును, ప్రత్తి యేకుటకును, అంగడి పెట్టుటకును, సారాయి నమ్ముటకును ప్రజలు రాజునకు నిదివరకు పన్నుల నిచ్చుచుండిరి. కాని ఈ పన్నులన్నియు నికముందు ప్రజలీయ నక్కరలేదు. ఎందుకనగా, నిట్టి పన్నులు రాబట్టుకొను నధికారులు తమ యధికారమును దురుపయోగముచేసి ప్రజలను బాధ పెట్టెదరు."[17]

ఔరంగజేబు దుర్గుణుడని, సద్గుణాలు అతనిలో మచ్చుకైనా ఉండేవి కావని ప్రజల్లో ఇప్పటికీ ప్రచారంలో ఉంది.

చాలామంది చరిత్రకారులు ఈ అభిప్రాయాన్ని గ్రంథస్థం చేశారు. లక్ష్మణరావుగారు ఔరంగజేబులోని సద్గుణాలను కొన్నింటిని పేర్కొన్నారు.

"నాచ్ అనబడు నృత్యవిద్యను నెవ్వరభ్యసింపగూడదని విధించినందున యనేక వారకాంతలకు నుపవాసము సంభవించెను. వారందరిని వివాహము

---

17. మహ్మదీయ మహాయుగము- పేజి. 60.

చేసుకొనుడని యాజ్ఞాపించెను. మత విషయము తప్ప మరి యే విషయమైన వ్యాజములు వచ్చినప్పుడు క్రమమైన తీర్పు చెప్పెను.''[18]

ఇది ఉత్తమ విమర్శకుడి లక్షణం. లక్ష్మణరావుగారు చరిత్ర పరిశోధనలో ఒక విలక్షణమైన విమర్శనాపద్ధతికి బాటలు వేశారనడానికి ఇవన్నీ ఉదాహరణలే.

మహమ్మదీయ చరిత్రకారులు పక్షపాతంతో చరిత్రను వక్రగతిన చిత్రించారని ఆయన అందుకు అనేక దృష్టాంతాలను చూపించారు. మహమ్మదీయులు హిందూదేశాన్ని సులభంగా స్వాధీనం చేసుకొన్నారన్న వాదనలను ఆయన త్రోసిపుచ్చారు. వారు యావద్భారత దేశాన్ని ఎన్నడూ జయించలేకపోయారని స్పష్టీకరించారు.

పాశ్చాత్య చరిత్రకారులు కొందరు ఇదే అభిప్రాయాన్ని వ్యక్తీకరించారు

"The popular notion that India fell an easy prey to the Muslamans is opposed to Historical facts... At no time was Islam triumphant throughout the whole of India."[19]

లక్ష్మణరావుగారు వ్రాసిన మూడో చారిత్రక గ్రంథం శివాజీ చరిత్ర. ఇది మొట్టమొదట 1901 లో సరస్వతి పత్రికలో ప్రచురించబడింది.[20] ఆ తరువాత 1904 లో పుస్తక రూపంలో వెలువడింది. తెలుగు భాషలో వ్రాసిన అత్యుత్తమ శివాజీ చరిత్ర ఇప్పటికీ ఇది ఒక్కటే.

---

18 మహమ్మదీయ మహాయుగము- పేజి. 152.

19. Indian Empire—By Dr. W.W. Hunter. 3rd Edition. P. 323.

20. ఈ సరస్వతి పత్రికను పోలవరం జమీందారు కొచ్చెర్లకోట వెంకట కృష్ణారావుగారు 1898 లో ప్రారంభించారు.

లక్ష్మణరావుగారు మరాఠీ భాషలో విద్వాంసుడు కాబట్టి మరాఠీలోని గ్రంథాలను పరిశీలించి ఈ గ్రంథం వ్రాశారు. లక్ష్మణరావుగారి దృక్పథానికి శివాజీ చరిత్ర కూడా ప్రతిబింబం వంటిదని చెప్పవచ్చు.

లక్ష్మణరావుగారికి బాల గంగాధర తిలక్ ఆదర్శ ప్రాయుడు. తిలక్ శివాజీ ఉత్సవాలను నిర్వహించి ప్రజలలో స్వాతంత్ర్య భావాలకు అంకురార్పణ చేశారు. శివాజీ ఉత్సవాలు ఆనాడు ప్రజలను ఉత్తేజితులను చేశాయి. ఆత్మ స్థైర్యాన్ని కలిగించి, ధైర్య సాహసాలను పెంపొందించే శక్తి శివాజీ వృత్తాంతానికి ఉంది. లక్ష్మణరావుగారు శివాజీ చరిత్రను రచించింది ఆ ఉద్దేశంతోనే.

## చారిత్రక వ్యాసాలు :

లక్ష్మణరావుగారు అనేక వ్యాసాలను వ్రాశారు. వాటిలో చారిత్రక పరమైనవి కూడా ఉన్నాయి. చరిత్రకు సంబంధించిన నూతన విషయాలను బహిర్గతం చేయడానికి ఇవి రచించబడ్డాయి. ఆయన పరిశోధనా సామర్థ్యాన్ని ఇవి చాటి చెప్పుతున్నాయి.

చారిత్రక వ్యాసాలలో అష్టనిస్తానము, అశోక వర్ధనుడు, అనవోతారెడ్డి, అనవేమారెడ్డి, అధర్వణాచారుడు అనంతామాత్యుడు, అన్నయ్య (తెనాలి), అబ్బయామాత్యుడు, అప్పకవి అనేవి విజ్ఞాన సర్వస్వం కొరకు ప్రత్యేకంగా వ్రాసినట్టివి. విజ్ఞాన సర్వస్వం కొరకు ఆయన వ్రాసిన వ్యాసాలు ఇంకా ఉన్నాయి. అయితే అవి సాహిత్య, శాస్త్ర సంబంధాలు కావడంవల్ల వాటిని ఈ విభాగం పరిధిలోకి తీసుకురాలేదు చారిత్రక ప్రాధాన్యం గల వ్యాసాలు మాత్రమే దీనిలో పరిశీలింపబడుతున్నాయి.

ఆయన వివిధ పత్రికల్లో వ్రాసిన చారిత్రక వ్యాసాలు కూడా ఉన్నాయి. ఆంధ్ర బ్రాహ్మణులలోని నియోగి, వైదిక భేదకాల నిర్ణయం; శ్రీనాథుని గ్రంథ కాల నిర్ణయం; కృష్ణరాయల కొన్ని దిగ్విజయ యాత్రలు; కృష్ణరాయల

నిధనకాలం; చాళుక్యులు దాక్షిణాత్యులే ఇవి వివిధ పత్రికల్లో ప్రచురించబడ్డాయి. 'ఏకశిలా నగర మోరుగల్లే' అనే పేరుతో ఆయన ఒక వ్యాసం వ్రాశారు. అముద్రితంగా ఉండిపోయిన ఈ వ్యాసం ఆ తరువాత 'లక్ష్మణరాయ వ్యాసావళి' లో చేర్చబడింది.[21]

లక్ష్మణరావుగారు అఫ్ఘనిస్తాన్ చరిత్రను 15 పేజీలలో వ్రాశారు. ఇది ఇప్పుడు ప్రచురిస్తే చిన్నసైజు దేశచరిత్ర గ్రంథంగా తయారవుతుంది. అఫ్ఘనిస్తాన్ పూర్వాపరాల చరిత్ర సవిస్తరంగా దీనిలో ప్రస్తావించబడింది.

సరిహద్దులు - భౌతిక లక్షణములు; పర్వతములు-నదులు; తటాకములు; పురాతత్త్వము; జనులు-జాతులు; మతములు-భాషలు; కళాకౌశలము; కృషి - వాణిజ్యము; రాజ్యపరిపాలన-రక్షణ వ్యవస్థ; రాజవంశములు- ఈ శీర్షికలతో విభజించి ఆయన దీన్ని రచించారు. ఒకదేశ చరిత్రను ఏ పద్ధతులమీద ఆధార పడి రచిస్తారో ఆ పద్ధతులన్నీ ఈ వ్యాస రచనలో పాటింపబడ్డాయి.

అఫ్ఘనిస్తాన్ వ్యాసాన్ని ఒక చిన్నదేశ చరిత్రగా రూపొందిస్తే, అశోక వర్ధనుడనే వ్యాసాన్ని ఒక మహాపురుషుని జీవిత చరిత్రగా తీర్చిదిద్దినారు కళింగ దిగ్విజయము; బౌద్ధమతావలంబనము; బౌద్ధ భిక్షువుల పరిషత్తు: రాజ్య విస్తారము; శిలాశాసనములు; భూతదయ; సత్యప్రియత్వము; పరమత సహిష్ణుత; కట్టడములు; అశోకుని స్వభావము - ఈ రకంగా ఈ వ్యాసం విభజింపబడింది.

''అశోక చరిత్రమంతయు నశోకుని శాసనములు, సింహళ; టిబెట్టు దేశ మందలి గ్రంథములు, మన పురాణములు, అను నాధారములను బట్టి వ్రాయబడి నది'' అని ఆయన పేర్కొన్నారు.

---

21. లక్ష్మణరావుగారు మరణించిన తరువాత ఆయన వ్రాసిన వ్యాసాలను విజ్ఞాన చంద్రికా మండలివారు 'లక్ష్మణరాయ వ్యాసావళి' అనే పేరుతో రెండు సంపుటాలుగా ప్రకటించారు. అముద్రితంగా ఉండిపోయిన వ్యాసాలు కూడా వీనిలో చేర్చబడ్డాయి.

లక్ష్మణరావు గారు తెలుగులో మొట్ట మొదట దేశచరిత్రను రచించిన చరిత్రవేత్త. ఆయనకు ముందు ప్రామాణికమైన చరిత్ర వ్యాసాలను కూడా ఎవ్వరూ వ్రాయలేదు. ఆయన ఈ వ్యాసాలను క్లుప్తంగా కాకుండా పరిశోధనాత్మకంగా రూపొందించడం చెప్పుకోదగింది.

అనపోతారెడ్డి, అనవేమారెడ్డి అనే వ్యాసాలు వ్రాసేనాటికి రెడ్డి రాజుల కాలం నాటి శాసనాలు పూర్తిగా వెలుగులోకి రాలేదు. మల్లంపల్లి సోమశేఖర శర్మగారు రెడ్డిరాజులను గురించి పరిశోధించి "The History of Reddy Kingdoms" అనే గ్రంథం రచించారు. లక్ష్మణరావుగారి పరిశోధన వ్యాసాలు కూడా ఈ గ్రంథ రచనకు తోడ్పడ్డాయి.

అనపోతారెడ్డి పరిపాలనాకాలాన్ని లక్ష్మణరావుగారు 1350 నుండి 1361గా నిర్ణయించారు. "కొండవీటి రెడ్ల ప్రభుత్వ కాలమింకను నిశ్చయముగా నిర్ణయము కాలేదు" "అనపోతారెడ్డి కాలము రెండు మూడు సంవత్సరములు హెచ్చు తగ్గుగ తేలినదన వచ్చును" అని ఆయన అభిప్రాయపడ్డారు. ఆధునిక చరిత్రకారులు అనపోతారెడ్డి పరిపాలనాకాలాన్ని 1353 నుండి 1364గా నిర్ధారించారు. లక్ష్మణరావుగారి అభిప్రాయం దీనికి దాదాపుగ దగ్గరలోనే ఉందని చెప్పాలి.

అనపోతారెడ్డి వేయించిన మోటుపల్లి శాసనం ఆధారంగా అతని కాలంనాటి సాంఘిక పరిస్థితులను లక్ష్మణరావుగారు చాలా చక్కగా వివరించారు.

అనపోతారెడ్డి సోదరుడే అనవేమారెడ్డి అనపోతారెడ్డి తరువాత అనవేముడు రాజ్యానికి వచ్చాడు. 1362 నుండి 1391 వరకు ఆయన రాజ్యం చేశాడని లక్ష్మణరావుగారు నిర్ణయించారు ఆధునికులు ఇతని పరిపాలనా కాలం 1364 నుండి 386 వరకని పేర్కొన్నారు శాసనాలను, ప్రాచీన వాఙ్మయాన్ని ఆధారంగా తీసుకొని ఆయన రెడ్డి రాజుల వంశ వృక్షాన్ని రూపొందించారు. ఇది ఇప్పటికీ ప్రామాణికమైనదిగానే పరిగణింపబడుతున్నది.

అధర్వణాచార్యుడు, అనంతామాత్యుడు, అన్నయ్య (తెనాలి), అబ్బయామాత్యుడు, అప్పకవి-వీరందరూ ప్రాచీనాంధ్ర సాహితీ మూర్తులు. లక్ష్మణ

రావుగారు 1914-1917 సంవత్సరాల మధ్య ఈ వ్యాసాలను వ్రాశారు. అప్పటికే వీరేశలింగం పంతులుగారి కవుల చరిత్ర తెలుగుదేశంలో ప్రాచుర్యం పొందింది.

లక్ష్మణరావుగారు వ్రాసిన ఈ వ్యాసాలు సాహిత్య చరిత్ర నిర్మాణానికి ఉపకరించేవి కాబట్టి వీటిని చారిత్రక వ్యాసాలుగానే స్వీకరించాలి

అధర్వణాచార్యుడు ఆంధ్ర సాహిత్యానికి ద్వితీయాచార్యుడన్న వీరేశలింగం పంతులు గారి అభిప్రాయాన్ని లక్ష్మణరావు గారు అంగీకరించలేదు. నన్నయ్య భట్టు మొదట ఆంధ్ర శబ్దములను శాసించిన వాడగుట వలన అతడు ప్రథమాచార్యుడనీ, అతని తరువాత తెనుగు వ్యాకరణము వ్రాసిన వాడు అధర్వణాచార్యుడు గనుక అతడు ద్వితీయా చార్యుడని ఆ రోజుల్లో పండిత లోకము భావిస్తుండేది. వీరేశలింగం పంతులుగారు "నన్నయ భట్టు తరువాతనే ఇతడుండనియెడల ద్వితీయాచార్యుడనే పేరు ఈతని కెట్లు వచ్చును" అని కవుల చరిత్రలో పేర్కొన్నారనీ, ఇది సరి కాదనీ అధర్వణుడు 13వ శతాబ్దం తరువాత వాడని ఆయన నిర్ణయించారు.[22]

అధర్వణాచార్యుడు ఖచ్చితంగా ఫలానా కాలానికి చెందిన వాడని ఇంత వరకూ ఎవ్వరూ నిర్ధారించలేదు. అతడు 13వ శతాబ్దానికి ముందు లేడని, 14,15

22. 'కవుల చరిత్ర' తొలి ముద్రణలో వీరేశలింగం పంతులుగారు ఈ అభిప్రాయాన్ని వ్యక్తీకరించి ఉంటారు. లక్ష్మణరావుగారు తొలి ముద్రణ ప్రతిని చూసే పంతులుగారి అభిప్రాయాన్ని ఖండించి ఉంటారని మనం భావించాలి. ఎందుకంటే, పంతులుగారు 1917 లో కవుల చరిత్రను సవరించి తిరిగి ప్రచురించారు. చారిత్రకంగా భిన్నమైన తన పాత నిర్ణయాలను, అభిప్రాయాలను పంతులుగారు ఈ ముద్రణ సందర్భంలో మార్చుకోవడం జరిగింది. కవుల చరిత్ర మలి ముద్రణలో లక్ష్మణరావుగారు తనకెంతగానో తోడ్పడినట్టు వీరేశలింగం పంతులుగారు దాని పీఠికలో పేర్కొన్నారు. "అధర్వణాచార్యుడు పండ్రెండవ శతాబ్దాంతమునందో, 13 వ శతాబ్దాదినో యున్నట్టు నిశ్చయముగ దెలియుచున్నది" అని పంతులుగారు సవరించి ప్రచురించిన కవుల చరిత్రలో పేర్కొన్నారు. —కవుల చరిత్ర పేజీ. 262

Year of Publication. 1917.

శతాబ్దాల మధ్య కాలంలో ఉండి ఉంటాడని ప్రప్రథమంగా నిర్ణయించింది లక్ష్మణరావుగారే. ఆయన వ్యక్తీకరించిన ఈ అభిప్రాయమే సరియైందిగా ఇప్పుడు భావించబడుతున్నది.[23]

అధర్వణుడు 13వ శతాబ్దానికి ముందు వాడెట్లా కాదో లక్ష్మణరావు గారు సోపపత్తికంగా వివరించారు.

''పంచవర్గముల ప్రథమాక్షరములు (కచటతపలు) శంక శార్ఙ్గాదికముల వలెనుండును. ఆ యక్షరముల మీది భాగమందు తిర్యగ్రేఖలుండును. క్రింది భాగ మందు దండరేఖలుండును.''

అధ్వరణ కారికలలో పైవిధంగా వర్ణించిన తెలుగు అక్షరాల వర్ణనను ఆయన తన వాదనకు ఉపయోగించుకొన్నారు.

పన్నెండవ శతాబ్దాంతానికి గాని తెలుగు వర్ణాలు అధర్వణాచార్యుడు వర్ణించిన స్వరూపాన్ని సంతరించుకోలేదు. దీన్నిబట్టి అతడు 12వ శతాబ్దికి పూర్వపువాడన్నది సరికాదని ఆయన సిద్ధాంతీకరించాడు. అలాగే కేతన తన ఆంధ్ర భాషా భూషణంలో అధర్వణాచార్యుని గురించి ప్రస్తావించలేదు. కాబట్టి 13వ శతాబ్దంలో కూడా అతడు లేడని, 14వ శతాబ్దంలోనైనా, 15వ శతాబ్దం లోనైనా అతడు ఉండవచ్చని లక్ష్మణరావుగారు అభిప్రాయపడ్డారు.

అధర్వణుడు వ్రాసినవిగా చెప్పబడుతున్న గ్రంథాలు నాలుగు. అవి త్రిలింగ శబ్దానుశాసనము, కారికావళి, అధర్వణ ఛందస్సు, అధర్వణ భారతము.

---

23. "అధర్వణాచార్యుణ్ణి పేర్కొన్న ప్రాచీనుడు గౌరన. ఇతడు క్రీ. శ. 1445 మధ్య జీవించాడు. 'లక్షణ దీపిక' అనే ఛందోగ్రంథం రచించాడు. అందులో అధర్వణచ్ఛందాన్ని పేర్కొన్నాడు. కనుక అధర్వణుడు గౌరనకు కనీసం ఒక శతాబ్దం ముందు ఉండవచ్చును."
సమగ్ర ఆంధ్ర సాహిత్యం-ఆరుద్ర. రెండవ సంపుటం. పేజి. 242.

ఈ నాల్గింటి గురించి వివరిస్తూ ఆయన చివరి "రెండును నామావశిష్టములు. మొదటి రెండును మిక్కిలి యపరిశుద్ధ స్వరూపముతో గానవచ్చుచున్నవి" అని పేర్కొన్నారు.

అనంతామాత్యుడు 15 వ శతాబ్ది మధ్య భాగంలో జీవించివున్న సుప్రసిద్ధ లక్షణ శాస్త్రవేత్త భోజరాజీయం, అనంత ఛందస్సు రసార్ణవం అనే మూడు గ్రంథాలను ఆయన రచించాడు.

రసార్ణవంలో ఆ గ్రంథ రచన శాలివాహన శకం 1356 ఆనంద నామ సంవత్సర మాఘ బహుళ పదకొండు మంగళవారం రోజు పూర్తయినట్టు పేర్కొనబడింది. దీన్నిబట్టి ఆ గ్రంథం క్రీ శ. 1435 జనవరి 25 వ తేదీన పూర్తయిందని లక్ష్మణరావుగారు లెక్కవేసి చెప్పారు.

భోజరాజీయ కావ్యాన్నిబట్టి ఈ కవి నివాస స్థానం పూర్వపు నైజాము రాజ్యంలో ఉండేదని అభిప్రాయపడ్డారు.

భోజరాజీయంలోని "ఆంధ్రవల్లభ హరిసేవ నలరుచుండు" అనే పద్య పాదాన్నిబట్టి అనంతుకు ఆంధ్రరాయనివద్ద ఉద్యోగిగా నుండెనని కొందర ర్థము చేసికొనిరి. కాని అది పొరపాటు ఆంధ్రవల్లభ హరి యనగా ఆంధ్ర విష్ణువు. శ్రీకాకుళంలోని దేవుడు ఇట్లే ఈ కవి వ్రాసిన రసార్ణవ మందలి "శ్రీనిండన్ ధ్రువ పట్టణాధిపున కిచ్చెన్ భక్తిపూర్వంబుగన్" అన్న చరణము జూచి కొందరీ గ్రంథమును ధ్రువ పట్టణపు రాజునకిచ్చెనని భ్రమపడుచున్నారు. ధ్రువపట్టణాధిపుడనగా ధ్రువ పట్టణపు దేవుడని అర్థము. ఈ కవి తన గ్రంథ మేదియు నరాంకితము చేయలేదు." అని వ్యాఖ్యానించారు

అనంతామాత్యుడు తిక్కనను ఏ విధంగా అనుకరించాడో భోజరాజీయాన్ని బట్టి లక్ష్మణరావుగారు నిరూపించారు.

తెనాలి రామభద్ర కవి రచించిన 'ఇందుమతీ కల్యాణం' ఆధారంగా అన్నయ్య కవికాలాన్ని, తెనాలి రామకృష్ణ కవికాలాన్ని తేల్చిచెప్పడం అన్నయ్య (తెనాలి) అన్న వ్యాసంలో ఉన్న విశేషం.

అన్నయ్య కవి 'సుదక్షిణా పరిణయం' అనే కావ్యం వ్రాశాడు. పాండు రంగ మాహాత్మ్యం రచించిన తెనాలి రామకృష్ణునికి ఇతడు తమ్ముడు.

సుదక్షిణా పరిణయం పులిజాల సోమామాత్యునకు అంకితమియ్యబడింది. ఈ అమాత్యుడు కోనేటి రామరాజు దగ్గర మంత్రిగా ఉండేవాడు. కృష్ణదేవ రాయల అల్లుడైన అళియ రామరాజు, ఈ కోనేటి రామరాజు ఇద్దరూ ఏక వంశీయులు. వరుసకు కోనేటి రామరాజు అళియ రామరాజుకు మనుమడవుతాడు. ఈ అళియ రామరాజు దగ్గరి నుండి కోనేటి రామరాజు కొంత రాజ్యాన్ని పొందినట్టు సుదక్షిణా పరిణయంలో చెప్పబడింది.[24]

అళియ రామరాజు 1565 లో తాళికోట యుద్ధంలో మరణించాడు. అప్పటికి అతడు వృద్ధుడనేది చారిత్రక సత్యం. కనుక కోనేటి రామరాజు ఇతనికి మనుమడవుతాడంటే నమ్మవచ్చు. తాళికోట యుద్ధానికి ముందే ఈ కోనేటి రామరాజు అళియ రామరాజు దగ్గరినుండి కొంత రాజ్యం పొంది ఉంటాడు.

ఇంత వివరణ ఎందుకంటే, కోనేటి రామరాజు అళియ రామరాజుకు మనుమడవుతాడు కదా మరి ఇద్దరూ సమకాలికులు ఎట్లా అవుతారు అనే సందేహాన్ని నివృత్తి చేయడానికే

దీన్నిబట్టి కోనేటి రామరాజు 1565 ప్రాంతం వాడవుతాడు. కోనేటి రామరాజు మంత్రి పులిజాల సోమామాత్యుడు కూడా అదే కాలానికి చెందిన వాడనడంలో ఎట్టి సందేహం ఉండదు. అతనికి కావ్యాన్ని అంకితం చేసిన అన్నయ్య కవి అతనికి సమకాలికుడు. తెనాలి రామకృష్ణ కవి ఈ అన్నయ్య కవికి సోదరుడు కాబట్టి, అతడూ ఈ కాలానికి చెందినవాడే అవుతాడు.

ఈ చారిత్రకాంశాలను వివరించి అన్నయ్య కవి, తెనాలి రామకృష్ణ కవి 16 వ శతాబ్దపు మూడవ, నాల్గవ పాదానికి చెందినవారై ఉంటారని లక్ష్మణ రావు గారు పేర్కొన్నారు.[25]

---

24. సుదక్షిణా పరిణయం – (1-47.)
25. వీరేశలింగం పంతులు గారు అన్నయ్య కవి 1580 ప్రాంతానికి చెందినవాడని ఊహించారు. ఆయన తన ఊహకు ఆధారం చూపలేదు. లక్ష్మణరావు గారు దాదాపు అదే కాలాన్ని సూచించినప్పటికి దానికి చారిత్రకాధారాలను చూపించారు.

లక్ష్మణరావు గారు ఈ వ్యాసం వ్రాసేనాటికి సుదక్షిణా పరిణయం అచ్చు కాలేదు. దీనిలో ఆయన ఆ కావ్య విశేషాలను ప్రస్తావించారు.

అప్ప కవిని గురించి వ్రాసిన వ్యాసంలో అప్పకవి గురించి కొత్తగా చెప్పవలసిన చారిత్రకాంశాలేవీ లేనందువల్ల దాదాపుగా ఇది అప్పకవీయంపై వివరణాత్మకమైన వ్యాసంగా రూపొందినది.

"ఇది పేరునకు నన్నయ భట్టీయమనబడు ఆంధ్ర శబ్ద చింతామణికి టీకయైనను, నిజముగా స్వతంత్ర గ్రంథమనియే చెప్పవలసి యున్నది. అప్పకవి ఛందో వ్యాకరణముల గురించి ఆంధ్రమున గొప్ప గ్రంథము వ్రాయదలచి, గౌరవార్థమును, లోకులు ప్రమాణముగా నంగీకరించుటకును దీనిని నన్నయ భట్టీయమునకు టీకగా వ్రాసెను. ఆంధ్ర శబ్ద చింతామణి యంతకు పూర్వము అప్పకవి కన్నదియు విన్నదియుగాదు." అని ఆయన ప్రస్తావించారు.

కనుపర్తి అబ్బయామాత్యుడు అనిరుద్ధ చరిత్రము, కవిరాజ మనో రంజనం అనే కావ్యాలను రచించాడు.

లక్ష్మణరావుగారు అనిరుద్ధ చరిత్రలో ప్రయోగింపబడిన "పేషువా" అనే పదాన్ని బట్టి ఈ కవి కాలం నిర్ణయించారు

"ఇతడు 1780 వ సంవత్సరము ప్రాంతము వరకు జీవించి యుండ వచ్చును" అని వీరేశలింగం పంతులుగారు ఊహించారు. ఈ ఊహకు హేతువును ఆయన సూచించలేదు [26]

'పేషువా' పూనా రాజుల బిరుదును సూచించే పీష్వా శబ్దానికి రూపాంతరం 1761 తరువాత పూనా పీష్వాల ఖ్యాతి దక్షిణ దేశంలో వ్యాపించింది. పీష్వా శబ్దం కూడా దాదాపు అదే కాలంలో దక్షిణ దేశంలో ప్రచారం పొంది, అనిరుద్ధ చరిత్రలో చోటు చేసుకొని ఉం[illegible] అభిప్రాయం.

---

26. ఆంధ్ర కవుల చరిత్ర-ద్వితీయ భాగం పేజి, 115

ఇంతవరకు పరిశీలించిన వ్యాసాలు లక్ష్మణరావుగారు విజ్ఞాన సర్వస్వంలో వ్రాసినట్టివి. వీటిలో కొన్ని చోట్ల ఆయన నూతన విషయాలను వెల్లడించారు. మరి కొన్ని చోట్ల వీరేశలింగం పంతులుగారి ఊహలకు ఆధారాలు చూపించారు. చారిత్రక ప్రమాణాలకు నిలువలేని విషయాలను ఖండించి స్వీయ సిద్ధాంతాలను ప్రతిపాదించారు.

లక్ష్మణరావుగారు వివిధ పత్రికలలో వ్రాసిన వ్యాసాలు లక్ష్మణరాయ వ్యాసావళి అనే పేరుతో రెండు సంపుటాలుగా ప్రకటింపబడినట్లు లోగడ పేర్కొనడం జరిగింది. వీనిలో చారిత్రక వ్యాసాలు, శాస్త్ర సంబంధమైన వ్యాసాలు, సాహిత్య సంబంధమైన వ్యాసాలు ఉన్నాయి. అముద్రితంగా ఉండిపోయిన కొన్ని వ్యాసాలు కూడా వీనిలో చేర్చబడ్డాయి. ఈ సంపుటాలు 1923 లో లక్ష్మణరావు గారు పరమపదించిన తరువాత ప్రచురించబడ్డాయి వీనిలోని చారిత్రక వ్యాసాలను మాత్రమే ప్రస్తుతం పరిశీలించడం జరుగుతున్నది

''ఆంధ్ర బ్రాహ్మణులలోని నియోగి, వైదిక భేదకాల నిర్ణయము" అనే వ్యాసం 1906 లో స్వధర్మ ప్రకాశినిలో ప్రచురించబడింది. బ్రాహ్మణుల వైశిష్ట్యాన్ని చెప్పడం కోసం లక్ష్మణరావుగారు ఈ వ్యాసం వ్రాయలేదు. బ్రాహ్మణులలోని నియోగి, వైదిక భేదకాల నిర్ణయాన్ని చారిత్రకంగా నిరూపించడమే ఈ వ్యాసానికి లక్ష్యం. సాహిత్య చరిత్ర నిర్మాణానికి ఇది ఉపయోగపడుతుంది.

పూర్వ చాళుక్య రాజైన మంగి యువరాజు తామ్ర శాసనం ఆధారంగా ఆంధ్రదేశంలో నియోగి శాఖ ఏడవ శతాబ్దం నుండి ఉందని ఆయన నిరూపించారు.

"శ్రీనాథుని గ్రంథముల కాల నిర్ణయం" అనేది గ్రంథాలయ సర్వస్వం ద్వితీయ సంపుటి ప్రథమ సంచికలో ముద్రితమైంది. శ్రీనాథుని విరచితమైన 'హరవిలాస' కావ్యం ఆధారంగా శ్రీనాథుడు వ్రాసిన తక్కిన కావ్యాల 'రచనా కాలాన్ని' ఆయన నిర్ణయించారు.

హరవిలాసం శ్రీనాథుని చరమదశలో వ్రాయబడిందన్న పోలవరం జమీందారు, కూనపులి లక్ష్మీనరస్సయ్య, వేదం వెంకట రాయశాస్త్రి మొదలైన వారి అభిప్రాయాలను లక్ష్మణరావుగారు ఖండించారు. హరవిలాసం కుమారగిరి రెడ్డి సుగంధ భాండాగారాధ్యక్షుడైన అవచి తిప్పయ్య సెట్టికి అంకితమియ్య బడింది. కుమారగిరిరెడ్డి 1386 నుండి 1403 వరకు కొండవీటిని పరిపాలించాడు దీన్నిబట్టి హరవిలాసం 1400 ప్రాంతంలో రచించబడిందని లక్ష్మణరావు గారు నిర్ధారించారు.

హరవిలాసం కుమారగిరిరెడ్డి కాలంలో రచించబడిందన్న అభిప్రాయం సహేతుకమైందే. దానికి చారిత్రకాధారం ఉంది.

ఈ వ్యాసంలో లక్ష్మణరావుగారు మరో నూతన విషయాన్ని వెల్లడించి, పూర్వపక్షం వారి అభిప్రాయాలను ఖండించారు. నైషధ కావ్యాన్ని అంకితంగా స్వీకరించిన మామిడి సింగన్న అనవేమారెడ్డికి మంత్రి అని జయంతి రామయ్య పంతులు,[27] రాజమహేంద్రవరము నేలిన వేమారెడ్డికి మంత్రి అని వేదం వెంకటరాయశాస్త్రి[28]; కుమారగిరిరెడ్డికి మంత్రి అని కేతవరము వెంకటశాస్త్రి[29]; అభిప్రాయపడ్డారు.

నైషధ కావ్యంలో కావ్యోపసంహార గద్యంలో "పెదకోమటి వేమ భూపాల కరుణాపాత్ర" అనే వాక్యం ఉంది. ఈ వాక్యాన్నిబట్టి మామిడి సింగన్న పెదకోమటి వేమారెడ్డికి మంత్రి అని లక్ష్మణరావుగారు నిరూపించారు.

కుమారగిరిరెడ్డి కొండవీటిని పరిపాలిస్తున్న రోజులలో పెదకోమటి వేమారెడ్డి ఒక చిన్న ప్రాంతానికి జమీందారుగా ఉండేవాడు. అప్పుడు కూడా సింగన్న అతని దగ్గర మంత్రిహోదాలో ఉండి ఉంటాడు. శ్రీనాథుడు పెద

---

27. Epigraphia India. Vol. XI. P. 315.
28. శృంగార నైషధము. వేదం వెంకటరాయశాస్త్రి పీఠిక. పేజీ. 11.
29. ఆనంద ముద్రాక్షరశాల శృంగార నైషధ పీఠిక. పేజీ. 18.

కోమటిని ఎప్పటినుండో ఆశ్రయించి ఉన్నాడని చెప్పడానికి నైషధం కూడా ఒక ఉదాహరణ. హరవిలాసంలో నైషధ ప్రస్తావన ఉంది నైషధం ముందు వ్రాయబడితేనే తప్ప దానితరువాతదైన హరవిలాసంలో దాని ప్రస్తావన రావడానికి వీలులేదు.

లక్ష్మణరావుగారు శ్రీనాథుడు జన్మించిన కాలాన్ని, అతని ఇతరగ్రంథాల రచనాకాలాన్ని హరవిలాస కావ్యరచన ఆధారంగా ఈ రకంగా నిర్ణయించారు:

జననం—1360
మరుత్తరాట్చరిత్ర—1376
శాలివాహన సప్తశతి—1385
ఆంధ్ర నైషధం—1395
హరవిలాసం—1400
భీమఖండం—1420
కాశీఖండం—1430
శివరాత్రి మాహాత్మ్యం—1435
మరణం—1440.

పల్నాటి వీరచరిత్ర 1400–1420 మధ్య కాలంలో వ్రాసి ఉండవచ్చని ఊహించారు.

ఆయన సాధారణ పద్ధతులను అనుసరించి ఈ నిర్ణయాలు చేశారు.

"రాయి గ్రుద్దినట్లును, త్రాసు తూచినట్లును ఈ సంవత్సరముననే ఈ గ్రంథము తప్పక నిర్మింపబడినదని చెప్పుటకు నీ వ్యాసము వ్రాయబడలేదు. క్రొత్త శాసనములుగాని, క్రొత్త గ్రంథములు గాని బయలుదేరి లెక్కయంతయు దప్పిన జెప్పలేను. కాని ఉన్న సాధనములే యాధారములుగ నిల్చెనేని పది సంవత్సరములు హెచ్చు తగ్గుగ నేను వేసిన లెక్క నిల్చునని నా తాత్పర్యము'' అని ఆయన తన ఉద్దేశాన్ని ప్రకటించారు.

"కృష్ణరాయలు-కొన్ని దిగ్విజయ యాత్రలు" అన్న పేరుతో 1918లో ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో లక్ష్మణరావుగారు ఒక వ్యాసం వ్రాశారు. ఈ వ్యాసానికి "దిగ్విజయ యాత్రలు" అన్న పేరున్నప్పటికి దీని ప్రధానోద్దేశం ఆముక్తమాల్యద రచనాకాలాన్ని నిర్ణయించడమే.

ఆముక్తమాల్యదలో "మున్నె కళింగదేశ విజిగీషా మనీషన్ దండెత్తిపోయి విజయవాటిం గొన్ని వాసరంబులుండి శ్రీకాకుళ నికేతనుండగు నాంధ్ర మధుమథను సేవింపబోయి హరివాసరోపవాసంబచ్చట గావింప నప్పుణ్యరాత్రి చతుర్థయామంబున" అనే వచనం ఉంది. ఈ వచనంలో పేర్కొనబడిన హరి వాసరం ఏదో తనకు దొరికిన శాసనాన్ని బట్టి లక్ష్మణరావుగారు కనుగొన్నారు.[30]

లక్ష్మణరావుగారు సేకరించిన ఈ శాసనం శా.శ. 1440 బహుధాన్యనామ సంవత్సర ఫాల్గుణ శుద్ధ॥ ఏకాదశి శుక్రవారం రోజు వేయించబడింది. కృష్ణరాయలు "హరివాసరోపవాసం" గావించిన రోజు, ఆంధ్ర మహావిష్ణువు అతనికి కలలో కనిపించిన రోజు ఇదేనని ఆయన నిర్ధారించారు. ఆముక్తమాల్యద రచనకు క్రీ.శ. 1519 ఫిబ్రవరి 11 వ తేదీన అంకురార్పణ జరిగినట్టు దీన్నిబట్టి స్పష్టంగా తెలుస్తున్నది.

"ఆముక్తమాల్యద రచన ప్రారంభింపబడిన దినమింత సూక్ష్మముగను, నిశ్చయముగను మనకు తెలిసినందుకు మనమెంతయు సంతసిల్లవలసియున్నది" అని ఆయన సంతోషాన్ని ప్రకటించారు. ఆముక్తమాల్యద రచనా కాలాన్ని

---

30. ఇది దాన శాసనం. కృష్ణరాయలు శ్రీకాకుళ ఆంధ్ర మహా విష్ణువునకు ఇచ్చిన దానం దీనిలో ప్రస్తావించబడింది. మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో "ఇలియట్స్ కలెక్షన్స్" నుండి లక్ష్మణరావుగారు ఈ శాసన ప్రతిని సేకరించారు. ఈ శాసనాన్ని ప్రప్రథమంగా ప్రకటించింది లక్ష్మణరావుగారే.

ఇంత స్పష్టంగా కనుగొనగలిగింది లక్ష్మణరావుగారే.[31] ఖచ్చితమైన కాల నిర్ణయాలకు శాసనాధారాన్ని మించిన ఆధారం లేదు. ఎంతో ప్రయాసతో విలువైన ఈ విషయాన్ని వెల్లడించిన లక్ష్మణరావుగారు చిరస్మరణీయులు అయితే ఆంధ్ర సాహిత్య చరిత్ర వ్రాసిన మహానుభావులెవ్వరూ తమ గ్రంథాలలో లక్ష్మణరావుగారి పరిశ్రమను మాటమాత్రంగానైనా ప్రస్తావించలేదు.

కృష్ణదేవరాయలు స్వర్గస్థుడైన సంవత్సరమేదో తెలుసుకోవడానికి లక్ష్మణరావుగారు 'కృష్ణదేవరాయల నిధన కాలం' అనే పేరుతో ప్రత్యేకంగా ఒక వ్యాసం వ్రాశారు. తనకు దొరికిన చారిత్రకాధారాలతో కృష్ణరాయలు 1525 లోనే మరణించి ఉంటాడని లక్ష్మణరావుగారు ఊహించారు.

కృష్ణదేవరాయల కుమారుడు తిరుమల దేవరాయలు, అల్లుడు రామరాయలు, తమ్ముడు అచ్యుత దేవరాయలు. వీరు 1525-1530 మధ్య కాలంలో వేయించిన శాసనాలు. జారీచేసిన కౌలు కాగితాలు కొన్ని ఉన్నాయి. వీటినిబట్టి లక్ష్మణరావుగారు కృష్ణదేవరాయల నిధన కాలాన్ని ఊహించారు.

1526 లో కృష్ణదేవరాయల అల్లుడైన రామరాజు జారీ చేసిన కౌలు ప్రతిని లక్ష్మణరావుగారు దీనిలో ఉదహరించారు. కృష్ణదేవరాయలు అవసాన దశలో తీవ్రమైన మానసిక సంక్షోభానికి గురియైనట్టు చారిత్రకాధారాలు తెలుపుతున్నాయి. దీన్ని అదనుగా తీసుకొని రాజవంశీయులు తమకు తోచిన రీతిలో దాన శాసనాలను, కౌలు పత్రాలను జారీ చేసి ఉండవచ్చు. కృష్ణదేవరాయల పేరుతో 1525-1530 సంవత్సరాల మధ్య వేయించబడిన దాన శాసనాలుకూడా ఉన్నాయి. కృష్ణదేవరాయలు 1530 దాకా బ్రతికే ఉన్నాడనడానికి ఇవి

---

31. వీరేశలింగం పంతులుగారు ఆముక్తమాల్యద రచన 1915 లో ప్రారంభించబడిందని అభిప్రాయపడ్డారనీ, ఇది సరియైందికాదని లక్ష్మణరావుగారు ఈ వ్యాసంలో పేర్కొన్నారు-లక్ష్మణరాయ వ్యాసావళి. ప్రథమ సంపుటం పేజి.31.

సాక్ష్యంగా నిలిచాయి. వీటినిబట్టే కృష్ణదేవరాయలు 1530 దాకా విజయనగర సామ్రాజ్యాధీశుడుగా ఉన్నాడని ఆధునిక చరిత్ర పరిశోధకులు నిర్ణయించారు. వీటన్నింటిని పరిశీలిస్తే లక్ష్మణరావుగారి ఊహ సరికాదని తేలుతున్నది. 1525-1530 మధ్యకాలంలో కృష్ణదేవరాయల పేరుతో వేయించిన దాన శాసనాలు ఉన్నాయి కాబట్టి, అతడు 1530 దాకా బ్రతికి ఉన్నాడనే చెప్పాలి. లక్ష్మణరావు గారు ఊహించినట్లు కృష్ణదేవరాయలు 1525 లోనే మరణించి ఉంటే, ఆ తరువాత కృష్ణదేవరాయల పేరుతో దాన శాసనాలు వెలువడడానికి వీలులేదు. అయితే లక్ష్మణరావుగారు రాయల నిధనకాలాన్ని ఊహించారే తప్ప ఖచ్చితంగా అతడు 1525 లో మరణించాడని చెప్పలేదు.

ముమ్ముందు రాయల శాసనాలను పరిశోధించేవారు తన అభిప్రాయాలను జ్ఞాపకముంచుకోవాలని ఆయన సూచించారు. దీనివల్ల నిజానిజాలు బయటపడతాయని ఆయన అభిప్రాయం.

''చాళుక్యులు దాక్షిణాత్యులే''అన్న వ్యాసం లక్ష్మణరావుగారు అగ్రశ్రేణికి చెందిన చరిత్ర పరిశోధకులని చెప్పడానికి మరో నిదర్శనం.

చాళుక్యులు ఉత్తరాపథం నుండి దక్షిణాపథానికి వచ్చారనీ, వారు చంద్రవంశపు క్షత్రియులని కొందరు చరిత్రకారులు పేర్కొన్నట్లు లక్ష్మణరావు గారు దీనిలో ప్రస్తావించారు. ఈ రెండు అభిప్రాయాలను త్రోసిపుచ్చి, చారిత్రకంగా నిజాన్ని నిరూపించడమే ఈ వ్యాసానికి లక్ష్యం.

లక్ష్మణరావుగారు తాను మరణించిన రోజు మధ్యాహ్నమే దీన్ని ముగించారు. ఇది ఆయన వ్రాసిన చిట్టచివరి వ్యాసం. చివరి శ్వాస పేల్చేతరుణంలో కూడా ఆయన చరిత్ర రచనను విడిచిపెట్టలేదు.

ఈ వ్యాసంలో లక్ష్మణరావుగారు వెలిబుచ్చిన అభిప్రాయాలకు చారిత్రకమైన విలువలున్నాయి. ఇవి ఎల్లప్పుడూ ప్రామాణికాలే. చాళుక్యులను గురించి సమగ్రంగా పరిశోధించడానికి తరువాతి పరిశోధకులకిది బాగా తోడ్పడింది.

చాళుక్య వంశాలు ప్రధానంగా మూడు. అవి బాదామి చాళుక్యవంశం, వేంగీ చాళుక్య వంశం, కళ్యాణి చాళుక్య వంశం. బాదామి చాళుక్యులు 'బాదామిని' ముఖ్య పట్టణంగా చేసుకొని పరిపాలించారు. వేంగీ చాళుక్యులు రాజమహేంద్రవరం రాజధానిగా చేసుకొని పాలించారు. మూడవ వారు కన్నడ దేశంలోని కళ్యాణ పట్టణం రాజధానిగా చేసుకుని పాలించారు. వీరి రాజధానీ పట్టణమైన కళ్యాణి మహారాష్ట్ర ప్రాంతంలో ఉందని జయంతి రామయ్య పంతులుగారు, కాశీభట్ట బ్రహ్మయ్య గారు వాదించారు. వారు చెప్పినట్లు వీరి రాజధాని మహారాష్ట్ర దేశమందలి రైలుస్టేషన్ కళ్యాణ్ కాదని, కన్నడదేశ మందలి కళ్యాణ పట్టణమని, ఇది గుల్బర్గా జిల్లాలో ఉందని లక్ష్మణరావుగారు నిరూపించారు. ఆయన అభిప్రాయమే ప్రామాణికమైనది.

ఈ చాళుక్యులలో మరో రెండు శాఖలున్నాయి. వారు గుజరాతు దేశాన్ని పాలించారు. వీరందరూ దాక్షిణాత్యులే. కొందరు దక్షిణదేశం నుండి వెళ్ళి ఉత్తర దేశంలో రాజ్యాలను ఏర్పరచుకొన్నారు. వీరు చంద్రవంశస్థులు కాదని లక్ష్మణరావు గారు సోదాహరణంగా నిరూపించారు. వారు వెలమ ప్రభువుల తెగకు చెందినవారనీ, రాజకీయంగా ఆధిపత్యం పెరుగుతున్నకొద్దీ వీరు క్షత్రియులమని, చంద్ర వంశస్థులమని చెప్పికొన్నారని ఆయన ఇందుకు కొన్ని శాసనాలనుండి, ప్రాచీన వాఙ్మయం నుండి ఉదాహరణలు చూపించారు. "సల్కి" అనే దేశ్యశబ్దాన్ని సంస్కృతీకరించడం వల్ల చాళుక్య శబ్దం ఏర్పడిందన్నారు. దేశ్యశబ్దం రానురాను ఎట్లా రూపాంతరం చెందిందో వివరించారు.

చాళుక్యుల గురించి ఇంత పరిశోధనాత్మకమైన వ్యాసాన్ని లక్ష్మణరావు గారికి ముందు ఎవ్వరూ వ్రాయలేదు ఆయన స్వయంగా శాసన పరిశోధకులు కాబట్టి ఇంతటి విశిష్టమైన వ్యాసం వ్రాయగలిగారు. దక్షిణదేశ చరిత్రను పరిశోధించడానికి పూనుకొన్న వారిలో లక్ష్మణరావు గారు ప్రముఖులు.

లక్ష్మణరావు గారు వ్రాసిన "ఏకశిలానగర మోరుగల్లే" అనే వ్యాసం ఏ పత్రికలోనూ ప్రచురించబడలేదు. అముద్రితమైన ఈ వ్యాసం 'లక్ష్మణ

రాయ' వ్యాసావళిలో చేర్చబడింది. ఇది అచ్చులో 52 పేజీలలో ఉంది. పరిశోధనాత్మకంగా, విమర్శనాత్మకంగా ఆయన దీన్ని రూపొందించారు.

పోతన ఒంటిమిట్ట వాడన్న వావికొలను సుబ్బారావు గారి వాదాన్ని ఖండించి లక్ష్మణరావు గారు దీనిలో ఓరుగల్లు సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు.

ఈ వ్యాసాన్ని ఆయన తాను మరణించడానికి కొద్ది రోజుల ముందే వ్రాసినట్టు తెలుస్తున్నది. ఆయన ఎప్పుడో వ్రాసి ఉంటే తప్పకుండా దీన్ని ఏదైనా పత్రికకు పంపించి ఉండేవారు.

లక్ష్మణరావు గారి చారిత్రక వ్యాసాలలో కొన్ని ఇప్పటికీ అత్యున్నతమైనవి. కొన్ని ఆనాటి పరిస్థితులలో అత్యున్నతమైనవి. మన దేశంలో ప్రామాణికమైన చరిత్ర రచనకు ప్రయత్నాలు ప్రారంభమైన తరుణంలో లక్ష్మణరావుగారు అమూల్యమైన చారిత్రకాంశాల నెన్నింటినో వెల్లడించారు. దేశచరిత్రలో ఆయన పరిశోధన కూడా ఒక ఉజ్జ్వల ఘట్టం.

## శాసన పరిశోధన :

తెలుగుదేశంలో కావలి వెంకట బొర్రయ్య శాసన పరిశోధనకు ఒరవడిని పెట్టినవాడు. ఆయన తరువాత శాసన పరిశోధకులలో చెప్పుకోదగినవారు కొమర్రాజు లక్ష్మణరావుగారు.

లక్ష్మణరావుగారి తరానికి చెందిన జయంతి రామయ్యపంతులు, చిలుకూరి నారాయణరావు, వేటూరి ప్రభాకరశాస్త్రి, దుగ్గిరాల సూర్యప్రకాశరావు, పెండ్యాల వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి, నందగిరి వెంకట అప్పారావు, కర్రి సాంబమూర్తి మొదలైనవారు పెక్కు శాసనాలను పరిశోధించారు.

ప్రాచీన లిపిని సునాయాసంగా అర్థం చేసుకోగలిగే నేర్పరిగా లక్ష్మణరావుగారికి ఆ రోజుల్లో మంచిపేరు ఉండేది. ఆయన ప్రాచీన లిపులను అధ్యయనం

చేసి ఒక సమగ్రమైన వ్యాసం కూడా వ్రాశారు. అది విజ్ఞాన సర్వస్వంలో ప్రచురించబడింది.

లక్ష్మణరావుగారు మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారం నుంచి అనేక ప్రాచీన శాసన ప్రతులను వెలికితీసి పరిష్కరించారు. అలాగే స్వయంగా మిత్రుల ద్వారా మరికొన్ని శాసనాలను సేకరించారు.

శాసన పరిశోధనలో సంపాదించిన ప్రావీణ్యం దేశ చరిత్ర రచనలో ఆయనకు బాగా తోడ్పడింది. అట్లాగే ఆయన వ్రాసిన చారిత్రక వ్యాసాలకు శాసన పరిశోధన ఉపయోగపడింది.

శాసన పరిశోధనలో జయంతి రామయ్య పంతులు లక్ష్మణరావు గారి సహాయాన్ని కోరుతుండేవారు.

ఆనెగొంది వెండి శాసనాన్ని జయంతి రామయ్య పంతులు అభ్యర్థనపై లక్ష్మణరావుగారు పరిష్కరించి, 1920లో ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో ప్రకటించారు.[32]

ఈ శాసనం శివాజీకి, విజయనగర ప్రభువులకు సంబంధించిన కొన్ని విశేషాలను తెలియజేస్తున్నది.

విజయనగర రాజులలో కడపటివాడు శ్రీరంగరాయలు. అతని కుమారులకు శివాజీ 1657 ఏప్రిల్ నెలలో ఆనెగొంది సమీపంలోని కొన్ని గ్రామాలను దానం చేసినట్టు ఈ శాసన పాఠం చెప్తున్నది.

శ్రీరంగరాయలు రాజ్య భ్రష్టుడై మధుర నాయకులను ఆశ్రయించి అక్కడే మరణించాడు. శివాజి మధురను జయించిన సందర్భంలో శ్రీరంగ రాయల సతీమణి వెంకట కృష్ణప్ప అనే మంత్రితో (మధుర రాజుల మంత్రి)

32. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక—రౌద్రి సంవత్సరం ఆశ్వయుజ—పుష్య మాసముల సంచిక. సంపుటం 9, సంచికలు 4,5.

తన కుమారులను శివాజీ దగ్గరకు పంపించగా, అతడు వారికి కొన్ని గ్రామాలను దానం చేశాడని దీనిలో పేర్కొనబడింది.

ఈ వెంకట కృష్ణప్ప ఎవరో కాదు, జైమినీ భారతం వ్రాసిన సముఖము వెంకటకృష్ణప్పనే.

శాసనంలో పేర్కొనబడినట్టు ఇది 1657 నాటిది కాదనీ, శివాజీ 1677లో మధురను జయించాడు కాబట్టి ఇది కూడా ఆ కాలానికే చెందినదై ఉంటుందని లక్ష్మణరావుగారు అభిప్రాయపడ్డారు. ఈ శాసనం రంగరాయల చరిత్ర తెలుసుకోవడానికి కొంతవరకు ఉపయోగపడింది.

ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలోనే పెదకోమటి వేమారెడ్డి వ్రాయించిన నాలుగు తామ్ర శాసనాలను లక్ష్మణరావుగారు ప్రకటించారు.[33] ఈ నాలుగు శాసనాలకు లేఖకుడు శ్రీనాథుడు. ఇవి 1404 నుండి 1419 మధ్య జారీచేయబడిన దాన శాసనాలు. వీనిలో నాలుగవ శాసనం 1419వ సంవత్సరానికి చెందినది.

ఈ శాసనాల ఆధారంగా లక్ష్మణరావుగారు పెదకోమటి వేమ భూపాలుడు కొండవీటి రాజ్యాన్ని పరిపాలించిన కాలాన్ని అంచనా వేశారు.

పెదకోమటి వేముని పరిపాలన 1420లో అంతమైంది. అప్పటివరకు శ్రీనాథుడు అతన్ని ఆశ్రయించి ఉన్నాడని ఈ శాసనాలు చెప్తున్నాయి.

పెదకోమటి వేమారెడ్డి వేయించిన మరో శిలా శాసనాన్ని లక్ష్మణరావుగారు 1920లో ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో ప్రకటించారు.[34] పెదకోమటి వేమారెడ్డి చరిత్రను సాకల్యంగా తెలుసుకోవడానికి ఈ శాసనం బాగా తోడ్పడింది. సత్తెనపల్లి సమీపంలోని అమీనాబాదు గ్రామదేవత గుడి దగ్గర ఒక రాతిపై ఈ శాసనం చెక్కబడింది. ఈ శాసనం చెక్కబడిన తేదీ జనవరి 25, 1377.

---

33. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక—రౌద్రి. సంపుటం 9. సంచికలు 4,5.
34. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక—రౌద్రి. మాఘ-ఫాల్గుణ సంచికలు.

పెదకోమటి వేమారెడ్డి కొండవీటిని పరిపాలించడానికి ముందు కొంత భూభాగానికి జమీందారుగా ఉండేవాడు. ఆ సమయంలో ఈ శాసనం వేయబడింది. 1377 లో కొండవీటిని అనవేముడు పాలిస్తున్నాడు.

అనవేమారెడ్డి 1364 నుండి 1386 వరకు, అతని తరువాత అనపోతారెడ్డి కుమారుడు కుమారగిరిరెడ్డి 1386 నుండి 1403 వరకు కొండవీటిని పాలించారు. వీరి తరువాత, అంటే 1403 తరువాత పెదకోమటి వేమారెడ్డి కొండవీటికి రాజైనాడు.

1403 వ సంవత్సరానికి పూర్వం పెదకోమటి వేమారెడ్డి జమీందారుగా ఉండేవాడనీ, రాజవంశీకుడు కాబట్టి అప్పుడు కూడా అతడు రాజుగా పిలువబడ్డాడనీ ఈ శాసనాన్నిబట్టి తెలుస్తున్నది. ఈ శాసనంలోని సీస పద్యాలను ఫిరంగిపుర శాసనంలోని సీస పద్యాలతో పోల్చి, ఇది శ్రీనాథుడు వ్రాసిందేనని లక్ష్మణరావుగారు నిరూపించారు. పెదకోమటి వేమారెడ్డి కొండవీటిని పాలించడానికి ముందునుండే శ్రీనాథుడు అతన్ని ఆశ్రయించి ఉన్నాడని ఈ శాసనంవల్ల తెలుస్తున్నది.

లక్ష్మణరావుగారు, వేంగీని రాజధానిగా చేసుకొని పాలించిన శాలంకాయనుల రెండు తామ్ర శాసనాలను స్వయంగా సేకరించారు. ఇవి ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో ప్రకటించబడ్డాయి[35]. ఇవి గుంటూరు సమీపంలోని కంతేరు గ్రామంలో దొరికాయి.

4 వ శతాబ్ది ప్రారంభంలో శాలంకాయనులు వేంగినాటిని ఆక్రమించి ఉంటారని ఆయన ఈ శాసనాల ఆధారంతో ఊహించారు. ఇదే యథార్థమని అనంతర పరిశోధకులు నిర్ణయించారు శాలంకాయనులు 300 నుండి 450 వరకు రాజ్యం చేసినట్లు వీరి ఇతర శాసనాలవల్ల తెలుస్తున్నది.

---

35 ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక- దుందుభినామ సంవత్సరం. జ్యేష్ఠ-భాద్రపద మాసముల సంచిక.

ఏలూరు సమీపంలోని 'వేంగి' వీరి రాజధాని. ఈ శాసనంలో రాజుకు చెప్పబడిన ''భగవచ్చిత్ర రథస్వామి పాదానుధ్యాతుడు'', ''బప్ప భట్టారక పాద భక్తుడు'' మొదలైన బిరుదులను పరిశీలించి, లక్ష్మణరావుగారు ఆ రాజులకు సంబంధించిన నూతన విషయాలను వెల్లడించారు

'చిత్రరథస్వామి' అంటే సూర్యుడని, దానికి సంస్కృతకోశం నుండి ఉదాహరణలు చూపించారు. సూర్యుడు శాలంకాయనుల కులదైవమని దీనివల్ల తేలింది. ఈ శాసనాలపై ముద్రింపబడి ఉన్న సూర్య ప్రతిమలు దీన్ని బల పరుస్తున్నాయి. ''బప్ప భట్టారకుడు'' అనే పదంలోని 'బప్ప' అనేది ఒక రాజు పేరని, ఆ రాజు పేరుమీదుగా ఈ వంశం వర్ధిల్లిందని వాదించిన వారి వాదన లను ఆయన ఖండించారు.

'బప్ప' అనే పేరు గుప్తులు, వాకాటకులు, పల్లవులు, గాంగులు మొద లైన రాజవంశపు రాజుల శాసనాలలో కూడా కనబడుతున్నది. దీన్నిబట్టి వీరంచరూ 'బప్ప' రాజు వంశీయులే అని చెప్పడం హాస్యాస్పదం.

'బప్ప' అనేది రాజు పేరు కాదు. అది 'తండ్రి' అనే అర్థంలో వాడ బడింది. ఇది ప్రాకృత శబ్దం. దానినుండే ఇప్పటి 'బాప్' అనే హిందీ శబ్దం పుట్టింది. తన తండ్రి పట్ల వినయవిధేయతలను ప్రకటించడానికి ఆ రోజుల్లో రాజులు శాసనాలలో ఈ పదాన్ని ప్రయోగించేవారు. ఇంత వివరణాత్మకంగా లక్ష్మణరావుగారు ఈ శాసనాలలోని చారిత్రకాంశాలను వెల్లడించారు.

లక్ష్మణరావుగారు ప్రకటించిన మరో ముఖ్యమైన శాసనం ''రెండవ పులకేశి కొప్పరపు తామ్ర శాసనం.''[36] గుంటూరు జిల్లాలోని 'కొప్పరం' గ్రామంలో ఇది దొరికింది.

---

36. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక–దుందుభినామ సంవత్సరం. ఆశ్వయుజ– పుష్యమాసముల సంచిక.

ఇది క్రీ. శ. 611 వ సంవత్సరం అక్టోబర్ 21 వ తేదీన వ్రాయించ బడింది.

రెండవ పులకేశి సేనాని ధ్రువరాజు తన రాజు రాజ్యానికి (రెండవ పులకేశి) వచ్చిన సందర్భాన్ని పురస్కరించుకొని వేదశర్మ అనే బ్రాహ్మణునికి ఇర్చులి గ్రామంలో కొంత భూమిని దానం చేశాడని ఈ శాసనం చెప్తున్నది.

దీనిలోని ''ప్రవర్థమాన విజయరాజ్య సంవత్సరే ఏకవింశతి'' అనేది రెండవ పులకేశి రాజ్యపాలన ప్రారంభాన్ని సూచిస్తున్నది.

రెండవ పులకేశి తెలుగుదేశానికి వచ్చిన సంవత్సరం, తెలుగుదేశంలో చాళుక్యుల పాలన ప్రారంభమైన సంవత్సరం ఈ శాసనాన్ని బట్టి ఖచ్చితంగా తెలుసుకొనే అవకాశం కలిగింది. ఈ శాసనం క్రీ. శ. 611 వ సంవత్సరం అక్టోబర్ 21 వ తేదీన జారీ చేయబడింది. రెండవ పులకేశి తెలుగుదేశాన్ని జయించింది, తెలుగుదేశంలో చాళుక్యుల పాలన ప్రారంభమైంది ఆ తేదీననే. రెండవ పులకేశి చాళుక్యవంశీయుడు.

రెండవ పులకేశి మారుటూరు శాసనాన్ని బట్టి, అతడు క్రీ. శ. 616 నాటికే వేంగి మండలాన్ని ఆక్రమించి, చాళుక్య రాజ్యాన్ని స్థాపించాడని ఇప్పటి చరిత్ర పాఠ్య గ్రంథాలలో పేర్కొనబడింది. లక్ష్మణరావు గారు ప్రకటించిన కొప్పరపు తామ్ర శాసనం రెండవ పులకేశి క్రీ. శ. 611 లో చాళుక్య రాజ్యాన్ని స్థాపించాడని ఖచ్చితంగా చెప్తున్నది లక్ష్మణరావు గారు ప్రకటించిన ఈ శాసనం ఇప్పటివరకు చరిత్రకారుల దృష్టికి రాలేదని దీనివల్ల తెలుస్తున్నది.

గుంటూరు మండలాన్ని పల్లవ సామంతులైన విష్ణుకుండినులు పాలిస్తుండగా రెండవ పులకేశి వారిని ఓడించాడు. తన సోదరుడైన కుబ్జ విష్ణువర్ధనుణ్ణి గుంటూరు మండలానికి రాజ ప్రతినిధిగా నియమించాడు. ఆ తరువాత ఈ కుబ్జ విష్ణువర్ధనుడే వేంగీ చాళుక్యవంశ స్థాపకుడయ్యాడు.

లక్ష్మణరావు గారు ప్రకటించిన మరో ముఖ్యమైన శాసనం ప్రథమ చాళుక్య భీముని అత్తిలి తామ్ర శాసనం.[37]

కుబ్జ విష్ణువర్ధనుడు వేంగి చాళుక్యవంశ స్థాపకుడని పైన చెప్పబడింది. ఈ వేంగీ చాళుక్యులనే తూర్పు చాళుక్యులని అంటారు. తూర్పు చాళుక్య వంశం లోనివాడే ఈ ప్రథమ చాళుక్య భీముడు.

చాళుక్య భీముని పట్టాభిషేక కాలం దీనిలో స్పష్టంగా చెప్పబడింది. దీన్ని ఆధారంగా తీసుకొని లక్ష్మణరావు గారు తక్కిన తూర్పు చాళుక్య రాజుల రాజ్య పాలన కాలాన్ని అంచనా వేశారు.

లక్ష్మణరావు గారు విష్ణుకుండిన వంశజుడైన మూడవ మాధవ వర్మ తామ్ర శాసనాన్నొకదాన్ని సేకరించారు. ఇది 1930 సెప్టెంబర్ నెల భారతిలో ప్రకటించబడింది.

లక్ష్మణరావు గారు 1923 లో ఈ శాసనాన్ని గురించి ఆంగ్లంలో సమగ్ర మైన వ్యాసం వ్రాసి, ప్రచురణార్థమై, కలకత్తా విశ్వ విద్యాలయం జర్నల్‌కు పంపించారు. అయితే అది 1924 లో ప్రకటించబడింది. అప్పటికే ఆయన పరమపదించారు ఆ తరువాత మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు దీన్ని తెలుగు లోనికి అనువదించి భారతికి పంపించగా, అది 1930 సెప్టెంబర్ నెల సంచికలో ప్రచురించబడింది.

వేంగి చాళుక్యులకు ముందు తెలుగు దేశాన్ని అనేక రాజ వంశాలు పాలించాయి. అయితే ఏ రాజవంశం తరువాత ఏది పాలించిందో సక్రమంగా తెలుసు కోవడానికి ఈ విష్ణుకుండిన మూడవ మాధవవర్మ తామ్ర శాసనం బాగా తోడ్ప డింది. కలకత్తా జర్నల్‌లో ప్రచురించబడినందువల్ల ఈ శాసనం యావద్భారత దేశంలో చరిత్ర పరిశోధకులను ఆకర్షించింది.

37. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక - దుందుభి. మాఘ - ఫాల్గుణ మాసముల సంచిక.

ఈ మూడవ మాధవ వర్మ వేంగి చాళుక్య వంశస్థాపకుడైన కుబ్జ విష్ణు వర్ధనునికి అతని సోదరుడైన రెండవ పులకేశికి దాదాపుగా సమకాలికుడు. వేంగి చాళుక్యులకు ముందు విష్ణుకుండినులు ఉత్తర సర్కారు జిల్లాలను పాలిస్తుండే వారని ఈ శాసనాన్ని బట్టి లక్ష్మణరావు గారు నిరూపించారు.

విష్ణుకుండిన వంశజుడైన ఈ మూడవ మాధవ వర్మ క్రీ.శ. 594 వరకు, అతని తరువాత అతని కుమారుడు క్రీ.శ. 610 వరకు తీరాంధ్రాన్ని పాలించి ఉంటారు. క్రీ శ. 611 లో రెండవ పులకేశి తీరాంధ్రాన్ని జయించి చాళుక్య రాజ్యాన్ని స్థాపించాడని రెండవ పులకేశి కొప్పరపు తామ్ర శాసనాన్ని బట్టి తెలుసుకున్నాం.

లక్ష్మణరావు గారు రాజరాజనరేంద్ర పట్టాభిషేక మహోత్సవ సంచికలో సోమలదేవి వ్రాయించిన రెండు శాసనాలను ప్రకటించారు[38] ఈ శాసనాల ద్వారా రాజరాజుకు రేవలదేవి అనే భార్య, సోమలదేవి అనే కూతురు ఉండేవారనీ, రాజరాజు కాలంలో తెలుగుదేశంలో సౌరమాన వ్యవహారం ఉండేదని ఆయన తెలియజేశారు.

ఇప్పటివరకు చెప్పిన శాసనాలే కాకుండా, లక్ష్మణరావుగారు తాము చారిత్రక వ్యాసాలను వ్రాసే సందర్భంలో మరెన్నో శాసనాలను పరిశీలించి నారని స్పష్టంగా తెలుస్తున్నది. ఆయన సుప్రసిద్ధ శాసన పరిశోధకులని ఇవన్నీ రుజువు చేస్తున్నాయి.

''లక్ష్మణరావుగారు కేవలము చరిత్ర రచయిత మాత్రమే కాదు. శాసన పరిశోధకుడు కూడ. ఆంధ్రదేశ చరిత్రకు సంబంధించిన శిలా తామ్ర శాసనాలను పెక్కింటిని బయలుపరచి, పరిష్కరించి ప్రకటించిరి. వీరి పరిశ్రమము వలననే ఆంధ్రదేశపు శాసనముల ప్రాముఖ్యము జనులకు దెలిసినది''[39] నేలటూరి వెంకట రమణయ్యగారు వెలిబుచ్చిన ఈ అభిప్రాయంలో నూటికి నూరుపాళ్ళు నిజం ఉంది.

---

38. శ్రీ రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక - 1922
39. భారతి-1949. రజతోత్సవ సంచిక పేజి. 157.

## భాషా పరిశోధన :

లక్ష్మణరావుగారు సుప్రసిద్ధ భాషా పరిశోధకులనే విషయం చాలా మందికి తెలియదు. ఈ రోజుల్లో ఆయన గురించి ఎక్కడైనా ప్రస్తావన వచ్చినట్టయితే 'ఆయన విజ్ఞాన సర్వస్వ రచనను చేపట్టిన మహానుభావుడు' అని మాత్రమే చెబుతారు తప్ప ఆయన భాషా వ్యాసావళిని మచ్చుకైనా ఉదహరించరు. ఈ కారణంగానే ఇప్పటికీ, మరెప్పటికీ ప్రామాణికంగా నిలిచే ఆయన వ్రాసిన 'అక్షరము'లనే వ్యాసం మరుగున పడిపోయింది. దీన్ని ఒక పుస్తకంగా ప్రకటించి ఉన్నట్టయితే దీని విలువ అందరికీ తెలిసే అవకాశం ఉండేది.

తెలుగు భాషను సంస్కృత భాషతో పోల్చి, సంస్కృత లక్షణాలకు లోబడి తెలుగు భాషకు లక్షణాలను చెప్పే ప్రయత్నం లక్ష్మణరావుగారు చేయలేదు అట్లా చేస్తే ఆయన వ్యాకరణ శాస్త్రజ్ఞులయ్యేవారు.

తెలుగు భాషకు ఇతర భాషలతోగల సంబంధాన్నీ, తెలుగు శబ్దాల వ్యుత్పత్తినీ తేల్చి చెప్పే ప్రయత్నం ఆయన భాషా వ్యాసావళిలో కనిపిస్తుంది. అందుకే ఆయన భాషా పరిశోధకులయ్యారు.

అక్షరములు; అక్షర సమామ్నాయము; అచ్చ తెలుగు; త్రిలింగము నుండి 'తెలుగు' పుట్టెనా? లేక తెలుగునుండి 'త్రిలింగము' పుట్టెనా?; యుద్ధమల్లుని బెజవాడ శాసనము (అరవమునందలి [illegible] అను ధ్వని తెనుగున నుండుట); ద్రావిడ భాషలలోని ఉత్తమ పురుషవాచక సర్వనామము; అరవము ప్రాకృతమైనదా? తెలుగు అరవము నుండి పుట్టినదా? కానేకాదు; అనే వ్యాసాలను లక్షణరావుగారు వ్రాశారు. ఈ వ్యాసాలన్నీ ఏదో ఒక కొత్త విషయాన్ని చెప్పడానికి ఉద్దేశించినట్టివే ఈ కారణంగా వీటిని భాషా పరిశోధక వ్యాసాలుగా పరిగణించాలి.

వీటిలో అక్షరములు, అక్షర సమామ్నాయము, అచ్చ తెలుగు - ఈ మూడు వ్యాసాలు విజ్ఞాన సర్వస్వంలో ప్రచురించబడ్డాయి. తక్కినవి ఆయా

పత్రికల్లో ప్రకటితమయ్యాయి. "అరవము పూరాతి మైనదా? తెలుగు అరవము నుండి పుట్టినదా? కానేకాదు!'' అనే వ్యాసం 1941 ఆంధ్ర పత్రిక ఉగాది సంచికలో ప్రచురితమైంది. అముద్రితంగా ఉండిపోయిన దీన్ని మల్లంపల్లి సోమశేఖర శర్మగారు ఆ తరువాత ఆంధ్ర పత్రికకు పంపించారు. అందుకే ఇది 1941 లో ప్రచురించబడింది.

లిపి పుట్టుపూర్వోత్తరాలను గురించి తెలుగులో మొట్టమొదట ఒక సమగ్రమైన వ్యాసం వ్రాసింది లక్ష్మణరావుగారే. 'అక్షరములు' అనే పేరుతో ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం మొదటి సంపుటిలో ఆయన ఈ వ్యాసం వ్రాశారు. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం మొదటి సంపుటం 1915 లో వెలువడింది. కాబట్టి ఈ వ్యాసం అదే సంవత్సరంలో వ్రాయబడిందని భావించవచ్చు. దీనికిముందు తెలుగులో 'లిపి' ని గురించి ఇంత సమగ్రమైన వ్యాసంగానీ, గ్రంథంగానీ వెలువడలేదు. ప్రపంచ లిపులను గురించి పాశ్చాత్యులు వ్రాసిన గ్రంథాలను పరిశీలించి, మన భారతీయ లిపుల పుట్టుపూర్వోత్తరాలను శాసనాల ఆధారంతో సాకల్యంగా పరిశోధించి లక్ష్మణరావుగారు ఈ వ్యాసం వ్రాశారు.

సహేతుకంగా లేని పాశ్చాత్యుల సిద్ధాంతాలను ఆయన దీనిలో సోదాహరణంగా ఖండించారు ఈ వ్యాసాన్ని గ్రంథరూపంలో ప్రకటించినట్టయితే పాఠ్యగ్రంథంగానే కాకుండా ఇతరత్రా అధ్యయనానికి కూడా ఎంతో ఉపయోగపడుతుందని చెప్పడంలో సందేహం ఏమాత్రం లేదు

లిపిని గురించి చెప్పవలసినదంతా లక్ష్మణరావుగారు దీనిలో చెప్పేశారు. ఎవరైనా లిపిని గురించి గ్రంథం వ్రాయదలచుకుంటే తప్పకుండా యీ వ్యాసాన్ని పరిశీలించవలసిందే. లక్ష్మణరావుగారు శాసన పరిశోధకులు కావడం వల్ల ఈ వ్యాసం అత్యుత్తమంగా తీర్చిదిద్దబడింది. ఈ కారణంగానే లిపిని గురించి ఇటీవల వెలువడిన గ్రంథాలకు, వ్యాసాలకు లక్ష్మణరావుగారి వ్యాసం బాగా ఉపయోగపడింది.[40]

---

40. తిరుమల రామచంద్రగారు వ్రాసిన ''మన లిపి - పుట్టుపూర్వోత్తరాలు'' అనే గ్రంథానికి ఈ వ్యాసం బాగా ఉపయోగపడిందని ఆ గ్రంథాన్ని పరిశీలిస్తే తెలిసిపోతుంది. తన గ్రంథ రచనకు తోడ్పడిన గ్రంథాల పట్టికలో ఆయన లక్ష్మణరావుగారి ఆంధ్ర విజ్ఞాన సర్వస్వాన్ని కూడా పేర్కొన్నారు.

విజ్ఞాన సర్వస్వంలో చిన్న టైపుతో 42 పేజీలలో ఈ వ్యాసం ముద్రించబడింది. విజ్ఞాన సర్వస్వం పేజి ఇప్పటి మన మామూలు గ్రంథాల పేజీకి రెట్టింపు ఉంటుంది. దీన్ని గ్రంథంగా ప్రకటిస్తే దాదాపు రెండు వందల పేజీల గ్రంథంగా తయారవుతుంది.

డిపి నుండి లిపి పుట్టిందా ?; నాగరికతకు, లిపికి సంబంధం; లిపి యొక్క యుత్పత్తి; ప్రపంచంలోని పురాతన లిపులు; హిందూదేశమందలి లిపులు; అశోకుని లిపి యెట్లు పుట్టింది?; ఖరోష్ఠ లిపి; బ్రాహ్మీ లిపి సంతతి; దాక్షిణాత్య లిపులు; తెలుగు-కన్నడ లిపి; వేంగీ లిపి; బాదామి చాళుక్య లిపి; వేంగీ చాళుక్య లిపి; తిక్కనకాలపు లిపి; శ్రీనాథునినాటి లిపి; అరవదేశపు లిపులు అనే భాగ విభాగాలుగా. సచిత్రంగా లక్ష్మణరావుగారు దీన్ని వ్రాశారు.

అక్షర లిపి చిత్రలిపి నుండి పుట్టిందని చెప్తూ, దానికి ఉదాహరణగా ఈ క్రింది విషయం ప్రస్తావించారు :

"డకోటా దేశమందలి జనులు చిత్రలేఖనముచే సంవత్సరము నందు జరిగిన విశేషములు వ్రాసియుంచెదరు. సంవత్సరమును సూచించుటకు నాయేడు జరిగిన గొప్ప విశేషమేదైన నున్నయెడల నా విశేషమును పటముగా వ్రాసి సూచించెదరు. అనగా నాయేడు సంపూర్ణ సూర్యగ్రహణము వచ్చిన యెడల సూర్యుడు చీకటిలో మునిగినట్లు చూపుదురు."

అట్లాగే ఆంగ్ల భాషలోని 'A' అనే అక్షరం ఎట్లా పుట్టిందో వివరిస్తూ, "ప్రథమమున ఎద్దు తల, రెండు కొమ్ములును వ్రాయుచుండిరి. అవియే క్రమముగ మారుచు నిప్పటి 'A' అన్న అక్షరము ఏర్పడినది" అని పేర్కొన్నారు.

హిందూ దేశంలో ప్రాచీన కాలంలో లిపి లేదన్న బర్నెల్ వాదాన్ని ఖండించి, ఋగ్వేద కాలంకంటే ముందునుండే భారతదేశంలో లిపి ఉన్నదని నిరూపించారు.

భారతదేశంలోని లిపులన్నీ బ్రాహ్మీలిపి నుండి ఉద్భవించాయి. ద్రావిడ భాషలు ఆర్య భాషలనుండి పుట్టలేదు. కాని ద్రావిడ భాషలు వ్రాయడానికి అవసరమయ్యే లిపిమాత్రం అశోక లిపినుండి పుట్టిందని ఆయన వెల్లడించారు.

"ఆంధ్రదేశము పేరశోకుని శాసనములందు లేదనియు, క్రీ.శ. రెండవ శతాబ్దికి పూర్వ మాంధ్ర రాజ్యమే లేదనియు బర్నెల్ దొరగారు వ్రాయుట అసత్యము. అశోకుని శాసనములందు ఆంధ్ర దేశము పేర్కొనబడినది" అని, బర్నెల్ వ్రాతలను త్రోసిపుచ్చారు.

రాజరాజ నరేంద్రుని కోరుమిల్లి శాసనం, జాయన చేబ్రోలు శాసనం, శ్రీనాథుడు వ్రాసిన పెదకోమటి వేమ భూపాలుని శాసనం-వీటిని ఆధారం చేసుకొని తెలుగు లిపి పరిణామక్రమాన్ని ఆయన చాలా చక్కగా, సచిత్రంగా వివరించారు.

తోబుట్టువులైన కర్ణాటాంధ్ర లిపులు 14 వ శతాబ్దంలో విడిపోయి ప్రత్యేక లిపులుగా స్థిరపడ్డాయని పేర్కొంటూ, అందుకు క్రీ.శ. 1369లో వ్రాయబడిన కన్నడ బసవ పురాణం నుండి ఉదాహరణలను తీసి చూపించారు.

ఈ వ్యాసం శాస్త్రీయ పద్ధతిలో వ్రాయబడింది దీనిలో తీసివేయదగింది, ఖండించదగింది ఏదీలేదు. అందుకే దీని ప్రామాణికత ఎల్లప్పుడూ సజీవమైందే.

విజ్ఞాన సర్వస్వం మొదటి సంపుటంలోనే 'వర్ణసమామ్నాయం అనే పేరుతో ఆయన మరో వ్యాసం వ్రాశారు అక్షరములనే వ్యాసంలో అక్షరాల ఆకారం (లిపి) గురించి వివరించబడింది. ఈ వ్యాసంలో అక్షరాల ఉచ్చారణ విశదీకరించబడింది.

సంస్కృత భాషలోని అచ్చులను, హల్లులను పేర్కొని, ఆ అక్షరాలలో కొన్నింటి ఉచ్చారణ ఇతర భాషలలో ఎట్లా ఉందో ఈ వ్యాసంలో ఆయన వివరించారు

తమిళంలో 'కచటతప'లు, 'గజడదబ'లు అనే రెండు విభాగాలు లేవనీ, స్థానభేదాన్నిబట్టి ఒకే అక్షరాన్ని పరుషంగా, సరళంగా తమిళులు ఉచ్చరిస్తారని ఆయన పేర్కొన్నారు. తమిళంలో సరళాలు భిన్నాక్షరాలు కావు. దీన్ని ఆధునిక భాషా పరిశోధకులు కూడా అంగీకరిస్తున్నారు [41]

శకటరేఫ చరిత్రను ప్రస్తావిస్తూ, ప్రాచీన కాలంలో తెలుగు భాషలో దీనికి స్వతంత్రోచ్చారణ ఉండేదనీ, రానురాను రేఫంతో దీని ఉచ్చారణ కలిసి పోయిందనీ, తమిళ, కన్నడ, మలయాళ భాషల్లో 'ర-ఱ' ల మధ్య స్పష్టమైన భేదం ఇప్పటికీ నిలిచి ఉందని ఆయన అభిప్రాయపడ్డారు. అయితే లక్ష్మణరావు గారు అభిప్రాయపడినట్టు తమిళ, కన్నడ భాషల్లో ఇప్పుడు ఈ భేదం లేదు. మలయాళంలో మాత్రం ఉంది [42]

ఈ వ్యాసంలో ఉత్తర భారత, దక్షిణ భారత ఉచ్చారణ భేదాన్ని ఆయన ఈ క్రింది విధంగా విశ్లేషించారు:

''ఉత్తర దేశమందలి ఇప్పటి యుచ్చారణ సంప్రదాయము ప్రాకృత భాషా పద్ధతి ననుసరించును. దీనిని మనము గౌడీయ సంప్రదాయమందుము. రెండవది దాక్షిణాత్య సంప్రదాయము ఇది యెక్కువ స్పష్టమైనదియు, పరిశుద్ధమైనదియు, పూర్వపు ఆర్యోచ్చారణమును పోలియున్నదియునని చెప్పవచ్చును. ఇక దాక్షిణాత్యులలో స్ఫుటోచ్చారణకై యాంధ్రులు మొదటివారని చెప్పుటకు నేమియు సందేహము లేదు.''

---

41. "తమిళ, మలయాళ భాషలలో గజడదబలు, కచటతపలకి సవర్ణాలు. అందుచేతనే సాధారణ తమిళ లిపిలో గజడదబలకి గుర్తులు లేవు. వీటికి కచటతప లనే వాడతారు.'' ద్రావిడ భాషలు- డా॥ పి.ఎస్ సుబ్రమణ్యం. పేజి. 126.

42. ''ర-ఱ ల మధ్య ప్రాచీన కాలంలో ఉండే ఉచ్చారణ భేదం తమిళ, కన్నడ, తెలుగు భాషల్లో ఇప్పుడు నశించింది.'' ద్రావిడ భాషలు - డా॥ పి. యస్. సుబ్రమణ్యం. పేజి. 150.

లక్ష్మణరావుగారు 'అచ్చతెలుగు' గురించి ఒక వ్యాసం వ్రాశారు. ఇది విజ్ఞాన సర్వస్వంలో ప్రచురించబడింది. ఆ తరువాత లక్ష్మణరాయ వ్యాసావళి ద్వితీయ సంపుటంలో చేర్చబడింది.

దీనిలో కేతన, అప్పకవి, కూచిమంచి తిమ్మకవి మొదలైన లాక్షణికులు తెలుగు పదాలను ఏ విధంగా విభజించారో ప్రస్తావించి, ఆయన తన అభి ప్రాయాన్ని వ్యక్తీకరించారు

దీనిలో ఆయన వెలిబుచ్చిన అభిప్రాయాలు :

అ)- ఆరు విధాలైన ప్రాకృతాల నుండి తెలుగులోకి తద్భవ పదాలు వచ్చాయన్న ప్రాచీన లాక్షణికుల అభిప్రాయాన్ని అంగీకరించ లేదు.

మనం ప్రాకృత భవాలని చెప్పే పదాలలో ఎక్కువ భాగం మహారాష్ట్రి ప్రాకృతం నుండి వచ్చాయని ఆయన అభిమతం మిగిలిన ప్రాకృతాల కంటె మహారాష్ట్రి ప్రాకృతం తెలుగుదేశానికి పొరుగున ఉండడమే దీనికి కారణం. మహారాష్ట్రి భవమే ప్రస్తుత మరాఠీ

గాంధార, నేపాల దేశాలకు చెందిన చూళికా పైశాచ భాష నుండి తద్భవాలు తెలుగులోకి ఎట్లా వస్తాయని ఆయన ప్రశ్నించారు. ఈ దేశాలు తెలుగు దేశానికి చాలా దూరంలో ఉన్నాయని ఆయన వాదం.

జాతర అనే పదం 'యాత్ర' అనే సంస్కృత పదం నుండి పుట్టలేదని, అది మహారాష్ట్రంలోని 'జాత్రా' శబ్దభవమని లక్ష్మణరావుగారి సిద్ధాంతం.

అలాగే 'సొన్న' (బంగారం) అనే పదం 'సన్నమ్' అనే పైశాచీ పదం నుండి పుట్టిందన్న మామిడి వెంకయ్యగారి (ఆంధ్రదీపిక గ్రంథకర్త) అభి ప్రాయం సరియైంది కాదని ఆయన పేర్కొన్నారు.

'సోనా' అని హిందీలోనూ, 'సోనె' అని మహారాష్ట్రంలోను పదా లున్నాయి. ఇవి మన 'సొన్న' అనే పదానికి పైశాచీ 'సన్నమ్' కన్న సన్ని హితంగా ఉన్నాయని వెల్లడించారు.

''తద్భవములలో నూటికి తొంబది తొమ్మిది ఇందుండియు (మహారాష్ట్రి నుండి), సంస్కృతము నుండియు పుట్టినవని చెప్పవలెను" అని లక్ష్మణరావు గారు అభిప్రాయపడ్డారు.

ఆ)- ''అన్యదేశ్యములను దేశ్యములయందు చేర్చుటకంటె తత్సమముల యందు జేర్చుటయే న్యాయము. వజీరుడు, ఫౌజు, జోహారు మొదలైన పదము లన్యదేశ్యములనుండి యున్నవి యున్నట్టు తెలుగులోనికి తీసుకొనబడినవి. కావున నివి తత్సమములే."

తెలుగు పదాలను తత్సమములు, తద్భవములు, దేశ్యాలు అనే మూడు విభాగాలుగా విభజిస్తే సరిపోతుందని ఆయన అభిప్రాయం. అయితే ఇప్పుడు తత్సమాలు, తద్భవాలు, దేశ్యాలు, అన్యదేశ్యాలు అనే విభాగమే వాడులో ఉంది.

ఇ)- ''త్రిలింగ దేశ వ్యవహార సిద్ధంబగు భాష దేశ్యంబు'' ''లక్షణ విరుద్ధంబగు భాష గ్రామ్యంబు.'' అని చిన్నయసూరి సూత్రీకరించారు.

లక్ష్మణరావుగారు చిన్నయసూరి అభిప్రాయంతో విభేదించి, గ్రామ్యపదా లను కూడా దేశ్య విభాగంలో చేర్చారు.

''మోటుతనమేమియులేక సల్లక్షణ భాషయందు బర్యాయ పదము లేనట్టి యొకానొక గ్రామ్యపదము చక్కనిది యున్నయెడల నది యిదివరకు గ్రంథ కారులచే వాడబడలేదన్నంత మాత్రమున దానిని పరిత్యజించుట వృద్ధిచెందుచున్న చెట్టును ద్రుంచి వేయుటయే'' అని తనకున్న అభ్యుదయ దృక్పథాన్ని చాటు కున్నారు. ఇక్కడ వ్యవహారిక భాషకు అనుకూల ధోరణిని ప్రదర్శించారు.

ఉ)- సంస్కృత సమేతరంబైన భాష అచ్చతెలుగని ప్రాచీన లాక్షణికుల అభిప్రాయం. సంస్కృతసమాలు తప్ప తక్కిన పదాలన్నీ అచ్చతెలుగు క్రిందకు వస్తాయని దీని భావం. దీని ప్రకారం ప్రాకృతసమాలు, సంస్కృతభవాలు, ప్రాకృతభవాలు, దేశ్యాలు, అన్యదేశ్యాలు ఇవన్నీ అచ్చతెలుగు పదాలే.

''సర్వ సాధారణంగా తెనుగు దేశమున వాడుకయందున్న సంస్కృత పదముల నన్నింటిని అన్యదేశ్యములతో పాటు అచ్చతెనుగులనియే యనుకొన వలయును" అని ఆయన భిన్నమైన అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

అప్పకవి చెప్పినట్టు తేటతెల్లం చేయడమే అచ్చతెలుగునకు లక్షణమై నట్టయితే సంస్కృతసమాలు కూడా అచ్చతెలుగులోకి వస్తాయని ఆయన వాదం. దీని ప్రకారం 'పక్కి' అనేది అచ్చతెలుగు కానేరదు, 'పక్షి' అనే పదమే అచ్చతెలుగు అవుతుంది అని ఆయన వివరించారు.

"వైకృతము లన్నింటిని అచ్చతెలుగుగా పరిగణించుటయే యుక్తము" అని ఆధునికుల అభిప్రాయం. ప్రకృతి ప్రత్యయాలలో మార్పును సంతరించు కొన్నవి వైకృతాలు.[43]

తెలుగు భాషకు పర్యాయ పదాలైన ఆంధ్రము. తెనుగు, తెలుగు- వీటి వ్యుత్పత్తిని గూర్చి వాదోపవాదాలు జరుగుతున్న రోజులలో లక్ష్మణరావుగారు ''త్రిలింగము'' నుండి ''తెలుగు'' పుట్టెనా? లేక ''తెలుగు'' నుండి ''త్రిలింగము'' పుట్టెనా? అనే వ్యాసం వ్రాశారు.

భాషా సిద్ధాంత రీత్యా ఆ రోజుల్లో ఈ వ్యాసం ఎంతో విలువను సంత రించుకొన్నది.

''తెలుగు'' త్రిలింగ శబ్ద భవం కాదనీ, త్రిలింగమే తెలుగు శబ్దానికి సంస్కృతీకరించిన రూపమని ఈ వ్యాసంలోని సారాంశం.

త్రిలింగ శబ్దం నన్నయ భట్టు కాలంలో వాడుకలో లేదని, ఇది విద్యా నాథుడు కల్పించిన పదమని లక్ష్మణరావుగారు పేర్కొన్నారు.

గంటిజోగి సోమయాజిగారు క్రీ. శ. 1027 నుండే త్రిలింగ శబ్దము వాడుకలో ఉందని చెప్తూ, అందుకు ఇంద్రవర్మదత్తమయిన పుర్లీ తామ్ర శాసనాన్ని సాక్ష్యంగా చూపించారు.[44]

లక్ష్మణరావు గారు వెలిబుచ్చిన అభిప్రాయానికి భిన్నంగా, త్రిలింగ శబ్దంనుండే తెలుగు శబ్దం పుట్టిందని గంటిజోగి సోమయాజిగారు వాదించారు.[45]

---

43. ఆంధ్ర భాషా వికాసం - గంటిజోగి సోమయాజి. పేజి. 571.
44. ఆంధ్ర భాషా వికాసం-గంటిజోగి సోమయాజి పేజి. 21.
45. ఆంధ్ర భాషా వికాసం - గంటిజోగి సోమయాజి పేజీ 24.

వీరిద్దరి అభిప్రాయాలు సరియైనవి కావని ఇటీవలి పరిశోధనలు తెలుపుతున్నాయి. ద్రావిడ భాషలను పరిశోధించిన ఆధునిక భాషా పరిశోధకులు 'తెలుగు' 'తెనుగు' శబ్దానికి రూపాంతరమని నిరూపించారు. ద్రావిడ భాషల్లో 'న-ల' వినిమయం సామాన్యంగా కనిపిస్తుంది. దీని ప్రకారమే తెనుగు శబ్దం తెలుగు శబ్దంగా మారిందని సిద్ధాంతీకరించారు ఈ అభిప్రాయమే ఇప్పుడు ప్రామాణికమైనది.

తెనుగు, తెలుగు - ఈ రెండు శబ్దాలు నన్నయ భట్టు కాలం నుండి వాడుకలో ఉన్నాయి. తెలుగు శబ్దం ప్రాచీనమైనదన్న లక్ష్మణరావుగారి వాదం సరియైనదే.

అట్లాగే 'తెలుగు' త్రిలింగ శబ్దభవం కాదన్న ఆయన సిద్ధాంతం ఇప్పటికీ ప్రామాణికంగా నిలిచింది. 'త్రిలింగం' తెలుగుపదాన్ని సంస్కృతీకరించగా ఏర్పడిందన్న వాదం మాత్రం నిలువలేదు. శ్రీశైల, ద్రాక్షారామ, కాళేశ్వర లింగాలకు చిహ్నంగా ఈ త్రిలింగ శబ్దం ఉద్భవించింది.

యుద్ధమల్లుని బెజవాడ శాసనం గురించి 1913 లో పండిత లోకంలో వాదోపవాదాలు జరిగాయి. అయితే ఈ వాదోపవాదాలు నన్నయకు ముందు పద్యం ఉన్నదా ? లేదా ? అన్న దానికే పరిమితమయ్యాయి.

ఈ శాసనం నన్నయకు ముందు పద్యం ఉన్నదని స్పష్టంగా చెబుతున్నప్పటికీ కాశీభట్ట బ్రహ్మయ్య గారు అసలు ఈ శాసనం నన్నయకు ముందటిది కానేకాదు పొమ్మన్నారు. నన్నయకు తరువాత ఎవరో దీన్ని సృష్టించారని వాదించారు. అయితే చారిత్రకంగా దీని విలువ పెరిగేసరికి ఆయన వాస్తవాన్ని అంగీకరించక తప్పలేదు.

ఈ వాదోపవాదాలు కొన ఊపిరితో ఉన్న తరుణంలో జయంతి రామయ్య పంతులు గారు ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో స్వీయ వ్యాఖ్యానంతో ఈ శాసనాన్ని ప్రకటించారు. ఆయన ఈ శాసనాన్ని తెలుగు భాషా వ్యుత్పత్తిని దృష్టిలో పెట్టుకొని పరిశీలించలేదు. ఆ తరువాత లక్ష్మణరావుగారు దీనిలోని కొన్ని అక్షరాల వ్యుత్పత్తిని పరిశీలిస్తూ వివరణాత్మకంగా ఒక వ్యాసం వ్రాశారు. ఇదీ ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలోనే ప్రచురించబడింది. తెలుగు భాషా వ్యుత్పత్తిని పరిశీలించడానికి ఈ వ్యాసం ఎంతగానో తోడ్పడింది.

ప్రాచీన శాసనాలలో కనిపించే అనే అక్షరం తమిళ భాషలోని అనే అక్షరానికి సమానమైనదని ప్రప్రథమంగా లక్ష్మణరావుగారు ఈ వ్యాసంలో నిరూపించారు.

RZH అనే మూడు ఆంగ్లాక్షరాలను కలిపి ఉచ్చరిస్తే ఏ ధ్వని వస్తుందో, తమిళంలోని అనే అక్షరం ఆ ధ్వనితో ఉచ్చరింపబడుతుంది.

తమిళ భాషలోని ఈ అక్షరానికి సమానమైన ఉచ్చారణగల అనే అక్షరం తెలుగు, కన్నడ భాషల్లో 9వ శతాబ్దానికి పూర్వం ఉండేది. ఈ అక్షరం తెలుగులో 9వ శతాబ్ది వరకు ఉందని చెప్పడానికి యుద్ధమల్లుని బెజవాడ శాసనమేనిదర్శనం. ఈ శాసనంలో మూడు చోట్ల ఈ అక్షరం ప్రయోగించ బడింది.

9 వ శతాబ్దం తరువాత ఈ అక్షరం తెలుగులో 'డ' కారంతో, కన్నడంలో 'ళ'కారంతో కలసిపోయింది. ఈరెండుభాషల్లో ఈఅక్షరం ఇప్పుడులేదు.

ఈ శాసనంలో ఈ అక్షరంతో ప్రయోగింపబడిన పదాలు స్సి; అ సిన; య పుట అనేవి. వీటిని 'దస్సి, అడిసిన, అడిపుట'అని జయంతి రామయ్య పంతులుగారు 'డ' కారయుక్తంగా చదివారు. యుద్ధమల్లుని బెజవాడశాసనం నాటికి ఈ అక్షరం తెలుగులో 'డ' కారంతో కలసిపోయిందని ఆయన ఉద్దేశం.

అయితే ఇదే శాసనంలో నిజమైన 'డ' కారం 28 సార్లు ప్రయోగించ బడింది. శాసన లేఖకుని ఉద్దేశంలో ఈ అక్షరం 'డ' కారంతో సమానమైనదైతే అనే అక్షరం విడిగా ప్రయోగింపబడేదికాదు. దానిస్థానంలో 'డ' కారమే ప్రయోగింపబడిఉండేది. దీన్నిబట్టి అనే అక్షరం, 'డ' కారం ఈ రెండూ భిన్నమైన ఉచ్చారణగల అక్షరాలుగానే ఈ శాసనంలో ప్రయుక్తమైనాయని తెలుస్తున్నది.

9 వ శతాబ్దం వరకు ఈ ఴ అనే అక్షరం స్వతంత్రోచ్చారణను కలిగిఉండేదనీ, 9వ శతాబ్దం తరువాతే క్రమేపీ 'డ'కారంతో ఈ అక్షరం కలసిపోయిందని లక్ష్మణరావుగారు స్పష్టీకరించారు ఇది 'డ' కారంతో కలసిపోయిందనే విషయంలో లక్ష్మణరావుగారికి, జయంతి రామయ్య పంతులుగారికి భేదాభిప్రాయం లేదు. అయితే 9 వ శతాబ్దం వరకు ఈ అక్షరం ఉచ్చారణ భిన్నంగా ఉండేదని, తమిళ భాషలోని ழ అనే అక్షరం ఉచ్చారణ ఎట్లా ఉందో దాని ఉచ్చారణ అట్లా ఉండేదని వివరంగా తెలియజేశారు.

తమిళ భాషలో ழ అనే అక్షరం ఇప్పటికీ కొన్ని ప్రాంతాల మాండలికాలలో నిలిచిఉంది. తక్కిన మాండలికాలలో 'ళ' కారంతో కలిసిపోయింది.[46]

ఈ ఴ అనే అక్షరం తెలుగు భాషలో 'డ' కారంగా, కన్నడంలో 'ళ' కారంగా మారిపోయిందని చెప్పడానికి కొన్ని పదాలను ఉదాహరణగా చూపించారు.

| ప్రాచీన కన్నడం | కన్నడం | తెలుగు |
|---|---|---|
| తెగఴు | తెగళు | తెగడు |
| పొగఴు | పొగళు | పొగడు |
| మగఴు | మగళు | మగడు |

46. ద్రావిడ భాషలు—డా॥ పి. ఎస్. సుబ్రహ్మణ్యం. పేజి 161.

ள అనే అక్షరంతో కూడుకొన్న పదాలు తెలుగులో 'డ' కారంగా, కన్నడంలో 'ళ' కారంగా ఎట్లాగైతే మారిపోయాయో, తమిళ భాషలో ழ అనే అక్షరంతో కూడుకొన్న పదాలు కూడా అట్లాగే, అంటే 'డ' కార, 'ళ' కార యుక్తంగా ఈ రెండు భాషల్లో మార్పు చెందాయి. ఈ మార్పు ள ழ ఈ రెండు అక్షరాల ఉచ్చారణ సమానమైనదన్న అభిప్రాయాన్ని ధృవీకరిస్తున్నది.[47]

| **తమిళం** | **కన్నడం** | **తెలుగు** |
|---|---|---|
| కో ழி | కోళి | కోడి |
| సు ழி | సుళి | సుడి |
| పా ழ் | పాళు | పాడు |
| కూ ழ் | కూళు | కూడు |

లక్ష్మణరావుగారు ప్రాచీన కాలంలోని తమిళ, తెలుగు, కన్నడ భాషల స్వరూపాన్ని బాగా అధ్యయనం చేసి ఈ వ్యాసం వ్రాశారు. వారికున్న విశిష్టమైన భాషా పరిశోధక దృక్పథాన్ని ఇది తెలియజేస్తున్నది.

ద్రావిడ భాషల మధ్యగల సంబంధాన్ని నిరూపించడానికి ప్రయత్నించిన తెలుగు భాషా పరిశోధకులలో లక్ష్మణరావుగారొకరు. అందుకు ఆయన వ్రాసిన

47. లక్ష్మణరాయ వ్యాసావళి - ప్రథమ సంపుటం. పేజి. 129.

భాషా పరిశోధక వ్యాసాలే సాక్ష్యం. "ద్రావిడ భాషలలోని ఉత్తమ పురుష వాచక సర్వనామము" అనే వ్యాసం కూడా ఈ కోవలోనిదే.

ఒక భాషలో ఎటువంటి మార్పు లేకుండా ఎల్లప్పుడూ ఒకే రీతిలో ఉండే శబ్దజాలంలో పురుషవాచక సర్వనామాలు ముఖ్యమైనవి. ఏవైనా రెండు భాషల మధ్యగల సంబంధాన్ని నిరూపించడానికి ఇవి ఎంతగానో తోడ్పడతాయి. ద్రావిడ భాషలలోని ఈ పురుషవాచక సర్వనామాల ఆధారంగా వాటి మధ్య గల జన్యజనక సంబంధాన్ని నిరూపించడానికి యత్నించారు లక్ష్మణరావుగారు.

ద్రావిడ భాషలలోని ఉత్తమ పురుషవాచక సర్వనామాలు ''ఏన్'' అనే మూల ద్రావిడ రూపంనుండి ఉద్భవించాయని లక్ష్మణరావుగారు పేర్కొన్నారు.

ఈ మూలరూపం ఉచ్చారణ మొదట్లో "ఆ'' అని గాని, ''ఏ'' అని గాని స్పష్టంగా లేక ఈ రెండింటికి మధ్యస్థంగా, అంటే ''ఆ్య'', "యా'' అనే రూపంలో ఉండేదని అభిప్రాయపడ్డారు. ప్రాచీనకాలంలో ఈ ''ఏన్'' రూపం ఇప్పుడు వ్రాసిన రూపంలో కాకుండా ''ఆ్యన్'' అనో ''యాన్'' అనో ఉచ్చరింపబడుతుండేదని దీని తాత్పర్యం.

ద్రావిడ భాషల్లోని ఉత్తమ పురుషవాచక సర్వనామాలను ఆయన ఈ క్రింది విధంగా విభజించి చూపించారు.

| | ఏకవచనం | బహువచనం |
|---|---|---|
| తెలుగు | ఏను, నేను | ఏము, నేము, మేము, మనము |
| తమిళం | యాన్, నాన్ | యామ్, నామ్, నాంగళ్ |
| కన్నడం | ఎన్,ఆం,ఆన్,నాన్ | ఆం, ఆవు, నావు |
| మలయాళం | ఞాన్ | నామ్,నోమ్,నమ్మళ్, నుమ్మళ్ |
| తుళు | యాన్ | ఎంకులు, నమ |
| గోండి | అన్నా | అమ్మాట్ |

ఈ పురుషవాచక సర్వనామాల ఏకవచన రూపం 'ఏన్' అనీ, బహువచన రూపం 'యామ్' అని ఆయన నిర్ధారించారు.

ద్రావిడ భాషలలోని ఉత్తమ పురుషవాచక సర్వనామాల ఏకవచన రూపాలు 'యాన్' అనే మూలద్రావిడ రూపంనుండి ఏర్పడ్డాయని ఆధునిక భాషాపరిశోధకులు నిర్ణయించారు.[48]

లక్ష్మణరావుగారు మూలద్రావిడ ఏకవచన రూపం ''ఏన్'' అని నిర్ధారించారేగాని దాని ఉచ్చారణ "ఆ్య, యా''ల ఉచ్చారణతో కూడి ఉంటుందని

48. ద్రావిడ భాషలు— డా॥ పి.ఎస్. సుబ్రమణ్యం. పేజి 234

చెప్పారు. ఆధునికులు తమిళంలో ఏకవచనరూపమైన 'యాన్' పదాన్ని మూల రూపంగా స్థిరపరచారు. లక్ష్మణరావుగారు కాస్తంత ఇంకా ముందుకు వెళ్ళి మూలరూపం ఉచ్చారణను విశదీకరించారు.

లక్ష్మణరావుగారి అభిప్రాయం, ఆధునికుల అభిప్రాయం దాదాపుగా కలిసిపోయాయని చెప్పాలి.

లక్ష్మణరావుగారు వీటి బహువచన రూపం 'యామ్' అని పేర్కొన్నారు. ఆధునికులు దీన్నే స్థిరపరచారు.

''అరవము పురాతనమైనదా? తెనుగు అరవము నుండి పుట్టినదా? కానే కాదు!''అనే విషయాన్ని కూలంకషంగా పరిశీలించి లక్ష్మణరావుగారు ఒక వ్యాసం వ్రాశారు. అముద్రితంగా ఉండిపోయిన ఈ వ్యాసాన్ని మల్లంపల్లి సోమశేఖర శర్మగారు 1941 లో ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో ప్రకటించారు.

తమిళం పురాతనమైనది కాదని, తమిళం నుండి తెలుగు పుట్టలేదని దీని సారాంశం.

లక్ష్మణరావుగారు 'అచ్చతెలుగు' వ్యాసంలో ''ఉన్న ద్రావిడ భాషలలో అరవము వయసున పెద్దది. ఆంధ్రమునకక్క గావున రెండు భాషలయందును సమాన పదము గానవచ్చినప్పుడు, అరవమునుండి ఆంధ్రము గ్రహించిన దనియే యొప్పుకొనిన దప్పేమియు నుండదు'' అని పేర్కొన్నారు.[49]

దీన్నిబట్టి, 'అరవము పురాతనమైనదికాదని' చెప్పే వ్యాసం 'అచ్చ తెలుగు' వ్యాసం వ్రాయడానికి ముందు అంటే 1915 వ సంవత్సరానికి ముందే వ్రాయబడిందని తెలుస్తున్నది. 'అచ్చతెలుగు' వ్యాసం మొదట విజ్ఞాన సర్వస్వంలో ప్రచురించబడింది.

---

49. లక్ష్మణరాయ వ్యాసావళి - ద్వితీయ సంపుటం. పేజి. 227.

ద్రావిడ భాషల్లో తమిళం పురాతనమైనదని, మూల ద్రావిడ భాషకు అది అతి సన్నిహితంగా ఉందని భాషా శాస్త్రజ్ఞులు నిర్ణయించారు.

లక్ష్మణరావుగారు తమిళం తెలుగు కంటె ప్రాచీనమైంది కాదని మొదట ఈ వ్యాసం వ్రాసి, తరువాత తన అభిప్రాయాన్ని మార్చుకొని ఉంటారు. అందుకే దాన్ని ఏ పత్రికలోను ప్రచురించలేదు. సమకాలీన భాషా పరిశోధకుల నిర్ణయాలు దీనికి కారణమై ఉంటాయి. తిరిగి అచ్చతెలుగు గురించి వ్యాసం వ్రాసేటప్పుడు 'తమిళం' ప్రాచీనమైనదన్న అభిప్రాయాన్ని వ్యక్తీకరించారు.

ఈ వ్యాసంలో రెండు అభిప్రాయాలున్నాయని ముందే మనవి చేశాను. ఒకటి తమిళం ప్రాచీనమైంది కాదు అన్నది. రెండవది తమిళం నుండి తెలుగు పుట్టలేదు అన్నది.

మొదటిదాని విషయంలో లక్ష్మణరావుగారు ఆ తరువాత అభిప్రాయాన్ని మార్చుకొన్నారని తెలిసింది. రెండవ అభిప్రాయం సహేతుకమైందే. అరవము నుండి తెలుగు పుట్టిందన్న వారివాదనను ఖండించడం ఈ రెండవ అభిప్రాయానికి లక్ష్యం లక్ష్మణరావుగారు సుప్రసిద్ధ భాషా పరిశోధకులనే విషయం తెలుగు ప్రజలకు తెలియాలనే ఉద్దేశంతో మల్లంపల్లి సోమశేఖర శర్మగారు ఆ తరువాత దీన్ని పత్రికలో ప్రచురించారు.

## పారిభాషిక పద నిర్మాణం :

దేశ భాషలలో విద్యాభ్యాసం జరిగినప్పుడే ప్రజలందరూ విజ్ఞానవంతులు కాగలుగుతారని లక్ష్మణరావుగారి అభిప్రాయం.

మన భాషలో శాస్త్రీయ గ్రంథాలను రచించినట్టయితే ఆంగ్ల భాషలో కంటే ఇంకా తక్కువ వ్యవధిలో విద్యాభ్యాసం చేయడానికి వీలుంటుందని ఆయన భావన ఈ దృక్పథంతో విజ్ఞాన చంద్రిక పక్షాన అనేక శాస్త్రీయ గ్రంథాలను ప్రకటించారు.

వైజ్ఞానిక విషయాలు పాఠ్యాంశాలుగా నిర్ణయించి తెలుగులో మొట్ట మొదట పరీక్షలను నిర్వహించింది ఆయనే.

"స్వభాష యందు విద్యలు లేక పరభాష నభ్యసించి విద్యల సాధింప వలసినవాడింట నన్నము లేక పొరుగిండ్ల తిరిగి యన్నమును సంపాదించిన వానితో సమానుడు'' అని ఆయన వ్యాఖ్యానించారు.

ఆంగ్ల భాషలోని శాస్త్రీయ పదాలను వీలైనంతవరకు తెలుగులో రూపొం దించుకోవాలని ఆయన సూచించారు. పారిభాషిక పదాలు లేవన్న సాకుతో శాస్త్రీయ గ్రంథాల రచనను మానుకోకూడదని, వాటిని స్వయంగా రూపొందించు కోవాలని ఉద్బోధించారు.

తాను చెప్పదలచుకొన్న విషయాన్ని ఆచరించి చూపించగలిగే సుగుణం లక్ష్మణరావుగారిలో ఉండేది. ఆయన కార్యదక్షుడు. తన గ్రంథాలలో ఆంగ్ల పదాలకు సమానమైన తెలుగు పదాలను సృష్టించి ప్రయోగించాడు.

ఈనాడు మన నోళ్ళల్లో నిత్యం నలిగిపోతున్న కొని పదాలను లక్ష్మణ రావుగారు సృష్టించారంటే మనకు నిజంగా ఆశ్చర్యం వేస్తుంది. అటువంటి పదాలలో 'విశ్వవిద్యాలయం' అనేది ఒకటి. ఇది 'University' అన్న ఆంగ్ల పదానికి తెలుగు రూపాంతరం. అంతకు ముందు 'University' అన్న పదానికి "సర్వ కళాశాల" అనే తెలుగు పదాన్ని ప్రయోగిస్తూ ఉండే వారని మాడపాటి హన్మంతరావుగారు పేర్కొన్నారు.[50]

హిందూ మహాయుగం తృతీయ ముద్రణకు వ్రాసిన పీఠికలో "చెన్నపురి సర్వకళాశాలవారు" దీనిలోని కొన్ని భాగాలను మెట్రిక్యులేషన్ పరీక్షకు పాఠ్యాంశాలుగా నిర్ణయించారని ఆయన ప్రస్తావించారు. దీనిలో University అన్న ఆంగ్లపదం 'సర్వకళాశాల'గా పేర్కొనబడింది. హిందూ మహాయుగం

50. తెలుగు తల్లి - లక్ష్మణరాయ వర్ధంతి సంచిక పేజి 50.

రచించేనాటికి 'సర్వకళాశాల' అనే పదం వ్యవహారంలో ఉండేది. ఆ తరువాత లక్ష్మణరావుగారు 'విశ్వవిద్యాలయం' అనే పదం సృష్టించారు

అట్లాగే 'సంపాదకుడు' అన్న పదం కూడా లక్ష్మణరావుగారు సృష్టించిందే. Editor అనే ఆంగ్ల పదానికి తెలుగులో "పత్రికాధిపతి" అని ప్రయోగిస్తుండేవారు. ఇది సరిగా లేదని ఆయన దీన్ని "సంపాదకుడు" అని మార్చివేశారు.

'Amoeba' అనే పదానికి కొత్త పారిభాషిక పదాన్ని లక్ష్మణరావుగారు తయారు చేశారు. 'అమీబా' అనేది సూక్ష్మాతి సూక్ష్మమైన జంతువు. తెలుగు గ్రంథాలలో దీన్ని 'వికారిణి' అని అన్నారు. 'అమీబా'కు ఆకారం లేదు. అందుకే అది 'వికారిణి.'

ఆంగ్ల పదాలకు సరియైన తెలుగు పదాలు వాడుకలో ఉండాలని తలచి ఆయన ఈ పదాల సృష్టికి పూనుకొన్నారు.

లక్ష్మణరావుగారు వ్రాసిన గ్రంథాలలో, వ్యాసాలలో అనేక పారిభాషిక పదాలున్నాయి. వాటిలో కొన్నింటిని అక్షర క్రమంలో ఇక్కడ పొందుపరుస్తున్నాను. మామూలు పారిభాషిక పదాలను వీటిలో చేర్చలేదు. వీటిలో ఏవో ఒకటి రెండు తప్ప అన్నీ నిండుదనంతో కూడుకున్నవే. Education అనే పదానికి 'శిక్షణము' అని ఆయన వ్యవహరించారు దీనితో నిండుదనం లేదు. ఇక్కడ 'విద్య' అన్న పదమే అన్ని విధాల సరిపోతుంది.

Archaeologists = పురాతత్త్వవిదులు
Admiralty = సముద్ర సైన్యము
Anachronisms = కాలవిపర్యాస దోషములు
Astronomical investigations = నాక్షత్రిక పరిశోధనలు
Astronomy = ఖగోళ గణితము
Astronomical Observation = ఆకాశవేధ
Blocks = బిమ్మెలు (Photo Blocks)
Chemical Compounds = రసాయనిక మిశ్రణములు

Chemical Processes = రసాయనిక పద్ధతులు
Central Provinces = మధ్యపరగణాలు
Chamber of Commerce = వర్తక సంఘములు
Decimal = దశాంశ గణితము
Division of Labour = శ్రమ విభాగ న్యాయము
Detcetive Police = గుప్తచారులు
Epic Age = క్షాత్ర యుగము
Education = శిక్షణము
Editor = సంపాదకుడు
Fashion = విరగబాటు
Finance = ఆదాయ వ్యయము
Glaciers = హిమానీనదములు
Glorious defeats = కీర్తిప్రదములగు పరాజయములు
Geometrical Progression = పెద్ద గుణోత్తర శ్రేఢి
Geometrical Demonstrations = రేఖాగణిత సిద్ధాంతములు
Historical investigations = ఐతిహాసిక పరిశోధనలు
Inter lopers = పరదేశాగంతకులు
King makers = రాజ నిర్మాతలు
Liquids = ద్రవాక్షరములు (య, ర, ల, వ లు)
Military Academy = సైనిక పరిషత్తు
Muncipal Corporation = గ్రామరక్షక సంఘము
North-West Frontier Province = వాయవ్యపు పొలిమేర పరగణా
National = రాష్ట్రీయ
Orthography = వర్ణ పరిచ్ఛేదము
Oligarchical Republic = నాయక సత్తాక రాజ్యము
(అనేక కుటుంబాలలోని నాయకులందరు కలసి రాజ్యాన్ని పరిపాలిస్తే దాన్ని నాయక సత్తాక రాజ్యం అంటారు.)
Permutations and combinations = అంకయోగ వ్యవహారములు

Principal of Free-trade = అప్రతిబద్ధ వ్యాపార తత్త్వము
Philology = భాషా వ్యుత్పత్తి శాస్త్రము
Point of Law = ధర్మ నిర్ణయము
Paleography = పురాతనాక్షర శాస్త్రము
Phonetic = ధ్వన్యాత్మకమైన
Proofs = అచ్చు చిత్తులు
Political Revolution = రాజ్య క్రాంతి
Penal Code = శిక్షాస్మృతి
Psychology = మానస శాస్త్రము
Republics = ప్రజాసత్తాక రాజ్యములు
Resjudicata = పునర్విచారణ దోషము
Religious Revolution = ధర్మ క్రాంతి
Religious mission = మతప్రబోధకసంఘము
Religious toleration = పరమత సహిష్ణుత
Rationalistic Age = బుద్ధివైభవ యుగము (సూత్ర యుగము)
Statesman = రాజ్యకార్యధురంధరుడు
Standing Army = శాశ్వత సైన్యము
Thermometer = తాపమాపకము
University = విశ్వవిద్యాలయము
United provinces = సంయుక్తపు పరగణాలు

ఈ పారిభాషిక పదాలలో కొన్ని ఎంతో హుందాగా ఉన్నాయి. Rationalistic Age అనే పదాన్ని తీసుకుందాం. దీన్ని ఆయన 'బుద్ధివైభవ యుగం' అని అన్నారు. హిందూదేశ చరిత్రలో దీన్ని 'సూత్ర యుగం' అని కూడా పిలుస్తారు. సూత్ర వాఙ్మయం వెలసింది కాబట్టి దీన్ని సూత్ర యుగం అని అన్నారు. బుద్ధికి సంబంధించిన వికాసం ఎక్కువగా కనిపిస్తుంది కాబట్టి, లక్ష్మణరావు గారు దీన్ని "బుద్ధివైభవ యుగం" అని పేర్కొన్నారు. అట్లాగే "Political Revolution" అన్న పదాన్ని "రాజ్య క్రాంతి" అని వ్యవహరించారు. ఈనాడయితే దీన్ని "రాజకీయ విప్లవం" అని ప్రయోగిస్తారు. ఈ 'రాజకీయ విప్లవం'లో కంటే "రాజ్యక్రాంతి" అన్న పదంలో నిండుదనం ఎక్కువగా ఉంది. ఇటువంటి పదాలే భాషను సుసంపన్నం చేస్తాయి.

లక్ష్మణరావుగారి రచనావ్యాసంగం బహుముఖంగా విస్తరించింది. వివిధ రంగాలలో ప్రజలను విజ్ఞానవంతులను చేయాలన్నది ఆయన ఆశయం. తెలుగు వాఙ్మయం ఆధునికతను సంతరించుకుంటున్న తొలినాళ్ళల్లో తెలుగు సమాజాన్ని ఆవరించి ఉన్న చిమ్మచీకట్లను పారద్రోలడానికి అనేక విధాలుగా ప్రయత్నించిన మహనీయుడు వీరేశలింగం పంతులుగారు. ఆయన తరువాత పేర్కొన దగిన వాడు కొమర్రాజు లక్ష్మణరావుగారు వీరేశలింగం గారిని ఆధునికులు సాహితీ సవ్యసాచి అని అంటున్నారు. లక్ష్మణరావుగారు సాహిత్యపరంగా కొత్తప్రక్రియలు సృష్టించకపోయినా అనేక విషయాల గురించి ఆయన రచనలు చేశారు. సాహిత్యానికి, శాస్త్ర విషయాలకు, చారిత్రక భాషా పరిశోధనలకు సంబంధించిన అనేక వ్యాసాలు ఈ రచనల్లో ఉన్నాయి. ఆయన వ్రాసిన చారిత్రక, భాషా పరిశోధక వ్యాసాలను దీనికి ముందు వ్రాసిన విభాగంలో పరిశీలించడం జరిగింది. ఇవికాక, ఆయన వ్రాసినవి మరికొన్ని వ్యాసాలున్నాయి. ఈ వ్యాసాలు ఆయన బహుముఖ ప్రతిభా విశేషాలను చాటి చెప్పుతున్నాయి. వీటన్నింటినిబట్టి చూస్తే సాహితీ సవ్యసాచి అనే పేరు లక్ష్మణరావు గారికి కూడా వర్తిస్తుందని నిస్సందేహంగా చెప్పవచ్చును. ఆ రోజుల్లో ఆయన తానొక్కడే ఎంతో శ్రమ కోర్చి ఈ వ్యాస పరంపరలను వెలువరించారంటే అది సామాన్య విషయం కాదు.

చారిత్రక, భాషా పరిశోధక వ్యాసాలను మినహాయిస్తే, ఆయన రచించిన తక్కిన వ్యాసాలను స్థూలంగా రెండు విభాగాలుగా విభజించవచ్చును. అవి సాహిత్య వ్యాసాలు, శాస్త్ర సంబంధాలు. ఈ విభాగాలక్రిందకు రాని మరికొన్ని వ్యాసాలున్నాయి. వీటిని ఇతరములనే పేరుతో వ్యవహరిస్తే బాగుంటుంది.

## సాహిత్య వ్యాసాలు :

శివతత్త్వసార పీఠిక, అభిజ్ఞాన శాకుంతలం, అధర్వవేదం, శృంగారం- పూర్వలాక్షణికులు అలంకారములు, లలితకళలు, అభినయము- ఇవన్నీ సాహిత్య సంబంధాలు, ఉత్తమ శ్రేణికి చెందిన వ్యాసాలు.

మల్లికార్జున పండితారాధ్య కృతమైన శివతత్త్వసారం తెలుగు సాహిత్యంలో మొట్టమొదటి శతక గ్రంథంగా పరిగణింపబడుతున్నది. దీన్ని మొదట పరిష్కరించి, ప్రకటించింది లక్ష్మణరావుగారే. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో ఈ గ్రంథం వరుసగా ప్రచురించబడిన తరువాత ఆ పత్రిక వారిచేతనే 1922 లో గ్రంథరూపంగా వెలువరించబడింది.

ఈ గ్రంథానికి లక్ష్మణరావుగారు 40 పేజీల సుదీర్ఘమైన పీఠిక వ్రాశారు. ఈ తెలుగు శతక గ్రంథాన్ని వెలుగులోకి తెచ్చి, దాని ప్రాధాన్యతను పండిత లోకానికి తేటతెల్లం చేసిన కీర్తి లక్ష్మణరావు గారికి దక్కింది.

ఆంధ్ర సాహిత్య చరిత్ర రచనలో శివతత్త్వసారానికి ఒక విశిష్టమైన స్థానం ఉంది. "నన్నయకును, తిక్కనకును నడిమి కాలములో పుట్టినదని నిశ్చయముగ రచనా కాలము తెలిసిన గ్రంథమిది యొక్కటియే" అని లక్ష్మణ రావుగారు దాని ప్రాధాన్యతను ఉగ్గడించారు. సాహిత్య విలువలను మాత్రమే పరిష్కరించాలనే దృక్పథంతో కాక, దేశకాల పరిస్థితులను క్షుణ్ణంగా తెలుసుకోవాలనే లక్ష్యంతో అందుకు అభిముఖంగా ఈ గ్రంథాన్ని పరిష్కరించి ప్రకటించారు. ఆయన వ్రాసిన పీఠికంతా ఇదేరకంగా రూపొందినది.

తాను తప్పు అని భావించిన భాగాలను సవరిస్తూ, ఆ భాగాలను విడిగా యథాతథంగా చూపించారు. ఈ పద్ధతి, భావిలో ఈ గ్రంథాన్ని గురించి మరింత సమాచారం తెలుసుకోగోరేవారికి బాగా ఉపకరిస్తుందని అభిలషించారు.

"ఇదివరకచ్చుపడని గ్రంథమును క్రొత్తగా నచ్చువేయునప్పుడీ పద్ధతిని తప్పక యవలంబింపవలయును" అని ఆయన వ్రాశారు.

లక్ష్మణరావుగారు చారిత్రక పరిశోధకులు కాబట్టి, ఆయన వ్రాసిన ఈ పీఠికలో చారిత్రక ప్రమాణాలు చోటు చేసుకొన్నాయి.

శాసన ప్రమాణాలను, సాహిత్య ప్రమాణాలను తులనాత్మకంగా పరిశీలించి, ఈ శివతత్త్వసారం క్రీ.శ.1168 తరువాత రచించబడిందని నిర్ధారించారు.

మల్లికార్జున పండితుని కాలాన్ని నిర్ణయించడంలో నైతేనేమి, అతని వంశవృక్షాన్ని పేర్కొనడంలో నైతేనేమి, నాటి తెలుగుదేశ సాంఘిక పరిస్థితులను, మతపరమైన విషయాలను వివరించడంలో నైతేనేమి లక్ష్మణరావుగారు ఒక విశిష్టమైన మార్గాన్ని అనుసరించారు. కనుకనే ఆయన వ్రాసిన పీఠిక సుదీర్ఘమైన పరిశోధక వ్యాసంగా రూపొందినది.

ప్రాచీన గ్రంథాలను క్రొత్తగా ప్రచురించదలచినప్పుడు ఎటువంటి పద్ధతులను అనుసరించాలో ఆయన ఈ పీఠిక ద్వారా సాహిత్య ప్రపంచానికి తెలియజేశారు.

శివతత్త్వసారంలోని భాషా విషయాలను ప్రస్తావిస్తూ, "నన్నయ కావ్యమందలి లక్షణమును, శబ్దజాలమును నీ శతకమునందు గాన వచ్చుచున్నవి. అందువలన నా సంప్రదాయము పరంపరగా నీతని కాలము వరకు (మల్లికార్జున పండితుని కాలము వరకు) వచ్చెనని మన మూహింపవచ్చును'' అని పేర్కొన్నారు.

లక్ష్మణరావు గారు వ్రాసిన వ్యాసాలలో చాలా భాగం విజ్ఞాన సర్వస్వం కొరకు వ్రాసినవే అయినా, అవి సాహిత్య విమర్శలో ఉన్నత శ్రేణికి చెందినవని లోగడ మనవి చేశాను.

ఆయన విజ్ఞాన సర్వస్వంలో వ్రాసిన అభిజ్ఞాన శాకుంతలమనే వ్యాసము ఆ తరువాత లక్ష్మణరాయ వ్యాసావళి ద్వితీయ సంపుటిలో చేర్చబడింది.

కాళిదాసు విరచితమైన అభిజ్ఞాన శాకుంతల నాటకంలోని విశిష్టత దీనిలో పరామర్శించబడింది.

అభిజ్ఞాన శాకుంతలానికి మూడు భిన్న పాఠాలు మన దేశంలో కనిపిస్తున్నాయి. అవి గౌడీయము, దేవనాగరము, దాక్షిణాత్యము. ఈ మూడింటి మధ్య గల భేదాన్ని ఆయన ప్రస్తావించారు.

విభిన్న పాఠాల తారతమ్య పరిశీలన, కథాగమనం, భారత కథతోడి సంబంధం, ఔచిత్యం, రసపోషణ, వర్ణనలు, పాత్ర చిత్రణ, టీకలు, భాషాంతరాలు- ఈ రకంగా వింగడించబడి అభిజ్ఞాన శాకుంతలం సమగ్రంగా పరిశీలించబడింది.

మహా భారత కథ కంటే శాకుంతల వృత్తాంతం కాళిదాసు చేతిలో ఔచితీవంతంగా తీర్చదిద్దబడింది. మహా భారత కథలో దుష్యంతుడు శకుంతలను కుటీరంలో చూసి, మోహించి, శకుంతలకు జన్మించిన కుమారునికి రాజ్యాన్నిస్తాననే ఆశ చూపి గాంధర్వ వివాహం చేసుకుంటాడు.

ఇక్కడ దుష్యంతుడు కుమారున్ని రాజ్యాభిషిక్తున్ని చేస్తానని చూపిన ఆశ లంచం వంటిది కనుక ఔచితీవంతంగా లేదు. అట్లాగే శకుంతల తన కుమారున్ని పట్టాభిషిక్తుని చేయమని అడగడం సహజసిద్ధమైన ప్రేమానురాగాలకు విరుద్ధం. కాళిదాసు ఈ అనౌచిత్యాన్ని సరిదిద్ది, తన నాటకంలో శకుంతలకు దుష్యంతునికి మధ్య జనించిన అనురాగం పరస్పర ప్రేరేపితమైనట్టును నిర్వ్యాజమైనట్టును వర్ణించాడు.

మహాభారతంలో దుష్యంతుడు మొదటినుండి అసత్యసంధుడుగ, మోసగాడుగ కన్పిస్తాడు. రాజధానికి వెళ్ళిన తోడనే తోడ్కొని పోవడానికి జనాన్ని పంపిస్తానని శకుంతలతో చెప్పి, ఆ తరువాత తొమ్మిది సంవత్సరాల వరకు శకుంతలను గురించి పట్టించుకోలేదు. ఇటువంటి దోషాలున్నవాడు నాయకుడుగ ఉండడానికి వీలులేదని భావించడం వల్లే కాళిదాసు దుర్వాసముని వృత్తాంతాన్ని కల్పించాడు.

"దుర్వాసముని శాపము రాజు స్మృతి పథమును పూర్తిగ నాక్రమించినదని చూపుటకు కవి పంచమాంక ప్రారంభమున నొక చిన్న రంగము ప్రదర్శించినాడు. అది యెంతయు భావగర్భితముగను, భావభరితముగను, సరసముగనునున్నది" అని లక్ష్మణరావుగారు కాళిదాసును ప్రశంసించినారు.

కాళిదాసు భారతంలోని మూలకథను ఔచిత్యంగా మలచాడని చెప్పడానికి లక్ష్మణరావుగారు పై రెండు కథా భాగాలను ఉదహరించారు. కాళిదాసు నాటక రచనలో ప్రదర్శించిన ప్రతిభా విశేషాలను ఆసక్తికరంగా చెప్పుతూ 'ఔరా! కాళిదాసెంతటి గొప్పవాడు' అనే భావం పాఠకుని హృదిలో తళుక్కుమనేట్టు ఆయన ఈ వ్యాసం వ్రాశారు.

అభిజ్ఞాన శాకుంతలంలో నాలుగవ అంకం రమ్యమైంది. అందులోను శకుంతలను అత్తవారింటికి పంపుతున్నట్టు వర్ణింపబడిన నాలుగు శ్లోకాలు రమ్యాతిరమ్యాలు, ఉత్తమోత్తమాలు.

మొదటిసారి కూతురును అత్తవారింటికి పంపుతున్నప్పుడు కలిగే హృదయగతమైన ఆవేదన ఈ ఘట్టంలో కనిపిస్తుంది దాన్ని లక్ష్మణరావుగారు ఈ విధంగా చెప్తున్నారు :

"ఇచ్చట తండ్రి ఋషియైనను, తల్లి లేకపోయినను, ఇల్లు తపోవనమైనను, ఇతర జనులు బ్రహ్మచారులును బ్రహ్మచారిణులును అయినను, వారి పవిత్రతకెంతయు భంగము రాకుండగ, సామాన్య గృహస్థుని యింట నంపకములు జరుగుచున్నట్టుగానే కవి ఛాయాపటమును దింపియున్నాడు. ఇది విశేషములోని విశేషము"

అభిజ్ఞాన శాకుంతలాన్ని చదవనివారు, ఆ అవకాశం లేనివారు ఈ వ్యాసాన్ని చదివి ఆ నాటకంలోని మాధుర్యాన్ని ఆస్వాదించవచ్చు. అట్లాగే విమర్శకలోకం చేత 'ఓహో!' అని అనిపించే రీతిలో ఆయన శాకుంతల నాటకాన్ని ఈ వ్యాసంలో చిత్రించారు.

అథర్వవేదంపై ఆయన వ్రాసిన వ్యాసం కూడ ఆయన ప్రతిభను చాటి చెప్పుతున్నది. సామాన్యులకు వేద వాఙ్మయాన్ని వ్యాఖ్యానించడం సాధ్యం కాదు. లక్ష్మణరావుగారి వంటి మేధావి, బహు భాషాకోవిదుడు, పరిశోధకాగ్రేసరుడు మాత్రమే అందుకు సమర్థుడు.

లక్ష్మణరావుగారు చారిత్రక గ్రంథాలలో, శాసన వ్యాఖ్యానాలలో అవసరమనిపించిన ప్రతిచోట వేదవాఙ్మయంలోని విశేషాలను ఉదహరించారు.

నాలుగు వేదాల గురించి సమగ్రమైన, సాధికారికమైన వ్యాసాలు వ్రాయాలన్న తలంపు ఆయనకు ఉండేదని ఈ వ్యాసం వల్ల విదితమవుతున్నది

విజ్ఞాన సర్వస్వం అకారాది క్రమంలో ప్రారంభించబడింది కనుక అథర్వ వేదం గురించి మొదట వ్రాయవలసి వచ్చింది. అట్లా కాకుండా విషయ పరంగా విజ్ఞాన సర్వస్వం ప్రారంభించబడి ఉంటే నాలుగు వేదాలకు సంబంధించిన వ్యాసాలు లక్ష్మణరావుగారి లేఖిని నుండి వెలువడి ఉండేవి. అంతే కాకుండా, విషయపరంగా విజ్ఞాన సర్వస్వాన్ని ప్రారంభించి ఉంటే ఆయన దాన్ని త్వరితగతిన పూర్తిచేసి ఉండేవారు. కేవలం అకారాది క్రమంలో ప్రారంభించినందువల్లే అన్నేళ్ళు కష్టపడి ఆయన కేవలం మూడు సంపుటాలనే పూర్తి చేయగలిగారు.

అథర్వవేదంలోని సంహితను గురించి, తద్బ్రాహ్మణముల గురించి, ఉపనిషత్తుల గురించి, ఇతర ఉపాంగముల గురించి దీనిలో వివరించబడింది. తొలుదొల్త వేదాలు మూడేనన్న అభిప్రాయం ప్రబలంగా ఉండేది. క్రమేపీ అథర్వవేదం నాలుగవ వేదంగా పరిగణనలోకి వచ్చింది.

ఋగ్వేదం తెలిసినవాన్ని హోతగ, యజుర్వేదం తెలిసినవాన్ని అధ్వర్యునిగ, సామవేదం తెలిసినవాన్ని ఉద్గాతగ, అథర్వవేదం తెలిసినవాన్ని బ్రహ్మగ ఎన్నుకోవాలన్న ఆచారం ఏ విధంగా వచ్చిందో ఆయనలో దీనిలో వివరంగా పేర్కొన్నారు.

పురాణ కాలం నాటికి అథర్వవేదం ప్రతిష్ఠ హెచ్చి, రాజపురోహితులు ఈ వేదం గురించి తెలిసినవారై ఉండాలన్న నియమం ఏర్పడింది. లక్ష్మణరావు గారు మత్స్య పురాణం నుండి, మార్కండేయ పురాణం నుండి దీనికి సంబంధించిన ఉదాహరణలు తీసి చూపించారు. ఈ వ్యాసం చదువుతుంటే ఆయన పాఠకులకు ఋషిగా సాక్షాత్కరిస్తాడు.

లక్ష్మణరావుగారు శృంగార రసంపై వ్యాసం వ్రాయడానికి ఒక కారణం ఉంది. నాడు ఆంధ్ర దేశంలో శృంగార రసాన్ని గురించి తర్జనభర్జనలు జరుగుతున్నాయి. శృంగార వర్ణనలు కావ్యాలలో ఉండాలని వాదించేవారి వాదనలకు సమాధానంగా ఆయన ఈ వ్యాసం వ్రాశారు.

"శృంగారమనిన తోడనే యెట్టి యశ్లీల వర్ణనములును శృంగార రసమే యని కొందరు తలంచుచున్నారు. ఇంతకంటె ఘనమైన పొరపాటుండజాలదు. అభిజ్ఞాన శాకుంతలమందు వర్ణింపబడినది శృంగార రసము. కాని కవి చౌడప్ప శతకమందలిదియు శృంగార రసమేనా?'' ఇదీ లక్ష్మణరావుగారి అభిప్రాయం.

శృంగార వర్ణనలు ఎంత ఉదాత్తంగా ఉంటే అంత మంచిది. దానివల్ల కావ్యం విలువ పెరుగుతుంది. శృంగార రసాన్ని వేలంవెర్రిగా వర్ణించాలనుకునే వారికి, అటువంటి వర్ణనలను సమర్థించే వారికి కనువిప్పు కలిగించడమే ఈ వ్యాసంలోని పరమార్థం.

భరతుడు, జగన్నాథ పండితరాయలు, విశ్వనాథ కవిరాజు, మమ్మటుడు, క్షేమేంద్రుడు, విద్యానాథుడు వీరి సిద్ధాంతాలను వివరిస్తూ, శృంగార వర్ణనల పరిమితిని సూచించారు

శృంగారమనే పేరుతో ఉత్తమ ప్రకృతుల విషయమై పిచ్చి పిచ్చి సంభోగ వర్ణనలు చేయరాదని ఉద్బోధించారు.

"నాయికా నాయకులయొక్క యున్నతమైనట్టియు, సముజ్జ్వలమైనట్టియు, శుచియైనట్టియు ననురాగమును శ్రావ్యమైన శబ్దములచే వర్ణింపబడినది మాత్రమే శృంగార''మని నిర్ద్వంద్వముగా నిర్ధారించారు.

పచ్చి శృంగారాన్ని వర్ణిస్తూ కొందరు సమాజంలో అనీతిని సృష్టిస్తున్నారనే లక్ష్మణరావుగారి ఆవేదన మనకు దీనిలో కనిపిస్తుంది.

ప్రాచీనాలంకారికులు చెప్పిన అలంకారముల గురించి లక్ష్మణరావుగారు ప్రత్యేకంగా వ్యాసం వ్రాశారు. తెలుగు తెలిసినవారికి శాస్త్రగ్రంథాలు అందు

బాటులో లేవని భావించి, వారి ఉపయోగార్థం ఈ వ్యాసం వ్రాయబడింది. ఈ వ్యాసం కూడా విజ్ఞాన సర్వస్వంలో ప్రకటించబడిందే.

అలంకారికుల వేరువేరు సంప్రదాయాలు, గుణములు, అలంకారములకుగల భేదం, ధ్వనికి అలంకారానికి మధ్యగల తేడా, అలంకారాల చరిత్ర, అలంకారాల సంఖ్య, అలంకారాల విభజన, శబ్దార్థాలంకారాల యోగ్యత, ఈ రకమైన శీర్షికలుగా విభజింపబడి ఇది వ్రాయబడింది. తెలుగులో అలంకారాల గురించి ఇంత సమగ్రమైన వ్యాసం మరొకటి లేదు. దీన్ని ప్రత్యేకంగా పుస్తక రూపంలో ప్రకటించినట్టయితే ఎంతో మందికి ఉపయోగపడుతుంది.

లలిత కళల గురించి లక్ష్మణరావుగారు వ్రాసిన వ్యాసానికి సరితూగే వ్యాసం తెలుగు సాహిత్యంలో ఇంతవరకు పుట్టలేదు. తెలుగు సాహిత్యం ఉన్నంత కాలం ఈ వ్యాసం విలువ తరగకుండా ఉంటుంది.[1] 'కళ' అనే మాసపత్రికలో ముందు ప్రకటించబడి, ఆ తరువాత లక్ష్మణరాయ వ్యాసావళి ప్రథమ సంపుటిలో చేర్చబడింది.

ప్రాక్పాశ్చాత్య గ్రంథాలను పరిశీలించి ఆయన దీన్ని వ్రాశారు. లలిత కళలను లావణ్య కళలు, శృంగార కళలు అని అనవచ్చు. అయితే కవికుల గురువైన కాళిదాసు వీటికి లలిత కళలనే పేరు పెట్టినందువల్ల ఆ పేరే సార్థకంగా ఉంటుందని, ఆయన దాన్నే స్వీకరించారు.

మనోహరత్వం, విశ్వజనీనత, అనుకరణం-ఈ మూడు లలిత కళలకు ప్రధాన ధర్మాలని ఆయన పేర్కొన్నారు.[2]

---

1. 'కళ' దుందుభి : కార్తికం-పుష్యం.
   రుధిరోద్గారి : చైత్రం-వైశాఖం.

2. కాళిదాసు లలితకళలనే శబ్దాన్ని రఘువంశంలో ప్రయోగించాడు. ''గృహిణీ సచివః సఖీమిథః ప్రియశిష్యా లలితే కళావిధౌ'' రఘువంశం. 8వ సర్గము, 67వ శ్లోకము.

నిజ జీవితంలో బాధలను మరపించి, అంతరాత్మకు నిర్హేతుకమైన ఆనందాన్ని కలిగిస్తాయి. కాబట్టి మనోహరత్వం లలితకళలకు ముఖ్య ధర్మం.

ఇవి అందరికి సమానంగా ఆనందాన్ని కలిగిస్తాయి. ఏక కాలంలో అనేక మంది జనులకు వీటివల్ల ఆనందం కలుగుతుంది. కాబట్టి ఇవి విశ్వజనీనములు.

సృష్ట్యనుకరణ లలిత కళలకు గల మూడవ ధర్మం. చిత్రవిద్య, కవిత్వం, నాట్యం, శిల్పం, సంగీతం - ఈ ఐదు కళలకు ఈ మూడు ధర్మాలుంటాయి

సృష్టిలో కనిపించే వస్తువును చిత్రకారుడు చిత్రిస్తే, కవి శబ్ద రూపంలో వర్ణిస్తాడు. ఇద్దరి సృష్టికి అనుకరణే ఆలంబన. అదే విధంగా నాట్యం కూడా అనుకరణే. నేత్ర ముఖ హస్త పాదాదికములచే మనోవ్యాపారాన్ని తెలియజేయడమే ఆంగికాభినయం. లోకంలోని శారీరక వ్యాపారాలను నటులు చక్కగ అనుకరిస్తేనే గాని ప్రేక్షకులకు ఆనందం కలుగదు.

శిల్పకళ కూడా అనుకరణ ధర్మాన్ని ఆధారం చేసుకొన్నదే. సంగీతానికి మనోహరత్వం, విశ్వ జనీనత - ఈ రెండు ప్రధాన ధర్మాలున్నప్పటికీ అనుకరణం అప్రధానమైన ధర్మమని లక్ష్మణరావుగారు అంటారు. ఇక్కడ ఆయన ఆరిస్టాటిల్ అభిమతాన్ని ప్రస్తావించి, దానితో విభేదించారు.

పాశ్చాత్యులు లలితకళలను అనుకరణ ప్రధాన కళలు, అననుకరణ ప్రధాన కళలు అని రెండు విధాలుగా విభజించారు కొందరు సంగీతాన్ని అననుకరణ కళల్లో చేర్చారు. అయితే ఆరిస్టాటిల్ మాత్రం ఈ కళను అనుకరణ కళగా పరిగణించాడు.

ఉల్లాసం, విచారం, ఔత్సుక్యం, క్రోధం, రోషం మొదలైన అనుభావములను మనస్సులో పుట్టించడానికి అవసరమయ్యే ధ్వనిని అనుకరించి, సంగీతం తిరిగి మానవునిలో అట్టి భావాలను కలిగింపజేస్తుంది. కనుక ఇది అనుకరణ కళ

యని ఆరిస్టాటిల్ విశ్వాసం. కాని సంగీతంలో వినిపించే ప్రతిధ్వనీ సృష్ట్యను కరణమని చెప్పుటకు వీలులేదని, తక్కిన నాలుగు కళల్లోవలె అనుకరణము దీనికి ప్రధాన ధర్మం కాదని లక్ష్మణరావుగారు పేర్కొన్నారు. అయితే కొంత వరకు సంగీతంలో సృష్ట్యనుకరణ ఉంటుందని మాత్రం ఆయన అంగీకరించారు. అందుకే సంగీతానికి అనుకరణ ధర్మం అప్రధానమని అన్నారు. అంటే అనుకరణ ధర్మం ఉండవచ్చు. అయితే అది ప్రధానమైనది కాదు. అని ఆయన భావం.

లక్ష్మణరావుగారి మాటల్లో—

''నాదౌచిత్యమును విడిచి సంగీతానందము లేదు. రూపౌచిత్యమును విడిచి చిత్ర విద్యలేదు. శబ్దౌచిత్యమును విడిచి కావ్యము లేదు.''

లలితకళలు అనుకరణ ప్రధానాలని చెప్పడానికి భారత భాగవతాల నుండి; కాళిదాసు, భవభూతి, హేమచంద్రుడు మొదలైన మహాకవుల రచనల నుండి దృష్టాంతాలను చూపించారు. ముఖ్యంగా ఆయన చిత్రకళను గురించి విపులంగా వర్ణించారు. ఈ సందర్భంలో పాశ్చాత్యుల అభిప్రాయాలను, సంస్కృతవాఙ్మయ కర్తల అభిప్రాయాలను ఉదహరించారు.

హైందవ చిత్రకళను లక్ష్మణరావుగారు రెండు శాఖలుగా వర్గీకరించారు. అవి లౌకిక చిత్రవిద్య, ఆగమిక చిత్రవిద్య.

మనుషులు, పశుపక్ష్యాదులు, వృక్షములు, పర్వతములు - ఇవన్నీ లౌకిక చిత్రవిద్యకు ఆలంబనములు. దేవతలు, రాక్షసులు ఇత్యాది పౌరాణిక అమానుషుల ప్రతిమలు ఆగమిక చిత్రవిద్యకు ఆధారములు.

చక్కటి శైలితో, కొంగ్రొత్త ఆలోచనలతో, తారతమ్య పరిశీలనతో, నిశితమైన దృష్టితో ఈ వ్యాసగమనం సాగింది. ఈ వ్యాసం గురించి ఎన్ని మాటలు చెప్పినా తనివి తీరదు. లక్ష్మణరావు గారు తెలుగు సాహిత్యానికి సమర్పించిన అమూల్యమైన కానుక ఈ వ్యాస రాజం.

అభినయం కూడా కళా విశేషమే. ఇది సాహిత్యానికి అనుబంధమే. కనుకనే లలిత కళలతో పాటు దీన్ని కూడా ఈ విభాగంలో చేర్చడం జరిగింది. ఇది సచిత్రంగా విజ్ఞాన సర్వస్వంలో ప్రచురించబడింది.

అభినయం నాలుగు విధాలు. ఆంగికము, వాచికము, ఆహార్యము, సాత్త్వికము. ఈ నాలుగు అభినయాల గురించి దీనిలో చెప్పబడింది.

శాకుంతలం నుండి, ఉత్తర రామ చరిత్ర నుండి, జూలియస్ సీజర్ నుండి ఉదాహరణలు తీసి చూపిస్తూ, ఈ అభినయాలను ఆయన చాలా చక్కగా వర్ణించారు.

లక్ష్మణరావుగారు విజ్ఞాన సర్వస్వంలో వ్రాసిన మరో సాహిత్యపరమైన వ్యాసం అల్లోపనిషత్తు. ఇది అక్బరు హిందూదేశాన్ని పరిపాలిస్తున్న రోజుల్లో వెలువడింది. సాహిత్య విలువలపరంగా ఈ గ్రంథానికి ప్రాధాన్యం లేదు. ఇది సంస్కృతంలో అల్లాను గురించి వర్ణించబడిన విచిత్రమైన గ్రంథం. ఇటువంటి విచిత్రమైన గ్రంథం ఉందని చెప్పడానికే కాబోలు ఆయన దీన్ని అకారాది క్రమంలో చేర్చి ప్రచురించారు.

## శాస్త్ర సంబంధాలు :

లక్ష్మణరావుగారు వ్రాసిన శాస్త్రసంబంధమైన వ్యాసాలలో గణిత శాస్త్రానికి, జ్యోతిష శాస్త్రానికి, తర్క శాస్త్రానికి, అర్థ శాస్త్రానికి, ప్రకృతి శాస్త్రాలకు చెందినవి ఉన్నాయి. అలంకార శాస్త్రానికి చెందిన వ్యాసాలు సాహిత్యానికి సన్నిహితమైనవి కాబట్టి వాటిని సాహిత్య వ్యాసాలలో చేర్చడం జరిగింది.

అంకచ్ఛేఢులు, అనేక వర్ణ సమీకరణము, పంచాంగము, అధికమాసము, రాజరాజు కాలమున తెలుగు దేశమునందు సౌరమాన వ్యవహారముండెనా?, అనుమానము, అర్థశాస్త్రములు, దేశభాషలలో శాస్త్రపఠనము, ప్రకృతి శాస్త్రములు, రసాయన శాస్త్రము మేరు ప్రదేశము-ఇవన్నీ వివిధ శాస్త్ర విషయికాలే.

అంకచ్ఛేఢులు, అనేక వర్ణసమీకరణము ఈ రెండు గణితశాస్త్ర సంబంధాలు. గణితశాస్త్రం గురించి వ్యాసం వ్రాయడం ఏమిటని ప్రశ్నించేవారున్నారు. అటువంటివారు లక్ష్మణరావుగారు వ్రాసిన ఈ రెండు వ్యాసాలను చదివితే సరి

పోతుంది. నీరసమైన విషయాలను ఆసక్తికరంగా వ్రాయవచ్చునని ఆయన వీటి ద్వారా నిరూపించారు.

ఇంగ్లీషు పదాలు వాడకుండా తెలుగు పదాలతో సాంకేతికపరమైన వ్యాసాలు వ్రాయడం కష్టమని భావించేవారు ఈ వ్యాసాలను చదవాలని మనవి.

అంకశ్రేఢులంటే అంకెల వరుస. గణిత సూత్రాలనుబట్టి ఒక వరుస లోని ఒకానొక సంఖ్యను సాధించడం దీనిలోని సారాంశం.

గణితశ్రేఢి, గుణోత్తరశ్రేఢి, హరాత్మకశ్రేఢి అనే అంకశ్రేఢుల గురించి దీనిలో వివరించబడింది. సూక్ష్మంగా చెప్పాలంటే, ఈ వ్యాసంలో కూడిక, తీసివేత, హెచ్చవేత, భాగహారము - వీటి గురించి ప్రస్తావించబడింది.

అనేక వర్ణసమీకరణాన్ని ఆంగ్లంలో Simultaneous equation అని అంటారు ఇది బీజ గణితశాస్త్రానికి సంబంధించినది. ఏకవర్ణ సమీకర ణంలో తెలియని వర్ణం ఒక్కటే ఉంటుంది. అనేక వర్ణసమీకరణంలో తెలియని వర్ణాలు, అంటే సంఖ్యలు ఒకటికిమించి ఉంటాయి వాటిని సూత్రబద్ధంగా సాధించవలసివుంటుంది. భాస్కరాచార్యుడు చెప్పిన సిద్ధాంతాలనే సులభమైన పద్ధతిలో విపులంగా వ్యాసరూపంలో లక్ష్మణరావుగారు వివరించారు. విద్యార్థు లకు ఇటువంటి వ్యాసాలు బాగా ఉపకరిస్తాయి

పంచాంగము, అధికమాసము, రాజరాజు కాలమున తెలుగు దేశమునందు సౌరమాన వ్యవహారముండెనా? అనే మూడు వ్యాసాలు జ్యోతిషశాస్త్రాన్ని గురించి చెప్తున్నాయి.

పై మూడు వ్యాసాలలో అధిక మాసమనే వ్యాసం విజ్ఞాన సర్వస్వంలో ప్రచురించబడింది. పంచాంగమనే వ్యాసం పింగళనామ సంవత్సర ఉగాది సంచికలో ప్రచురించబడింది. మూడవది రాజరాజ నరేంద్ర పట్టాభిషేక మహో త్సవ సంచిక కొరకు ప్రత్యేకంగా వ్రాయబడింది.

తిథి వార, నక్షత్ర, యోగ, కరణములను పంచాంగముల గురించి లక్ష్మణరావుగారు శాస్త్రీయ పద్ధతిలో వివరించారు.

జ్యోతిష్కులు అహోరాత్రులను 24 భాగాలుగా విభజించి, ఒక్కొక్క భాగానికి 'హోర' అన్న పేరు పెట్టినారు. ఈ హోర అన్న పదం సంస్కృత పదం కాదు. గ్రీకు పదం. దీన్నే ఇంగ్లీషు భాషలో 'అవర్' (Hour) అని వ్యవహరిస్తున్నారు అని ఆయన వెల్లడించారు.

మన దేశంలో పంచాంగాలను గుణించే పద్ధతి ఏర్పడి చాలా కాలమైందని, దాన్ని ఆధునిక దృష్టితో సంస్కరించవలసి ఉందని ఆయన అభిప్రాయపడ్డారు.

"పాశ్చాత్య జ్యోతిష శాస్త్రము ఒక సెకనులో నూరోవంతు కాలము కూడా దప్పకుండా నాకాశమునందు గ్రహాదికముల స్థానమును జూపునంత పరిపూర్ణావస్థకు వచ్చినది" అని అంటూ, పాశ్చాత్యులతో సమాన స్థాయికి మనం ఎదగాలన్నారు.

అయితే లక్ష్మణరావుగారు ఈ అభిప్రాయాన్ని వెలిబుచ్చిన రోజులను ఇప్పటి రోజులతో పోల్చిచూస్తే మనం ఇప్పుడు ఖగోళాది పరిశోధనల్లో చెప్పుకో దగిన స్థాయికే చేరుకున్నామని చెప్పాలి.

అధిక మాసం అనే వ్యాసంలో పంచాంగాన్ననుసరించి అధికమాసం అంటే ఏమిటో, అది ఎట్లా వస్తుందో చెప్పబడింది.

మన పంచాంగం లెక్కల ప్రకారం ఒక్కొక్కసారి సంవత్సరానికి పదమూడు మాసాలొస్తాయి. అప్పుడు ఆ విధంగా అదనంగా వచ్చిన మాసాన్ని అధిక మాసం అని అంటారు. ఏ చాంద్రమాసంలో సంక్రాంతి ఉండదో అది అధిక మాసం.

మాసాలు రెండు రకాలు. చాంద్రమాసం, సౌరమాసం. మాసాలను బట్టే సౌరసంవత్సరం, చాంద్రసంవత్సరం అని రెండు రకాల సంవత్సరాలు గుణింప

బడుతున్నాయి. సౌరసంవత్సరం, చాంద్రసంవత్సరం కంటె దాదాపు పదకొండు రోజులు పెద్దది. తెలుగుదేశంలో చాంద్రమాసాలు, తమిళ దేశంలో సౌర మాసాలు వాడుకలో ఉన్నాయి. దీని కారణంగానే సంవత్సరాది పండుగను రెండు ప్రాంతాల వారు వేర్వేరుగా జరుపుకుంటారు.

అయితే రాజరాజు తెలుగుదేశాన్ని పరిపాలిస్తున్న కాలంలో తెలుగు దేశంలో సౌరమాన వ్యవహారం ఉండేదని కోరుమిల్లి శాసనం తెలియజేస్తున్నది ఈ శాసనాన్ని ఆధారం చేసుకొని లక్ష్మణరావుగారు జ్యోతిష శాస్త్రానికి సంబంధించిన మూడవ వ్యాసం వ్రాశారు. రాజరాజనరేంద్రుని పట్టాభిషేక మహోత్సవాల సందర్భంలో వెలువరించిన సంచికలో ఈ వ్యాసం ప్రకటించ బడింది రాజరాజు ఎప్పుడు పట్టాభిషిక్తుడయ్యాడో ఈ వ్యాసంలో ఖచ్చితంగా తేల్చి చెప్పబడింది. తెలుగుదేశంలో రాజరాజు కాలంలో సౌరమానం వ్యవహారంలో ఉండేది దాన్నే ఆయన ఈ వ్యాసంలో విపులీకరించారు. అయితే ఈ సౌరమాసం తెలుగుదేశం నుండి ఎప్పుడు పోయిందో ఆయన తేల్చి చెప్పలేదు. బహుశా దాన్ని నిర్ధారించి చెప్పడానికి సరియైన ఆధారాలు ఆయనకు దొరికి ఉండవు.

లక్ష్మణరావుగారు రచయితగా స్పృశించని వస్తువంటూ లేదు. ఆయనకు అంత విశిష్టమైన మేధా సంపత్తి ఏ విధంగా అలవడిందో ఆలోచిస్తే ఆశ్చర్యమే కలుగుతుంది.

తర్కశాస్త్రాన్ని అధ్యయనం చేయడమే కష్టమని చాలామంది భావిస్తుంటారు. అయితే లక్ష్మణరావుగారు తర్కశాస్త్రంలో కూడా నిష్ణాతుడని ఆయన వ్రాసిన 'అనుమానం' అనే వ్యాసం చెబుతున్నది. హిందూ తర్కశాస్త్రం గురించి, పాశ్చాత్య తర్కశాస్త్రాల గురించి దీనిలో చెప్పబడింది.

తర్కశాస్త్రంలో 'అనుమానం' అనేది రెండవ ప్రమాణం. ప్రమాణములు నాలుగు. అవి ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము. 'ప్రమ' అంటే

యథార్థానుభవం. దాన్నే నిజమైన జ్ఞానం అని అంటారు. ప్రమకు కారణం ప్రమాణం.

ఎక్కడో దూరంగా కనిపించే పొగనుబట్టి అక్కడ అగ్ని ఉందని అనుమానిస్తాం. ఇది వినడానికి, చెప్పడానికి సులభంగానే ఉంటుంది. కాని తర్కశాస్త్రరీత్యా శాస్త్రీయ పద్ధతిలో దీన్ని నిర్వచించాలంటే సామాన్య విషయం కాదు.

అనుమానం రెండు విధాలు. స్వార్థానుమానం, పరార్థానుమానం. స్వార్థానుమానంలో మానవుడు తన సంశయాన్ని మాత్రమే పోగొట్టుకుంటాడు. పరార్థానుమానంలో ఇతరుల సంశయాన్ని కూడా తొలగిస్తాడు. ఈ వ్యాసంలో తర్కశాస్త్రానికి సంబంధించిన అనేక విషయాలు చెప్పబడ్డాయి.

ఈ వ్యాసం చివర లక్ష్మణరావుగారు తర్కశాస్త్ర సంబంధమైన పారిభాషిక పదాల పట్టికను ఇచ్చారు. నాగరీ ప్రచారిణీ సభవారి శాస్త్రీయ పదపారిజాతం (Glossary of scientific terms), ప్రొఫెసర్ రానడేగారి అంగ్ల మహారాష్ట్ర కోశం - ఈ రెండింటి ఆధారంతో ఆయన ఈ పారిభాషిక పద పట్టికను రూపొందించారు.

హిందూ దేశంలో రచించబడిన అర్థశాస్త్రాల గురించి వివరించే చిన్న వ్యాసాన్ని లక్ష్మణరావుగారు విజ్ఞాన సర్వస్వంలో ప్రకటించారు. హిందూ దేశంలో వేదాంతం పాలు ఎక్కువ కనుక ఆర్థిక రంగంలో హిందూ దేశ ప్రజలు మక్కువ చూపలేదని చెప్పేవారి మాటలు యథార్థం కాదని దీనిలో చెప్పబడింది.

ధర్మశాస్త్రాలు, అర్థశాస్త్రాలు, కామశాస్త్రాలు, మోక్షశాస్త్రాలు అని మన ప్రాచీనులు శాస్త్రాలను నాలుగు విధాలుగా విభజించారు.

శుక్రనీతిలో అర్థశాస్త్రానికి సంబంధించిన విషయాలున్నాయి. దీనిలో చర్చించబడిన అర్థ శాస్త్ర విషయాలను "Political Economy"గా పరిగణించవచ్చని లక్ష్మణరావుగారంటున్నారు.

కౌటిల్యుని అర్థ శాస్త్రం ఆర్థిక శాస్త్ర విషయాలను వివరించిన పరమోత్కృష్టమైన గ్రంథం. అట్లాగే పదవ శతాబ్దంలో వ్రాయబడిన కామంద కీయ నీతిశాస్త్రం, పన్నెండవ శతాబ్దంలో వ్రాయబడిన 'నీతి వాక్యామృతం' ఆర్థిక శాస్త్ర గ్రంథాలేనని ఆయన పేర్కొన్నారు.

లక్ష్మణరావుగారు దేశాభిమాని. ప్రకృతి శాస్త్ర గ్రంథాలు విస్తృతంగా వెలువడినట్టయితే మన దేశ ప్రజలు విజ్ఞానవంతులవుతారని, తద్వారా దేశ ప్రగతి సాధ్యమవుతుందని భావించారు. అందుకే విజ్ఞాన చంద్రిక లక్ష్యాలలో ప్రకృతి శాస్త్ర గ్రంథాల ప్రచు ణను చేర్చారు.

తెలుగు మాతృభాషగా గలవారు శాస్త్ర గ్రంథాలను ఆంగ్ల భాషలో అభ్యసించడంవల్ల విజ్ఞాన సముపార్జనకు ఎక్కువ సమయం పడుతున్నదనీ, మాతృభాషలోనే విజ్ఞాన శాస్త్రాలను అభ్యసించినట్టయితే ఆ సమయాన్ని సగానికి సగం తగ్గించవచ్చని ఆయన అభిప్రాయం.

ఆంగ్లేయులు ప్రపంచ వ్యాప్తంగా ఆధిపత్యాన్ని సంపాదించి ఆంగ్ల భాష ప్రపంచ వ్యాప్తం కావడానికి కారకులయ్యారు. అనేక శాస్త్ర గ్రంథాలు ఆంగ్ల భాషలో రచించబడి ప్రపంచంలో తక్కిన వారికి శరణ్యాలయ్యాయి. ఆంగ్లే యులు అన్ని రంగాలలో ముందడుగు వేయడానికి కారణం అనేక శాస్త్రీయ గ్రంథాలు ఆంగ్ల భాషలో రచించబడడమే. అట్లాగే ఒక భాష ఉన్నత స్థితికి చేరాలన్నా, ఒక భాషా ప్రజలు ముందడుగు వేయాలన్నా ఆ భాషలో ఉన్నత ప్రమాణాలు కలిగిన శాస్త్రీయ గ్రంథాలు ఉండాలి. అటువంటప్పుడే ఆ భాషా ప్రజలకు తమ మాతృభాషపట్ల అభిమానం పెరుగుతుంది. ప్రయోజనం సిద్ధి స్తుంది. ఈ కారణంగా లక్ష్మణరావుగారు అనేక ప్రకృతి శాస్త్ర గ్రంథాలను తెలుగులో వెలువరించడానికి పూనుకొన్నారు.

దేశ భాషలలో శాస్త్రాలను అభ్యసించడంవల్ల కలిగే ప్రయోజనాలను, అందుకు చేయవలసిన కృషిని ఉద్ఘాటిస్తూ ఆయన ప్రత్యేకంగా ఒక వ్యాసం వ్రాశారు. ఇది ఆంధ్ర సారస్వత పరిషత్పత్రిక ప్రమాదీచ ద్వితీయ సంచికలో ప్రచురించబడింది.

"లలిత వాఙ్మయ మభివృద్ధి చెందుట యొక యెత్తు. శాస్త్ర జ్ఞానాభివృద్ధి కనుకూలమైన గ్రంథములు నిర్మాణమగుట యొక యెత్తు. ఇట్టి గ్రంథములు దేశ దారిద్ర్య వినాశకములు" అని ఈ వ్యాసంలో శాస్త్ర గ్రంథాల ప్రాముఖ్యతను చెప్పినారు.

దేశ భాషలలో శాస్త్రీయ గ్రంథాలు వ్రాయడానికి పారిభాషిక పదాల నిర్మాణం ప్రతిబంధకంగా ఉందని భావించేవారికి ఆయన ఈ విధంగా సూచించారు :

''పదములు లేవని శాస్త్ర గ్రంథములు నిర్మించుట మానవలదు. శాస్త్రములు మొదట పుట్టును, పారిభాషిక పదములు పిదప స్థిరపడును.''

పారిభాషిక పదాల నిర్మాణంలో వీలయినంతవరకు దేశ్య పదాలను, వాడుకలో ఉన్న సంస్కృత పదాలను వాడాలనీ, ఆ పదాలు లేనప్పుడు సంస్కృత వాఙ్మయంలోని సమానార్థక పదాలను తీసుకోవాలనీ, అవీ దొరకనప్పుడు మాత్రమే ఇంగ్లీషు పదాలను ఉపయోగించాలని ఆయన ఉద్ఘాటించారు.

శాస్త్రీయ గ్రంథాల నిర్మాణంలో తప్పని పరిస్థితుల్లో మాత్రమే ఆంగ్ల భాషా పదాలు వాడాలన్నది దీని సారాంశం.

విజ్ఞాన చంద్రిక ప్రచురించిన శాస్త్రీయ గ్రంథాలకు ఆయన విలువైన పీఠికలు వ్రాశారు. 'జీవశాస్త్ర సంగ్రహం' అనే గ్రంథానికి, 'రసాయన శాస్త్రం' అనే గ్రంథానికి ఆయన వ్రాసిన పీఠికలను ఆయా శాస్త్ర విషయాలపై వ్రాసిన వ్యాసాలుగా పరిగణించాలి. ఆ ఉద్దేశంతోనే కావచ్చు ఈ రెండు వ్యాసాలు ఆ తరువాత లక్ష్మణరాయ వ్యాసావళిలో చేర్చబడ్డాయి.

జీవశాస్త్ర సంగ్రహమనే గ్రంథానికి 'ప్రకృతి శాస్త్రము'లనే పేరుతో ఆయన పీఠిక వ్రాశారు. దీనిలో ఆధ్యాత్మిక శాస్త్రులకు, ప్రకృతి శాస్త్రులకు

గల సంబంధం, ప్రకృతి శాస్త్రాల ప్రాముఖ్యత వివరించబడ్డాయి. ఈ రోజుల్లో శాస్త్ర గ్రంథాల రచనకు పూనుకునేవారు. లక్ష్మణరావుగారి రచనా ధోరణిని అనుసరిస్తే వారి గ్రంథాలు ఆసక్తికరంగా రూపొందుతాయని చెప్పవచ్చును.

పారిభాషిక పదాల కొరకు తడుముకోవడం, శాస్త్రీయమైన నిర్వచనాన్ని చెప్పే సందర్భాలలో డొంక తిరుగుడు పద్ధతిని అనుసరించడం ఆయన రచనలలో మచ్చుకైనా కనిపించవు. శాస్త్ర విషయాలను చేప్పేటప్పుడు ఆయన శైలి ఎట్లా ఉంటుందో మచ్చుకు ఈ క్రింది వాక్యాలను గమనిస్తే చాలు:

"జడ ద్రవ్యములన్నియు నెటుల అణువులచేత జేయబడినవో యటులనే జీవ శరీరములన్నియు జీవకణములనబడు (Cells) సూక్ష్మ ద్రవ్యములచే జేయబడినవి. ఏ వృక్షము యొక్క శరీరమును పరీక్షించి చూచినను, ఏ జంతువు యొక్క శరీరమును శోధించినను అవి కణమయమై యున్నటుల గానవచ్చును. అనేక మానవులు కూడి యొక సంఘముగా గాని దేశముగా గాని యెటుల నేర్పడునో యటులనే యనేక కణముల సమూహము దేహమనబడును."

రసాయన శాస్త్రానికి వ్రాసిన ఉపోద్ఘాతంలో రసాయన శాస్త్రం పూర్వం నుండి మన దేశంలో ఉన్నదేనని అంటూ వైద్యశాస్త్రం, రసవాదం, ధాతువాదం మొదలైన విద్యలను ఉదహరించారు. అయితే పాశ్చాత్య దేశాలలో మాదిరిగా మన దేశంలో రసాయన శాస్త్రంలో విరివిగా పరిశోధనలు జరుగలేదు. అందుకే పాశ్చాత్య పరిశోధనలపై మనవారు ఆధారపడవలసి వచ్చింది.

ప్రాచీన కాలంలో మన దేశంలో రసాయనశాలలు, యంత్రశాలలు నిర్మింపబడుతుండేవి. దీనికి నిదర్శనాలను 'రసార్ణవం' నుండి తీసి చూపించారు. అట్లాగే ఆ కాలంలో శాస్త్రజ్ఞుల సభలు జరుగుతుండేవని 'చరక సంహిత' నుండి దృష్టాంతాలను ఉదహరించారు.

మన దేశంలో క్రమక్రమంగా శాస్త్ర ప్రయోగాలు తగ్గిపోయినందువల్లే రసాయన శాస్త్రాలు మన దేశంలో అభివృద్ధి చెందలేదు. అని ఆయన తన

సమకాలీన పరిస్థితితో పాశ్చాత్యుల శాస్త్ర జ్ఞానాభివృద్ధిని పోల్చుతూ, మన వెనుక బాటుతనాన్ని ప్రజల దృష్టికి తీసుకవచ్చారు. పాశ్చాత్యులవలె మనం రసాయన శాస్త్రంలో ప్రయోగాలు చేసి ఉన్నట్టయితే వారికంటే ఎక్కువ ప్రగతి సాధించి అందరికీ మార్గదర్శకులం కాగలిగేవాళ్ళం అని అంటారాయన.

రసాయన శాస్త్రాన్ని గురించి చెప్పడం ముఖ్యోద్దేశం. కాని సూటిగా దాని గురించి కాకుండా రసాయన శాస్త్రం మన దేశంలో ఏ విధంగా అభివృద్ధి చెంది నదీ, మనం ఈ శాస్త్రాధ్యయనానికి పాశ్చాత్యులపై ఎందుకు ఆధారపడవలసి వచ్చినదీ దీనిలో వివరించారు. ఆయన ఏ విషయం చెప్పినా ఈ ధోరణే కనిపిస్తుంది.

లక్ష్మణరావుగారు 'మేరుపర్వతం' అన్న పేరుతో ఒక వ్యాసం వ్రాశారు.[3] ఈ పేరు వినగానే ఏదో కావ్యగత వస్తువు గురించి వ్రాయబడిన వ్యాసం అనే అనుమానం తప్పక కలుగుతుంది. కాని దీనిలో భౌగోళిక విషయం చెప్పబడింది.

ప్రాచీన కవులు మేరు పర్వతాన్ని దేవతా సంబంధమైన మానవాతీత ప్రదేశంగా వర్ణించారు. అక్కడ ఆరు నెలలు పగలు, ఆరు నెలలు రాత్రి ఉంటుందని, పితృదేవతలు నివసిస్తుంటారని వారి వర్ణనలు చెప్తున్నాయి. ఈ మేరు పర్వతం ఎక్కడో కాదు - భూలోకంలోనే ఉందని, అదే ఉత్తర ధృవ ప్రాంతమని (North pole) లక్ష్మణరావుగారు పేర్కొన్నారు దాన్ని చెప్ప డానికే ఈ వ్యాసం వ్రాశారు.

ధృవప్రాంతం ఎల్లప్పుడూ మంచుచేత కప్పబడి ఉంటుంది. కనుక వెండి కొండవలె భాసిస్తుంది. సూర్యుని గమనంలో మార్పు కారణంగా ఈ ధృవ ప్రాంతంలో ఆరునెలలు పగలు, ఆరునెలలు రాత్రి ఉంటుంది.

''మన పూర్వులైన యార్యులొకప్పు డీప్రదేశమునందు (ధృవ ప్రదేశము నందు) గాపురముండుటచే నచ్చట వారు చూచిన, వంకరగ ప్రదక్షిణము

---

3. 'సరస్వతి' దుందుభి. సంపుటి. 1· సంచిక 1,2.

చేయుచు దీర్ఘకాలముండెడి ఉషస్సును గురించిన కథలు వారి సంతతివారైన వైదిక ఋషులు ఋగ్వేదాదికములలో వర్ణించి యున్నారు". అని ఒకచోట వ్రాశారు.

ఒక వాస్తవికమైన ప్రదేశం రానురాను మన కవుల వర్ణనల్లో మానవాతీతమైన ప్రదేశంగా మారిపోయింది. ఈ దృష్టితో పరిశీలిస్తే కావ్యాలలో వర్ణింపబడిన అనేక అద్భుత ప్రదేశాలు ఎక్కడోకాదు - మన చుట్టూనే ఉన్నాయన్న వాస్తవం మనకు తప్పక తెలిసిపోతుంది.

లక్ష్మణరావుగారి వ్యాసాలను గమనించి చూస్తే మనకు ఒక విషయం స్పష్టమవుతుంది. మనం, మన దేశం, మనది - ఈ భావనతో ఆయన రచనకు అంకురార్పణ జరుగుతుంది. మనం ఏ విషయంలోనూ తీసిపోయినవారం కాదు. మనకు ఎన్నో ఏళ్ళక్రిందటే అన్ని విషయాలు తెలుసు. కాని మనం వాటిని అభివృద్ధి చేసుకోలేదు. పాశ్చాత్యులు అభివృద్ధి చేసుకొన్నారు. అదే మనకూ వారికీగల తేడా. ఇప్పటితరంవారు దీన్ని గమనించకుండా పాశ్చాత్యులే అన్నిటికీ ఆద్యులని పొరబడుతున్నారు అని ఆయన చాలాచోట్ల వ్యక్తీకరించారు. సోమరితనం కారణంగా మనం చాలా నష్టపోయామని పరోక్షంగా చాలామార్లు స్పష్టీకరించారు.

ఒక గ్రంథం వ్రాసినా, వ్యాసం వ్రాసినా మొదట దాన్ని ఆసక్తికరంగా ప్రారంభించి, ఆ తరువాత వ్యాఖ్యాన సహితంగా తీర్చిదిద్దే పద్ధతి లక్ష్మణరావుగారి రచనల్లో కనిపిస్తుంది.

## ఇతర వ్యాసాలు :

అద్వైతము, అభావము, కర్మయోగము, అవతారములు, అవధానములు, అనాగరక సంఘము - ఈ ఆరు వ్యాసాలు ఈ శీర్షిక క్రింద పరిశీలింపబడుతున్నాయి.

జీవాత్మ, పరమాత్మ భిన్నములని చెప్పునది ద్వైతము. జీవాత్మ, పరమాత్మ అభిన్నములని చెప్పునది అద్వైతము.

"బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవోబ్రహ్మైవనాపరః."

ఇది అద్వైత సిద్ధాంతం. బ్రహ్మ ఒక్కడే సత్యం. జగమంతా మిథ్య. జీవుడు బ్రహ్మమే. బ్రహ్మముకంటే భిన్నముగాదు. ఇది దీని సారాంశం.

శ్రీ శంకర ప్రతిపాదితమైన అద్వైతంలో మళ్ళీ రెండు ఉపశాఖలు బయలుదేరినాయి అవి విశిష్టాద్వైతము. శుద్ధా ద్వైతము.

శ్రీ శంకరాచార్యులవారి మతము ననుసరించి బ్రహ్మము నిర్గుణము. నిర్విశేషము ఇది సహేతుకము కాదని శ్రీ రామానుజాచార్యులు విశిష్టాద్వైతాన్ని స్థాపించారు. విశేషణయుక్తమైనందున ఇది విశిష్టాద్వైతము. దీనిలో శ్రీ రామానుజులు బ్రహ్మము సగుణమని ప్రతిపాదించారు.

అద్వైతమును, విశిష్టాద్వైతమును ఖండించుచు శ్రీ వల్లభాచార్యులు శుద్ధాద్వైతమును ప్రతిపాదించారు. కళ్ళకు కనిపించే ప్రపంచమంతా సత్యమని. సూటిగ బ్రహ్మమని ఈతని సిద్ధాంతం మాయావాదముగాని, చిదచిత్తులీశ్వరుని గుణములన్న వాదముగాని ఇతనికి సమ్మతములు గావు.

లక్ష్మణరావుగారు 'అద్వైతం' అనే వ్యాసంలో విశిష్టాద్వైతం గురించి, శుద్ధాద్వైతం గురించి, పాశ్చాత్యాద్వైతం గురించి సర్వసమగ్రంగా చర్చించారు. పాశ్చాత్యాద్వైతం ప్లోటినస్ మతానుసారం, స్పినోజా మతానుసారం చర్చించబడ్డాయి.

'అభావము' అనే పేరుతో విజ్ఞానసర్వస్వంలో లక్ష్మణరావుగారు ఒక వ్యాసం వ్రాశారు ఇది వైశేషిక దర్శన సంబంధి. వైశేషిక దర్శనం 'అణువు' ప్రపంచానికి మౌలిక పదార్థమని చెబుతున్నది

ఆదిలో వైశేషిక సూత్రాలలో ద్రవ్య, గుణ, కర్మ, సామాన్య, విశేష, సమవాయ అనే ఆరు పదార్థాలే చెప్పబడ్డాయి. ఆ తరువాత దార్శనికులు అభావమనే పేరుతో మరో పదార్థాన్ని చేర్చారు మొదటి ఆరు భావపదార్థాలైతే ఇది

అభావపదార్థం. అభావపదార్థ లక్షణం దీనిలో చెప్పబడింది. ''ఇచ్చట ఘటము లేదు. ఇచ్చట పటములేదు'' అన్న అభావసజ్ఞానమే అభావమునకు హేతువు.

'కర్మయోగం' అనే వ్యాసంలో వేదాంతం చర్చించబడింది. అముద్రితంగా ఉండిపోయిన ఈ వ్యాసం లక్ష్మణరాయ వ్యాసావళి ప్రథమ సంపుటిలో ప్రచురించబడింది. ఇది అసంపూర్తి వ్యాసం. వేదాంత సంబంధమైన కర్మ సిద్ధాంతం దీనిలో చర్చించబడింది.

కర్మకు, మానవ స్వభావానికి గల సంబంధాన్ని వివరించడం వరకు వ్రాయబడి, ఆ తరువాత అసంపూర్తిగా ఆగిపోయింది. చివరి వాక్యం పూర్తిగా లేదు. అట్లాగే అసంపూర్తిగా ప్రచురించబడింది.

కర్మ సిద్ధాంతం గురించి సమగ్ర్యమైన వ్యాసం వ్రాయాలన్న దృక్పథంతో దాన్ని ప్రారంభించి, కొంతవరకు వ్రాసి, అనారోగ్యం వల్లనో లేదా మరేదైనా కారణంవల్లనో లక్ష్మణరావుగారు దాన్ని పూర్తి చేయలేకపోయారని తెలుస్తున్నది.

## అవతారములు :

అవతారమంటే దిగుట. దివినుండి భువికి దిగివచ్చుట. దేవుడు మానవ రూపాన్ని ధరించడం అవతారమని తాత్పర్యం.

ఈ వ్యాసం విజ్ఞాన సర్వస్వంలో ప్రచురించబడింది. దీనిలో అనేక ఆసక్తికరమైన విషయాలు ప్రస్తావించబడ్డాయి.

వేదాలలో ప్రజాపతి అవతారాలుగా చెప్పబడ్డవే ఆ తరువాత పురాణాలలో విష్ణువు అవతారాలుగా పేర్కొనబడ్డాయి. పురాణాలలో అవతారాల మహిమలే ఎక్కువగా కనిపిస్తాయి. పురాణ వాఙ్మయ ప్రభావంతో మన దేశంలో అనేక ఆలయాలు వెలిశాయి. విష్ణువు అవతారాలు మన సాహిత్యంపై సమాజంపై అమితమైన ప్రభావాన్ని కలిగించాయని చెప్పడానికి ఎన్నో నిదర్శనాలున్నాయి.

విష్ణువు అవతారాలు పదేనని అందరూ అంటున్నప్పటికీ, కొన్ని పురాణా లలో పదికిమించిన అవతారాలు ఉదహరించబడ్డాయి.

శ్రీమద్భాగవతంలో ఇరవైరెండు అవతారాల ప్రస్తావన వుంది.[4] అయితే వాటన్నింటికీ ప్రాముఖ్యత లేదు. వీనిలో కేవలం పది అవతారాలు మాత్రమే ప్రధానమైనవి. ఈ పదింటిలో హిందువుల భక్తి పూజలకు ప్రధానమైనవి రామ కృష్ణావతారములు మాత్రమే.

శ్రీ శంకరాచార్యుల అభిమతానుసారం అజుడు మానవదేహము నెత్తుట అసంగతము. పురాణాలలో కనిపించే విష్ణువు అవతారాలు మాయచే భాసించునవే కాని యథార్థములు కావు అని ఆయన ప్రచారం చేసినారు. గీతా భాష్యంలో ఆయన ఈశ్వరుని అజత్వ అవతారత్వముల పరస్పర విరుద్ధ ధర్మాలను సమన్వయించడానికి ప్రయత్నించారు. శ్రీ శంకరుల అభిమతాన్ని అటుంచి, లక్ష్మణరావుగారి స్వీయాభిప్రాయం ఇక్కడ గమనింపదగింది.

మహాపురుష పూజనుండి ఈ అవతారాల ఆరాధన ఉద్భవించిందని ఆయన నమ్మకం. దాన్ని సమర్థించే రీతిలో ఈ వ్యాసం మలచబడింది. ఆయన వెలిబుచ్చిన అభిప్రాయాలు చదివిన తరువాత వాటిలో నూటికి నూరుపాళ్ళు నిజం ఉందని మనకనిపిస్తుంది.

ఒకానొక కాలంలో ఒక మహాపురుషుని అలౌకిక గుణాలను చూసి, తక్కినవారిలో అటువంటి గుణాలు లేకపోవడంచేత జనులు అతన్ని ఈశ్వరుని యంశగా భావిస్తారు అతని జీవితకాలంలో అతడు అనన్య సామాన్యమైన గౌరవాభిమానాలకు పాత్రుడవుతాడు. అతడు గతించిపోయిన తరువాత అతని గురించిన అద్భుత గాథలు ఉత్పన్నమై ఏ అవతారమూర్తిగనో అతడు కీర్తింప బడతాడు పరశురాముడు, శ్రీరాముడు, శ్రీకృష్ణుడు మొదలైనవారు అట్లాగే అవతార పురుషులైనారని లక్ష్మణరావుగారు అభిప్రాయపడ్డారు.

4. స్కంధ 1, అధ్యా 3.

శ్రీరాముడు మొదట అద్వితీయ రాజుగ ఖ్యాతిపొంది క్రమంగా దైవత్వాన్ని పొందినట్టు రామాయణంవల్లనే తెలుస్తున్నది. వాల్మీకి మనస్సులో శ్రీరాముడు విష్ణువు అవతారమనే భావన లేదని లక్ష్మణరావుగారు వాల్మీకి రామాయణంలోని బాలకాండ ఒకటవ సర్గనుండి కొన్ని దృష్టాంతాలను చూపించారు.

దీనిలో శ్రీరాముడు గోదానాదులు చేసి బ్రహ్మ లోకానికి పోతాడని చెప్పబడింది. దాశరథి రాముడు విష్ణువు అన్న భావం వాల్మీకి మనస్సులో ఉన్నట్టయితే ''రామో రాజ్యముపాసిత్వా బ్రహ్మలోకం సగచ్ఛతి'' అని అనే బదులు ''విష్ణులోకం సగచ్ఛతి'' అని వర్ణించి ఉండేవాడు. 'బ్రహ్మలోకం సగచ్ఛతి' అని అనడానికి కారణం వాల్మీకి శ్రీరామున్ని గొప్ప రాజశ్రేష్ఠుడుగ తలంచడమే.

యుద్ధకాండలో చివర, రాముడు చివరివరకు తాను నరుడననే అభిప్రాయంతోనే ఉన్నట్టు, ఇంద్రాదులు వచ్చి నీవు శ్రీవిష్ణువని తెలిపినట్లు కథ చెప్పబడింది.[5] యుద్ధకాండలోని ఈ భాగం, బాలకాండలోని దేవతలు విష్ణువు దగ్గరకు వెళ్ళి జన్మమెత్తమని వేడుకొన్న భాగం ఈ రెండూ ఆ తరువాత ఎవరో కల్పించి చేర్చినట్టు లక్ష్మణరావుగారు చెబుతున్నారు. వాల్మీకి దృష్టిలో శ్రీరాముడు కేవలం నరుడే. అతని రామాయణంలో శ్రీరాముడు విష్ణువు అవతారమని చెప్పిన భాగాలు ప్రక్షిప్తాలని ఆయన అభిప్రాయం. ''అట్లే రామాయణమునందింకను ప్రక్షిప్తములు కలవు. వానిని గురించి 'రామాయణ' శబ్దము క్రింద జూడనగును" అని పేర్కొన్నారు. 'ర' అక్షర క్రమంలో ఆయన విజ్ఞాన సర్వస్వాన్ని వెలువరించి ఉన్నట్టయితే ఆ వ్యాసం చదివే భాగ్యం మనకు తప్పకుండా కలిగి ఉండేది.

దాశరథి రాముడు, పరశురాముడు కొంతకాలం వరకు రాజర్షిగ, బ్రహ్మర్షిగ పరిగణింప బడుతుండేవారు. వ్యాస మహాభారతంలోని సభాపర్వంలో

5. యుద్ధకాండ. 12 వ సర్గ.

నారదుడు ధర్మరాజుకు యమ సభను గురించి వర్ణిస్తూ పెక్కుర్రు రాజర్షులు, బ్రహ్మర్షులు యముని సేవింతురని చెప్పి, యయాతి, నహుషుడు మొదలైన రాజర్షుల పేర్లతో పాటు దాశరథి రాముని పేరును, పరశురాముని పేరును ఉదహరిస్తాడు. ఇది ఎనిమిదవ అధ్యాయంలో ఉంది.

''శ్రీరాముడు యయాతి నహుషాదులతో పాటు గొప్ప రాజన్న అభిప్రాయమున్న దినములలోనే యీ శ్లోకములు వ్రాయబడిన వనుటకు సందేహము లేదు'' అని లక్ష్మణరావుగారు వ్రాశారు.

ఇక కృష్ణావతారం గురించి పరిశీలించినట్టయితే భాగవతంలోని కృష్ణునిలో దైవత్వం ఎక్కువగా, భారతంలోని కృష్ణునిలో నరత్వం ఎక్కువగా కనిపిస్తాయి.

ఛాందోగ్యోపనిషత్తులో దేవకీపుత్రుడైన కృష్ణుడు ఘోరాంగిరస ఋషి వలన పురుష యజ్ఞ దర్శనమును నేర్చుకొన్న శిష్యుడుగా కనిపిస్తున్నాడు. కాబట్టి ఉపనిషత్తుల కాలంలో కృష్ణుడు గౌరవింపదగిన ఒక తత్త్వవేత్తగ, రాజర్షిగ పరిగణింపబడినట్టు. ఆ తరువాతి కాలంలో దేవుడుగ మారిపోయినట్టు భావించాలని ఆయన అంటున్నారు

''మహాభారతము నందు (శాంతి అ 339, శ్లో. 100) దేవీ భాగవతము నందును (4 వ స్కం. అ. 16) దశావతారములందు బుద్ధుని పేరు లేదు'' అని వ్రాస్తూ, దశావతారాలలో బుద్ధుని పేరు బౌద్ధమతం మిక్కిలి వ్యాప్తిలో ఉన్న కాలంలో చేర్చబడిందని విశదీకరించారు.

లక్ష్మణరావుగారు ఈ వ్యాసంలో వెలిబుచ్చిన అభిప్రాయాలు అమూల్యమైనవని చెప్పక తప్పదు. ఈ అభిప్రాయాలలో వాస్తవిక దృక్పథం కనిపిస్తుంది. ఆయన నిశితమైన పరిశీలనాదృష్టికి ఈ వ్యాసం మరో నిదర్శనమని చెప్పాలి.

'అవధానము'లనే వ్యాసంలో అష్టావధానం, శతావధానం, వైదికావధానం, స్వరావధానం, నేత్రావధానం- వీటి గురించి చెప్పబడింది. పఠితలకు తెలియాలనే ఉద్దేశంతో ఆయన వీటిని గురించి వివరంగా వ్రాశారు.

ప్రపంచంలో అక్కడక్కడ కనిపిస్తున్న ఆటవిక జాతుల వేషభాషలను, ఆచార వ్యవహారాలనుబట్టి లక్ష్మణరావుగారు ఆదిమ మానవుల జీవన స్థితిని తెలుసుకోవడానికి యత్నించారు. 'అనాగరిక సంఘ'మనే వ్యాసంలో చెప్పిన విషయం దానికి సంబంధించిందే.

ఇంతవరకూ పరిశీలించిన వ్యాసాలే కాక, ఆయన గౌతమ న్యాయ దర్శనాన్ని కూడా కొంతవరకు అనువదించారు.

న్యాయ దర్శనం సంస్కృత వాఙ్మయంలోని షడ్దర్శనాలలో ఒకటి. తెలుగు వాఙ్మయ పత్రికలో 1921 ఆగస్టు సంచిక నుండి దీని అనువాదం ప్రారంభమయింది. అయితే లక్ష్మణరావుగారి అకాల మరణం వల్ల అది పూర్తి కాలేదు. ''గ్రంథమంతయు పూర్తియైన తరువాత నొక స్వతంత్రమైన ఉపోద్ఘాతము వ్రాయదలచితిని" అని ఆయన ఈ న్యాయదర్శనానువాదం ప్రారంభమైన సంచికలో తన ఆశయాన్ని వెల్లడించారు. ఈ ఆశయం నెరవేరకముందే మృత్యువు ఆయనను కబళించివేసింది.

న్యాయ దర్శనంలోని ద్వితీయాధ్యాయంలో 40 సూత్రాల వరకు ఆయన అనువదించారు. ప్రతి సూత్రానికి తెలుగులో సరియైన అర్థం, స్వల్పంగా వివరణ ఇచ్చారు.

1923 లో, ఇంకో ఆరు నెలల్లో మరణిస్తారనగా చిత్రాడ ఆంధ్ర పరిశోధక మండలి వార్షికోత్సవ సభలో లక్ష్మణరావుగారు ప్రసంగించారు. ఆయన ప్రసంగ పాఠం 1923 జనవరి 8 వ తేదీ ఆంధ్రపత్రికలో ప్రచురించబడింది. ఆయన ఈ ప్రసంగంలో తెలుగు సాహిత్య వికాసాన్ని గురించి, పరిశోధనను గురించి ప్రస్తావించారు. బ్రౌన్ మహాశయుడు తెలుగు భాషకు చేసిన సేవను ప్రస్తుతించారు. ఆయన పరిశోధకుల గురించి ఈ ప్రసంగంలో చేసిన [illegible] గమనింపదగింది.

పరిశోధనలో పూర్వపు పరిశోధకులు వెల్లడించిన అభిప్రాయాల్లో ఒకొక్కమారు పొరపాట్లు సంభవింపవచ్చును. ఒక పరిశోధకుడు తనకు అందు

బాటులో ఉన్న సామగ్రిని ఆధారం చేసుకొని పరిశోధనాఫలితాలను వెల్లడిస్తాడు. ఆ తరువాత కొంతకాలానికి అంతకంటే ప్రామాణికమైన ఆధారాలు లభ్యమై నప్పుడు, మరో పరిశోధకుడు అతని అభిప్రాయాలు సరియైనవి కావని ప్రకటించ వచ్చు. అంతమాత్రంచేత ఆధునిక పరిశోధకులు తామేదో గొప్పవారమని విఱ్ఱవీగుతూ పూర్వపు పరిశోధకులను నిందింపరాదు

పరిశోధనలో నూతన విషయాలు వెల్లడవుతున్న కొద్దీ పరిశోధన ప్రామాణికత పెరుగుతుంది. కాబట్టి ఆధునిక పరిశోధకులకు పూర్వపు పరిశోధ కులు పితృతుల్యులు. ఆదర్శప్రాయులు. అయితే ఆధునిక పరిశోధకులు పూర్వపు పరిశోధకుల పొరపాట్లను దాచవలసిన పనిలేదు. పరిశోధనలో వాస్త వాన్ని తేటతెల్లం చేయడమే ప్రధానం.

"పూర్వులెంత గొప్పవారైనను వారికిగాని, సమకాలము వారికి గాని భయపడనక్కరలేదు. కాని నింద చేయుట కెవ్వరికిని అధికారము లేదు. నింద ప్రారంభమైన తోడనే చిత్తము వికలమగును. బుద్ధి భ్రమించును. సారాసార వివేకము నిద్రించును. హేతువాదము సున్నయగును. న్యాయము లోపించును. సత్యమడుగంటును.'' ఇది ఆధునిక పరిశోధకులకు, విమర్శకులకు లక్ష్మణరావు గారు చేసిన హెచ్చరిక.

లక్ష్మణరావుగారు ఇటు తెలుగు భాషలో అటు మరాఠీ భాషలో రచనా వ్యాసంగం కొనసాగిస్తూ రెండు భాషలవారికి సన్నిహితులయ్యారు. మరాఠీ భాషలో ఆయన వ్రాసిన వ్యాసాలు తక్కువే అయినా వాటి ప్రభావం ఎక్కువగా ఉంది.

'చాళుక్యులు దాక్షిణాత్యులే' అనే చారిత్రక వ్యాసాన్ని ఆయన తాను మరణించే రోజు మధ్యాహ్నమే ముగించారు. అదే ఆయన తెలుగులో వ్రాసిన చివరి వ్యాసం. అట్లాగే అదే రోజు అంతకుముందు తాను మరాఠీలో ప్రారంభిం చిన వ్యాసానికి ఆయన తుదిరూపం ఇచ్చారు. ఆ వ్యాసం దండి 'అవంతీ సుందరి కథ' పై వ్రాసింది వివిధ జ్ఞాన విస్తార్‌లో ఈ వ్యాసం 1923 ఆగస్టు

నెల సంచికలో ప్రచురించబడింది. ఆ పత్రికా సంపాదకులు ఆ వ్యాసాన్ని ప్రచురిస్తూ, దాన్ని పత్రికకు పంపించిన లక్ష్మణరావుగారి బావమరిది కానూరి వీరభద్రేశ్వరరావు గారి ఉత్తరాన్ని కూడా అదే సంచికలో ప్రకటించారు. ఆ ఉత్తరంలోని ప్రధానభాగం—

"I send his last article 'Mahakavi Dandi's Avantisundari katha' which he had written and finished on the very last day of his death- a few hours before that fatal occurence"—

-Kanuri Veerabhadreshwara Rao.

లక్ష్మణరావుగారు మరాఠీభాషకు చేసిన సేవను పరిశీలించడం ఈ సిద్ధాంత వ్యాసానికి లక్ష్యంకాదు. మరాఠీభాషపై ఆయనకు ఎంత అభిమానం ఉండేదో తెలియజేయడానికి మాత్రమే పై విషయాన్ని ప్రస్తావించడం జరిగింది.

లక్ష్మణరావుగారు మరాఠీలో వ్రాసిన మరో అమూల్యమైన వ్యాసాన్ని గురించి ఇక్కడ ప్రస్తావించక తప్పదు ఇది ఆయన పరిశోధనా దృక్పథాన్ని చాటి చెప్పుతున్నది. ఈ వ్యాసం ఆయన చనిపోవడానికి రెండు నెలల ముందు అంటే 1923 ఏప్రిల్-మే నెల వివిధ జ్ఞాన విస్తార్ సంచికల్లో ప్రచురించబడింది.

'రాధామాధవ విలాసం' అనే సంస్కృత చంపూ కావ్యాన్ని విశ్వనాథ కాశీనాథ రాజవాడే మరాఠీలో తొట్టతొలుత పరిష్కరించి, ప్రకటించాడు రాజవాడే మరాఠీలో సుప్రసిద్ధ సాహితీవేత్తగా ప్రసిద్ధి కెక్కినవాడు.

రాజవాడే పరిష్కరించిన గ్రంథాన్ని చూసి, దానిలో ఆయన వెల్లడించిన చారిత్రకాంశాలు సత్యదూరాలని చెప్పడానికే లక్ష్మణరావుగారు ఈ వ్యాసం వ్రాశారు

ఈ కావ్యం శివాజీ రాజ్యాభిషేకానికి పూర్వం వ్రాయబడిందని రాజవాడే గారంటే, అట్లా కాదు-తంజావూరు రాజైన ఏకోజీ కాలంలో వ్రాయబడిందని ఖచ్చితమైన ఆధారాలను తీసి చూపించారు.

"శ్రీ రాజవాడేగారు నాకు పూజ్యులు. కాని చారిత్రకమైన సత్యం అంత కంటే పూజనీయమైనందువల్ల వారి అభిప్రాయాలను ఖండిస్తూ ఈ వ్యాసం వ్రాస్తున్నానని" ఆయన ఈ మరాఠీ వ్యాసంలో పేర్కొన్నారు.

లక్ష్మణరావుగారు మరాఠీలో గ్రంథాలు వ్రాయకపోయినప్పటికీ, ఆయన వ్రాసిన వ్యాసాలవల్ల, సాహిత్య చర్చలవల్ల మహారాష్ట్ర ప్రాంతంలో ఆయనకు మంచి పేరుప్రతిష్ఠలు వచ్చాయి.[6]

## మహోన్నత వ్యక్తిత్వం :

లక్ష్మణరావు గారు సాహితీవేత్తగా, పరిశోధకులుగా ఎంత ఔన్నత్యం సంపాదించారో, వ్యక్తిత్వంలో అంతకంటే ఎక్కువగా మహోన్నతులని అనిపించుకున్నారు.

సాహితీవేత్తగా సాహిత్యాన్ని సృష్టించేవారికి ఆదర్శప్రాయులైతే, పరిశోధకులుగా పరిశోధనను ప్రారంభించేవారికి అదర్శప్రాయులైతే, వ్యక్తిగా సమస్తప్రజానీకానికి ఆదర్శప్రాయులు.

---

6. లక్ష్మణరావుగారు మరణించిన తరువాత వివిధ జ్ఞాన విస్తార్ పత్రిక 1923 జూలై సంచికలో తన సంతాపాన్ని ప్రకటించింది. దానిలోని కొంత భాగాన్ని పరిశీలనార్థం ఇక్కడ ఇస్తున్నాను.

"రాధామాధవ పరిశీలనపు మొదటి రెండు వ్యాసాలపై ఎవరైనా ఆక్షేపణలు తెలిపినట్టయితే వాటిని చూసి మూడవ వ్యాసం వ్రాయాలని లక్ష్మణరావుగారు అభిప్రాయపడినారు. కాని ఎవ్వరి ఆక్షేపణలు ఈనాటి వరకు రాలేదు...... కె. వి. లక్ష్మణరావుగారు తెలుగు సాహిత్యానికి ఘనమైన సేవచేశారు. మరాఠీ సాహిత్యానికి ఆయన చేసిన సేవ స్వల్పమే అయినప్పటికీ అది ఎంతో విలువైనది.'' (మరాఠీకి తెలుగు అనువాదం).

—వివిధ జ్ఞాన విస్తార్. 1923 జూలై సంచిక.

విజ్ఞాన చంద్రిక స్థాపకులలో ఒకరైన హరిసర్వోత్తమరావు గారు లక్ష్మణరావుగారికి ఎల్లప్పుడూ కుడిభుజంగా ఉంటుండేవారు. హరిసర్వోత్తమరావు గారు దేశభక్తుడుగా రూపొందడానికి లక్ష్మణరావు గారి సహచర్యం బాగా తోడ్పడింది.

1908 ఆగస్టులో హరిసర్వోత్తమరావు గారిని అప్పటి ప్రభుత్వం అరెస్టు చేసి మద్రాసుకోర్టులో విచారణను ప్రారంభించింది. అప్పటికి హరిసర్వోత్తమ రావుగారి సతీమణి ఏడునెలల గర్భవతి. వారిది కడు బీదకుటుంబం.

విచారణ జరిపేరోజు ఆమె భర్తను చూడడానికి కోర్టుకు వచ్చింది, ఆమె బంధువులు ఆమెను నడిపించుకొని తీసుకరావడాన్ని లక్ష్మణరావుగారు చూశారు. వెంటనే వారందరిని చీవాట్లుపెట్టి, విచారణ జరిగినన్ని రోజులు ఆమె కోర్టుకు రావడానికి వాహనాన్ని ఏర్పాటు చేశారు. ఒక దేశభక్తున్ని, అతని కుటుంబాన్ని ఏవిధంగా గౌరవించాలో, ఆదుకోవాలో లక్ష్మణరావు గారు ఆచరణలో చూపించారు. దేశంకొరకు పోరాడేవ్యక్తులతో మాట్లాడితేనే ప్రళయం ముంచుకొస్తుందని భయపడే రోజుల్లో ఆయన నిర్భయంగా ఒక దేశభక్తున్ని అన్ని విధాల ఆదుకున్నారు[7]. వ్యక్తి ఔన్నత్యం మాటల్లోకాదు చేతల్లో ఉంటుందని ఆయన నిరూపించారు.

లక్ష్మణరావు గారి గ్రంథాలలో, వ్యాసాలలో ఆయన వ్యక్తిత్వము ప్రస్ఫుటమవుతుంది. ఛాందస సంప్రదాయాలను, ఆచారాలను గ్రుడ్డిగా అనుకరించకూడదని ఆయన తన వ్యాఖ్యానాల ద్వారా ఉద్బోధించారు. వర్ణవ్యవస్థకు, కులవ్యవస్థకు ఆయన వ్యతిరేకి. వీరేశలింగం పంతులు గారు సమాజాన్ని

7. తాను జైలులో ఉన్నప్పుడు, లక్ష్మణరావుగారు తన కుటుంబాన్ని ఏవిధంగా ఆదుకున్నారో హరిసర్వోత్తమరావు గారు స్వయంగా తెలుపుకున్నారు.
"నా మిత్రులితరులు ఆమెను జంకుతో దూరముగా చూచినా, ఆయన ఆమె బసకుపోయి మర్యాద గాంభీర్యములుట్టిపడునట్లు సంభాషించి, యితర వసతులు కల్పించి ఆమె ధైర్యమునకెక్కువ దోహదము చేసినాడు'' తెలుగుతల్లి, లక్ష్మణరావు వర్ధంతి సంచిక. పేజి 10.

సంస్కరించడానికి నడుంకట్టుకున్నరోజుల్లో సామాజిక సమస్యలను, సాహిత్య విలువలను చర్చించి, ప్రజల్లో మానసికపరమైన విప్లవం తీసుకరావడానికి కృషి చేశారు. తాను నమ్మిన సిద్ధాంతాల కొరకు కన్నతల్లిసికూడా దూరం చేసుకున్నారంటే ఆయన వ్యక్తిత్వం ఎంత విశిష్టమైనదో తెలుసుకోవచ్చు.

లక్ష్మణరావు గారి తల్లి గంగమ్మగారు తన మనుమరాలి పెళ్ళి (లక్ష్మణరావుగారి కూతురు అచ్చమాంబ) యుక్తవయస్సు రాకుండానే పూర్వాచార ప్రకారం జరిపించాలని పట్టుబట్టింది లక్ష్మణరావు గారు తల్లిమాట కాదన్నారు. అంతేకాదు-కూతురును బాగా చదివించి, విదేశాలకు కూడ పంపించారు. గంగమ్మగారు కుమారుడు సంస్కరణపేరిట సంప్రదాయాలను మంట గలుపుతున్నాడని ఆగ్రహించి, ఆయనతో పూర్తిగా తెగతెంపులు చేసుకొని కాశీకి వెళ్ళిపోయింది. లక్ష్మణరావు గరు మరణించిన తరువాత కూడా ఆమె తిరిగి రాలేదు.

దేశభక్తులను ఎంతగా అభిమానించేవారో, సంఘసంస్కర్తలను అంతగా అభిమానించి, గౌరవించేవారు. వీరేశలింగం పంతులు గారంటే లక్ష్మణరావు గారికి ఎనలేని గౌరవాభిమానాలు.

లక్ష్మణరావు గారు మద్రాసులో అద్దెకు తీసుకొన్న ఇంట్లోనే వీరేశలింగం పంతులు గారు తన అంతిమ జీవితాన్ని గడిపారు. అదే ఇంట్లో వీరేశలింగం పంతులు గారు 1919 మే 27 వ తేదీన పరమపదించారు. అప్పుడు లక్ష్మణరావు గారు నడిగూడెంలో ఉన్నారు పంతులు గారు మరణించారని తెలిసి అక్కడి నుండి మద్రాసులో ఉన్న తన మిత్రుడు గొబ్బూరు వెంకటానంద రాఘవరావుకు ఆయన ఒక ఉత్తరం వ్రాశారు.

ప్రియమైన రాఘవరావు,

వీరేశలింగం పంతులుగారి హఠాన్మరణానికి నాకు కలిగిన విచారం ఇంతింతనలేనిది. ఇది నాకొక అఘాతంవలె అందింది. నిన్న సాయంకాలం

ఇక్కడ ఒక వినోద కార్యక్రమం ఏర్పాటు చేయబడింది కాని పంతులుగారి మరణ వార్త చేరగానే, దాన్ని ఆపివేశాము. కొనసాగించలేకపోయినాము. నేను మద్రాసుకు మళ్ళీ చేరే నాటికి ఆ మహానుభావుడు మరి వుండడని నేనూహించలేక పోయినాను. తెలుగు సాహితీ జగత్తులో ఆయన లేమి పూరింపరానిది. వ్యక్తిగతంగా నా జీవితంలో కలిగిన వెలితి, నష్టం మరింత ఎక్కువ. నా పరిచయం ఆయనతో 1900 వ సంవత్సరంలోనే ప్రారంభమైంది. నాకెల్లప్పుడూ ఆయనగారి పట్ల విశేషమైన గౌరవం ఉంటూ వచ్చింది. ఆయన చివరి రోజులలో ఆయన దగ్గర ఉండి ఉపయోగపడలేకపోయినందుకు నాకెంతో విచారంగా ఉంది. నేనిక్కడికి రావలసి వచ్చింది. అక్కడి ఇంటి విషయమై ఇంటి యజమానికి గాని, ఆయనకు సంబంధించినవారికి గాని, వారు మిమ్మల్ని కలుసుకోవడమే తటస్థపడితే, ఆ ఇల్లు నా క్రిందనే ఉంచుకుంటానని చెప్పండి. నేను అక్కడికి జూన్ నెలాఖరు ప్రాంతంలో చేరుకున్నప్పుడు ఇంటి అద్దె ఇచ్చివేస్తాను. మీరే సంకోచం పెట్టుకోకుండా ఇక ముందు కూడా అక్కడే ఉండవచ్చు [8]

మే. 30,1919 భవదీయుడు
నడిగూడెం కె. వి. లక్ష్మణరావు.

లక్ష్మణరావుగారు దేశభక్తులను, సంఘ సంస్కర్తలను ఎంతగా అభిమానించేవారో పై సంఘటనలు రుజువు చేస్తున్నాయి. ఆయన తన ఆదర్శాలను తన కుమారునిలో, తన కూతురులో ప్రతిబింబింపజేయడానికి ప్రయత్నించారు. వినాయక వీరసావర్కర్ మీది అభిమానంతో తన కుమారునికి 'వినాయకరావు' అని పేరు పెట్టుకున్నారు. సమాజ శ్రేయస్సు నాశించి తన జీవితాన్ని అంకితం చేసిన ధన్యజీవి ఆయన.

ఆ రోజుల్లో బందరు నుంచి వెలువడిన 'శారద' అనే సాహిత్య పత్రిక 1923 ఆగస్టు సంచికలో పింగళి నాగేంద్రరావుగారు లక్ష్మణరావుగారితో తాను ఒకప్పుడు జరిపిన సంభాషణను వ్రాశారు.

8. ఇంగ్లీషుకు తెలుగు అనువాదం.

"ఒకసారి నేను కొమర్రాజు లక్ష్మణరావుగారిని ఏదో చర్చ సందర్భంలో ఇట్లా అడిగాను:

"సమాజాన్ని ఏ విధంగా శిక్షకు గురిచేయాలి, సంఘంలో ప్రచురంగా సాగుతున్న ఈ దుర్మార్గాలకుగాను ?"

దానికి లక్ష్మణరావుగారి సమాధానం ఈ క్రింది విధంగా ఉంది

"ఈ సమస్యను చూసే దృష్టి, పరిష్కరించే దృష్టి ఇది కాదు. ప్రతి ఒక్కరూ ముందు తమలోని లోపాలు సరిదిద్దుకోవాలి. ప్రజలలో ఈ విధమైన అవగాహనను పెంపొందించే ఉత్తమ సాహిత్యాన్ని సృష్టించాలి. సమాజంలో ఉండే లోపాలు, దోషాలు తొలగిపోవడానికి దోహదం చేయగల సాహిత్యాన్ని సృష్టించుకోవాలి. సృష్టింపజేయాలి. సమాజంలో కోరుకొనదగిన మార్పు రావటానికి బలమైన సాధనంగా సాహిత్యాన్ని రూపొందింపజేసుకోవాలి. అది శక్తివంతంగాను, సంపన్నంగాను, సమాజంలో భావ విప్లవం తీసుకొన రాగలిగి ఉండాలి".

ఈ భావ విప్లవం సాధించాలన్న ఆశయమే ఆయన చేసిన ప్రయత్నంలో మనకు కనిపిస్తుంది.

లక్ష్మణరావుగారు సౌమ్యులు, నిరాడంబరులు, గంభీర స్వభావులు. అని ఆయన సన్నిహిత మిత్రులు అనేక సందర్భాలలో ఉదహరించారు. మాట వరుసకు కూడా ఆయన ఒక్కపొల్లుమాట మాట్లాడేవారుకాదట. తనకు బాధ కలిగించిన వ్యక్తులపట్ల కూడా ఆయన గౌరవ భావాన్నే ప్రదర్శించారు.

గొబ్బూరు వెంకటానంద రాఘవరావుగారు ఒకసారి విజ్ఞాన చంద్రిక మున్ముందు ప్రచురించబోయే గ్రంథాల పట్టికలోని ఒక గ్రంథాన్ని సూచిస్తూ దాన్నెప్పుడు ప్రకటిస్తారని అడిగితే, లక్ష్మణరావుగారు ఈ క్రింది విధంగా సమాధానం చెప్పారు:

''ఆ గ్రంథము వ్రాయుటకు ఆ గ్రంథకర్తగారికి మూడు వందల రూపాయలు అడ్వాన్సు ఇచ్చి ఎగ్రిమెంటు వ్రాయించుకున్నాము. కాని ఆ గ్రంథ కర్తగారు ఆ గ్రంథము వ్రాయుదురని నాకు ఆశలేదు.''

అప్పుడు రాఘవరావుగారు వెంటనే 'అగ్రిమెంటు ఉందికదా కోర్టులో వ్యవహారం తేల్చుకుంటే పోలే?' అని అడిగిన దానికి లక్ష్మణరావుగారు నైరాశ్యంతో "మహానుభావుడు-ఆ భాషా సేవకుని హృదయంలో ఒక తృణం మన ద్రవ్యం పడి ధన్యం అయింది. కాని ఆ మహనీయుని గ్రంథరాజము చదువుకొని ఆనందము పొందే అదృష్టము మన తెలుగువారికి లేకపోయింది కదా అని విచారము" అని తన బాధను వ్యక్తీకరించారు.[9]

ఈ రోజుల్లో ఎవరైనా అగ్రిమెంటు కుదుర్చుకొని పుస్తకం వ్రాసి ఇవ్వక పోయినట్టయితే ఆ వ్యవహారం కోర్టుద్వారానే తీర్చుకుంటారు. లక్ష్మణరావుగారి స్వభావం అటువంటిది కాదు. డబ్బు గురించి ఆలోచించకుండా, ఆ రచయిత గ్రంథం వ్రాసి ఇచ్చినట్టయితే బాగుండునే అన్న వ్యథను కనబరచారు.

ఒక జమీందారు దగ్గర ఉండికూడా ఆయన నిరాడంబరమైన జీవితం గడిపారు. లేనిపోని అట్టహాసాలు, ఆడంబరాలు ఆయనకు నచ్చేవికావు. తన దగ్గర ఉన్నదాంట్లో కొంత ఇతరులకు సహాయం చేయడం లేదా విజ్ఞాన చంద్రికకు ఖర్చుపెట్టడం ఈ రెండే ఆయనకు అలవాటు.

ఆరోగ్యం పట్ల, ఆహారం పట్ల ఆయన శ్రద్ధ తీసుకోలేదు. రెండుసార్లు భోజనం చేయడంతప్ప ఉపహారాలు భుజించేవారు కాదు. నిరంతరం ఉబ్బసంతో బాధపడుతూ కనిపించేవారు. పుష్టికరమైన ఆహారం తీసుకొని, సక్రమంగా వైద్యం చేయించుకుంటూ విశ్రాంతి తీసుకొని ఉన్నట్టయితే ఆయన ఇంకా కొంత కాలం జీవించి ఉండేవారు.

9. లక్ష్మణరాయ వర్ధంతి సంచిక. పేజీ 27.

ఒంటరిగా ఉన్నప్పుడు ఏదో ఒక గ్రంథాన్ని పఠించడం, ఆలోచించడం, మిత్రులెవరైనా కలిసినప్పుడు వారితో సాహిత్య చర్చలకు దిగడం అవే ఆయనకు దినచర్యలు. మద్రాసులో ఉన్నప్పుడు ఆచంట లక్ష్మీపతిగారు లక్ష్మణ రావు గారికి విశ్రాంతి కలిగించాలని అనేకసార్లు యత్నించారు. కాని విశ్రాంతి పుస్తకాలలోనే దొరుకుతుందనే నమ్మకం ఉన్న లక్ష్మణరావు గారిని ఆయన మార్చలేకపోయారు లక్ష్మణరావు గారిని ఆయన పత్ని కోటమాంబ కూడా మార్చలేకపోయింది. ఆయనకంటె ముందే ఆయన పత్ని దివంగతురాలైంది. ఆ దుఃఖం కూడా మానసికంగా ఆయనను కొంతవరకు కృంగదీసి ఉండవచ్చు. అయితే ఆయన రచనావ్యాసంగంపై మాత్రం ఆ ప్రభావం కనిపించదు. చివరి శ్వాస పీల్చేవరకు ఆయన పుస్తకాలతోనే కాలక్షేపం చేశారు.

మద్రాసులోని ఎగ్మూరులో గల వేదవిలాస్ భవనంలో 1923 జూలై 13 వ తేదీ రాత్రి ఆయన కన్నుమూశారు. ఏ భవనంలో వీరేశలింగం గారు ఏ కుర్చీలో కూర్చొని పరమపదించారో లక్ష్మణరావుగారు కూడా అదే భవనంలో, అదే కుర్చీలో కూర్చొని కన్నుమూయడం విచిత్రమే.

లక్ష్మణరావుగారి మరణంతో తెలుగుదేశం ఒక మహానుభావున్ని కోల్పోయింది. ఆయన చిన్న వయస్సులోనే కన్నుమూయడంవల్ల సాహిత్యానికి తీరని లోటు ఏర్పడిందని చెప్పాలి. ఆయన ఇంకా కొంతకాలం బ్రతికి ఉన్నట్టయితే, తెలుగు సాహిత్యానికి, తెలుగు ప్రజలకు చిరకాలం ఉపయోగపడే బృహత్తర కార్యకలాపాలను మరెన్నింటినో చేపట్టి, పూర్తిచేసి ఉండేవారు.

ఆయన మరణవార్తను విని అక్కిరాజు ఉమాకాంతంగారు "తెలుగుదేశపు ఒక గొప్ప ఐతిహాసికుడు, ఒక గొప్ప విద్వాంసుడు, ఒక గొప్ప వాఙ్మయ తత్పరుడు, ఆంధ్రదేశ గర్భమునుండి వెడలిన ఒక మహాపురుషుడు అస్తమించినా''దని కన్నీరు కార్చారు.[10]

10. తెలుగుదేశ వాఙ్మయ పత్రిక-రుధిరోద్గారి, 12 వ సంచిక. పేజి. 24.

లక్ష్మణరావుగారి గురించి కొందరు పెద్దలు తమ అభిప్రాయాలను ఈ విధంగా వెల్లడించారు.

"ఈయన సుప్రసిద్ధుడగు దేశాభిమాని. జాతీయాభివృద్ధికై తీరని అభిలాషయే వీరి జీవితము నంతను భాషా సేవకును, సంఘ సేవకును అర్పణ చేయుటకు ప్రేరేపించినది.''

—దేశభక్త కొండా వెంకటప్పయ్య.

''లక్ష్మణరావుగారు ఆంధ్రదేశ పురోభివృద్ధికి అవసరమగు యన్ని విషయములలోను ముందంజవేసి మార్గమును చూపియున్నారు. నైతికముగ వారి జీవితము ఆదర్శప్రాయమైనది.''

— ఉన్నవ లక్ష్మీనారాయణ.

"యువకులలో యిమిడి ఉన్న ఉత్సాహాన్ని, బుద్ధి విశేషాన్ని బయటికి లాగి, దేశం కోసం వినియోగించిన ఘనుడు లక్ష్మణరావు.''

—ఆచంట లక్ష్మీపతి.

''అతడు బహు భాషావేత్త. భావిదర్శి. కార్యవాది. నిండు మనస్సు గలవాడు. గంభీరుడు, ముందు చూపు గలవాడు. ఒక్క ఊపుతో ఆంధ్ర వాఙ్మయమును అర్ధ శతాబ్దపు మేరకు ముందుకు నెట్టినవాడు."

—సురవరం ప్రతాపరెడ్డి

ఈ సిద్ధాంత వ్యాసాన్ని ముగించే ముందు మరో రెండు మాటలు చెప్పాలని వుంది.

ఆయా కాలాలలో కొన్ని మహాకావ్యాలు సృష్టింపబడి అనంతర సాహిత్య జగత్తును ప్రభావితం చేస్తాయి. అట్లాగే కొంతరు మహానుభావులు ఉద్భవించి జాతికి మార్గదర్శకులవుతారు. ఈ మహానుభావుల్లో కొందరు ఏదో ఒక మార్గానికే పరిమితమైతే మరి కొందరు బహుముఖ ప్రజ్ఞావంతులై, విశిష్టతను, విస్తృత

పై అభిప్రాయాలు లక్ష్మణరాయ వర్ధంతి సంచిక నుండి తీసుకొనబడిన వి.

పరిధిని సంతరించుకుంటారు. అట్టివారిలో లక్ష్మణరావుగారొకరు. లక్ష్మణరావు గారు సాహిత్యాన్ని ప్రభావితం చేయగలిగిన మహాకావ్యం సృష్టించలేదుగదా? అని ఎవరైనా ప్రశ్నించవచ్చు. లక్ష్మణరావుగారు మహాకావ్యాన్ని సృష్టించలేదు. నిజమే. కాని, సాహిత్యాన్ని సుసంపన్నం చేయడానికి పథనిర్దేశకుడయ్యారు.

గమ్యాన్ని చేరడానికి ముందు ఒక మార్గం కావాలి. మార్గం అంటూఉంటే దాన్ని సుగమం చేసుకొని ముందుకు సాగిపోవచ్చు, గమ్యాన్ని చేరుకోవచ్చు. తెలుగు సాహితీ రంగంలో అటువంటి గమ్యాన్ని చేరుకోవడానికి బాటలు వేసిన వారిలో లక్ష్మణరావు గారొకరు. మనం ఒక సుందర భవనాన్ని నిర్మిస్తాం. భవన నిర్మాణం పూర్తయిన తరువాత అది మనకు అందంగా కనిపిస్తుంది. అయితే పునాది వేసిన తరువాతనే ఆ సుందర భవన నిర్మాణం సాధ్యమైందన్న సత్యాన్ని విస్మరించరాదు. పునాది అంటూ ఉంటే దానిపైన ఎంత సుందర భవనాన్నైనా నిర్మించవచ్చు. సాహితీ వికాసం, సమాజ ప్రగతి, దేశ ప్రగతి- ఇవన్నీ ఈ సూత్రం పైనే ఆధారపడి ఉంటాయి.

లక్ష్మణరావుగారు వెలువరించిన చారిత్రక గ్రంథాలు దేశభక్తిని ప్రేరే పించి, దేశభక్తులను, దేశభక్తి సాహిత్యాన్ని సృష్టింపజేశాయి. ఆయన భాషా పరిశోధన ఆ తరువాత విస్తృత భాషా పరిశోధనలకు దారి చూపింది. ఇప్పటి వికాసంతో, అప్పటి ఆయన ప్రయత్నాన్ని పోల్చి చూడడంకాదు - ఇప్పటి వికా సానికి, అప్పటి ఆయన ప్రయత్నం దోహదం చేసిందన్న వాస్తవాన్ని గమ నించాలి.

అందుకే వీరేశలింగం పంతులుగారి నవ్యసాహిత్యం వలె, గురజాడ అప్పారావుగారి నవ్య కవిత్వం వలె లక్ష్మణరావుగారి తెలుగుభాషా సాహిత్యాల సేవ కూడా తెలుగుదేశంలో ఉషోదయం.

# ఉపకరించిన గ్రంథాలు, పత్రికలు


1. అభిజ్ఞాన శాకుంతలమ్ - కాళిదాసు
2. ఆధునికాంధ్ర కవిత్వము - డాక్టర్ సి. నారాయణరెడ్డి
3. ఆంధ్ర విజ్ఞాన సర్వసం సంపుటాలు - కొమర్రాజు లక్ష్మణరావు
4. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం సంపుటాలు - కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు
5. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం సంపుటాలు - తెలుగు భాషా సమితి ప్రచురణ
6. ఆంధ్ర సర్వస్వము - మాగంటి బాపినీడు
7. ఆంధ్ర భాషా వికాసము - గంటిజోగి సోమయాజి
8. ఆంధ్ర విజ్ఞానం సంపుటాలు - కందుకూరి బాలసూర్య ప్రసాదరావు
9. ఆంధ్రుల సాంఘిక చరిత్ర - సురవరం ప్రతాపరెడ్డి
10. ఆలోచనా లహరి - (యువ భారతి ప్రచురణ) - బి. రామరాజుగారి వ్యాసం
11. కవుల చరిత్ర - కందుకూరి వీరేశలింగం పంతులు
12. కొమర్రాజు వేంకట లక్ష్మణరావు - డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు
13. తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము - డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావు
14. తెలుగు నవలా వికాసం - డాక్టర్ మొదలి నాగభూషణ శర్మ
15. తెలుగులో సాహిత్య విమర్శ - డాక్టర్ యస్. వి. రామారావు
16. తెలుగు భాషా చరిత్ర - డాక్టర్ భద్రిరాజు కృష్ణమూర్తి
17. తెలంగాణా ఆంధ్రోద్యమ చరిత్ర - మాడపాటి హన్మంతరావు
18. ద్రావిడ భాషలు - డాక్టర్ పి. ఎస్ సుబ్రమణ్యం.
19. నా జీవితము-నవ్యాంధ్రము - అయ్యదేవర కాళేశ్వరరావు
20. ప్రబంధ వాఙ్మయ వికాసము - డాక్టర్ పల్లా దుర్గయ్య
21. మన లిపి-పుట్టుపూర్వోత్తరాలు - తిరుమల రామచంద్ర
22. మానవల్లికవి-రచనలు - నిడదవోలు వెంకటరావు

23. లఘు శబ్దార్థ సర్వస్వము - పరవస్తు వెంకటరంగాచార్యులు
24. వీరేశలింగం పంతులు-సమగ్ర పరిశీలన
-డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు
25. సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశం సంపుటాలు
26. సి. పి. బ్రౌన్‌దొర జీవితము -డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావు
27. స్వీయ చరిత్ర - ఆచంట లక్ష్మీపతి
28. సేతు మాహాత్మ్యము - అముద్రితము
29. శ్రీ హరిసర్వోత్తమరావు జీవితము - మాదల వీరభద్రరావు
30 Arvacheen Charitra Kosh - Edited by Sidheshwar Shastri Chitrav (Year of Publiction 1946.)
31. A Forgotten Chapter of Andhra History - Somashekhara Sharma, M.
32. Brown's English - Telugu Dictionary, II Edition.
33. Eastern Chalukyas of Vengi-Venkataramanaiah,N.
34. Encyclopaedia of Britanica -Vol. I.
35. Fundamental Unity of India -Mukherji, R.K.
36. Glimpses of Deccan History -M. Rama Rao.
37. History of Bengal -Jadunath Sarkar. Vol. II.
38. Present Position of History -G.M. Trevelyan.
39. India through the Ages-Edited by Dr. K.C. Vysa, Prof. D.R. Surdesai and Prof. S.R. Nayak.
40. Philosophy of History -Oxford 1936.
41. Reddy Kingdoms of Kondaveedu and Rajamundry -Somashekhara Sharma, M.
42. The research paper form and content- by Andrey J. Roth, Year of Publication 1969.
43. The modern researcher - by Jacques Barzun & Henry F. Graff.

44. The nature of literature-
by William F. Irmscher.
45. The History and Culture of the Indian people-
Edited by Dr R C. Mazumdar.
46. The International Encyclopaedia of Science-
Edited by James R. Newman, Vol. I.

## పత్రికలు

47. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక -రౌద్రి. సంచికలు 4-5.
48. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక -రౌద్రి. మాఘ-ఫాల్గుణ.
49. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక -దుందుభి. జ్యేష్ఠ-భాద్రపద.
50. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక -దుందుభి ఆశ్వయుజ-పుష్య.
51. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక -దుందుభి. మాఘ-ఫాల్గుణ.
52. ఆంధ్రపత్రిక -1923 జనవరి 8.
53. ఆంధ్ర పరిశోధక మండలి పంచమ వార్షికోత్సవ సంచిక-1922.
54. కళ-దుందుభి, కార్తీకం-పుష్యం.
55. కళ-రుధిరోద్గారి, చైత్రం-వైశాఖం.
56. తెలుగుతల్లి- లక్ష్మణరాయ వర్ధంతి సంచిక.
57. తెలుగుదేశ వాఙ్మయ పత్రిక- రుధిరోద్గారి. సంచిక-12.
58. భారతి. 1978 జూన్.
59. భారతి. 1949 రజతోత్సవ సంచిక.
60. రాజరాజనరేంద్ర పట్టాభిషేక మహోత్సవ సంచిక.
61. సరస్వతి-దుందుభి సంచిక 1-2.
62. వివిధ జ్ఞాన విస్తార్ (మరాఠీ పత్రిక) 1923 ఏప్రిల్, మే, జూలై, ఆగస్టు సంచికలు.

# సవరించి చదవండి

| పుట | పంక్తి | ముద్రితమైన పొరపాటు | సవరణ |
|---|---|---|---|
| 5 | 18 | వా_ప్తంగా | వ్యాప్తంగా |
| 8 | 18 | విశ్వకోసం | విశ్వకోశ్ |
| 11 | 7 | వీరాధ్యులు | వీరాద్యులు |
| 12 | 12 | మొదట్టి | మొదటి |
| 15 | 4 | సాహితీ రంగంతో | సాహితీ .రంగంలో |
| 18 | 1 | ఆనేక | అనేక |
| 23 | 8 | పంటి | వంటి |
| 33 | 2 | నమ్మకస్థుడుగా | నమ్మకస్తుడుగా |
| 34 | 5 | బహుబషా | బహుభాషా |
| 35 | 13 | విచ్చినం | విచ్ఛిన్నం |
| 35 | 15 | వహించిది | వహించింది |
| 36 | 7 | విలక్షణమై లక్ష్యాలు | విలక్షణమైన లక్ష్యాల |
| 41 | 11 | శివాజీ | శివాజీ |
| 43 | 17 | గాడిచర్ట | గాడిచర్ల |
| 45 | 13 | ఒక ముఠాగా | ఒక పక్షంగా |
| 55 | 21 | న్వరాజ్యముకొరకు | స్వరాజ్యము కొరకు |
| 69 | 3 | చారిత్రే | చరిత్రే |
| 76 | 14 | 'ఆంగ్ల స్థాపనమనే' | ఆంగ్లరాజ్య స్థాపనమ |
| 80 | 17 | వెలువడిని | వెలువడిన |
| 104 | 5 | ఆని | అవి |
| 133 | 23 | దా | దాచి |
| 151 | 16 | అనపోతారెడ్డి వేయించి | అనపోతారెడ్డి వేయిం |
| 151 | 21 | 386 | 1386 |

| | | | |
|---|---|---|---|
| 161 | 15 | ఉదహరించారు | ఉదాహరించారు |
| 162 | 3 | పలిశీలిస్తే | పరిశీలిస్తే |
| 162 | 20 | సేల్చే తరుణంలో | పీల్చే తరుణంలో |
| 170 | 16 | ఆది | అది |
| 175 | 12 | శతాబ్బంలో | శతాబ్దంలో |
| 197 | 2 | ఉదహరించారు | ఉదాహరించారు |
| 198 | 19 | ఆయనలో దీనిలో | అయన దీనిలో |
| 202 | 15 | ఉదహరించారు | ఉదాహరించారు |
| 210 | 16 | ఉదహరించారు | ఉదాహరించారు |
| 213 | 15 | పాశ్చాత్తాద్వైతం | పాశ్చాత్యాద్వైతం |
| 213 | 16 | పాశ్చాత్తాద్వైతం | పాశ్చాత్యాద్వైతం |
| 223 | 13 | ఆంతగా | అంతగా |
| 228 | 17 | కొంతరు | కొందరు |